# కర్షక వేదం

## (CREDO OF WORLD PEASANTRY)



ఆచార్య యన్. జీ. రంగ

అనువాదం

డా. జేక్కంపూడి సీతారామారావు



శతజయంతి ప్రచురణ : 2000-2001

కర్షక వేదం
CREDO OF WORLD PEASANTRY

డా. జక్కంపూడి సీతారామారావు

ప్రథమ ముద్రణ
2000, నవంబర్

వెల : రూ. 125/-

<u>ప్రతులకు</u>

డా. జక్కంపూడి సీతారామారావు
9/171 నెహ్రూనగర్
చిలకలూరిపేట - 522 616

<u>ముద్రణ :</u>

శ్రీలక్ష్మి ప్రెస్
14/2 అరండల్‌పేట
గుంటూరు - 2
ఫోన్ : 230643



**శ్రీ కృష్ణకాంత్**

భారత ఉపరాష్ట్రపతి



పుస్తక బహూకరణ

భారత ఉపరాష్ట్రపతి శ్రీ కృష్ణకాంత్, అనువాదకుడు, డా॥ బండ్లమూడి సుబ్బారావు.

# ముందుమాట

నమస్కారం!



యాభై సంవత్సరాలనాడు రంగాగారు ఏదైతే ఊహించారో అది ఈనాటికీ నిజంగా నిలిచింది.

కాపిటలిజం, కమ్యూనిజం - రెండూ దోపిడీ చేస్తున్నవే! వీటి బాధల నుండి తప్పించుకోవడానికి రైతాంగ సహకారసంస్థల నిర్మాణమే ఏకైక మార్గం.

రంగాగారు కీర్తిశేషులైన తరువాత, డా. వడ్లపట్ల వెంకటగోపాలకృష్ణగారి ప్రోత్సాహంతో రెండేళ్లనాడు 'CREDO OF WORLD PEASANTRY' గ్రంథాన్ని అనువాదం చేయడం ప్రారంభించాను. ప్రపంచ రైతాంగానికి అత్యంత ఉపయుక్తమనే భావంతో, మన తెలుగు రైతన్నలకు స్ఫూర్తిదాయకంగా ఉండాలనే లక్ష్యంతో ఈ గ్రంథాన్ని ఆంధ్రీకరించాను.

ఈ గ్రంథం కృషీకార్‌లోక్‌పార్టీ మానిఫెస్టోగా రంగాగారు భావించారు. ఆయన ఏ రాజకీయ పార్టీలో ఉన్నా రైతన్న అభ్యుదయమే జీవితలక్ష్యంగా ఉన్నవారు. ఇందులో గాట్ ఒప్పందాన్ని, సహకార వ్యవసాయం పేరుతో సమష్టి వ్యవసాయాన్ని ప్రవేశపెట్టడాన్ని రంగాగారు వ్యతిరేకించారు. రైతాంగ సహకారమూ, చేతివృత్తులూ - ఈ రెండూ దేశానికి చాలా ముఖ్యమని వారు భావించారు. జీవితకాలమంతా ఈ రెంటి కోసమే తపన చెందారు. ఈ గ్రంథంలో మార్క్స్ సిద్ధాంతాలను వ్యతిరేకించినా, మార్క్స్ మేధాశక్తికి ఆయన జోహార్లు అర్పించారు. చరిత్రకందని కాలంనుండీ ఈనాటి వరకూ ఉన్న రైతు సమస్యలను ఆయన ఈ గ్రంథంలో విశ్లేషించారు.

**-రచయిత**

# విషయసూచిక



డా॥ వడ్లపట్ల వెంకట గోపాలకృష్ణ, M.Sc., Ph.D.,

# అభివందన మందారం

ఒక గ్రంథాన్ని రచించడం ఒక ఎత్తు అయితే.. ఆవిష్కరణ ఒక ఎత్తు.. ఆంధ్రదేశంలో ఏ రచయితకీ అందని అవకాశం.. అరుదైన అదృష్టం నన్ను వెదుక్కుంటూ వచ్చింది.

రంగాగారి ఆత్మీయులు

భారత ఉపరాష్ట్రపతి

**మాన్యులు శ్రీ కృష్ణకాంత్‌గారికి**

ముద్రణ తొలి ప్రతిని అందించే భాగ్యం కలిగించిన సహృదయ మిత్రుడు, ఆచార్య రంగా ఫౌండేషన్ వ్యవస్థాపక అధ్యక్షుడు

**డాక్టర్ బండ్లమూడి సుబ్బారావుగారికి**

అనువాద రచనకు అడుగడుగునా ఉత్సాహ ప్రోత్సాహాలను

ప్రోది చేసిన కర్షక ఋషి

**శ్రీ దరువూరి వీరయ్యాగారికి**

ప్రత్యేకమైన కృతజ్ఞతలు. అనువాదమంటే నిజంగా అక్షరయజ్ఞమే! భావాన్ని చెడకుండా మనదైన భాషలో సూటిగా, స్పష్టంగా చెప్పడం, అసిధారావ్రతమే! ప్రపంచ కర్షక జీవన విధానాన్ని, వ్యవసాయక విధానాలను, దశాబ్దాల క్రితమే శోధించి.. మథించి.. విశ్లేషించి.. భవితను ఊహించి చెప్పిన ఆచార్యరంగాగారి "**క్రీడో ఆఫ్ వరల్డ్ పెజెంట్రీ**" నిజంగా కర్షకవేదమే! రెండు సంవత్సరాలు తపస్సుగా చేసిన ఈ అనువాదం మనస్సుకు నిజమైన సంతృప్తిని తరగని ఆస్తిగా మిగిల్చింది. ఈ అక్షరయజ్ఞానికి ఎందరో హితులు.. సన్నిహితులు సహకరించారు, మేమున్నా మంటూ తోడుగా నిలిచారు. వారు -

ప్రముఖ సినీ రచయిత.. మాన్య మిత్రులు

**శ్రీ అదృష్టదీపక్**

ముద్రణా బాధ్యతలను స్వీకరించిన ఆత్మీయులు

**డాక్టర్ పులిచెర్ల సాంబశివరావు**

(రీడర్, జె.కె.సి. కళాశాల గుంటూరు)

ముఖపత్ర చిత్రణ చేసిన

**చిరంజీవి పులిచెర్ల దేవకాంత్**

అక్షరరూపమిచ్చిన

**సాయి అంజనీగ్రాఫిక్స్** (గుంటూరు)

ముద్రించిన శ్రీ లక్ష్మీప్రెస్ అధినేత

**శ్రీ పి. శ్యాంబాబుగారికి**

కృతజ్ఞతా మందారాలు

ఈ గ్రంథరచన.. ముద్రణ సమయంలో వెన్నంటి నిలిచిన

మా డాక్టర్ **కందిమళ్ల సాంబశివరావు,**

(రీడర్, D.R.N & S.C.V.S కళాశాల)

**శ్రీ గుంటుపల్లి నాగేశ్వరరావు**

(లెక్చరర్, జె.కె.సి. కళాశాల)

**శ్రీమతి గింజుపల్లి సుశీల**

(లైబ్రేరియన్, D.R.N & S.C.V.S కళాశాల)

**శ్రీ కామేపల్లి రామారావు**

(లెక్చరర్, సి.ఆర్.కళాశాల)

మా అల్లుడైన కడు స్వతంత్రుడు

**నన్నపనేని శంకరయ్యాగార్లకు**

కృతజ్ఞతలు

నాలో అంకురించిన సాహితీ పిపాసను

ద్విగుణీకృతం చేసిన మా అభిమాన గురుదేవులు

**శ్రీ సామవేదం జానకి రామశాస్త్రి గారికి**

ఈ గ్రంథ భూమికలో వందన సుమమాల సమర్పించడం నా విధ్యుక్త ధర్మం..

ఈ గ్రంథరచనకు సహాయ సహకారాలను అందించిన పూజ్య రంగాజీ

అభిమానులకు

శిష్యవర్గానికి

ధన్యవాదములు

**-డాక్టర్ జక్కంపూడి సీతారామారావు**

# కృతజ్ఞతలు


గ్రంథ ముద్రణకు

ఆర్థిక సహాయ మందించిన వదాన్యులు

**శ్రీ గొట్టిపాటి ప్రసాదరావు**

డైరెక్టర్, శ్రీ ధనలక్ష్మి గ్రూపు సంస్థలు, చిలకలూరిపేట

**డాక్టర్ చుండి తిరుపతయ్య**

రీడర్, తెలుగుశాఖ, సి.ఆర్. కళాశాల, చిలకలూరిపేట

**శ్రీ జాగర్లమూడి నరేంద్రనాథ్**

**శ్రీ కోయ రామమోహనరావు**

యల్.వి.ఆర్.అండ్ సన్స్ క్లబ్ అండ్ రీడింగ్ రూమ్ - గుంటూరు

**శ్రీ జాష్టి రంగారావు**

డైరెక్టర్, అసిస్ట్, చిలకలూరిపేట

**కాకతీయ కళాపరిషత్, నాగభైరువారిపాలెం**

**సి.ఆర్.క్లబ్, చిలకలూరిపేట**

**కాకతీయ విద్యాపీఠం, చిలకలూరిపేట**

**శ్రీ బెల్లంకొండ వీరాంజనేయులు**

ప్రిన్సిపాల్, D.R.N & S.C.V.S కళాశాల, చిలకలూరిపేట

# అంకితమోయన..

బడిలో ఒక పూట
మడిలో ఒక పూట
అక్షరాల - పంటలు పండించిన
నిత్యసత్య కృషీవలుడు
రూకలు అడగక రుజలు మాన్పి..
వేలాది మందికి ప్రాణదానం చేసిన
అపర ధన్వంతరి
నాగార్జున విద్యాసంస్థల
వ్యవస్థాపక అధ్యక్షులై..
క్రమశిక్షణ..ఋజువర్తనల
సమాహార స్వరూపంగా విద్యాదానం చేసిన
అక్షరయజ్ఞ సోమయాజి
ప్రజాసేవకు పదవులు పరమపద సోపానం కాదని..
అణువణువునా నమ్మిన సత్య.సంధుడు..
నిరంతర సాహితీ చర్చనం..
సరస్వతీ సమర్చనం..
అభిమానంగా.. అభిలాషగా..
వేలాది గ్రంథాలను ఔపోసన పట్టిన అగస్త్యుడు..
వ్యవసాయం అంటే ఇష్టం..
కర్షకులంటే మరీ మరీ ఇష్టం..
హాలిక జన శ్రేయం
వారి నిరంతర ఆలోచనాలోచనం..
అమ్మలోని లాలన
నాన్నలోని పాలన
గురువులోని బోధన
యోగిలోని సాధన..

నాకు రుచి చూపించి..
నన్ను నన్నుగా తీర్చిదిద్దిన
మహామనీషి
నాకేమౌతాడు.. అంటే సమాధానం..
నిజంగా అక్షరాలకు అందనిది..
మాటలకు - చాలనిది ..
అన్నీ తానైన మా హితునికి
ఏమిచ్చినా అది చంద్రునికో నూలుపోగే
రంగాగారంటే వారికి చెప్పలేని అభిమానం..
నాకు ఆరాధ్యదైవం..
రంగాగారి మాట.. మా ఇద్దరికి రాచబాట..
నాకిష్టమైన గ్రంథం .. కర్షకవేదం..
నాకు అత్యంత ఇష్టుడైన మా మాష్టారుకి
నిండు మనస్సుతో నమస్కరిస్తూ
మానవత్వం పరిమళించే....
మంచితనం గుభాళించే
నాగుండె గుడిలోని
**డాక్టర్ కాసరనేని సదాశివరావుగారికి**
ఈ గ్రంథాన్ని ముడుపుకట్టి..
అభిమానంగా.. ఆరాధ్యంగా
అపురూపంగా.. అంకితమిస్తూ..

**-డాక్టర్ జక్కంపూడి సీతారామారావు**

# పరిచయం

ప్రపంచ రైతులు ఎంతో కాలంగా తమకందని సాంఘిక న్యాయం కొరకు వత్తిడి చేస్తున్నారు. ఒకరి దయాభిక్షగా కాక తమ హక్కుగా వర్గ స్పృహతో నేడుద్యమిస్తున్నారు.

ప్రపంచ రైతులకు సంఘనిర్మాణం అవసరం. తరతరాలుగా వీరు తమ ఐక్యతా వశ్యకతనుగుర్తించలేదు. అధికసంఖ్య, సంఖ్యాబలం, సాంఘిక జీవితంలో వారి ప్రాధాన్య తను గుర్తించలేకపోవటం ఇందుకు కారణాలు. ఇవివారి ఐక్యతావశ్యకతను గుర్తించ నీయలేదు. 20వ శతాబ్దపు పూర్వార్థంలో ప్రపంచంలో వచ్చిన పెనుమార్పులు వారిని మేల్కొల్పినవి.

"ప్రపంచకర్షకులారా - ఏకం కండు" ఇది మేల్కొన్న రైతాంగపు పొలికేక. ఈ మేలుకొలుపు ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ అగ్రికల్చరల్ ప్రొడ్యూసర్స్ (I.F.A.P.), ఇంటర్నేషనల్ పెజెంట్సు (I.P.U.) యూనియన్ నిర్మాణాలకు కారణమయింది. ఫుడ్ అండ్ అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్ (F.A.O.) ప్రభుత్వ విభాగం.

ఉత్పత్తి దారుల, పౌరుల - స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు రైతులు కొమ్ముకాచేవారు. రాజ్యాలు-రాజులచే బహిష్కరింపబడిన స్వేచ్ఛ రైతుల ఇళ్ళలో తలదాచుకొంది. జాతీయజీవనం, పరిశ్రమలు, కళలలో నశింపజేయబడిన స్వాతంత్ర్యం, రైతు జీవన విధానంలో కలగలసిపోయింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుకోల్పోయిన దేశాల ఆత్మలు రైతుల కుంపట్లలలో నివురుగప్పిన నిప్పులాగా వున్నాయ్. ప్రజల భాష, నుడికారం, మేధస్సు, సంస్కృతులు కించపరచబడి, విజేతల, పాలకుల న్యాయస్థానాలనుండి, విశ్వవిద్యాలయాల

నుండి వెళ్ళగొట్టబడినప్పుడు - రైతుల మాటలో - పాటలో - నవ్వులో - నాట్యంలో ఆశ్రమ వాసంచేశాయి. ఇతరవర్గాలు, విముక్తి స్వాతంత్ర్యాల పేరు తలచనప్పుడు, గిరిజనులలో, సంచారులలో, ఆటవికులలో వారి కొండగుహలందు, అరణ్యాలందు, మంచుకొండలందు పునరావాసం కల్పింపబడ్డాయి. రాజులపై, రాజ్యాలపై, భూస్వామ్య ప్రభువుల పెట్టుబడిదారీ తనంపై - ఆఖరుగానేడు కమ్యూనిష్టు అణచివేతపై - జరిగినపోరాటాలకు రైతులే వెన్నెముక. రష్యాలో, చైనాలో, రష్యా ఉపగ్రహ దేశాలలో రైతులు అణచివేతతో సంఘర్షించారు. తిరగబడ్డారు.

ప్రతి పోరాటంలో తొలిమెట్టు నుండి మలిమెట్టుకు రైతులుముందడుగు వేస్తున్నారు.

తరతరాలుగా రైతులు ప్రతి వర్గంలోనికిలాక్కొనబడుతున్నారు. వీరి వలన పరవర్గాలసంఖ్య పెరుగుతుంటే వీరి సంఖ్యా బలం తగ్గుతున్నది. అయినా పరిశ్రమలలో, ఇతర వ్యాపకాలలో నేటికీ వారే అధిక సంఖ్యాకులు. పారిశ్రామికంగా వృద్ధి చెందిన బ్రిటనులోకానీ, యాంత్రిక అమెరికాలో గానీ - ఆహారం, బట్టలలో సింథటిక్ ఉత్పత్తులు పెరిగిన నేడుకూడా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకై తపించేవారు మాత్రం రైతులే!

20వ శతాబ్దపు ఉత్తరార్ధం విసురుతున్న సవాళ్ళను ఎదుర్కోవటానికి రైతులు సిద్ధంగా వున్నారు. సోవియట్ నియంతృత్వాధికారం రైతాంగవిధానాన్ని, రైతులను సమూలంగా నాశనంచేసి, వ్యవసాయాన్ని పొలం-పరిశ్రమ (Farm-Factory) ఆర్థికత లోనికి నెట్టటానికి ప్రయత్నిస్తున్నది. రష్యా, చైనా, ఆగ్నేయాసియా రైతులు వీరి తిరోగమన చర్యలను, కుతంత్రాలను విజయవంతంగా నిలువరిస్తున్నారు. రష్యాలో ప్రభుత్వ క్షేత్రాలలో[1] - సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో[2] పనికి మాలిన వారిగా మార్చబడుతున్న రైతులు - ఈ కొత్త గొలుసులు త్రెంచేయత్నాలలో వున్నారు. రైతులలో పెల్లుబుకుతున్న స్వేచ్ఛా ప్రియత్వం కారణంగానే 1956 లో హంగరీ, పోలాండ్‌లలో విప్లవాలు, సోవియట్ వైఖరిలో మార్పు వచ్చినవి.

రైతులు వారి జీవితాలలో, వృత్తులలో అధికారయంత్రాగపు జోక్యాన్ని నిరసిస్తున్నారు. సహకార వ్యవసాయంను (రష్యాటైపు) వారు వ్యతిరేకిస్తున్నారు. ప్రత్యక్షంగా దాడికి సాహసంచేయలేక, కార్మిక, అధికారయంత్రాంగం,వారివ్యవసాయంలోనికి, సహకారవ్యవస్థల రూపంలో, మోసంతో, మోహినీ అవతారంలో సాక్షాత్కరిస్తున్నది.

ఈ అందంలోని మోసాన్ని గ్రహించి, యుగోస్లోవియా రైతులీ "కౌగిలి" తిరస్కరించారు. మార్షల్ టిటో[3] నేతృత్వంలో, కమ్యూనిష్టులచే కృత్రిమంగా నడపబడుతున్న కో-ఆపరేటివ్‌ల (సమిష్టివ్యవసాయక్షేత్రాల) నుండి 75 శాతం రైతులు బయటపడ్డారు. యూరప్‌లోని సోవియట్‌ఉపగ్రహ దేశాలలో స్వేచ్ఛ కోరటం, అంగీకరించటం, ఆచరింపబడటం జరిగింది. కో-ఆపరేటివ్ ఆర్థికతలోకంటే రైతాంగ ఆర్థిక విధానంలో ఉత్పత్తి రెట్టింపుగా వుంటుందని, అందుకే రైతులకు స్వేచ్ఛకల్పించామని వారు చెప్పుకుంటున్నారు."అమెరికా ఫార్మర్లు (Farmer-- అమెరికాలో రైతు) సహకార-సమిష్టివ్యవసాయాలకు వారి ఆర్థికత్వంలో చోటులేదని విశ్వసిస్తున్నారు. " అని వారి నేషనల్ యూనియన్ ప్రకటించింది.

ఇండియాలో - చైనాలోలాగానే రైతుల విజయాలను వారి స్వేచ్ఛను తక్కువగా చూపి, వారికి ప్రాధాన్యతలు -రక్షణలు ఎఱవేసి ముందుగా వారిని కార్మికులుగా మార్చే యత్నం జరుగుతున్నది. రష్యా,దాని ఉపగ్రహ దేశాలు ఈ యత్నంలో ఘోరంగా విఫలమయినయ్. చైనా, ఇండియాలలో కూడా రైతులను కార్మికులుగా మార్చే తంతు జరుగుతున్నది. రైతుల మానసిక ప్రవృత్తిని నిర్లక్ష్యంచేస్తే, రైతుల నుండి చరిత్ర ఎరుగని ప్రతి స్పందన వస్తుంది.

ఈ ఉద్యమ పరిణామాలేమిటి ? ప్రపంచరైతులు ముందుగా కార్మికులుగా మార్చబడతారు. వారి సామాజిక -ఆర్థిక స్వాతంత్ర్యం తీవ్రంగా దెబ్బతింటుంది. మానవ చైతన్యం-స్వాతంత్ర్యం అనే గడియారపుముళ్ళు వెనక్కునడుస్తాయి. ప్రపంచశ్రామికుల బానిసత్వంలో ఇంకో అధ్యాయం ప్రారంభమవుతుంది.

వీరి యత్నం ఫలిస్తుందా ? ఎక్కువకాలం కొనసాగుతుందా ? సహకార సామ్య వాదంలో ఇదినూతన యుగమౌతుందా ? ఇది సర్వసాధారణమా ? కాదు అనేదే సమాధానం. సోవియట్ రైతుల విజయాలనుండి - అవి ఎంత స్వల్పమయిన వయినా, మూసి పెట్టబడినవయినా - ఈ సమాధానం వచ్చింది.

రైతుతత్వపు ప్రాధాన్యత, శక్తులు, వారి స్వేచ్ఛలో, వారిపనిలో వున్నయ్. ఆధునిక ప్రపంచంలో పెరుగుతున్న జనాభాకు అవసరమయిన ఆహారం, బట్టల ఉత్పత్తులలో రైతుదనం విజయం సాధించింది. ఇది స్వతంత్రజీవుల - సంపూర్ణ శ్రామికతకు అంకితమై పెత్తందార్ల నుండి అధికారయంత్రాంగం నుండి, యజమానులనుండి విడబడినవారి జీవిత విధానం. ఈ జీవిత విధానం ఋతువుల వైపరీత్యాలనుండి, ఆర్థికహిమ పాతాల నుండి - ప్రభుత్వ రక్షణ కోరుతున్నది.

సహకారం (విధానం) రైతుకుమిత్రునిగా, సహచరునిగా, సచివుడిగా వుండాలి. స్వాతంత్ర్యం హరించే యజమానిగాకాదు. వారివ్యాపకాలకు, అత్యవసరాలకు, సరఫరాలకు, బేరసారాలకు రైతుసహకార సంఘాలు కావాలి. ప్రస్తుత ఆర్థిక చక్రం నుండి స్వేచ్ఛకు, కీలక సేవల పిడికిళ్ల నుండి విముక్తికి - వారికి కావలసిన కీలక సేవలపై ఆధిపత్యానికి - సహకార వ్యవస్థల (కో-ఆపరేటివ్‌లు) ఆవశ్యకతవుంది. అనావృష్టి , వరదలు, భూమికోత, అంటువ్యాధులు, పంటల వైఫల్యాలు వీటి వలన వచ్చే కరువుల నుండి రక్షణకు కోఆపరేటివ్‌ల ద్వారా వ్యవస్థీకృత సహకారం ప్రభుత్వం అందించాలని రైతులాశిస్తున్నారు. స్వపరిపాలనా సంస్థల నిర్మాణాలను, వారు ఆర్థికంగా బలపడటానికై కోరుకుంటున్నారు. వేతన బానిసలుగా మార్చబడటానికి కాదు. తనవాతావరణంలో (తనదైనశైలిలో) వ్యవస్థీకృత సహకార నిర్మాణం ద్వారా, పరిశ్రమలతో సంబంధాలు కలిగి, అధిక ఉత్పత్తిని వాంఛిస్తున్నారు.

పనిలోరైతులు స్వతంత్రులు. వారికి వారే యజమానులు. వారిపైఇతరుల అధికారాన్ని గుర్తించరు. వారు వారి పొలాలలో పనిని, జీవిత వనరులను వెతుక్కుంటారు. వ్యవసాయప్రణాళికలలో, కార్యాచరణలో, ప్రతిఫలాలలో వీరు జవం,జీవం,తృప్తి, ఆనందం, పొందుతారు. సంపూర్ణవ్యక్తిత్వం సంతరించుకొనటానికి, సామ్యవాద లక్ష్యాన్ని చేరు కోవటానికి అవసరమయిన ప్రాథమిక స్వేచ్ఛవారికుంది. కళాకారులు, చేతివృత్తులవారూ స్వేచ్ఛాజీవులే. స్వేచ్ఛ, స్వేచ్ఛావకాశం, సాంఘిక స్వాతంత్ర్యం - స్వాతంత్ర్యావకాశాల కొరకు మారిస్, ఆర్.హెచ్.టానీ (R.H.Tawney), హెచ్.ఎన్. బ్రెయిల్స్ ఫోర్డు, (H.N.Brailsford) లు అంగలార్చుతున్నారు. ఈ సాంఘిక స్వాతంత్ర్యాన్నే, స్వాతంత్ర్య ప్రియులయిన పాశ్చాత్య సామ్యవాదులు (Socialists- సోషలిస్టులు) ఈ 20వ శతాబ్దంలో సాధించాలని కోరుకుంటున్నది. చాకిరి నుండి విముక్తి, పారిశ్రామికాభివృద్ధి, సౌభాగ్యాలు కోరి - అమెరికన్‌కాంటినెంటు - యూరప్ ఈ స్వాతంత్ర్యం కోల్పోయాయి. పాశ్చాత్య సోషలిజం ఇటువంటి స్వాతంత్ర్యం కొరకు మరలా తపిస్తున్నది.

ఈ స్వాతంత్ర్యం కలిగిన కొద్దిమంది రైతులు స్వాతంత్ర్య రక్షకులుగా మిగిలారు. ప్రపంచంలోని ఇతర శ్రామికులు, ఈ నిజాన్ని, సామ్యవాదపునిజమయిన ఉద్దేశ్యాన్ని గుర్తించి, స్వాతంత్ర్యాన్ని కాంక్షించి, వీటిని శ్రామికస్వాతంత్ర్యానికి పునాదు లుగా, మూలస్తంభాలుగా భావించి, వీటి ఆధారంగా సహకార కామన్వెల్తు నిర్మాణం

జరిగి, సాంఘికన్యాయం పరిఢవిల్లేవరకు - రైతులే సాంఘికస్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పెంచిపోషిస్తారు.

అధిక సంఖ్యలో ఉద్యోగాలు, స్వపరిపాలనలేని కార్మికులు, ఇతరులు, ఆర్థిక స్వాతంత్ర్యంపొంది, స్వతంత్ర సహకార శ్రామికులుగా మారటానికి రైతులే ఆశాజ్యోతి నందిస్తారు.

ఈ పారిశ్రామిక యుగంలో తమవారు అధిక సంఖ్యలో లాభసాటిగా వుండే ఉద్యోగాలు, వృత్తులు వెదుక్కుంటున్నారనీ, వీటిలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండవనీ రైతులకు తెలుసు. వారు పోగొట్టుకుంటున్న స్వేచ్ఛను తిరిగి పొందాలని రైతుల ఆకాంక్ష. పరిశ్రమలలో, స్వపరిపాలన అధికార యంత్రాంగంచే ఎలా నియంత్రించబడుతుందో వారికి అర్థమైంది. అందుకే పరిశ్రమలలో స్వపరిపాలనపై రైతులు అధిక శ్రద్ధ వహిస్తున్నారు. వారి రక్షణకై పారిశ్రామిక సహకార సంస్థలను, వృత్తిశ్రేణులను, పనిసలహాసంఘాలను కావాలంటున్నారు. శ్రామికులందరి సమస్యలు తమసమస్యలుగా భావించి, పారిశ్రామిక స్వపరిపాలన, పారిశ్రామిక సహకార కామన్వెల్తుల నిర్మాణానికి తమ సంసిద్ధతను వ్యక్తం చేస్తున్నారు.

రైతులు పెట్టుబడి దారులుకారు. వారిది పెట్టుబడిదారీ ఆర్థికత కాదు. వారితరులను దోపిడీ చేయనవసరంలేదు. వారిది దోపిడీ నెరుగని జీవిత విధానం. ఈకారణంగా ప్రపంచరైతాంగం, సామ్యవాదానికి- సాంఘికన్యాయానికి పూర్తి హామీ దారుకాగలదు.

వారు మౌలికంగా సామ్యవాదులు. సహకారజీవనులు. వారెవరినీ దోపిడీ చేయాలని కోరరు. వారనుభవించేదాని కన్నా సమాజానికి అందించే సంపద చాలా ఎక్కువ. అందరి శ్రేయోభిలాషులు. తొలుతగా సాంఘికన్యాయాన్ని గుర్తించినవారు. సహకారావశ్యకత తెలిసినవారు. ప్రజాస్వామ్య ఐరోపాఖండంలో అమెరికాలో, లాటిన్ అమెరికాలో, కెనడాలో ఆధునిక సహకార దశలో సాధించిన విజయాలు - రైతుల శక్తికి, నిర్మాణతకు, జాతీయస్థాయిలో స్వయం పాలిత సహకార వ్యవస్థల నిర్వహణకు, భూమి హక్కుకు, వ్యవసాయ జీవితానికి కితాబులు. అందువలన వారు గిల్డు సోషలిజంకు[4] (Guild-శ్రేణి) మద్దతుదారులు.

పాలకులకు, పాలితులకు, యాజమాన్యానికి - మహాసభకు (General Body - జనరల్ బాడీ), డైరెక్టర్లకు - సభ్యులకు మధ్య ప్రయోజనాలకొరకు వచ్చే విభేదాలు

రైతులకు తెలిసినవే. వికేంద్రీకృత ప్రభుత్వం వలన కలిగే లాభాలపై వారికి అవగాహనుంది. అందుకే వీరు రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంఘిక రంగాలలో పాలన అతి చిన్న యూనిట్ల (UNIT)కు పరిమితంకావాలని కోరుకుంటున్నారు. అధికార యంత్రాంగానికి, వారెన్నుకొన్ననాయకులకు కట్టబెట్టిన అధికారం వీరి వ్యక్తిగత జీవితంలోనూ, పనిలోను తేగల ప్రమాదం వీరికి తెలిసిందే. వారి స్వతంత్రతను ప్రజాస్వామ్యపద్ధతులలో బల పరచటం వారి లక్ష్యం. వీరి శ్రమతో ఇతరవర్గాలన్నీ స్వేచ్ఛగా జీవిస్తున్నాయి.

వారు జాతీయ ప్రభుత్వాలలో తమ "గొంతు" బిగ్గరగా వినిపించాలని పట్టు దలతో వున్నారు. ఆధునిక రాజ్యపాలనలో శ్రామిక జీవుల మధ్య, ప్రజాస్వామ్యవాదులుగా, సామ్యవాదులుగా, ప్రాచీన గ్రామ కాన్వెల్తుల అభిమానులుగా సంపూర్ణ స్వేచ్ఛ, స్నేహ భావం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం కోరుకుంటున్నారు. పాలనా యంత్రాంగంలో ఉన్నతో ద్యోగాల ప్రాముఖ్యత తెలుసుకొని, తమ వర్గాలనుండి ఉన్నతోద్యోగులు రావాలని కోరుతున్నారు.

మతం, కులం, తెగ, సాంప్రదాయం రైతుల జీవితంతో పెనవేసుకొన్నాయి. కార్మికనియంతృత్వపు సవాలు ఒక వైపు, కాపిటలిస్టు దోపిడీ భయం వేరొక వైపు చుట్టుముట్టడంతో ఈ మానసిక బలహీనతలను, ఆటంకాలను తొలగతోసుకొని, జాతీయ, అంతర్జాతీయ సమస్యలను వర్గ దృక్పథంతో పరిశీలించి ఆధునిక పాలనకు-ప్రజావాణికి తగిన విధంగా తమను తీర్చిదిద్దుకున్నారు. స్కాండినేవియన్, డచ్,కెనడియన్, ఆస్ట్రేలియన్ రైతులు తమ శాసన సభల్లో కాలుపెట్టగలిగారు. ఆగ్నేయ ఐరోపారైతులు రాజకీయ విజయాలు సాధించారు. ఈ కారణంగానే ఇండియాలో జాతీయకాంగ్రెసుతో ఇతర వర్గాల పొత్తులతో 1952-1957 ఎన్నికలలో విజయాలు సాధించి, కమ్యూనిష్టులు మొగం మాడ్చుకొనేటట్లు చేశారు.

సాంఘికన్యాయం, అభివృద్ధులపై, పెరుగుతున్న జనాభా డిమాండ్లకు అనుగుణంగా అతిపెద్ద ఉత్పత్తి ప్రయత్నాలు, ఎక్కువ ఉత్పత్తులు - అనేవి ఈ శతాబ్దపు రెండవ అర్ధభాగపు కీలక భాష అయింది. రైతులీ దిశలో చాలా ముందున్నారు. 1955-56 సంవత్సరాలలోతూర్పు-పడమర దేశాలలో వ్యవసాయఉత్పత్తులు చాలా అధికంగా వున్నాయి, ధాన్యం పండించే భూముల విస్తీర్ణం, 1956-57లో భారతదేశంలో చాలా పెరిగింది. కమ్యూనిటీ డెవలప్మెంటు (సమాజాభివృద్ధి) బ్లాకుల ద్వారా పంచవర్ష ప్రణాళిక ద్వారా వ్యవసాయోత్పత్తులు 25 శాతం పెరిగినవి.

ఈ అభివృద్ధిని కార్మికులుగా మార్చబడ్డరైతులుకాక స్వతంత్ర రైతులు సాధించారు.

అయినా "వ్యవసాయ నికరాదాయంలో కానీ, వ్యావసాయిక ఉత్పత్తిదారుని ఆర్థిక స్తోమతలోగానీ కొద్దిపాటి అభివృద్ధి కూడా కానరాదు" అని I.F.A.P మరియు F.A.O లు అభిప్రాయపడినాయ్.

ప్రపంచంలో ఆకలి కడుపులనన్యాయం చేస్తున్నది రైతులుకాదు, ఖరీదైన ప్రభుత్వాలు, అధికార యంత్రాంగం, వారి అట్టహాసం మాత్రమే. అమెరికా ప్రభుత్వం, సాగుచేయని పొలాలకు, క్రమంగా సంపన్నంచేయబడే భూములకు (Soil Banks - SlowFertilisation-- భూమిబాంకులు-భూపోషణ) నిలువవున్న వ్యవసాయ అధికోత్పత్తుల ఎగుమతులకు సబ్సిడీలనందిస్తున్నది.

భారతజాతీయ ప్రణాళికా సంఘం తమలక్ష్యమయిన 603 మిలియన్ ఎకరాలకు గాను 4 మిలియన్ ఎకరాలకు మాత్రమే నీటిపారుదల సౌకర్యం కలిగించ బడిందని ఒప్పుకొంది. ఈ పరిస్థితులలో రెండవ ప్రణాళికాకాలంలో నీటిపారుదల సౌకర్యం కలగించాలని లక్ష్యంగా పెట్టుకొన్న 12 మిలియన్ ఎకరాల గతేమిటి ? అనావృష్టి నుండి రైతులకు రక్షణ ఏ విధంగా కలుగుతుంది. ?

అతిత్వరగా పారిశ్రామికీకరణ చెందుతున్న ప్రపంచంలో - రోజురోజుకూ వ్యవసాయం మీద ఆకర్షణ తగ్గుతున్నది అని వాపోవటం సహజం.

జాతీయ సంపదలో రైతువాటా తగ్గుతోంది. రైతులపరిస్థితి ఆందోళన కల్గిస్తున్నది. సామర్థ్యంగల యువకులు పొలాలు వదలి వెళ్ళుతున్నారు. (I.F.A.P. పాలసీకమిటి-1957)

**అందువలన వ్యవసాయేతర ప్రజరైతులనాదుకోవాలి.**

# వ్యక్తిగతం

మొదటి ప్రపంచయుద్ధంతరువాత, పాశ్చాత్యసామ్యవాదులు 'గిల్డు సోషలిజం' (Guild Socialism - శ్రేణీసామ్యవాదం)తో ఉత్తేజితులయిన తరుణంలో (1921-23) జి.డి.హెచ్. కోల్, హెచ్.ఎన్. బ్రెయిల్స్ ఫోర్డు, పేజ్ ఆర్నాల్డ్, ఆర్. పామేదత్, హెన్రీ గ్లే, రాడ్ ఫోర్డ్‌లతో 1921 లో (లేబర్ రీసర్చిస్టడీస్ - మరియు W.E.A లలో) నేను చర్చించటం జరిగింది. ఈ సందర్భంగా భారతదేశం తన కోట్లాది స్వతంత్ర చేతివృత్తులవారిని, వారి శ్రేణులను (GUILDS ) భద్రంగా కాపాడుకొంటున్నదని ధైర్యంగా చెప్పాను. ఈ చర్చలు నన్ను-సామ్యవాదం (Socialism) స్వయం ఉపాధి ఆర్థికత (Self Employment Economy ) ల స్వభావం, చరిత్రలను, భారతదేశపు - ఇతర తూర్పుదేశాల రైతుల, చేతివృత్తుల వారి అధ్యయనానికి ఉత్తేజ పరచినవి.

సామ్యవాదమౌలికతత్వం తూర్పుదేశాలరైతులలో - చేతివృత్తులవారిలో వేళ్ళూనుకుంటున్నదనే నావాదనను. హెచ్.ఎన్.బ్రెయిల్స్‌ఫోర్డ్ అభినందించాడు. అప్పటి నుండే ఈ వ్యవస్థల పునాదులను బలోపేతం చేసే "నిర్మాణాత్మక సామ్యవాద నిర్మాణ యత్నంలో" వున్నాను.

భారత స్వాతంత్ర్య పోరాటకాలంలో, భూస్వామ్యవిధానం, దాని దోపిడీల రద్దుకు - స్వతంత్రరైతాంగ ఆవిర్భావానికి కృషి చేసాను. నా సహచరుల నుండి ప్రతిఘటన-నిరుత్సాహాలే నాకు లభించినవి.

రైతువారి కౌలుదార్ల రక్షణకు 1930 నుండే పోరాటం చేసాను. రైతులు భూస్వామ్యవ్యవస్థ నుండి దాదాపు విముక్తిపొందిన తరువాత కౌలుదార్ల రక్షణ అత్యవసర

మయింది. దానికీ కృషిచేసాను. ఇటీవలవచ్చిన కౌలుదారీ చట్టంను మనస్పూర్తిగా అభినందిస్తున్నాను.

భూముల పంపిణీకి కూడా కృషిచేస్తున్నాను. బలవంతపు శ్రమరద్దుకు, నేరప్రవృత్తిగల తెగల ఉద్ధరణకుపోరాటం సాగిస్తున్నాను.

1923 నుండీ రైతులు-రైతుకూలీల పరస్పర సంబంధాలు దోపిడీ రహితంగా వుండాలని, అభివృద్ధిదాయకంగా వుండాలనేది నా ప్రగాఢ విశ్వాసం.

నేను, Mr. సెరెట్ (ఇటాలియన్) హెచ్.ఎన్.బ్రెయిల్స్ ఫోర్డ్ ఆసియా రైతుల, చేతివృత్తుల వారి సాంఘిక-రాజకీయ-మానసిక స్థితులు, ఈ శతాబ్దపు వేగాన్ని అందుకొనే మార్గాలకై అన్వేషించాము. డేనిష్, ఇటాలియన్ సహకారోద్యమాలలో ఈ సమస్యకు పరిష్కారం కన్పించింది.

భారతరైతుల - చేతివృత్తుల వారి సహకారోద్యమంలో కార్యకర్తగా శ్రమించాను. అఖిలభారత సహకారసంఘానికి (All INDIA Co.Operative Union) ఉపాధ్యక్షుడుగా వున్నాను.

1925-26 మధ్యకాలంలో, నా ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీ అధ్యయనంలో - భారతచేనేత మగ్గాల పరిశ్రమ- ఆర్థికత్వం తద్వారా 40 మిలియన్ల భారతచేతివృత్తుల వారి నిర్మాణాత్మక పాత్రను తెలుసుకోగలిగాను. చేనేత కార్మికుల సహచర్యం నా అదృష్టంగా భావిస్తున్నాను. సహకారరంగంలో నేడు పదిలక్షల కంటే ఎక్కువ చేనేత వారున్నారు.

కీలకసేవల యజమానుల నుండి వీరు విముక్తి పొందాలి. వారి స్వయంకృషి, సహకారవ్యవస్థలతో పాటు రాష్ట్రీయ వర్తకం (State Trading ) వంటి ప్రభుత్వ సేవలతో వీరు కీలకసేవల ఆధిపత్యం సంపాదించాలి. అప్పుడే వారు స్వపరిపాలన, విశ్వాసం, చేవ గల స్వతంత్రరైతులుగా, చేతివృత్తులవారిగా మనగలరు. వీరి ఉద్యమాలద్వారా సహకార సామ్యవాద నిర్మాణం చేయగలం. ఆత్మవిశ్వాసం, నమ్మకాలతో వీరిని శక్తి వంతులను చేసి, స్వపరిపాలన, స్వయం ఉపాధి, ఉత్పత్తిదారుల-వినియోగదారుల సహకారనిర్మాణంలో నిర్మాణాత్మకపాత్ర కల్పించి - మహాత్మాగాంధీ అడుగుజాడలలో నడపించటం మనకర్తవ్యం. నా ఈ కృషే స్వయం ఉపాధిగల ప్రజలకు మాపై విశ్వాసం కలుగ జేసింది. ఈ ఉద్యమంలో ఇండియన్‌పెజెంట్స్ ఇనిస్టిట్యూషన్ ముందు నిలచింది.

యాంత్రిక వ్యవసాయానికి నేను వ్యతిరేకిని కాను. దేశపు సాంఘిక ఆర్థికత్వానికి అది అవసరమని ఋజువు చేయబడాలి. పరిమితజనాభా, పట్టణఆకర్షణలు, అవకాశాలు గల అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా వంటి దేశాలలో భారీయాంత్రిక వ్యవసాయం వారి జాతీయవ్యవసాయలక్షణం. అధిక జనాభాతో, నిరుద్యోగం తాండవిస్తున్న ఓరియంటల్ దేశాలు, లాటిన్ అమెరికాలలో పనికల్పనకు, సామాజక భద్రతలకు వ్యవసాయఆర్థికతనే ఆశ్రయించాలి. పూర్తి ఉద్యోగకల్పన కలిగే వరకు మనం ఈ "చిన్నతరహా" (వ్యవసాయ) ఆర్థిక విధానానికే అంకితం కావాలి.

తూర్పుదేశాలలో విద్యావంతులు స్వల్పసంఖ్యలోనైనా వ్యవసాయానికంకితమై, యంత్రాలు ఉపయోగించటం నేర్చుకొని, ప్రజాస్వామ్యవ్యవస్థలో రాజకీయ-ఆర్థిక వ్యవస్థలను శాసించినప్పుడు. సాంఘికన్యాయం కొరకు వారిలో తపన పెరుగుతుంది. ప్రజాస్వామ్యరైతు-కూలి-ప్రజారాజ్యానికి వారిచ్చే మద్దతు ఎంతో శక్తివంతమయినది. వారి సంఘాలు ప్రజాస్వామ్యానికి బాటలువేయాలి. అధికార యంత్రాంగాన్ని నియంత్రించాలి. సంఖ్యాబలం నుండి వర్గాలనుండీ రక్షించేవిగా వుండాలి. అప్పుడే మనధ్యేయ మయిన సామ్యవాద సహకార కామన్‌వెల్తు, విద్య చైతన్యం, సంఘీభావం స్వేచ్ఛగల, రైతుల చేతివృత్తుల వారిచే ఆవిష్కరించబడుతుంది.

స్వాతంత్ర్యం - స్వేచ్ఛ, అభివృద్ధి, సమానన్యాయం గల నవసమాజం ఏర్పడుతుంది.

నేను వికేంద్రీకృత సహకార ప్రజాస్వామ్యసమాజం పై విశ్వాసం కలవాడను. సాంఘిక - ఆర్థికన్యాయాలకు రైతులు-చేతివృత్తుల వారు పెట్టని కోటలు. వీరి వల్లనే సామ్యవాద సహకారకామన్వెల్తు ముందుకు నడుస్తుంది.

అభివృద్ధిదాయకమయిన - 20వ శతాబ్దపు ఆలోచన మన సామ్యవాద సహకార కామన్వెల్తు కొరకై ఈ సమయంలో ఈ "క్రిడో" ప్రచురిస్తున్నాను.

ఈ కార్యక్రమాలన్నీ మహాత్మాగాంధీ చే ప్రారంభించబడిన "ఇండియన్ పెజెంట్ ఇన్‌స్టిట్యూషన్" మార్గాన్ని విశాలతరం చేస్తున్నవి.

పాశ్చాత్య ప్రభావంతో "వేతన జీవులకు" మాత్రమే సాంఘికన్యాయం కావాలనే అభిప్రాయం ప్రబలి, రైతుల చేతివృత్తులవారి అవసరాలు నిర్లక్ష్యం చేయబడ్డవి. ఇన్నేళ్ళుగా నేను ప్రపంచంలోని జాతీయ వాదులను, సామ్యవాదులను, ప్రజాసామ్యవాదులను రైతుల-చేతివృత్తుల వారి సాంఘిక న్యాయ ఆవశ్యకతకై ఒప్పించటానికి ప్రయత్నిస్తూనేవున్నాను.

ఆధునిక పాలకులు వీరిని పట్టించుకోవటంలేదు. వీరిని స్వతంత్రులుగా వుండనివ్వటమే మహోపకారం చేయటంగా భావిస్తున్నారు. యుద్ధాల మధ్యకాలంలో వచ్చిన సంక్షోభాలు, ఆర్థిక మాంద్యం, నిత్యావసరవస్తువుల కొరత, కమ్యూనిష్టు-రాజకీయ సామ్రాజ్యవాద భయం - ప్రపంచం ఎంతగా స్వతంత్ర ఉత్పత్తి దారులపై ఆధారపడివుందో తెలియజెప్పింది. స్వయం ఉపాధికత పెరుగుతున్న కొద్దీ ప్రభుత్వం పై బరువు తగ్గుతుంది.

నేను దేశ విదేశాలలో ప్రారంభించిన ఉద్యమాలు ఈ వర్గాలవారికి విస్తృత పరిధిలో సాంఘికన్యాయం కల్పించటానికి అనువైనవి. వారుప్రత్యేకమయిన వారుకాదు. వీరికి ఎవరిపైనా వ్యతిరేకత లేదు. వీరు (స్వతంత్ర రైతాంగం-చేతివృత్తుల వారు) "సర్వే జనా: సుఖినోభవంతు" అనే గాంధేయవాదంలో పెరిగినవారు.

ప్రజాస్వామ్య రాష్ట్రమంటే (Democratic State ) మనవుద్దేశ్యం రైతుల-చేతివృత్తుల-కార్మికుల-బుద్ధిజీవుల ప్రజాస్వామ్యప్రభుత్వమని. అదే కిసాన్ మజ్దూర్ ప్రజా రాజ్. మహాత్మా గాంధీ ఈ ఆదర్శాన్ని ఆశీర్వదించారు. సామ్యవాద సహకార కామన్వెల్తుకు మహాత్ముడందించిన బహుమానమిది.

ఈ "క్రీడో" మహాత్ముని ఆదర్శాన్ని రైతులకన్వయించి విశ్లేషించే గ్రంథం.

ఇండియన్ పెజెంట్ ఇన్స్టిట్యూషన్ సిబ్బందికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు - పరమహంస, అప్పలాచారి, పరిశోధనా సహాయకులు. పి.ఆర్. పరుచూరి, జి.యు. రావులు ఈ గ్రంథముద్రణకు సహకరించారు.

నా ప్రత్యేక ధన్యవాదాలు - శ్రీమతి భారతీదేవీజీకు, నాసహచరులు జి.ఎల్. నారాయణ, జి.వి. సుబ్బయ్యకు మరియు ఎ. నాగయ్యలకు తెలియజేసుకుంటున్నాను.

దేవిజీ - నాజీవితభాగస్వామి- నాతోడునీడ.

**"రంగ"**

# రైతులు - చేతివృత్తులవారు - సాంఘిక న్యాయం

(Demand for Social Justice)

పెట్టుబడిదారీ వ్యవస్థ, రైతులకు, చేతివృత్తులవారికి, శ్రామికులకు జరిగిన అన్యాయమనే ఇరుసుపై పరిభ్రమిస్తూ, మనుగడ సాగిస్తున్నది. వీరు దరిద్ర కూపంలో, విశ్రాంతి, సంస్కృతులకు దూరంగా అజ్ఞానంలో మగ్గుతున్నారు. దేశపాలనాధికారంలో వారి రాజకీయ భాగస్వామ్యం నిర్లక్ష్యంచేయబడింది. మార్క్సు[1], ఏంగెల్సు[2], లెనిన్[3], స్టాలిన్[4] ఇతర సోషలిష్టులు శ్రమజీవన ఆర్థిక విధానాన్ని లోతుగా, విస్తృతంగా అధ్యయనంచేసి పెట్టుబడిదారీ వ్యవస్థ మోసాన్ని బయటపెట్టారు. అదనపు విలువ[5] మాయను బయల్పరచి - పెట్టుబడి[6] (Capital) శ్రమసాధితమని నిరూపించారు. పెట్టుబడిదారీవర్గపు అణచివేతకు, శ్రామికవర్గ విజయానికి - వర్గరహిత సమాజస్థాపనకు అనుసరించ వలసిన విప్లవ మార్గాన్ని వారు సిద్ధాంతీకరించారు. పెట్టుబడి వ్యవస్థ, భూస్వామ్యవ్యవస్థ తోడ్పాటుతో రాజకీయాధికారాన్ని చేజిక్కించుకొని, రైతులను, చేతివృత్తులవారిని ఏవిధంగా వారి సంపూర్ణస్థాయికి ఎదగనీయకుండా అడ్డుకుంటుందో, దురదృష్టవశాత్తూ, సోషలిస్టులు సమగ్రంగా అధ్యయనం చేయలేదు. ఆ సమస్యకీయవలసినంత ప్రాధాన్యతనీయలేదు.

శ్రామిక వర్గం అనునిత్యం తమ పనికాలంలో ఉత్పత్తి చేస్తున్న "అదనపు విలువను" (Surplusvalue) వారియజమానులు, పెట్టుబడిదారులు, భూస్వాములు వారి తాబేదార్లు స్వంతం చేసుకుంటున్నారనే వాస్తవాన్నినేడందరూ గుర్తించారు. రైతులు, చేతివృత్తులవారుకూడా అదనపు విలువనుత్పత్తిచేస్తారనీ, అదిచాలా ఎక్కువనే వాస్తవం సామాన్యంగా అందరికీ తెలియని సత్యం. వీరి అదనపు విలువను (సాంప్రదాయ కమ్యూనిష్టులు భావించినట్లుగా) భూస్వామ్యవర్గాలు మాత్రమే కాక కాపిటలిస్టులు

(Capitalist - పెట్టుబడిదారు) సోవియట్లు (Soviets - కమ్యూనిష్టులు) కూడా దిగమింగుతున్నారు. పారిశ్రామికవేత్త - శ్రామికుని అదనపు విలువను స్వంతం చేసుకొని, ఇతర పెట్టుబడిదారీ వర్గాలతో పంచుకుంటాడు. పెట్టుబడిదారీ దేశాలలో, వాణిజ్యవర్గం, పారిశ్రామిక వేత్త పాత్రను పోషించి, రైతుల, చేతివృత్తులవారి నుండి పొందిన అదనపు విలువను, పాక్షికంగా వినియోగదారులందరితోను పంచుకుంటుంది.

రైతులు పరిశ్రమలలోని కార్మికులకన్నా చాలా దుస్థితిలో వున్నారు. రైతులకు పారిశ్రామికకార్మికుల "అదనపు విలువ"లో వాటా లేదు. ఉన్నా అది స్వల్పం, (పారిశ్రామిక వేత్త, కార్మికుల నుండి స్వంతం చేసుకొన్న అదనపు విలువను, తక్కువ ధరలకు యాంత్రిక ఉత్పత్తులను అందచేయటం ద్వారా పంచే అదనపు విలువ -వినియోగదారునిగా రైతుకు స్వల్పంగా రావచ్చు). వాణిజ్య వర్గాలు, పారిశ్రామిక వర్గాలుదోచుకునే రైతుల అదనపు విలువను అధిక జీతాల ద్వారా, మెరుగైన సంపూర్ణ సామాజిక సేవల ద్వారా, సాధించుకున్న రక్షణలద్వారా కార్మిక వర్గం చెప్పుకోదగ్గంతగా పొందుతున్నది. అభినందనీయమయిన తమ రాజకీయ ఆర్థిక స్పృహవలన, ఐక్యత వలన ప్రపంచ శ్రామిక వర్గంలో పదో వంతు లేకపోయినా వీరు (కార్మికులు) ఈ వాటాచేజిక్కించుకుంటున్నారు.

ఆధునిక శ్రామిక వర్గం క్రమక్రమంగా యాజమాన్యపుదోపిడీ నుండి విముక్తి చెందే స్థితికి చేరుకున్నారు. రైతులాస్థితిలో లేరు. కార్మిక వర్గం సంఘర్షణలు, సమ్మెలు, ట్రేడ్ యూనియన్లు, ఆధునిక పారిశ్రామిక వ్యవస్థలో వారి కీలకపాత్ర, వారి రాజకీయ పార్టీలు, ఇంటర్నేషనల్ లేబర్ ఆఫీసు - (International Labour Office - I.L.O. ) రక్షణలు, ముఖ్యంగా పనిగంటల క్రమబద్ధీకరణ, యూనియన్ల గుర్తింపు, ఓవర్టైముకు జీతభత్యాలు, సామాజిక భద్రతలు, నిరుద్యోగ భృతుల వలన అభినందనీయమయిన స్థానం కల్పించుకున్నది.

ఈ సమస్య తీవ్రతను గుర్తించిన సోషలిస్టులలో హెచ్.ఎన్. బ్రెయిల్స్ ఫోర్డు ఒకరు. ప్రపంచ శాంతికి అడ్డుగావున్న నాలుగు సమస్యలాయన పేర్కొన్నాడు. ఒకటి జాతీయ సార్వభౌమాధికారం, రెండు- అంతర్జాతీయ పరస్పర ఆధారంకంటే-స్వయం సమృద్ధిపైచేయి కావటం, మూడు- లాభాలు-ఋణాలను గురించి, వాటితో ముడి సరుకులకు - వలస సామ్రాజ్యానికి వున్న సంబంధాలు, నాలుగు - పారిశ్రామిక - వ్యావ సాయక ఆదాయాలలోని వ్యత్యాసం. ఈ నాలుగవది అన్నింటికంటే బలమయినదని ఆయన అభిప్రాయం. "ఈ దేశ (U.K.- యునైటెడ్ కింగ్డమ్) పట్టణ శ్రామిక జన

మయిన మనమందరం, ఆఫ్రికా, భారతదేశం వంటి దేశాలలోని గ్రామీణ శ్రామిక వర్గపుజీవన ప్రమాణాలను మన దేశస్థాయికి పెంచటానికి సిద్ధంగా వున్నామా ? ఈ దేశంలో (U.K.) కూడా పట్టణ - గ్రామీణ ప్రాంతాల మధ్య ఈ సమస్య వుంది. మన శ్రామికులు "మార్క్సు" రోజుల్లో "లాంక్షైరు"లో వున్నట్లు లేరు. వారిప్పుడు కలకత్తా, బొంబాయిలలో శ్రమిస్తున్నారు. "సామ్రాజ్యమంటే తెల్ల ఋణదాతకు - నల్ల ఋణ గ్రహీతకు మధ్యగల ఆర్థిక సంబంధమనీ, ఒకరు మాంసపువేపుళ్ళు నంజుతుంటే - వేరొకరు గంజినీళ్ళతో బతుకీడుస్తున్నారనీ లేబరు పార్టీ (Labour Party) వారు ఎప్పుడైనా గుర్తించారా ? సామ్రాజ్యవాదం అంతం అంటే - ఋణసంబంధాల అంతం - జీవన ప్రమాణాలలో సమానత్వ సాధనే " (Why Capitalism Means War )

మార్క్సిజం ప్రభావానికి తీవ్రంగాలోనైన మేమందరం 1939 వరకు కాయకష్టం చేసేవారందరినీ శ్రామికులు[7] (Prolitariat ) గా భావిస్తూ, సోవియట్‌వారు ఆపదానికి చెప్పే భాష్యపు అంతరార్థాన్ని, ప్రాముఖ్యతను, జాగ్రత్తగా పరిశీలించలేక పోయాం. ప్రపంచదేశాల కమ్యూనిష్టులందరి అంతర్జాతీయవేదిక " కోమిన్‌టిరిన్‌" మాస్కోలోవుంది. మాకా అవకాశాలు లేవు. అందువలన జాతీయ విప్లవం ఒక ఆశయంగా, వలస, రంగు జాతుల విముక్తిపోరాటం మరొక ఆశయంగా స్వీకరించి, ఈ రెండు సమస్యలపై సిద్ధాంత రచనలు, వలస రంగుజాతుల ఫ్రీడం ఫ్రంటు (C.C.P.F) ఏర్పాటుకై నా 1940-44 జైలు జీవితంలో - రెండవప్రపంచయుద్ధ సమయంలో నేను కృషి చేయటం జరిగింది. 1939లోనే " డుబాయిస్" (DUBOIS) చేసిన హెచ్చరికనా దృష్టికి రాలేదు. "ప్రపంచ శ్రామికులంటే ఐరోపా- అమెరికాలలోని తెల్లవారే కాదు. ప్రపంచదేశాలలోని నల్లజాతి "కార్మికులు" కూడా శ్రామికులేనని, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా, మధ్య అమెరికా, దక్షిణ సముద్ర ద్వీపాలవారు అని డుబాయిస్ హెచ్చరించాడు (అయితే డుబాయిస్ - రైతులను - శ్రామికులను విడమరచి చెప్పటం మరచిపోయాడు. రైతులను ప్రత్యేక శ్రామిక వర్గంగా పేర్కొన్నాడు.)

రైతులే తెల్లజాతులవారి సంపద, విలాసాలు, దుర్వ్యయాలనే నిర్మాణాలకు మూలస్తంభాలు. రైతుజనోద్ధరణేప్రపంచోద్ధరణ.నల్లజాతివారి సమస్యే 20వ శతాబ్దపు సమస్య. ఇది చాలా ప్రాముఖ్యతగల సమస్య. వీరి ఉద్ధరణ కోసం మనం మన విప్లవ జ్యోతిని ఒకతరం నుండి ఇంకొక తరానికి అందించాలి.

పాశ్చాత్యదేశాలలోని సోషలిస్టులు కూడా రైతుసమస్యల కీయవలసిన ప్రాధాన్యత

నీయలేదు. 'రైతులను మనం ఆకట్టుకోవాలి. వారు కూడా సామ్యవాదులు కాగలరు ' అని లెనిన్ చేసిన హెచ్చరికను వారు పట్టించుకోలేదు. రైతుసమస్యలను ప్రత్యేక మయినవిగా గానీ, మార్క్సిజానికి అనుబంధమయినవిగాగానీ పరిగణించక నిర్లక్ష్యం చేశారు. ఇది పెద్దతప్పిదం. ప్రపంచ విప్లవోద్యమానికి నష్టదాయకం. రైతులను నిర్లక్ష్యం చేస్తే వచ్చే ప్రమాదాలను, పాశ్చాత్యదేశాలలో యుద్ధానికి ముందువచ్చిన ప్రతీఘాత విప్లవాలు (Counter Revolutions) యుద్ధసమయంలో జరిగిన సంఘటనలూ తెలియజెప్పినయ్. ప్రపంచరైతాంగ సమస్యను తీవ్రంగా, నిజాయతీగా అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. కనుక జటిలమూ, అత్యంతావశ్యకమూ, ఆసక్తిదాయకమూనయిన ఈ బృహత్కార్యానికి అంకితమవుదాం.

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వమే ఐక్యరాజ్య సమితి[9] రాజకీయ మేధావులు బడుగుదేశాల దుస్థితిని వివేచించారు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత, ఆగ్నేయ ఐరోపాలో సోవియట్ విస్తరణ, అమెరికాకుబలమైన ప్రత్యర్థిగా U.S.S.R (రష్యా) ఆవిర్భావం, చైనాలో కమ్యూనిజం విజయం, మొదలయిన హఠాత్ పరిణామాలు ప్రపంచ దేశాలను రెండుబ్లాకులుగా (Two Blocks ) విభజించినయ్. అణచివేయ బడుతున్న ప్రపంచబడుగు - బలహీన వర్గాలు సోవియట్ ప్రభావానికి లోనౌతున్నారని, ప్రపంచ ప్రజాస్వామ్యదేశాలు గుర్తించక తప్పలేదు. అమెరికా, దీని సన్నిహితులు ఒకవైపు - రష్యా దాని మిత్రులు వేరొక వైపు ప్రత్యర్థి వర్గాలుగా నిలచి, అప్పటి వరకు "తిండికి ముఖంవాచి నిర్లక్ష్యంచేయబడి, అణగారుతున్న వర్గాల" మనస్సులను దొంగిలించి మద్దతుకూడాగట్టే రాజకీయ యత్నాలకు శ్రీకారం చుట్టారు. రాజకీయమయిన ఈ ప్రపంచ విభజన (రెండుబ్లాకులుగా) బడుగుదేశాల బలహీన వర్గాలకు కాస్తంత ఊపిరిపీల్చే అవకాశం, ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాలకై పోరాడే ధైర్యాన్నిఇచ్చింది. అమెరికా, రష్యాల శీతల యుద్ధాన్ని ఆసరాచేసుకొని, రంగు జాతుల వారు సాగించిన విప్లవపు తాకిడికి 19వ శతాబ్దపు సామ్రాజ్యవాద వృక్షం మోడుబారసాగింది.

వలసవాదం[10], సామ్రాజ్యవాద[11] నాయకత్వం పలాయనదశలో వున్నప్పటికి, వేయి సంవత్సరాలుగా అణగారుతున్న, ప్రపంచ వ్యవసాయదారుల అణచివేత వేరొక ముసుగులో కొనసాగుతున్నది. ప్రపంచ రైతాంగంలో నాలుగవవంతుగానున్న నాలుగు వందల మిలియన్ల సోవియట్ రైతులు తమ చిన్న భూ కమతాలపై హక్కు కోల్పోయి, బలవంతంగా, నిర్బంధంగా, సమిష్టి వ్యవసాయంలోనికి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలోనికి

నెట్టబడ్డారు. ప్రజాస్వామ్య దేశాలలో ఆహారసరుకుల సేకరణ, (Procurment - ప్రొక్యూర్‌మెంట్) లెవీలు, ధరల కంట్రోళ్ళు వగయిరా వత్తిళ్ళతో వ్యవసాయదారులు బోనులో పడ్డ ఎలుకల్లాగా గింజుకొంటున్నారు. నష్టదాయకమయిన ధరల వలయాల్లోంచి బయటపడటానికి రైతులు చేసే ప్రయత్నాలను, వినియోగదారుల లాభం కోసం బ్లాక్ మార్కెటింగ్ (Black Market- చీకటిబజారు) గా, ఆహారపు దొంగతనంగా కమ్యూనిష్టులు ముద్ర వేశారు.

పెట్టుబడిదారీ దేశాలూ, సోవియట్ వ్యవస్థా, ఈ రెండూ రైతులను దోపిడీ చేస్తున్నవే. అభివృద్ధిదాయకమయిన రైతాంగ ఆర్థికతత్వాన్ని, ఈ రెండు వ్యవస్థలూ గుర్తించటంలేదు.

రైతుల స్వాతంత్ర్యం హరించటానికి ఈ ఇద్దరూ ఏకాభిప్రాయంతోవున్నారు. పారిశ్రామికీకరణ, పట్టణ నాగరికతాభివృద్ధి, వ్యవసాయ ఆర్థిక విధానాన్ని (Agricultural Economy - వ్యవసాయ ఆర్థికత్వం) పొలం - పరిశ్రమ (Farm- Factory) ఆర్థికత్వంగా మార్చి, రైతులను కూలీలుగా మార్చగలదని వీరు ప్రియంగా విశ్వసిస్తున్నారు. పాశ్చాత్యరాజకీయ మేధావులు కూడా ప్రజాస్వామ్య ఆర్థిక విధానాన్ని, నిర్మాణ యుతము, అభివృద్ధికారకమైన రైతుల - చేతివృత్తులవారి పాత్రను గుర్తించక పోవటం ఆశ్చర్యకరం.

ప్రజల, ప్రముఖంగా వ్యవసాయదారుల వెనుకబడ్డతనానికి కారణాలను సానుభూతితో, శాస్త్రీయంగా, శ్రద్ధతో నిష్ఠగా అధ్యయనం చేయవలసివుంది. కాపిటలిస్టు (పెట్టుబడిదారి) - కమ్యూనిష్టు శాస్త్రవేత్తలు - వ్యవసాయదారులుత్పత్తి చేస్తున్న "అదనపు విలువ" ను ఆయా దేశాలపాలకవర్గాలు ఏ యే మార్గాల ద్వారా దోపిడీ చేసి, ధరలు నియంత్రించి, గిరాకీ (Demand -డిమాండు) - సరఫరాల (Supply -సప్లై) అడకత్తెర లలో ఇరికించి,మార్కెటులావాదేవీలలో రైతుల కొసరులాభాలను కూడాదోచుకుంటున్నదీ అధ్యయనం చేయటం నిర్లక్ష్యం చేశారు. సంపూర్ణ ఉపాధికల్పన, సాంఘిక భద్రతలు రైతులకందకుండా జేసి, ఇతరవర్గాలకు పరిమితం జేశారు. వీరి ఆర్థిక సూత్రాల, రాజకీయాలలోని అభూతకల్పనలను -రైతులు, చేతివృత్తుల వారు గ్రహించి, ఆధునిక ప్రపంచంలో, రాజకీయ, ఆర్థిక అధికారాలను సాధించుకోవాలిసిన అవసరం గుర్తించాలి. రెండవ ప్రపంచయుద్ధానంతరం ఈ పన్నెండేళ్ళ చరిత్రగతి - వ్యవసాయదారులు - ఇతరులు, సంపూర్ణ స్వేచ్ఛకై వేసే ప్రతి అడుగుకూ ఎంతో ఉపయుక్తంగా వుంది. ఈ కొద్దిపాటి స్వేచ్ఛచాలదు. సోవియటిజంకు దాసోహమనటం, దోపిడీ నుండి విముక్తికి

కాదని, మరింత ధృఢంగా - దయాహీనమైన దోపిడీని కౌగిలించుకోవటమేనని వారికి (రైతులు - చేతివృత్తులవారు) ఋజువయింది. రెండవ ప్రపంచయుద్ధం తరువాత బ్రిటీష్ సంక్షేమరాజ్యం చేసే "దరిద్రంలో - ధనికత్వంలో సమానభాగస్వామ్యం " వాదన, అలానే కమ్యూనిష్టులు సహకారవ్యవసాయాలపేరుతో - రైతులతో జరిపే తాత్కాలిక ప్రణయం, కల్పించే ఆశలు, రైతులు స్వేచ్ఛను సంపూర్ణంగా అనుభవించనీయటానికి కాదనికూడా ఋజువయింది. అతి భాగ్యవంతమైన అమెరికాలో రైతులేమంత భాగ్యవంతులు కారు. రష్యాలో భాగ్యహీనులుగా సాంఘిక భద్రత లేక నిర్లక్ష్యం చేయబడుతున్నారు. ఈ రెండు దేశాల్లోకాయకష్టంచేసే వ్యవసాయదారులే, ఇతర అన్నివర్గాలవారికంటే ఎక్కువగా వున్నారు. కాపిటలిష్టు, కమ్యూనిష్టు దేశాల రాజకీయవ్యవస్థలకు పుట్టిన రాచపుండిది. ఈ రెండుశత్రుకూటాలలోని రాజకీయ మేధావులు తమ మనస్సులను, మెదళ్ళను శోధించి, సమస్యలకే సమస్యగా పరిణమించిన ఈ సమస్యకు మానవత్వంతో పరిష్కారం చూపెట్టాలి.

**ఏ ఆదర్శం, ఏ ఉద్యమం, ప్రపంచజనాభాలోని అధిక సంఖ్యాకుల అభివృద్ధి, సంతోషాలను లెక్కచేయదో, ఆ ఉద్యమం ప్రపంచ ప్రజల సహకారం పొందదు. ప్రపంచాన్ని చీకటి నుండి వెలుగు బాటకునడపించలేదు.**

రైతులను - చేతివృత్తులవారిని నిర్లక్ష్యం చేస్తే ఏం జరుగుతుందో, యుద్ధ పూర్వం, యుద్ధానంతరం ప్రపంచం గమనించింది. వ్యవసాయదారుల "అదనపు విలువ" లో చెప్పుకోతగ్గవాటా పొందుతున్న కార్మికవర్గంతో సోషలిస్టుల స్నేహాన్ని అనుమానించ వలసివుంది. బ్రిటీషుసోషలిస్టులు - వ్యవసాయ సమస్యలను సామ్యవాద పునఃపరిశీలన చేయవలసివుందని తెల్సుకుంటున్నారు. ఆధునిక సమాజంలో ప్రక్రియాత్మకత (Processing) యాంత్రికత, పంపిణీ విధానాలకు మాత్రమే, మార్క్సిస్టులు తమ "అతుకుల బొంత" అధ్యయనాన్ని పరిమితం చేశారు. వ్యవసాయంలో యిమిడివున్న మానవ చైతన్యాన్ని నిర్లక్ష్యం చేశారు. బ్రిటీషుసోషలిస్టులు - వారికార్మికుల జీవిత విధానాన్ని, శ్రామిక జీవనాన్ని మెరుగుపరచటమే ఆశయంగా పెట్టుకున్నారు. రైతుల రాజకీయ సామాజిక ఉద్ధరణను పరిశీలన చేయటానికి వీరు సిద్దంగా లేరు.

ప్రపంచరైతుల స్థితి గతులు, ఇతర వర్గాలు అసూయపడవలసినంత గొప్పగా లేవు. రైతాంగ ఆదర్శాల సఫలతకోసం శక్తి-సామర్ధ్యాలనందించే బలమయిన, నిర్మాణాత్మకమార్గాలఅన్వేషణ నిజాయతీతోజరుపవలసివుంది. జటిలము, అత్యంతా

వశ్యకము, ఆసక్తిదాయకమూనయిన ఈ సమస్యకు నేను అంకితమవుతున్నాను. 1923 నుండే ఈ కార్యంలోనిమగ్నుడనై వున్నాను. ప్రతి సంవత్సరం కొత్త రహస్యాలు బయట పడుతున్నయ్. కాపిటలిజంసోషలిజం వ్యవసాయదారుల ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాలకై వల్లెవేసే పాఠాలలోని నిజాయితీ లోపాలను ఈ రెండు తరాల చరిత్ర మనకు తెలియజెప్పింది.

గాంధీ మార్గం, రూజ్వెల్టు (F.D. Roosevelt)[12] భావనలయిన సామాజిక న్యాయ సమానత్వం - రైతులపైగల చిన్నచూపును కొంత తొలగించినవి. వసుధైక ప్రపంచం అనే ఐక్యరాజ్యసమితి (U.N.O.) బోధన ఈ సమస్యకు ముందు చూపు నేర్పింది. ఆధునిక రైతాంగ ఉద్యమాలు, సహకార సంస్థలు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, మానవ హక్కుల పోరాటం, గాంధీ మహాత్ముని ఆదర్శాలయిన -"అట్టడుగు నుండీ ప్రజాస్వామ్య వికేంద్రీకరణ - సంపూర్ణన్యాయం" ప్రపంచ ప్రజాస్వామ్యానికి మార్గదర్శకాలు కాగలవు.

**ఈ సిద్ధాంత గ్రంథం మేల్కొంటున్న, ఆధునిక రైతాంగ ఆశయాల మౌలిక నిర్మాణ ప్రతిబింబం.**

# కీలక సేవల సూత్రం

(Law of Key Services)

రైతులు ప్రాధమిక ఉత్పత్తిదారులు. స్వయంపరిపూర్ణ ఆర్థికత్వం వలన గతంలో వారికి వినియోగదారులతో ప్రత్యక్ష సంబంధాలుండేవి. పారిశ్రామికీకరణవలన వీరిరువురు మధ్యా దూరం పెరిగింది. వ్యవసాయదారుల మనుగడ అదృశ్యంగా వారి సంపదను హరిస్తున్న " కీలక సేవల" (Key-Services) పై ఆధారపడి వుంది.

కీలక సేవలు :- యాంత్రిక ఉత్పత్తులు చేసే పరిశ్రమలు, వీటి దళారీలు - కీలక సేవలలో ప్రధాన పాత్ర పోషిస్తున్నారు. కీలక సేవల దోపిడీని ధాన్యం, పొగాకు, ప్రత్తి, చెరకు, వేరుశనగ, జూటు, పాలు, పండ్ల విషయాల్లో చర్చించటం జరిగింది. యుద్ధకాలపు కంట్రోళ్ళు, నిబంధనలు ఈ సేవల ప్రభావాన్ని ఎక్కువ చేసినయ్.

రైతులకు అప్పులిచ్చే వడ్డీ వ్యాపారులు, బాంకులు, సహకార బాంకులు చిల్లర వ్యాపారులు,

రవాణా, కమ్యూనికేషన్లు, - రైళ్ళు, లారీలు, ప్రపంచ వాణిజ్యంలో ప్రముఖ పాత్రవహించి, వివక్షతోకూడిన ఛార్జీలవలన రైతుల సంక్షేమానికి వ్యతిరేక దిశలో పయనిస్తున్నవి.

కార్మికులకు చౌకగా ఆహారాన్నందించటం కోసం విధించిన టారిఫ్‌లు, పెట్టిన పరిశ్రమలు, వ్యవసాయదారులనుండి అధికవిలువను పిండుకొంటున్నవి.

కరెన్సీ చలామణి (ద్రవ్య చలామణి - కాగితపు డబ్బు) విదేశీమారకాలు - ముఖ్యమయిన కీలక సేవలు. ఇవి బాంకుల చెప్పుచేతలలో నడచేవి, ఈ దోపిడీ

విదేశీయుల చేతులలో మరీ భయంకరంగా వుంది. భూస్వామ్యవిధానం అధికారజులుం, కీలక సేవలకు వత్తాసునిచ్చి రైతులకు ప్రాణ సంకటంగా మారినవి.

**రైతుల అథోగతి :-**

యుగయుగాలుగా సమాజానికి కావలసిన ప్రాథమిక ఉత్పత్తులనందించి (ముడిసరుకులు), అవసరాలుతీర్చి, సౌఖ్యానికి, సంతోషానికి, కారణభూతులయిన వ్యవసాయదారులు - నూతన ఆవిష్కరణలు (Inventions), నూతనయంత్రాలు, అణ్వాయుధతయారీల నేటికాలంలో, తామెందుకు ఇంత దిక్కుమాలినతనంగా బతుకుతున్నాము, తమజీవనప్రమాణాలెందుకు దిగజారినవి, వ్యవసాయకంగా, సాంఘికంగా ఏ సౌకర్యాలు లేక ఎందుకు అలమటిస్తున్నామని ఆశ్చర్యపడుతున్నారు. వ్యవసాయదారులను ప్రాధమిక ఉత్పత్తిదారులుగా అందరూ అంగీకరిస్తూనే, వారి ఆధునిక సామాజిక స్థితిగతులను దుర్భరంచేసి, అట్టడుగుకు నెట్టి వేస్తున్నారు. వ్యవసాయదారుల చుట్టూ సమాజం పరిభ్రమించింది, వారిపై ఆధారపడిందనేది సత్యం. సంఘం తన ప్రత్యేక సామాజిక, ఆర్థిక రక్షణలను పొందింది. నేడీదుస్థితి రైతాంగానికెందుకు కల్గింది ?

గ్రామీణ ఆర్థిక విధానం, స్వయం సమృద్ధి, సరుకుల మారకం (Barter System) గల గత సమాజంలో రైతులు గర్వింపదగిన హోదాననుభవించారు.వారి ఉత్పత్తు లయిన నిత్యావసరవస్తువులు, వినియోగదారులకు సరాసరి అందేవి. పట్టణాలు పుట్టు కొచ్చి, జనాభాలు పెరిగి, ఆర్థికరాజకీయ ప్రాధాన్యతలు సంతరించుకొని, పని విభజన జరిగి, వ్యవసాయం బహుముఖీనమయి (Diversified Agricltures - వైవిధ్య వ్యవసాయం) కలిగిన మార్పులతో, వచ్చిన ఆర్థిక విధానాల భౌతిక తత్వం వలన, వినియోగదారులకు, ప్రాథమిక ఉత్పత్తిదారులకు మధ్య దూరం పెరిగింది. ఈ కారణాలవలన, ఆధునిక మార్కెటింగ్ విధానం ఆవిర్భవించింది. ప్రతి దేశంలోని కొన్ని ప్రాంతాలను, ప్రతిఖండంలోని కొన్ని దేశాలను, ఆధునిక వాణిజ్యం, రవాణా సాధనాలు, కమ్యూనికేషన్లు, యంత్రాలసాయంతో తన గుప్పెట్లో పెట్టుకొని నూతన శక్తిగా బల పడింది. ప్రపంచవాణిజ్యం, కమ్యూనికేషన్లు, రవాణా సాధనాలు పలుదేశాల వ్యవసాయోత్పత్తులను భారీగా తరలించగలవు. కనుక ఖరీదయిన హార్బర్లు, రేవులు, రైళ్ళు, గోడవునులు, ఎలివేటర్లు, రిఫ్రిజిరేటర్లు, గ్రేడింగు, పాకింగు వసతులు - ఆరుదల యంత్రాలు, కోల్డ్ స్టోరేజ్‌లు ఎక్కౌంట్లు, స్టాక్ ఎక్స్చేంజీల ప్రాధాన్యత పెరిగింది. వీటి నిర్మాణానికి, నడపటానికి, భారీగా పెట్టుబడులు అవసరమయ్యాయ్. సంఘటితపడిన

పెట్టుబడి దారీ వర్గాలు, వారి ఆర్థిక బలం, రైతులను పక్కకునెట్టి, ఆధునిక సామాజిక ఆర్థిక జీవితంలో, కీలకస్థానాన్ని ఆక్రమించినయ్.

పలురకాలకీలక సేవలు, వీటి అర్థబలం, పెట్టుబడిదారీ సంఘటన నిర్మాణం, జోక్యం - ప్రాథమిక ఉత్పత్తిదారుల, వినియోగదారుల పరస్పర సంబంధాలకు వారధులయినవి.

ఈ నూతన పరిణామం ప్రపంచ వ్యవసాయదారుల అధోగతికి కారణం. ఆధునిక ప్రభుత్వాలకు ఈ నూతన శక్తి (కీలకసేవల మార్కెట్ల శక్తి) అధికార బలాన్ని పెంచి, సోషలిస్టు, కాపిటలిస్టు, కమ్యూనిష్టుదేశం - ఏదైనాకానీ - ఆ దేశాల ఆధునిక సమాజంలో, కొత్తసామాజక ఆర్థిక సంస్థలకు దోహదం చేసి, ప్రపంచంలో అధిక సంఖ్యాకులయిన ప్రాథమిక ఉత్పత్తి దారులగు వ్యవసాయదారులను క్రుంగదీసింది. నూతన ఆర్థికసంస్థలు, వాటి వ్యాపకాలు, ఆధునిక సమాజంతో విడదీయరాని సంబంధాలేర్పరుచుకొని, వ్యవసాయదారులు సమకాలీన సామాజక జీవన ప్రవాహంలో కొట్టుకొని పోయినా - ఒడ్డుకు చేరినా, అక్కరకొచ్చే సామాగ్రయి, వారిని శాసిస్తున్నవి. వ్యవసాయదారులు తమప్రాథమిక ఉత్పత్తులను వినియోగదారుల కందించాలంటే, పైన చెప్పిన కీలకసేవలతో తలపడాలి. తమసాంఘిక జీవితంలో, కీలక సేవలను స్వాధీనంలో వుంచుకోగలిగితేనే రైతులు మనుగడ సాగించగలరు. కీలక సేవలు - ప్రపంచ రైతుల మధ్య నిరంతరం ఏర్పడుతున్న సంబంధాలనే - మనం కీలక సేవల సూత్రంగా పరిగణించి, వాటి సాధారణ పనితీరును, ప్రతి ఫలాలను వర్గీకరించి, ప్రపంచరైతాంగపు సామాజక ఆర్థికస్థాయిని, ఆధునిక ప్రపంచంలో అర్థం చేసుకొనటానికి ప్రయత్నించాలి.

వ్యవసాయదారుల, సాంఘిక - ఆర్థికతీరుతెన్నులపై ప్రభావాన్నిచూపే రకరకాల కీలక సేవలను - మనం - వేరువేరుగా అధ్యయనం చేయవచ్చు.

వ్యవసాయం ఎక్కువ పెట్టుబడితో కూడుకున్నది. కనుక వడ్డీ వ్యాపారులు, బాంకులు, కరన్సీ, బాంకింగ్ లావాదేవీలు - వ్యవసాయోత్పత్తిలో ప్రాధాన్యతగలవి. ఆ తరువాత ప్రక్రియాత్మక పరిశ్రమలు (Processing Industries), ఆధునిక సమాచార వ్యవస్థ, రవాణా సౌకర్యాలు, వ్యవసాయోత్పత్తుల అమ్మకాలు - కొనుగోళ్ళలో ప్రాధాన్యత సంతరించుకొన్నవి. యాంత్రికవస్తూత్పత్తిదారులు (Manufacturers) వినియోగ దారులకవసరమయిన వస్తువులను వ్యవసాయదారులనుండి - రవాణా సౌకర్యాలుప యోగించుకొని - కొనుగోలు జేస్తారు. టోకు - చిల్లర వ్యాపారాల్లో - రైతు - వినియోగ

దారుని సంబంధాలలో - ఆధునిక మార్కెటింగు జోక్యం ప్రతి దశలోనూ అనివార్య మవుతున్నది. అధికార యంత్రాంగం, నేటి సంకీర్ణసాంఘిక జీవితాన్ని, నిబద్ధిస్తూ, నియంత్రిస్తూ అనుమతిస్తూ, శాసిస్తున్నది. పైన చెప్పిన కీలకశక్తులు ఆధునిక సమాజపు నూతన పోకడలతో రైతుల బాగోగులకు బాధ్యతవహిస్తున్నవి.

మొదట్లో ఈ కీలక సేవలు రైతుల మేలుకొరకు అవతరించినా, క్రమేణా రైతుల సంక్షేమానికి వ్యతిరేకశక్తులుగా మారినవి. రైతులెంతో మూల్యం చెల్లించవలసి వస్తున్నది. వ్యవసాయ ఆర్థికతను (Economy) అణచివేయటంలో భూస్వాములను మించి పోయినవి. గత నాలుగు శతాబ్దాలుగా "పెట్టుబడి" ప్రాబల్యం పెరిగింది. భూస్వాములు, చిన్నరైతులు, రష్యాలో సెర్ఫ్‌లు, బానిసలతో సహా పెట్టుబడి పోగు చేయలేకపోయారు. ఎక్కువ పెట్టుబడులతో వ్యాపారాలు చేసేవారు సంఘటితమై, బలమయిన" పెట్టుబడి - సంస్థల " నేర్పాటు చేసుకొని, బలమయిన వ్యవసాయేతర శక్తిగా ఎదిగారు. ఒకరో-ఇద్దరో వ్యవసాయదారులు సాహసంచేసి కీలక సేవలలోనికి ప్రవేశించగలిగితే - వారిని పెట్టుబడిదారీ వర్గం తనలోనికి లాగుకొని తమ అధికారాన్ని, పలుకుబడిని, సంఖ్యను పెంచుకుంటున్నది. రెండవ ప్రపంచయుద్ధం తరువాత ప్రపంచం మొత్తం, కీలక సేవల ఫలితాల (ప్రాబల్యాన్ని - ప్రాథమిక ఉత్పత్తులలో, ఉద్యోగ సంసాదనలో, ఉత్పత్తి మార్గాలలో జీవితాలలో, ఆర్థిక, సాంఘిక స్వేచ్ఛా సంపాదనలో - రాజకీయాలలో - ఎదుర్కో వలసివస్తున్నది. బాహ్యదృష్టికి రైతులు తమ భూములకు - తమ రోజువారీ వ్యవసాయ పనులకు, సీజనల్ పంటలు నిర్ణయించుకొనటానికి, తమ శ్రమకూ, ఉత్పత్తులకూ తామే స్వతంత్రాధికారులుగా కన్పిస్తారు. వాస్తవానికి వీరు స్వతంత్రులుకారు. వడ్డీ వ్యాపారులతో లావాదేవీలలో స్వతంత్రులుగా కన్పించినా తన సరుకుకు సరైన ధర వచ్చేవరకు ఆగే "స్తోమత" (Staying capacity) లేదు కనుక తరుణంలో ఋణసౌకర్యం అందకపోతే వ్యవసాయంచేయలేరు. వారు నీటిపారుదల సౌకర్యాలపై, బావులపై కాల్వలపై తాము హక్కుదార్లమనుకొని తమను తామే మోసం చేసుకొంటారు. ఈ సౌకర్యాలునుప యోగించుకోవటానికి వారు ఎందరో ఉద్యోగుల చేతులు తడపాలి. వ్యవసాయోత్పత్తులు మార్కెటుకు చేరకముందే, వ్యాపారస్తులు మార్కెట్లలోని దళారీలను, పన్నులు వసూలు చేసే వారిని, అధికార యంత్రాంగాన్ని, చిల్లరవ్యాపారులను, లొంగదీసుకొని, కన్పించని వత్తిళ్ళు తెచ్చి, వారడిగిన ధరకు తమ ఉత్పత్తులమ్ముకునేటట్లు చేస్తున్నారు. మార్కెటు పరిస్థితులు, పత్రికలలో ధరవరలు అన్నీ రైతుకు అర్థం అయినట్లే కన్పిస్తాయి. ఆధునిక సంక్లిష్టవాణిజ్యం, ప్రత్యేకత

సంతరించుకున్న మార్కెటింగ్ విధానం రైతుకర్థంకాదు. ప్రాసెసింగు పరిశ్రమలను తమ చెప్పుచేతల్లో వుంచుకొన్న యాజమాన్యం ఎంతో శక్తివంత మయినది. వారు రైతుల ఉత్పత్తుల అమ్మకాలపైనేకాక వారి రాజకీయ (ఓటు) హక్కు వినియోగం పై కూడా అధికారంచలాయిస్తున్నారు. ఆధునిక రైతాంగం కీలక సేవల దయాదాక్షిణ్యాలపై ఆధారపడిందని చెప్పటం యదార్థం.

కీలక సేవలను అదుపులో వుంచుకున్నవారు, వ్యవసాయదారుల ఆర్థిక జీవితాన్ని కూడా శాసిస్తున్నారు. ఒకటి అంతకన్నా ఎక్కువ కీలక సేవల ఆధిపత్యం కలవారు, రైతుల శ్రమలో మేలు భాగాన్ని పిండుకుంటున్నారు. భూస్వాములు, మతాధిపతులు, నిరంకుశపాలకులు చేసిన ప్రత్యక్షదోపిడీ లాభదాయకంకాదు. ప్రత్యక్షదోపిడీ ఆ వర్గాల పతనానికి కారణమయింది. పరోక్షంగా కీలక సేవలద్వారా తేలికగా చేయబడే దోపిడే దీర్ఘకాలికమూ, లాభదాయకము. సోవియట్ ప్రపంచంలోని అధికార వర్గాలు, ఈ సులువయిన మార్గాన్ని సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోని రైతుల దోపిడీకి ఎంచుకున్నారు. మార్క్సు శ్రామికుల "అదనపు విలువ " దోపిడీని బయల్పరచాడు. కాపిటలిస్టులు కీలక సేవల ద్వారా చేసే శ్రమ శక్తి దోపిడీలోని సౌలభ్యాన్ని గ్రహించి కమ్యూనిస్టులూ అదేపంథాలో పయనిస్తున్నారు.

## కీలక సేవల పుట్టుక

వ్యవసాయ ఉత్పత్తులలో అధికభాగాన్ని కొనుగోలు చేసే వ్యాపారులు (రైతుల స్వంత వినియోగానికి మిగుల్చుకొనే కొద్ది మొత్తం ధాన్యం - వాణిజ్య పంటలు పోను మిగతావి) అసలయిన వినియోగదారులుకాదు. వారు ప్రాసెసింగు పరిశ్రమల ఏజెంట్లు మాత్రమే. సాధారణంగా మాన్యుఫాక్చరర్లు (Manufacturer) ప్రపంచమార్కెట్లలో, వర్తకులద్వారా ప్రత్యక్షంగా పరోక్షంగా, సమర్థవంతంగా తమలావాదేవీలు జరుపుతారు.

## కొన్ని వ్యవసాయోత్పత్తుల మార్కెటింగ్ పరిశీలిద్దాం

**ధాన్యం** (Paddy ) :- ధాన్యాన్ని పట్టణాలలోని బియ్యం మిల్లులుకొనుగోలు చేస్తాయి. మిల్లుయజమానులమధ్యలోపాయికారీతనముంటుంది. రైతులు దూరపు మార్కెట్లకు ధాన్యం తరలించటానికి ఖర్చులు రవాణా వగైరాలు తడిసి మోపెడవుతాయి. అక్కడి ధరల వొడు - దొడుకులు వీరికి అంతు బట్టవు. అంతేగాకస్థానిక మిల్లుల యజమానులు, రైతులకు డబ్బు అడ్వాన్సుగా (అప్పుగా) ముందుగానే ఇచ్చి ఒప్పందాలు కుదుర్చుకుంటారు. (Forward contracts ) ఈ కంట్రాక్టులు, బాకీ చెల్లించవలసిన అవసరం దృష్ట్యా రైతులు తమ ధాన్యాన్ని స్థానిక రైసు మిల్లులకే అమ్మవలసి వుంటుంది. భూమిశిస్తు, వడ్డీవ్యాపారిబాకీ, గృహావసరాలు తోడవుతవి. వినియోగదారునకు కావలసింది బియ్యం. ధాన్యం కాదు. ధాన్యాన్ని పొట్టుదీసి, పాలీషుపట్టి, బియ్యంగా అమ్మటం రైతుకు సాధ్యంకాదు. రైతులకు బియ్యం మిల్లులతో ప్రత్యక్ష సంబంధాలుండవు. అందువలన తమ అమ్మకాలకు వీరు వ్యాపారుల, మిల్లుయజమానుల దయపై ఆధారపడాలి. వ్యాపారులు - మిల్లు యజమానులు వేరే కులానికి, (ఇండియాలో) వేరే జాతికి (ఇండో చైనా-బర్మా) చెందినవారలయినట్లయితే దోపిడీ మరింత ఎక్కువగా సాగుతుంది. వినియోగ దారులు చెల్లించే ధరలలో (ఖర్చులన్నీపోను) రైతుకు 60 నుండి 70 శాతం మాత్రమే అందుతుంది. కాటాక్లర్కు, బ్రోకరు, టాలిక్లర్కుల మధ్య కుమ్మక్కు బర్మారైస్ మార్కెటులో వుందని రాయల్ కమీషన్ ఆన్ అగ్రికల్చర్ పేర్కొంది.

యుద్ధకాలంలో ప్రవేశపెట్టిన ధాన్యం సేకరణ - రైతుల నిస్సహాయస్థితిని (మిల్లు యజమానులతో పోలిస్తే) వెలికి తెచ్చింది. అధికార యంత్రాంగం - మిల్లు యజమానుల కుమ్మక్కు, రైతులను అల్ప ధరలద్వారా, వినియోగదారులను అధిక ధరలద్వారా నష్టపరచింది.

భారతదేశపు ధాన్యం ఉత్పత్తిదారులు 1951లో కేవలం 67 శాతం మాత్రమే వినియోగదారులు చెల్లించే ధరలనుండి పొందారు. ఇతర ఖర్చులుగా రవాణా 7 శాతం, సాదరు 17 శాతం,టోకు వ్యాపారి 3 శాతం,చిల్లరవ్యాపారి 6 శాతం పంచుకున్నారు

**పొగాకు** (TOBACO) : భారతదేశపు పొగాకుపై ఐ.యల్.టి.డి. గుత్తాధిపత్యం సంపాదించింది. జపానువంటి ఇతరదేశాలవారు ఈ రంగంలో నిలదొక్కుకోలేక

పోయారు. మొదట ఐ.యల్.టి.డి. వారు ఆంధ్రలో విత్తనాలు, గ్యారంటీ ధరలు, పంటల పర్యవేక్షణ, కంపెనీ బారన్‌లలో కాల్పులవంటి ప్రోత్సాహకాలతో ఈ పంటను ప్రవేశపెట్టారు. ఈ పద్ధతి గుజరాతులో 1955 వరకు అమలు చేశారు. తరువాత విత్తనాల అమ్మకం, క్యూరింగులతో సరిపెట్టారు. ఇప్పుడు విత్తనాల సేకరణ నుండి, పొగాకు అమ్మకాల వరకు రైతులే నిర్వహించవలసివస్తున్నది. అలాదశలవారీగా ఈ వర్జీనియా పంటను రైతుల నెత్తినరుద్దారు. (తరువాత కాలంలో దక్షిణఆంధ్ర, మైసూరులలో ఈ పద్ధతులే అనురించారు) ఐ.యల్.టి.డి., బి.ఐ.టి. కంపెనీలు పెద్దమొత్తం కొనుగోలు దార్లవటంవలన, రైతులు తమ పొగాకును ఈ కంపెనీల కమ్మటానికి పోటీపడ్డారు. గేటు కాపలావానికి కూడా లంచాలిచ్చి, తమపొగాకు బేళ్ళను, ప్లాట్‌ఫారంపై చేర్చుకొనే స్థితికి దిగజారారు. ప్లాట్‌ఫారంలపై కంపెనీబయర్లు (Buyers) ధరలు నిర్ణయిస్తారు. బేలు, బేలూ పగలగొట్టి వేరువేరుధరలు నిర్ణయిస్తారు. ధరలు గిట్టుబాటుగా లేవనుకొంటే రైతులు తమబేళ్ళను ఇంటికి మోసుకొని పోవలసిందే. ఇతర కంపెనీలలో ఇంతకంటే ఎక్కువధర వచ్చే ఆశలేక, గత్యంతరం లేక, రవాణా ఛార్జీలు, వ్యవసాయ ఇబ్బందుల కారణంగా, వీరు చెప్పిన ధరకు, అది ఎంత అసమంజసమయినా, రైతులు పొగాకు వారికే అమ్ముకుంటున్నారు. రైతుల దీర్ఘకాలిక ఆందోళనల తరువాత మద్రాసుప్రభుత్వం గుంటూరులో కొన్ని బహిరంగ వేలం కేంద్రాలను ఏర్పాటుచేసింది. ఐ.యల్.టి.డి., ఇతర వ్యాపారుల కుమ్మక్కుతో ఈ విధానం విఫలమవటంతో రైతులే ఈ కేంద్రాలు మూసివేయమని కోరటం జరిగింది. భారతీయ ఎగుమతి దారులు (Exporters-ఎక్స్‌పోర్టర్లు) ఈ మార్కెటులో 33.3 శాతం మేలు రకం పొగాకును కూడా కొనలేకపోయారు. 1956లో ఐ.యల్.టి.డి, ఇతర విదేశీసంస్థలు పొగాకు ధరను రూ. 600/- నుండి రూ. 300/-లకు దిగజార్చినయ్. రైతులీదోపిడీ నుండి రక్షణకు రాష్ట్ర ప్రభుత్వంకు విజ్ఞాపనలు చేశారు. స్టేట్‌ట్రేడింగు కార్పొరేషను (S.T.C.) ఏర్పాటుచేసి, ప్రభుత్వరంగంలో సిగరెట్ ఫాక్టరీలనునెలకొల్పి, రైతులు సహకారసంస్థల ద్వారా గ్రేడింగు చేయించి, తగిన ఋణసౌకర్యం పొందినప్పుడే ప్రభుత్వ జోక్యం ఫలిస్తుంది. రైతులకు న్యాయబద్ధంగా అందవలసిన ధరలలో 50 శాతం కూడా వీరి కందటం లేదు[2].

ప్రత్తి(Cotton):- భారతదేశంలో సర్వసాధారణమయిన పంట. ప్రత్తి మార్కెటును ముగ్గురు లేక నలుగురు విదేశీ ఎగుమతిదారులు కంట్రోలు చేస్తున్నారు. లివర్‌పూల్, బాంబే (ముంబాయి), అమెరికాలలోని ప్రత్తి ధరలు వారికందుబాటులో వుంటాయి. స్థానిక వ్యాపారులతో వీరు కుమ్మక్కు అవుతున్నారు. రైతులకు ప్రపంచ

ధరలు తెలిసే అవకాశం లేదు. రేడియోలలో వచ్చే కొటేషన్లు - ప్రకటనలలో వారికి అమెరికా ప్రత్తికి - స్వదేశీకి వున్న ధరల తేడాలు అంతుపట్టవు. అన్నిపంటలలాగానే ఇక్కడ ముందు ఒప్పందాలు, ఋణాల అడ్వాన్సుల ప్రభావం వలన స్థానిక మార్కెట్లలోనే తమ ప్రత్తిని తక్కువధరకు అమ్ముకోవలసివస్తున్నది. భారతదేశంలో ప్రత్తికి బహిరంగవేలం మార్కెట్లు లేవు. (ప్రస్తుతం వేలం మార్కెట్లున్నవి. కానీ దళారీలు, కూలీలు, అధికారులు, వ్యాపారులు కలసి దోపిడీ చేస్తున్నారు.) వ్యాపారులు, ఎగుమతి సంస్థలు - జిన్నింగు - స్పిన్నింగ్ మిల్లులు - రైతులకు ఇచ్చే ధరలలో అంతరాలు చాలా ఎక్కువ. ఈజిప్టులో - ఇంగ్లీషు వ్యాపారులు ప్రత్తిరైతులను దోపిడీ చేస్తున్నారు అమెరికాలో లాభాలన్నీ వర్తకుల జేబుల్లోకే జేరుతున్నయ్.

చెరకు (Sugar Cane): పంచదార, గర్, బెల్లం తయారీలలో వాడే చెరకు పంటల ధరలో తేడాలధికం. చెరకురైతు ఒక్కరోజు మార్కెటుకు ఆలస్యంగా వెళ్తే, ఆ ఉత్పత్తి బెల్లం తయారీకి అమ్ముకోవాలి. చెరకు నరకటంలో ఆలస్యమయితే తూకం తగ్గుతుంది. ధరతగ్గుతుంది. చెరకు నరికిన 24 గంటల తరువాత చెరకులోని పంచదార శాతం తగ్గుతుంది. అందువలన వీలయినంత త్వరగా ఉత్పత్తిని మార్కెటుకు చేర్చాలి. చెరకు పండించే ప్రాంతంలో రెండు మిల్లులకు మించి వుండవు. ఈ కారణాల వలన రైతు నష్టపోతున్నాడు. ఈ విషయాన్ని గమనించి, ఉత్తరప్రదేశ్, బీహార్ ప్రభుత్వాలు ఒక్కొక్క మిల్లుకు చెరకు పండించే కొంత ప్రాంతాన్ని కేటాయించారు. కనీసధరలు నిర్ణయించారు. వాడవలసిన కాటాలు నిర్దేశించారు. రైతులకు కొంతవరకు రక్షణ కల్పించారు. మిల్లుల యాజమాన్యం పెద్దరైతులకు - చిన్న రైతులకు మధ్య చిచ్చు పెట్టి లబ్దిపొందుతున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో చెరుకు ఉత్పత్తిదారుల - పంచదార వినియోగ దారుల నిస్సహాయత కొట్టవచ్చినట్లు కన్పించింది. ధరల కంట్రోళ్ళు, పంపిణీ నియంత్రణ లతో రైతులను వ్యాపారులను ఒక వైపు - వినియోగదారులను ఇంకొక వైపు ఇండియన్ ప్రావిన్షియల్ గవర్నమెంటు కాల్చుక తిన్నది. ఈ కంట్రోళ్ళు, నియంత్రణల వలన లాభించింది దళారీలు, ప్రభుత్వం మాత్రమే.

జావా, డచ్, బ్రిటీషు మిల్లులు, ప్రభుత్వాలు, ఆయాదేశాల రైతులను, వ్యాపారులను పై విధంగానే పీడించాయి.

**వేరుశనగ (Ground Nut ):** వేరుశనగ రైతూ నిస్సహాయస్థితిలోనే వున్నాడు. నూనెమిల్లులు, ఎగుమతి సంస్థలు వ్యాపారంలో ప్రముఖపాత్ర వహిస్తున్నవి. అడ్వాన్సు కంట్రాక్టు లిక్కడ కూడా రైతులకాళ్ళకు బందాలు వేస్తున్నవి. ఎగుమతిదారులు, విదేశీ మార్కెట్లను చేజిక్కించుకుంటున్నారు. రైతులకు మార్కెట్ ధరల అవగాహన లేదు. వారు మార్కెటుకు కావలసిన "గింజలను" తయారుచేయలేరు. విదేశీకంట్రాక్టులు సంపాదించలేరు. అందువలన మిల్లులవారు, ఎగుమతి దారులు తాము చెల్లించే స్వల్ప ధరలలోనే రకరకాల కోతలు విధించి సొమ్ము చేసుకుంటున్నారు. వేరు శనగ ఎగుమతుల వలన ఉద్యోగావకాశాలకు కూడా దెబ్బ తగిలింది. నూనె మిల్లుల ఏకచ్ఛత్రాధిపత్యం ఈ పంటపై ఇప్పటికీ కొనసాగుతున్నది.

**జూటు (Jute) :** ఈ పంట మార్కెటింగ్‌ను కలకత్తా మిల్లులు స్కాట్లండులోని "డూండీ" మిల్లులు పరోక్షంగా కంట్రోలు చేస్తున్నవి. వారిలో వారికి లోపాయికారీ తనముంది. హిస్సయిన్, (జూటుతో తయారు చేసే బట్ట) జూటు సంచుల అమ్మకాలకు ఈ మిల్లులు ఏజంట్లుగా వ్యవహరిస్తున్నవి. బెంగాలు ప్రభుత్వం ఈ మిల్లులను అదుపులోపెట్టటానికి, కనీసధరలను నిర్ణయించే ప్రయత్నంచేసింది. మిల్లుల వారు ఆ ప్రయత్నాన్నివమ్ముచేశారు.

విశ్వకవి రవీంద్రుడు కూడా - ఈ రైతుల నిరాశానిస్పృహలపై తీవ్ర ఆవేదన వ్యక్తం చేశాడు. ఎగుమతి దారులు రైతులకు చెల్లించే మొత్తంలో 20 శాతం వ్యత్యాసం వుంటుంది. మాన్యుఫాక్చరర్ 40 శాతం (అన్నిఖర్చులుపోను) తనవాటాగా కాజేస్తున్నాడు. మాన్యుఫాక్చరర్ రెండింతలు లాభాలార్జిస్తున్నాడు.

స్వరాజ్యం వచ్చిన తరువాత పాకిస్తాన్ జూటు గుత్తాధిపత్యంతో పోటీపడటానికి - భారత ప్రభుత్వం మన దేశ రైతులను జూటు ఎక్కువగా పండించటానికి ప్రోత్స హించింది. పాకిస్తాన్‌తో వాణిజ్యావొప్పందం జేసుకొన్న తరువాత రైతులను వారి కర్మకు వారిని వదలి, మిల్లు యజమానుల కాళ్ళవద్ద పడవేసింది.

సంఘటితమయిన అమ్మకపు సంస్థల శక్తి - అసంఘటిత ఉత్పత్తిదారుల - వినియోగదారుల కంటే ఎంత గొప్పదో - పాల విషయములో ఇంగ్లండులో - అరటికాయల ఉత్పత్తిలో దక్షిణ అమెరికా రాష్ట్రాలలో ఋజువయింది. ఇంగ్లాండులో పాల ఉత్పత్తి దారులు వినియోగదారులు చెల్లించే ధరలలో 50 శాతం కూడా (సగం కూడా) పొందటంలేదు రెండవప్రపంచయుద్ధంవస్తేగాని ఈ పరిస్థితి మారలేదు 1951 లో

భారతదేశంలో పాలరైతు, వినియోగదారుడు చెల్లించే ధరలో 65 శాతం పొందగలిగాడు, మార్కెటింగ్ స్వదేశీయుల చేతుల్లో వున్నప్పుడు మోసం చాలా ఎక్కువగా జరుగుతుంది.

ప్రాసెసింగు పరిశ్రమలు ప్రైవేటు యాజమాన్యంలోనివి. వ్యవసాయదారులకు వీటిని అదుపుచేసే శక్తిలేదు. 60 శాతం అమ్మకాలు, రవాణా లావాదేవీలు గ్రామాల్లోనే జరుగుతున్నవి. (Rural Credit Survey).

అమెరికా రెండవప్రపంచయుద్ధంలో భాగస్వామిఅయినతరువాత పరిశ్రమలకు కావలసిన ముడిసరుకులు, పెట్టుబడులు, రైళ్ళు, ఓడలపై రవాణా, ఉత్పత్తుల మార్కెటింగులను, అమెరికా,గ్రేట్ బ్రిటన్, ఇతర దేశాలు తమ ఆధీనంలో వుంచుకొన్నవి.

యుద్ధకాలపు కంట్రోళ్ళు, నియమనిబంధనలు, దళారీలు కీలకసేవలలో ప్రధానపాత్రవహించే శక్తులు, రైతులను అసహాయులుగా జేసినయ్. వ్యవసాయ ఎగుమతులకు లైసెన్సుదారుల నేర్పాటు చేశారు. వీరు వ్యవసాయదారుల వినియోగదారుల నెత్తిన అధిక ధరలురుద్ది,రైతుల వాటాను (దళారీలు) దిగమింగారు, ధాన్యం, బియ్యం, గోధుమపిండి, బెల్లం, పంచదార, చెరుకు వంటి నిత్యావసర వస్తువుల క్రయ విక్రయాలలో దళారీలు మాత్రమే లాభించారు. పోలీసులు, రైల్వే, రెవిన్యూ, సివిల్‌సప్లయిస్ డిపార్టుమెంట్లు - అందరూ కలసి రైతులనుమోసం చేశారు. కమ్యూనిష్టులు వినియోగదారుల లాభాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని ధరలు తగ్గటానికి కారణమయ్యారు.

వీటి ఫలితంగా ఉత్పత్తి దారులు - పట్టణాలలోని పారిశ్రామిక వర్గాలపై , వారికి మద్దతు నిచ్చే కీలక శక్తులపై పోరాటానికి సిద్దమయ్యారు.

## కీలకసేవలు - డబ్బుపెట్టుబడి

వ్యవసాయంలో " డబ్బుపెట్టుబడి" పాత్రపై మార్క్స్ తన దృష్టిని తగినంతగా కేంద్రీకరించలేదు. పారిశ్రామిక పెట్టుబడులపైనే శ్రద్ధవహించాడు. లెనిన్ డబ్బుపెట్టుబడి ప్రాముఖ్యతను, సమకాలీన సమాజసమస్యలపై సామ్రాజ్యవాద వాణిజ్య ప్రభావాన్ని గుర్తించాడు. లెనిన్ కూడా వ్యవసాయంలో డబ్బుపెట్టుబడి ప్రభావాన్ని, ఆ సమస్య ప్రాధాన్యతను మనసులోవుంచుకొని అధ్యయనం చేయలేదు. లియన్‌తోవ్ (Leontove) వ్యవసాయార్ధికత్వాన్నిపట్టించుకోలేదు. కార్మికుల ఆర్ధికత్వ విశ్లేషణలో తలమునకలైనాడు. వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు చెల్లించే వడ్డీరేటు, వారికి వచ్చే లాభం రేటు కన్నాచాలా తక్కువని తేల్చివేశాడు.

స్పెయిన్ దేశంలో చిన్నరైతులు వడ్డీ వ్యాపారులపీడనకు ఎలా గురౌతున్నది - డాన్‌పాస్కెల్ కారియన్ వర్ణించాడు. " పొలాల ఎరువులకు, పశుపోషణకు అవసరమయిన "డబ్బు" కోసం రైతువడ్డీవ్యాపారిని ఆశ్రయిస్తున్నాడు. అప్పుచెల్లించే గడువురోజున, తన సర్వస్వం - అంటే - తనకూ తనకుటుంబానికి అవసరమయిన తిండిగింజలు, తన గుర్రాలదాణా, తన ఎరువులు, ఆఖరకు విత్తనాలు (విత్తేవి) తో సహా మొత్తం అమ్మితేగాని అధిక వడ్డీకి తను తీసుకున్న అప్పుతీరదని తెలుసుకుంటాడు. ఇది ఏడుస్తూ చేసే వ్యవసాయం కాదా? దుస్థితిలో వుండి చేస్తున్న వ్యవసాయం కాదా ? రైతు ప్రియంగాకొని, చౌకగా అమ్ముకొని రెండు విధాలా నష్టపోతున్నాడు. మరుసటి సంవత్సరం - ఆ మరుసటి సంవత్సరం ఇలానే జరుగుతుంది. తన బాకీల చెల్లింపులకు తన పొలం పుట్ర అమ్ముకొని కట్టుబట్టలతో మిగుల్తున్నాడు. తన ఆర్థిక బలహీనత వలన వడ్డీ వ్యాపారులకు లొంగి పోవటంలోని నిస్సహాయత, వత్తిడి వ్యవసాయఫలితం - చైనా, ఇండియాలలోవున్నట్లే వుందని తెలుసుకోలేడా ?

"లాటిన్ అమెరికా ప్రాంతపు రైతులు తాము పొందే ఋణంలో అధిక భాగం ప్రైవేటువడ్డీ వ్యాపారుల నుండి, దళారీల నుండి, అధిక శాతం వడ్డీలకు పొందుతున్నారు. ప్రపంచమంతా రైతుల పరిస్థితి ఇదే." (F.A.O. సర్వే)

24 శాతం వడ్డీలు, చక్రవడ్డీలతోరైతుకు పూట గడవటం కష్టంగా వుంది. అయినా చెల్లించక తప్పటంలేదు. భూస్వామ్య విధానపు దుర్మార్గాలను అధ్యయనం చేసే ఆదుర్దాలో సోషలిస్టులు వ్యవసాయ పెట్టుబడుల పరిశీలనకు తగిన ప్రాధాన్యత నీయలేదు. భూస్వామ్యం కన్నా ఋణబాధ రైతులకు ప్రాణాంతకమయింది. గ్రామీణ బాంకులు, పెద్దపెద్ద బాంకుల విషయంలో ఇది వాస్తవం. ఈ బాంకులు వాణిజ్య, వ్యాపార వర్గాల కన్నా 50 శాతం నుండి 100 శాతం వరకు అధిక వడ్డీని రైతులనుండి వసూలు చేస్తున్నవి. గ్రామీణ ఋణాల తారతమ్యం వ్యవసాయానికి, వ్యవసాయదారునికి ఎంతైనా నష్టం కలిగిస్తున్నది. ఈవిధానం సమర్ధనీయం కాదు. గ్రామీణ వసూళ్ళు కష్టమని చెప్పటం సరికాదు. పారిశ్రామిక, వాణిజ్య, వ్యాపార ఋణాలలో తరచుగా చాలా ఎక్కువ మొత్తాలలో బాంకులు తమ సొమ్మును పోగొట్టుకుంటున్నవి. గత ఆర్థిక మాంద్యంలోబాంకులు గ్రామీణపెట్టుబడులలో కంటే పారిశ్రామిక వాణిజ్య పెట్టుబడుల లోనే ఎక్కువ ఎగవేతకు గురైనష్టపోయినవి.

సారాంశం ఏమిటంటే, వడ్డీ వ్యాపారులు, బాంకులు, సమాజంలో వారికున్న కీలకస్థానాల వలన రైతుల దోపిడీతో లాభిస్తున్నారు. మాన్యుఫాక్చరర్లు, వ్యాపారులకున్నట్లు

రైతులకు నిలువ ధనం వుండదనే సత్యం బాంకులకు తెలుసు. చాలా మంది రైతులు తమవ్యవసాయం అప్పుల వారసత్వంతోనే మొదలు పెట్టారు. పరిశ్రమలు, వాణిజ్య సంస్థలు తమ పెట్టుబడులును పూర్తిగాగానీ, పాక్షికంగాగానీ, సంవత్సరం పొడవునా వాటి అమ్మకాల వలన రాబట్టుకోగలవు. రైతులు తమ పంటలు అమ్మేతరుణం వరకు ఆగి ఏ సంవత్సరాంతాన్నో, పెట్టుబడి తేల్చుకొనే అవకాశం వుంటుంది. ఇవన్నీ వడ్డీ వ్యాపారులకూ, బాంకులకూ తెలిసిన నిజాలే." ధరలు అతి తక్కువగా వున్నప్పుడు, వ్యాపారుల మధ్య పోటీ లేనప్పుడు, రైతులు తమ ఉత్పత్తుల నమ్మవలసివస్తున్నది. "(F.A.O.)[4] పంటపూర్తిగా చేతికందేవరకు కూడా రైతు ఓర్చుకోలేడు. కూలీల వేతనాలకు, పశువుల మేతకు, దాణాలకు, తన స్వంత అవసరాలకు రైతుపడే ఇబ్బంది నాసరాగా చేసుకొని, వత్తిళ్ళలోవున్న రైతు ఉత్పత్తిని మార్కెట్లలలో వ్యాపారులుఅతి చౌకగా కొనగలుగుతున్నారు. ప్రభుత్వంనుండిగానీ, సహకారసంస్థల నుండి గానీ, ఋణసౌకర్యం రైతులకందటంలేదు. రైతులు ప్రభుత్వం నుండి, సహకార బాంకుల నుండి తీసుకున్న ఋణం వారి ఋణభారంలో ఆరు శాతం మాత్రమే.

ఇండియా, చైనా గ్రామీణ ప్రాంతాలలో - తమ అప్పులు తిరిగిరావని, రైతుల ఆస్తులన్నీ అమ్మికట్టినా వారిబాకీ తీరదని తెలిసి కూడా అప్పులిచ్చేవారున్నారు. వారెందుకిలా అప్పులిస్తున్నారు? వారు పెట్టినఅప్పు అసలుఫాయిదాలతో సహా వారికెప్పుడో వడ్డీ రూపేణా జమపడింది. ధాన్యం వగైరా కొనుగోళ్ళు, యాంత్రిక ఉత్పత్తులు, ఇతర నిత్యావసరసరుకుల అమ్మకాలు ఈ వడ్డీ వ్యాపారులే గ్రామాల్లో నిర్వహిస్తారు. ఆ ఖాతాలు పోగొట్టుకోవటమంటే వారి ఆదాయ ప్రవాహానికి గండి కొట్టుకోవటమే.

37 శాతం గ్రామీణ వడ్డీ వ్యాపారులు, 83 శాతం పట్టణ వడ్డీ వ్యాపారస్థులు - గ్రామీణ ఉత్పత్తుల - అమ్మకాల వ్యాపారం నిర్వహిస్తునట్లు 1955 లో రూరల్‌క్రెడిట్ సర్వే (గ్రామీణ ఋణపరిశీలన) పేర్కొంది.

"రైతుల పాత అలవాటయిన, ప్రయోజన రహితమయిన అప్పుసేత నుండి వారిని మాన్పించి, వడ్డీవ్యాపారులనుండి వారికి రక్షణ కల్పించాలి. ఈ నిష్ప్రయోజన మయిన (అప్పు పుట్టుతున్నది కనుక -అప్పుచేయడం) అప్పుల నుండి బ్రెజిల్, హండోరాస్, నికరాగ్వే, పరాగువే, వెనిజులా, ప్రభుత్వాలు వ్యవసాయదారులకు ముఖ్యంగా చిన్న రైతులకిచ్చే ఋణ సౌకర్యం క్రమబద్ధీకరించి అజమాయిషీ చేస్తున్నవి."

ఋణగ్రహీతల "అదనపువిలువ" నంతా ఋణదాతలు (అప్పులిచ్చేవారు) పిండుకొనటంవలన, వీరంతా బీదరికం, అర్ధాకలితో అలమటిస్తున్నారు. గ్రామీణ

ఋణసౌకర్యం గ్రామీణ ఆర్ధికతను శాసిస్తుంది. ఈ పరిస్థితులలో వడ్డీ వ్యాపారులు, బాంకులు ప్రభుత్వాలు, గ్రామీణసహకారఋణసంస్థలు తక్కువ వడ్డీకి అప్పు దొరకకుండా అడ్డుపడటం ఆశ్చర్యకరం కాదు. ఫ్రాన్సు, ఇండియా, అమెరికా దేశాలు, ప్రత్యేకమయిన చట్టాలు తెచ్చి, వ్యవసాయదారులకు తగినంత ఋణం అందించ టానికి,కనీస వడ్డీ రేటును నిర్ణయించి వ్యవసాయదారులను ఆదుకోవటానికి కార్యక్రమాలు చేపట్టాయి. వ్యవసాయపు బలహీనత -అప్పుబలం దీనిని బట్టే మనం అర్ధం చేసుకోవచ్చు. "అప్పు" తనవాటాకంటే ఎక్కువమొత్తాన్ని తనలోకి లాగుకొని రైతులకు బతుకు తెరువులేకుండా చేస్తున్నది.

" ప్రభుత్వం పన్నుల ద్వారా కోటి రూపాయలు వసూలుచేస్తే, వడ్డీ వ్యాపారులు నాలుగు కోట్లు వసూలు చేస్తున్నారు. బ్రిటీషు కోర్టులు "బనియా" (వడ్డీవ్యాపారి) ల బాకీలను కూడా తామే వసూలు చేస్తున్నవి. భారతరైతులు 'లూటీ"(Loot ) చేయబడు తున్నారు. దీనిని సరిచేయటానికి ఏకైక మార్గం మొత్తంగా ఈ పద్ధతిని రద్దు చేయటమే.' (Douglus young - డగ్లస్‌యంగ్ - పంజాబు మాజీ ప్రధాన న్యాయమూర్తి).

## రిటైల్ వ్యాపారం

చిల్లర వ్యాపారం (Retail-రిటైలు) రైతులకవసరమయిన కీలక సేవలలో అతి ముఖ్యమయినది. ఈ కీలకసేవ రైతులను క్రూరంగా కబళిస్తున్నది. ఈ సేవ రైతులకు రెండు విధాల అవసరం. ఉత్పత్తులను వినియోగదారుల కందించటం ఒకటి. వ్యవసాయపెట్టుబడులు (Inputs) - ఎరువులు, పురుగుమందులు, విత్తనాలు, పశువుల దాణాలు వగైరాలను, వినియోగదారునిగా రైతుకు (అవసరమయిన పారిశ్రామికోత్పత్తుల) అందించటం రెండవది. ఈ రెండు కారణావలన మార్కెటింగు రైతుల జీవితాలను శాసించే యజమాని స్థాయికెదిగింది. పాశ్చాత్య దేశాలలో చిల్లర వ్యాపారం యాంత్రికత వలన, వినియోగదారుల వత్తిడివలన ప్రత్యేకమయిన "కళ" అయింది. వ్యవసాయదారులు ప్రైవేటు చిల్లర వ్యాపారులతో పోటీపడలేక పోతున్నారు. అతిబలమయిన "సిట్రస్ కో ఆపరేటివ్ మార్కెటింగు ఆర్గనైజేషన్ ఆఫ్‌కాలిఫోర్నియా" (బత్తాయి, నారింజ అమ్మకాల సహకారసంస్థ) ప్రైవేటు వ్యాపారుల చేతుల్లో చావుదెబ్బతిన్నది.

"అమెరికా సంయుక్త రాష్ట్రాలలో యాంత్రిక మార్పిడులు, అనువయిన ఒకే కేంద్రంలో నిత్యావసరవస్తువుల స్వయం సేవా కేంద్రాల (Self Service centres) ఏర్పాటు జరుగుతున్నది. వినియోగదారులకు శ్రమ లేకుండా ఆహారపదార్ధాల పాకింగు,

శుభ్రపరచటం, నిల్వవుంచటం, రిఫ్రిజిరేటర్లు ఇతర యంత్రాల సాయంతో, మాంసం, కూరగాయలు, పండ్లు, నిలువచేసి అందజేస్తున్నారు. దీని పరిణామంగా పంపిణీలో అంతరాలు పెరిగి, ఆహారపదార్థాల ధరలు ఉత్పత్తుల స్థాయిలో తగ్గినా, ఆ ప్రభావంతో వినియోగదారుల కొనుగోలు ధరలలో తగ్గుదల కన్పించలేదు.

ఈ ప్రత్యేక రిటైలు సేవలు అమెరికాలో రైతులకు - వినియోగదారుల కిరువురకూ భారమయ్యాయి. ఖరీదుతో కూడినవి. రిటైలు వస్తువుల ధరలో, పంపిణీ ఖర్చు సగ భాగం గా వుంటున్నది. ఈ కీలక సేవ ఖరీదయినదేగాక అనివార్యమయింది. ప్రాథమిక సేవలను, ఉత్పత్తులను నిర్లక్ష్యం చేసి, యాజమాన్య-పద్ధతులను (Professionalism ),ప్రాసెసింగును, కాపిటలిజంను ప్రోత్సహించినవి.

తూర్పుదేశాల మార్కెటింగు సంస్థల క్రమశిక్షణా, సమర్ధతారాహిత్యాల వలన, ఇవి అందించే సేవలు ఖరీదైనాయి. కనీస వ్యాపార గౌరవాన్ని , నిజాయితీని కూడా ఈ సేవలు పాటిం[illegible]టం లేదు. తూకాలు, కొలతలలో మోసాలు, దొంగతనం, ధరలకోత ఇష్టారాజ్యంగా [illegible]గుతున్నది. భారతదేశంలో పదివేల రిజిస్టరు చేయబడిన సహకార మార్కెటింగు సంఘాలున్నప్పటికీ - వీటి పలుకుబడి చెప్పుకోతగినంతగా లేదు.

" కీలక ప్రదేశాలలో పాకింగు, స్టోరేజి, సరుకుల విడుదలకు సంస్థల నేర్పాటు చేస్తే, తూర్పు దేశాలు తమ పండ్ల వ్యాపారానికి ఎగుమతి అవకాశాలు సంపాదించు కోగలవు." అని F.A.O. అభిప్రాయ పడింది. అమెరికాలోని ట్రాపికల్ దేశాలు, ఆసియాలో ధాన్యపు ఉత్పత్తి దారులు ఇప్పుడు విస్తృతంగా నిర్మాణాలు (నిర్మాణాలు అంటే కట్టుబడులు) చేస్తున్నారు. యుద్ధానంతరం ఈ పన్నెండు సంవత్సరాలలో మార్కెట్ల స్థితిగతులు బాగుపడినవి. ఆసియా, లాటిన్ అమెరికా దేశాలకు, అంతర్జాతీయ ఆర్థిక సహకారం కూడా పుష్కలంగా అందుతున్నది. మార్కెట్ల క్రమబద్ధీకరణకు చట్టాలు చేయబడుతున్నవి. పాశ్చాత్య దేశాల స్థాయికి చేరటానికి మనమెంతో కృషిచేయాలి.

ఈ విధమయిన అభివృద్ధిలో కూడా ఎన్నో లొసుగులన్నాయి. అమెరికా-ఇంగ్లాండుల స్థాయికి ఈవిధానం ఎదిగితే (తూర్పుదేశాలలో) మార్కెటింగు ఉత్పత్తిదారులకు ఉపయోగకారికాక పోగా గుదిబండగా మిగుల్తుంది. యుద్ధకాలంలోను, ఆ తరువాత ప్రభుత్వాలు మార్కెటింగులో లాభాల వాటాను (Margin ) తగ్గించటానికి యత్నిస్తాయి. ఇంగ్లాండులోని సమర్థవంతమయిన అధికారయంత్రాంగంకూడా చాలా అసమర్ధంగా పనిచేసే వ్యాపార సంస్థలు తమలాభాల పెరుగుదలకై తెచ్చేవత్తిళ్ళు తట్టుకో లేక పోతున్నది.

అమెరికా వినియోగదారులు కూడా మార్కెటింగు పద్ధతుల వలన లాభించ లేదని వేరు వేరు ప్రజాహిత సంస్థలు అభిప్రాయపడినయ్. "అమెరికా, నెదర్లాండు, కెనడా దేశాలలో వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పడిపోయినా, వినియోగదారుల ధరలు స్థిరంగా వున్నవి." రిటైలు ధరలు అన్ని దేశాలలోనూ ఏవిధమైన ఆటు-పోట్లకు లోనుకాలేదు." "వ్యవసాయధరల తగ్గుదల రిటైలు ధరలలో ప్రతిఫలించలేదు."

ఉత్పత్తి దారులకు - వినియోగదారులకూసేవలందించాల్సిన రిటైలు వ్యాపారం - ఇరువర్గాలకు నష్టదాయకమయింది. ప్రజల ఆర్థిక జీవితాన్ని కాపిటలిజం ఎంతగా శాసిస్తున్నదో దీని వలన మనం గ్రహించవచ్చు. ఈ ఇరువర్గాల ఆర్థిక స్థితిగతులెటు వంటివయినా, పొలం నుండి పట్టణానికి ఉత్పత్తులు చేరటానికయ్యే మార్కెటింగు ఖర్చులలోమార్పులేదు. అవి అవ్యాకోచమయినవి. రిటైలు ధరలలో ఎక్కువ తేడాలు కలిగినప్పుడు మాత్రమే కొంత మార్పు ఆలస్యంగా మార్కెటింగులో కన్పిస్తుంది. వినియోగదారుల ధరలలో తగ్గుదల కన్పిస్తే వ్యవసాయోత్పత్తుల ధరలలో తగ్గుదల కన్పిస్తుంది.రిటైలు ధరల పెరుగుదలకు రిటైలుమార్కెటింగు ఖరీదయినదవటం కారణం. మార్కెటింగు ఖర్చులుతగ్గించలేకపోతే, వినియోగదారులకు పోషక విలువలు కలిగిన ఆహార పదార్థాలు, అలాగే పొలాల్లో కాయకష్టంచేసేవారికి ఇతర వర్గాలతో సమానమయిన జీవనప్రమాణాలందించలేము. ఈ కీలక సేవ (రిటైలువ్యాపారం) ఉత్పత్తి దారులకు - వినియోగదారులకు లాభదాయకమయిన అభివృద్ధి సాధించటానికి అవకాశమిస్తుందా? ప్రపంచవ్యాప్తంగా రైతుల దైనందిన అనుభవాలు పరిశీలిస్తే, సాధారణ పంటల ధరలు త్వరితగతిన దిగజారుతున్నా, భూసార పోషకాలు, పురుగుమందులు, విత్తనాలు, పశువుల దాణాల ధరల తగ్గుదలలోఎంతో "కాల విలంబం" (Timelag) వుంటున్నది. రైతులు కూడా పారిశ్రామికోత్పత్తులను ఎక్కువగా వినియోగిస్తున్నారు. పారిశ్రామిక వినియోగాల ధరలు వ్యవసాయధర దిశలో పయనించటంలేదు. రిటైలు వ్యాపారంలో వ్యవసాయదారుడు - ఉత్పత్తి దారుగా - వినియోగదారుగా - రెండు విధాల పీడింపబడుతున్నాడు. అందువలన వారిజీవితాలలో ఈ కీలక సేవ పాత్రను నిరసిస్తున్నాడు.

**రవాణావ్యవస్థ** (Transport - Communication ):- వ్యవసాయోత్పత్తుల రవాణావ్యవసాయదారుల చేతులలో లేదు. తలమూటలు, ఎద్దులు, గుర్రాల బండ్లు, పెరికలతోరవాణా నేడు సాధ్యం కాదు. రవాణా ఖర్చులు, వివిధ పంటల రవాణా చార్జీల వ్యత్యాసం, ప్రాధమిక ఉత్పత్తుల రవాణాలో ప్రాధాన్యత కలిగినవి. పారిశ్రామిక ఉత్పత్తుల, వ్యవసాయోత్పత్తుల రవాణాలో వివక్షతలు - ముఖ్యంగా రైల్వేల చేతుల్లో వుండి (భారత్)

దేశ ఆర్థికాభివృద్ధి నైజాన్ని శాసిస్తున్నవి. యుద్ధకాలంలో వాగన్ల కొరత చాలా ఎక్కువగా వుంది. ఈ కొరతవలన రైతులు, వర్తకులు రైల్వేసిబ్బందికి లంచాలిచ్చుకోవలసి వచ్చింది. అర్జెంటీనాలో ప్రభుత్వం రోడ్డు రవాణాను ప్రోత్సహించ టానికి చేసిన ప్రయత్నాలను, బ్రిటీషు రైల్వేలు భగ్నంచేసినయ్. ఇండియన్ రైల్వే భారతదేశంలో కాల్వల పై రవాణాను కనుమరుగు చేసింది. రవాణాపై ఆధిపత్యం సంపాదించి, ఇండియన్ రైల్వే రవాణా చార్జీలు పెంచింది. వాగన్లకొరత వలనవ్యాపారస్తులు దిగువస్థాయి రైల్వేసిబ్బందికి, ఉన్నతాధికారులకు వాగన్ల కేటాయింపుకై లంచాలు చెల్లించారు. రెండవప్రపంచ యుద్ధసమయంలో, వ్యవసాయోత్పత్తుల రవాణా చార్జీలు పెంచి, రైల్వేసిబ్బంది రైతుల రక్తాన్ని పీల్చి వేశారు. రైతుల జీవితాలతో చలగాట మాడుకున్నారు. రోడ్ రవాణా బడాపెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకృతమయింది. థాయ్‌లాండులో అమ్మకపువస్తువుల ధరల్లో 2/8 వంతు నుండి 3/8 వంతు వరకు రోడ్ రవాణా స్వంతం చేసుకొన్నది.

"రోడ్డు, రైళ్ళు, కాలువలపై రవాణా, లారీలులేనట్లయితే ఉత్పత్తుల తరలింపులు అసాధ్యం. ఆర్థికవ్యాపకాలు కేవలం మనుగడతోనే సరిపెట్టుకోవలసివస్తుంది.'

"యుద్ధకాలంలో విస్తృతపరచబడిన రవాణా సౌకర్యాలు శాంతి కాలానికి అనుగుణంగా, తేలికగా మార్చుకొనవచ్చును."

"యుద్ధానంతర ప్రపంచం రవాణా సౌకర్యాలలో ఊహాతీతమయిన అభివృద్ధి సాధించింది."

వ్యవసాయోత్పత్తుల పరిమాణం చాలా పెద్దది. రవాణా ఛార్జీలు పెరగటం వీటిపై అధిక ప్రభావం చూపటంతో రైతులు మార్కెట్లకొరకు చేసే ఉత్పత్తులలో మాంద్యం వచ్చింది.

**కరన్సీ (Currency ) :-** బాంకుల సావాసగత్తె. కరన్సీ చలామణీని అదుపులో వుంచుకొన్నవారు ధరలను నియంత్రించగలరు. రైతులనుద్ధరించగలరు. అణగదొక్క గలరు. డాక్టర్ సన్ యట్ సెన్ (Dr. Sun yat Sen) ప్రఖ్యాతిగాంచిన తనరెండవ ఉపన్యాసంలో ఇలా చెప్పాడు. "విదేశీయులు ఎన్నో మిలియన్ డాలర్లను విడుదల చేయగలరు. వీరు మిలియన్లకొలది కాగితపు కరన్సీని అతిచౌకగా అచ్చుగుద్ది - ఈ కాగితాలతో మిలియన్ల డాలర్ల విలువగల మన వస్తువులను మార్పిడి చేసుకుంటున్నారు.' అలానే భారతదేశపు సరుకులను, సేవలను కాగితపు కరన్సీతో ఆంగ్లో - అమెరికన్ దేశాలు కొనుగోలు చేయటానికి వీలుగా, ఈ కాగితాల ప్రవాహాన్ని బ్రిటను అంతులేకుండా కొనసాగించింది. ఇది బెంగాలు, ఒరిస్సా, విశాఖపట్నం, మలబారులలో కరువులు, బీహారు,

అవ్వాంలలో అంటువ్యాధులు ప్రబలటానికి బలమయిన కారణమయింది. ఈ కరన్సీ విధానం "ఎటుబడితే అటుమార్చటానికి" వీలవుతుంది. దీనివలన స్థానిక మారకపు విలువలలో వ్యత్యాసం పెరుగుతుంది. ఈ పెరుగుదల వ్యవసాయోత్పత్తులపై అదృశ్య ప్రభావం చూపుతుంది."

రూపాయి విలువనుపెంచితే (Deflation) వ్యవసాయదారుల, వ్యవసాయ కూలీల ఋణ భారం పెరుగుతుంది. వడ్డీ వ్యాపారుల లాభాలు పెరిగి (వడ్డీలు పెరిగి) బీద రైతులకు మోయరాని బరువౌతుంది.

రైతులు, వారికుటుంబ సభ్యులు (ఇంకాలోతుకు వెళ్తే అతని పశువులు - కోళ్ళు - మేకలు కూడా) నిరంతరం ఉత్పత్తిచేసి "పోగు" చేసే "అదనపు విలువ" ను వ్యవసాయ కీలక సేవల సూత్రాన్నమలు చేస్తూ, వర్తకులు, బాంకర్లు, విదేశీ ద్రవ్యమారకపు దళారీలు, కరన్సీ, (కాగితపుడబ్బు) రైళ్ళు, మార్కెట్లలో వ్యవసాయదారులను దోపిడీ చేస్తున్నారు. సామాజిక ఆవశ్యకతలయిన పోషణ, ప్రత్యుత్పత్తిశ్రమల్లోకూడా ఈ కీలకసేవలు వాటా కోరుతున్నవి. పైకి తమవాటాను మాత్రమే పొందుతున్నట్లు కన్పించే కీలకసేవలు వాస్తవానికి రైతుల శ్రమనంతా పిండుకొంటూ వారు నిత్య దారిద్ర్యాన్ని అనుభవించేలా చేస్తున్నవి. 1200 మిలియన్‌డాలర్లను కీలక సేవలు చైనాలో ప్రతి సంవత్సరం తమవాటాగా కాజేస్తునట్లు డాక్టర్. సన్ యట్ సెన్, 1924లో అంచనా వేశారు.

భూస్వామ్యం, అధికారజులుం, వ్యవసాయదారుల జీవితాలతో ఆడుకొనే మరి రెండు కీలక సేవలు, వివిధ మార్గాల ద్వారా, కొద్దిలక్షలమంది భూస్వాములు ఎక్కువ మొత్తాల భూములను తమ స్వంతం చేసుకున్నారు. అధిక కవుళ్ళు చెల్లించి, రైతులుఈ భూములలో వ్యవసాయం చేయాలి. భూస్వాముల హక్కులపై ప్రభుత్వ అజమాయిషి వున్న ప్రాంతాలలో కూడా, భూమి కవులు చాలా ఎక్కువగా వుంది. వ్యవసాయార్థికత్వ పటిష్టత కొరకు భూస్వాములు శ్రమించరు. ప్రమాదాలకు (Risk-రిస్కు) వారు దూరంగా వుంటారు. వీరంతా పోతు తేనెటీగలు, పరాన్న భుక్కులు. వివిధదేశాలలో భూస్వామ్య పెత్తందారీతనం విభిన్న పోకడలు పోతుంది. రైతుల ఓటు హక్కును శాసించటం నుండి, ఊడిగం చేయించుకోవటం వరకు ఈ దుర్మార్గం బలపడి, గ్రామీణ రైతు జీవితాన్ని విషంతో నింపుతున్నది. ప్రభుత్వాలు, మతాధిపతులు, భూస్వామ్యపెత్తందార్లు, పరోక్ష వాణిజ్య రైతులు, అందరకూ ఈ పాపంలో వాటా వుంది. కాపిటలిజం - భూస్వామ్యంల పొత్తు రైతులను అవిటివారుగా చేస్తున్నది. ఈ విధానం రద్దు చేయమని 'డిమాండు' చేయటం మినహా రైతులకు గత్యంతరం లేదు.

ప్రభుత్వాధికారులు, మతాధికారులు, పెద్దరైతులు, వర్తకులు, రైల్వే, నీటి పారుదలల సిబ్బంది. ప్రాసెసింగు సంస్థల జులుం, లంచాలు, రైతుల దుర్గతికి కారణ మౌతున్నవి. అడవుల్లో వుండేవారు, చెరువుల, కాల్వల నీటితో వ్యవసాయం చేసేవారు రవాణాకు రైల్వేవాగన్లపై ఆధారపడ్డవారు, పొలం రిజిస్ట్రేషన్ ధృవీకరణ పత్రాలు కావలసినవారు, చిన్నపొరపాట్లకు పెద్ద శిక్షలు తప్పించుకోగోరేవారు,వీరందరూ నెలసరి, సాలుసరి మామూళ్ళు సంబంధిత అధికారులకు, అనధికారులకు చెల్లించే మొత్తం వారి బీదరికం దృష్ట్యా, వలస రైతాంగానికి మోయరాని బరువౌతుంది. ఈ స్వార్థశక్తుల దాహం తీర్చందే రైతు పొలంలోకాలుపెట్ట లేడు.

ఈ కీలక సేవల ఏకచ్ఛత్రాధిపత్యంపై పోరాటం చేయటం రైతు ఉద్యమాల ప్రధాన బాధ్యత. రైతుల "అదనపు విలువల పోగును" ఎవరుదొంగిలిస్తున్నదీ కీలక సేవల సూత్రాన్ని అవగాహనచేసుకోవటం ద్వారా తెలుసుకోగలిగాము. వలసదేశాల ప్రజల రక్తాన్ని, సామ్రాజ్యవాదదేశాల కందించే కీలకమయిన రక్తనాళాన్ని ఈ సూత్రం బయటపెట్టింది.

ఇటీవలి కాలంలోవర్తక, వాణిజ్య వర్గాలు రైతులకు, పారిశ్రామిక కార్మికులకు మధ్య విరోధాలు సృష్టిస్తున్నవి. రైతులు స్వదేశీ పారిశ్రామికాభివృద్ధి, కార్మికులకు ఉదారవేతనాలు అందించే యత్నంలో వుంటే, కార్మికులురైతుల స్థితిగతులను పట్టించుకొనక, అధిక వేతనాల కొరకు, చౌకగా ఆహారం కొరకు, ఇతర వసతుల కొరకు తపన పడుతున్న కారణంగా ఈ విరోధాలకవకాశమిస్తున్నారు. ఎవరినో వొకరిని బలి పశువును చేసి తమ పబ్బం గడుపుకొనే కాపిటలిస్టులు-ఈ అభిప్రాయభేదాలను తమ స్వార్ధానికి వాడుకుంటున్నారు. ప్రభుత్వాలపై వత్తిళ్ళతో, పరిశ్రమలకు రక్షణ కల్పించుకొని, అధిక ధరలతో తాము సంపాదించుకొన్న లాభాలలో నామమాత్రంగా కార్మికులకు విదిలిస్తున్నారు. కార్మికులను తక్కువ జీతాలతో తృప్తిపరచటం కోసం, ఆహార పదార్ధాలు, నిత్యావసర వస్తువులు చౌకగా అందించాలని దొంగ ప్రచారం చేస్తున్నారు. ఆస్ట్రేలియాలో అధికవేతనాలురైతుల అభివృద్ధికి అడ్డుకట్టలయినవి. రైతులు ప్రభుత్వరక్షణ కలిగిన పారిశ్రామికోత్పత్తులకు ఎంతోమూల్యం చెల్లిస్తున్నారు. వారి ఉత్పత్తులకు దేశ విదేశీ మార్కెట్లలోరక్షణలులేవు.

పరిశ్రమే ఒక పెద్ద కీలక సేవగా మారి, అది అందించే స్వల్పసేవలకు ప్రతి ఫలంగా అధిక మొత్తాలను సంపాదించుకుంటున్నది.

# వత్తిడి ఉత్పత్తి

## (Production Under Duress)

గ్రామ స్వరాజ్యంలో[1] (కామన్వెల్తులలో) స్వయం సమృద్ధిగల ఆర్థిక ప్రాబల్యంలో, వ్యవసాయదారులు పనిరోజుల్లో తమకు, గ్రామాలకు, విశ్రాంతి దినాలకు, పండుగ రోజులకు అవసరమయిన పంటలను పండించేవారు. ఋతువులు సక్రమంగా వుండి, మేలు రకం వ్యవసాయ పద్ధతులనవలంబించి, కరువు కాటకాలకు రక్షణ భీమాగా అదనపు నిల్వలు కలిగి వుండేవారు. ఉత్పత్తి చేయటానికి, వ్యవసాయంపై ఆసక్తి పెంచుకోవటానికి అవసరమయిన వత్తిడి లేక నిర్బంధం మినహా ఇతర వత్తిడులు, నిర్బంధాలు వారిపై లేవు. ఈ ఉత్పత్తిని స్వతంత్రోత్పత్తి లేక వత్తిడి లేని ఉత్పత్తి అని పిలువవచ్చు.

గతంలో ఫ్యూడలిజంలో[2], నేడు సోవియట్ పాలనలో రైతులు రోజుకు ఇన్ని గంటలు, సీజనుకు లేక సంవత్సరానికి ఇన్ని రోజులు అనివారి స్వంత పొలాల్లో, భూస్వాముల పొలాల్లో ఫ్యూడలిజంలో, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో - సోవియట్‌లో, భూస్వాములకు వారి వారసులకు నాడు, సోవియట్ నేతలకు, కార్మికులకు, పట్టణ ప్రజలకు నేడు అవసరమయ్యే ఉత్పత్తులకై, జైలు శిక్ష భయంతో, పొలాలు లాక్కుంటారనే భయంతో, ఇతర వేధింపులు భయంతో అధికంగా శ్రమిస్తున్నారు. వారి శ్రమతో తక్కిన వర్గాల వారు సుఖ జీవనం చేస్తున్నారు. ఈ విధమయిన ఉత్పత్తినే వత్తిడికి లోనై చేసే వ్యవసాయం లేక వత్తిళ్ళ వ్యవసాయం లేక నిర్బంధపు వ్యవసాయంగా వర్గీకరించారు. రైతులు, సామాన్యంగా, తమ అవసరాలమేరకే తమ పొలాల్లో శ్రమిస్తారు.

గత నాలుగు శతాబ్దాల కాపిటలిష్టు ఆధిక్యతా ప్రపంచంలో రైతులీ వత్తిళ్ళ ఉత్పత్తిని సాగిస్తున్నారు. అడవులు నరుకుతున్నారు. పశుపోషణ చేస్తున్నారు. చేపలు

పడుతున్నారు. ఫ్యూడలిజంలో సోవియట్ సమాజంలో ఈ వత్తిడిపైకి కనిపించదు. రెండవ యుద్ధానంతర ప్రపంచపు ఆధునిక రాజ్యాంగాలు ప్రతి కుటుంబానికి ప్రతి వ్యక్తికీ పూర్తి ఉద్యోగావకాశం, పోషణ, సామాజిక భద్రతలను గుర్తించినయ్. దేశాలమధ్య, విభిన్న ఖండాల మధ్య సామాజిక న్యాయాన్ని అంగీకరించినయ్. వీటి ఫలితంగా ఐక్యరాజ్యసమితి 'మానవ హక్కుల తీర్మాన[3] రచన చేసింది. యుద్ధ విరామసమయంలో ఇంగ్లాండు, జర్మని, ఫ్రాన్సు, స్వీడను దేశాలు శ్రామికుని శ్రమించే హక్కును, జీవించే హక్కును అంగీకరించినవి. వారి విద్యా వికాసాలకవకాశం కల్పించినవి. ఈ హక్కులను ఆదేశాలు నిరుద్యోగులకు, వయో వృద్ధులకు, రోగులకు ఒక భీమా పథకంగా మాత్రమే ఆచరణలో పెట్టినవి. ఈ కోణం నుండి పరిశీలించినా, నాలుగు శతాబ్దాల కాపిటలిజం కానీ, నలభై సంవత్సరాల సోవియటిజం కానీ, ప్రపంచ జనాభాలో అరవై (60%) శాతం కంటే ఎక్కువగా వున్న వ్యవసాయ దారుల - చేతి వృత్తుల వారిపై తమకు గల బాధ్యతను విస్మరించినవి. క్రూరమయిన రాజకీయ నియంతల పాలనలో అమాయకులైన వ్యవసాయ దారుల బలహీనతలను (కాపిటలిజంకు పూర్వం) తమకు అనుకూలంగా మార్చుకొన్నయ్.

వృత్తి స్వాతంత్ర్యాన్నంగీకరిస్తున్న నేటి ప్రపంచం, పశుపోషణ వ్యవసాయం రైతులకు లాభసాటిగా వుంది కనుక చేస్తున్నారు అని నమ్మినట్లు నటిస్తున్నారు. ప్రభుత్వ ప్రొక్యూరుమెంట్లు - కంట్రోళ్ళు వ్యవసాయ ఆర్థికత్వానికి నష్టదాయకమని గొంతెత్తి మేము అరుస్తుంటే, గాంధీవారసులయిన కాంగ్రెసు మంత్రులు వ్యవసాయ ఉత్పత్తుల పరిమాణాలు, అమ్మకాలు ఏకరువు పెట్టి అన్యాయమయిన తప్పుడు వాదనలు చేస్తున్నారు. ఈ తప్పుడు వాదనల వెనుక రైతు ప్రపంచపు ప్రాథమిక సూత్రాల అవగాహనా వైఫల్యం, రైతులపై నిరాదరణ స్ఫుటంగా గోచరిస్తున్నది. 'వ్యవసాయ ఆర్థికత్వం' 'ధనమూల' మయినది కాదు. అది ఒక జీవన విధానం అని అంగీకరిస్తున్నారు. తరతరాలుగా రైతులు, తమకోసం, తమ సంతానం కోసం, తమ కాళ్ళపై నిలబడి తమ పొలాలలోనే ఉద్యోగావ కాశాలు, పోషణ వెతుక్కొంటున్నారు అని ఒప్పుకొంటున్నారు. జనాభా పెరిగి కొత్త పొలాలు (ప్రైవేటు ప్రభుత్వ భూములు) సాగుబడి లోనికి రాక, ప్రత్యామ్నాయ ఉద్యోగావకాశాలు లేక, పెరిగిన గ్రామీణ నిరుద్యోగులకు ప్రభుత్వాలు అవకాశాలు కల్పించక, గ్రామీణ నిరుద్యోగ భారం పెరిగి - అనవసరమయిన శ్రామిక భారాన్ని, తమపై ఆధారపడిన వారిని భరించటం రైతులకు శక్తికి మించిన పనైంది. వారు వ్యవసాయంలోనే శ్రమించాలి - జీవించాలి. వారి జీవనాధారం వారి భూమి మాత్రమే. జనాభా పెరుగుదలతో, ఆ కొద్దిభూమినే అందరూ నమ్ముకొని, లాభసాటి అయిన జీవనోపాధియని నమ్మి, బతకటం

కోసం తమ రెక్కలు ముక్కలు చేసుకొంటున్నారు, వీరి దుస్థితివి కాపిటలిజం పూర్తిగా తన స్వార్థానికుపయోగించుకుంటున్నది. వారి మానసిక బలహీనతలను, స్వాభావిక ప్రపంచ దృక్పధాన్ని ఆసరా చేసుకొని ప్రోత్సాహక ధరలను ఎఱవేసి వారితో ఆడుకొన్నది. చాలా కాలం కాపిటలిష్టు ప్రోత్సాహకాలలోని మర్మం రైతులు గ్రహించలేకపోయారు. ఎగుమతి చేసుకొనే వాణిజ్యోత్పత్తులకు డబ్బు రూపేణా చెల్లింపులు, ఫార్వర్డ్ కంట్రాక్టులు (ముందుగా అమ్మకాల - కొనుగోళ్ళ ఒప్పందాలు) ఆకర్షణీయమయిన అప్పులు, పట్టణ యాంత్రికోత్పత్తులు ఎరవేసి రైతులతో ఆడుకొన్నది. ఈ ప్రోత్సాహకాల వలన, తలసరి ఉత్పత్తి, ప్రతి ఎకరంలో ఉత్పత్తి, మొత్తం ఉత్పత్తి ప్రపంచమంతా ఒక్కసారిగా పెరిగింది. ఆర్థిక మాంద్యం రాకతో కొంతవరకు కాపిటలిజం చేస్తున్నమోసం, ఆధునిక ప్రభుత్వాలు, సంఘం పక్షపాతవైఖరులు రైతుల కళ్ళు తెరిపించినవి. విద్యావంతులయిన నిరుద్యోగులు తూర్పుదేశాల్లో, నిరుద్యోగులయిన శ్రామికులు పాశ్చాత్య దేశాల్లో, ఉద్యోగ ఉపాధులు లేక రోజురోజుకు తరిగిపోతున్న ఆకాస్త పొలాన్నే నమ్ముకొని దిగజారుతున్న ధరలతో పోటీపడి అధికోత్పత్తులు కేవలం తమ 'మనుగడ' (Subsistance) కొరకు చేస్తున్నారు. తమ కార్మిక సోదరులు, వారి యజమానులు, ఫాక్టరీలను మూసి వేస్తూ, ఉత్పత్తులను తగ్గించుకొంటూ, తగ్గిన గిరాకీకి అనుగుణంగా తమ సరఫరాలను తగ్గించు కొంటుంటే, రైతులు మాత్రం ఎందుకు తామీ ఆత్మహత్యా సదృశ్యమయిన విధానాన్నే అంటి పెట్టుకొని వున్నామని ఆశ్చర్యపడుతున్నారు. కార్మికులకు ప్రభుత్వ రంగాలలో ఉద్యోగావకాశాలు కల్పిస్తూ, తమకు, తమ ఉత్పత్తుల అమ్మకాలకు ప్రభుత్వాలు సాయం చేయకపోవటంలోని ఆంతర్యాన్ని అర్థం చేసుకొంటున్నారు. కాపిటలిజం సృష్టించిన ఆర్థికశక్తుల వత్తిడి, గ్రామీణస్వయం పోషక ఆర్థిక విధానం కనుమరుగుకావటంలో వచ్చిన మార్పుల క్రమం, వ్యవసాయాన్ని పరిశ్రమగా అభివృద్ధి పరచటం - ఈ కారణాల అవగాహనతో తాము చేసేది నిజమయిన వత్తిడికిలోనై చేసే వ్యవసాయం (ఉత్పత్తి) అని గుర్తించారు.

వత్తిడి ఉత్పత్తి ప్రాధాన్యత ఇండియాలో కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది. పెరిగిన జనాభా, ఆర్థికాభివృద్ధిలేకపోవటం, ప్రభుత్వాలు, సమాజం, వ్యవసాయదారుని పట్టించు కొనకపోవటం కారణాలుగా, నిరుద్యోగులుగా వుండలేక భూములకు ఎక్కువ ధరచెల్లిస్తూ, తక్కువ కూలి తీసుకుంటూ, ఎక్కువకాలం పొలాలలో శ్రమిస్తున్నారు. సంఘం రైతుల ఉపాధి, సౌఖ్యావహమయిన జీవితాలపై శ్రద్ధ వహించకపోయినా, వీరు మాత్రం అధిక దిగుబడులు సాధిస్తూ, చౌకగా అమ్ముతూ సమాజాన్ని పోషిస్తున్నారు. కేవలం సేద్యం

చేసుకొనటానికి అనుమతినిస్తున్న కారణంగా ప్రజాస్వామ్య రక్షకుల ఆర్థిక చరిత్రలోని వైపరీత్యమిది.

అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, కెనడా, స్వీడను, డెన్మార్కు వంటి సామాజిక బాధ్యతలు గుర్తెరిగిన భాగ్యవంతమయిన దేశాలలో రైతుల పరిస్థితి మన కన్నా చాలా మెరుగ్గావుంది. వ్యవసాయాన్ని కేవలం నాగలికే పరిమితం చేయక బహుముఖీనం చేసి, వ్యవసాయాన్ని, వ్యవసాయ ఉపవృత్తులను రూజ్వెల్టు (U.S.A.) ప్రవేశ పెట్టిన "మద్దతు ధరల[4] విధానం" ప్రోత్సహించింది. దీని అంతరార్థం, వ్యవసాయ దారులకు వత్తిడి నుండి విముక్తి కలిగించి, వారి ఉత్పాదకశక్తిని, బహుముఖంగా విని యోగించికొని, సామాజిక భద్రతా కవచం ద్వారా, స్వాతంత్ర్య పిపాసువులయిన రైతుల శ్రమను క్రమబద్ధీకరించటం.

రైతులు ప్రణాళిక బద్ధంగా ఉత్పత్తులు సాధించటానికి సాయపడటం నాగరిక సమాజపు బాధ్యత. బడుగు బలహీనదేశాలలోని గ్రామాల్లో గ్రామాలనుండి పట్టణాలకు కనీస రహదారి సౌకర్యాలు లేవు. రైల్వేల, కాల్వల రవాణాలు తగినంతగా లేవు. క్రమబద్ధీకరించిన వ్యవసాయ విపణులు లేవు. వ్యవసాయ పరిశోధనలు, వ్యవసాయ పనిముట్ల ఆధునీకరణ, యాంత్రికీకరణలు శైశవదశలో వున్నాయి. 1939 నుండి ఈ ప్రయత్నాలు మొదలయినవి. 1948 నుండి F.A.O. స్ఫూర్తితో నీటి పారుదల, వరద నివారణ చర్యలు, భూసార పరిరక్షణా కార్యక్రమాలు, గ్రామీణ విద్యుదీకరణ, చేతివృత్తుల ఆధునీకరణ, కరవు నివారణ పథకాలు, జాతీయ, అంతర్జాతీయ సంస్థలు, ప్రభుత్వాలు చేపట్టినయ్. సోవియట్ ప్రపంచంలో కాపిటలిష్టుదేశాలకు విరుద్ధంగా జాతీయ ప్రణాళికలను రచించి వత్తిడి ఉత్పత్తులలోనికి రైతులను నెట్టటం క్షమార్హం కాదు. ఇది ప్రణాళికా బద్ధమయిన అమానుషత్వం.

ఈ కారణాల వలన జాతీయ వ్యవసాయ సమృద్ధి, లాభసాటి ధరల విధానాన్ని బలపరుస్తున్న రాజకీయ పార్టీలకు అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సులలో రైతులు మద్దతునిస్తున్నారు.

కీలక సేవల, వత్తిడి ఉత్పత్తుల సూత్రాల ద్వారా ప్రపంచ వ్యవసాయోత్పత్తుల స్థితిగతుల సమీక్షచేద్దాం.

సామాజిక న్యాయం కోరే ఆధునిక విప్లవ రైతాంగం, స్వపరిపాలనగల సహకార వ్యవస్థల నిర్మాణం, నియంత్రణల ద్వారా రైతుల కవసరమయిన 'కీలక సేవలు', ధరల స్థిరీకరణ, మద్దతు ప్రణాళికలు, సాంఘిక భద్రతలు, ఆహార నిల్వలు, భూసారం పెంపుదల, బహుముఖీనమయిన వ్యవసాయాధారితవృత్తులు, పశుపోషణ వగైరాలు తామే చేపట్టి ఈ సూత్రాలనుండి, వాటి పరిణామాల మోసం నుండి, బయట పడటానికి ఉద్యమించాలి. సహకార వ్యవస్థల నిర్మాణ ప్రాధాన్యతను, అవసరాన్ని రైతులు గుర్తించితే వారు తమ భూములలో స్వేచ్ఛావ్యవసాయం సాగించి, అధికోత్పత్తులను సాధించి, ప్రపంచ వ్యవసాయ సహకార వ్యవస్థపై ఆధిపత్యం పొందగలరు. వ్యవసాయదారులు తరతరాలుగా తమ పొలాలు, కుటుంబాలు, తమ పశువులు అధికమయిన దోపిడీకి, శక్తి హీనతలకు, పోషణాలోపాలకు ఎందుకు ఎలా గురైంది, ఈ వత్తిడి ఉత్పత్తి సూత్రం తమ జీవితాల్లో చెలగాటమాడుతున్నదని గ్రహిస్తే, అర్ధం చేసుకోగలరు. అప్పుడు మాత్రమే వారు నిర్మాణాత్మకము, విప్లవాత్మకమూనయిన పురోగతిని త్వరగా సాధించి, తమ వర్గ శత్రువులయిన కాపిటలిష్టు, కమ్యూనిష్టుశక్తులను, ఈ కీలక సేవల సూత్రాలను ఎదుర్కొనే శక్తిని సంపాదించగలరు.

డేనిష్, స్కాండినేవియన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశాల రైతులు, సహకార వ్యవస్థలు, ప్రభుత్వ మార్కెటింగుల ద్వారా ఈ సూత్రాలు పనిచేసే తీరుపై ఆధిపత్యం సంపాదించి దోపిడీ నుండి రక్షణ పొందారు. భారత దేశం కూడా రిజర్వు బాంక్ ఆఫ్ ఇండియా సలహాపాటించి, అధిక సంఖ్యలో గిడ్డంగుల నిర్మాణం, బహుళార్ధ సాధక వ్యవసాయ సహకార సంఘాలలో భాగస్వామ్యం, సహకార వ్యాపార కేంద్రాల నిర్వహణ, ఋణ సంస్థలలో భాగస్వామ్యం కలిగి వున్నట్లయితే ఇండియాలో కూడా సహకార కామన్ వెల్త్ ఆవిష్కరింపబడేది.

**మార్క్సిస్టు, మార్షెలియన్ సరఫరా - గిరాకీ సిద్ధాంతాలను రైతు దృక్పథంతో విశ్లేషణ**

" మార్కెటులో సరుకుల మారకం (Exchange) ఆ సరుకు యొక్క విలువకు సమానంగా గానీ, స్వల్పమయిన తేడాతో గాని వుంటుంది. దీర్ఘకాలికమారకాలలో, వ్యవసాయోత్పత్తులు ఇతర ఉత్పత్తుల ధరలు పూర్తి విలువను పొందటం గానీ లేక కొద్దిపాటి తేడాలతో అసలు విలువపై ఆధారపడటం గానీ జరుగుతుంది. ఇది వ్యవసాయ ఉత్పత్తులు, ధరలు, మార్కెటింగు సంబంధాలపై సాంప్రదాయ మార్కిస్టుల ఆలోచనాసరళి.

"సరుకుల చలామణీ సమానమయిన మారకాలపై ఆధారపడి వుంటుంది. అంటే సమాన విలువలుగల సరుకుల మధ్య మాత్రమే మారకం (Exchange) జరుగుతుంది. కానీ వాస్తవ ప్రపంచంలో ఏ సంఘటనా దాని నిజరూపంలో సంభవించదు." ఇది మార్క్సు మహాశయుని అభిప్రాయం. (Capital. Vol. 1. 46).

"సరుకుల అమ్మకపు ధరలు వాటి నిజమయిన విలువకు భిన్నంగా వుండవచ్చు. కానీ ఈ తేడా సంభవిస్తే అది సరుకుల మారకపు (Exchange) సూత్రాన్ని అతిక్రమించినట్లే." (మార్క్సు). సరుకుల ఉత్పత్తి సాంఘిక సంబంధాలతో వ్యవస్థీకృతమైనది. వివిధోత్పత్తులను ఒక దానితో వేరొక దానిని సమాన మారకం (Exchange) చేయవచ్చును." "విలువ" సిద్ధాంతం గిరాకీ - సరఫరాలు సమానంగా వున్నప్పుడే ప్రతిపాదించవలసి వుంది. గిరాకీకి అనుగుణమయిన సరఫరా వుండాలని గాని, వుంటుందని గాని కాపిటలిష్టు సమాజంలో నిర్ధారించలేము."(LENIN - Quoted by Leontove)

"విలువ కన్నా సరుకు ధర కొంత కాలం ఎక్కువగా, కొంతకాలం తక్కువగా వుండవచ్చు. సరుకుల ధర 'విలువ' అనే గరిమనాభిని కేంద్రంగా చేసుకొని ఊగిసలాడుతుంది. "(Leontove)". 1929లో 1935 మధ్యలో వచ్చిన ఆర్థిక మాంద్యంలో, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ధరలకు సరుకుల విలువలకు మధ్య ఏర్పడిన అగాధాలనే విధంగా అర్థంచేసుకోవాలి? ఈ విలువలు - ధరలు మధ్య ఏర్పడిన అర్థంగాని దీర్ఘకాలపు అంతరాలను కాపిటల్ Vol. 1 నుండి ఉదాహరణలు తీసుకొని సాంప్రదాయ మార్కిస్టు అవగాహనావైఫల్యాన్ని పరిశీలిద్దాం.

'ప్రత్తి విలువను గురించి లోతుగా ఆలోచించనవసరం లేదు. పెట్టుబడి దారు బహిరంగ విపణులలో ముడి సరుకును దాని నిజమయిన విలువకు కొనుగోలు చేశాడు' '(P.180). వ్యవసాయ ఉత్పత్తుల ధరలు, విలువలను గురించి ఈ అగ్రగణ్యమేధావి లోతుగా అధ్యయనం చేసివుంటే, వ్యవసాయ దారులు ఆయన పరిశీలన వలన ముందుగా మేల్కొనేవారు.

కార్మికుల - యజమానుల, ఇతర సాంఘిక శక్తుల మధ్య లావాదేవీలను సులభంగా వ్యక్తీకరించటం కోసం ముందుగనే 'మార్క్సు' ఒక అవగాహనకు వచ్చి - 'శ్రమశక్తి, ఇతర సరుకుల (ప్రస్తుత పరిశీలనలో) అమ్మకం కొనుగోళ్ళు వాటి విలువ వద్దనే జరుగుతున్నవి.' అని వ్రాశాడు. (P. 327) ఈ అవగాహనకు కలిగే ఆటంకాలను,

వాటి నైజాన్ని, శక్తిని, ఆయా సరుకుల యజమానులపై అవి చూపే ప్రభావాన్ని విశ్లేషించటానికి మార్క్సు ప్రయత్నించలేదు.

"చెలామణీలో వున్న సరుకులకు అదనపు విలువ లేదు కనుక ఇవి సమాన విలువలు మధ్య జరిగే మారకాలు (Exchanges) కనుక వ్యవసాయదారులు - వినియోగదారులు - వర్తకుల లావాదేవీలలో వ్యసాయదారులుత్పత్తి చేసే అత్యధికమయిన విలువను వారు పట్టించుకోలేరు.' వర్తకుడు, అమ్మే ఉత్పత్తి దారుని, కొనుగోలు చేసే ఉత్పత్తి దారుని మధ్య పరాన్నజీవిగా చొచ్చుకొని పోయి వీరిద్దరినీ అధిగమించాడు'. (Capital Vo. 1. P. 150) అని చెప్పి ఆ విషయాన్ని అంతటితో వదలివేశాడు.

"తన పెట్టుబడిని వృద్ధిచేసుకొనటానికి కాపిటలిజంకు తెలిసినది ఒకే ఒక మార్గం. ఈ మార్గం, కర్మాగారాల్లో, గనుల్లో, వ్యవసాయ వ్యాపకాల్లో జరిగే ఉత్పత్తులలో దాగివుంది." (Leontove) వీరు కాపిటలిజం అధిక లాభాలను గుంజుకొంటున్నదా లేక రైతుల అదనపు విలువ నిల్వలను సొంతం స్వంతం చేసుకొంటున్నదా? అనే విషయ పరిశీలన చేయలేదు.

మార్కెట్టు లావాదేవీలలో యజమానులచే పీడించ బడుతున్న కార్మికుల నిస్సహాయస్థితిని అర్థం చేసుకోగలిగిన శాస్త్రవేత్తలు ఇతర బలహీన వర్గాలను కాపిటలిస్టులు చేసే మోసం గ్రహించలేకపోయారని అనుకోగలమా?

"కాపిటలిస్టు ఉత్పత్తి ఒక పరిపక్వ దశను చేరినప్పుడు, కార్మికుడొక్కనిగా తన శ్రమశక్తిని అమ్ముకోవలసి వస్తే, పెట్టుబడి ప్రాబల్యాన్ని ప్రతిఘటించలేడు". రైతుకు - కార్మికునకు వున్న ఈ సామ్యాన్ని, రైతులకు - వర్తకులకు - ప్రపంచ విపణులకు గల సంబంధాలను మార్క్సు నిర్లక్ష్యం చేశాడు.

'కార్మికుడు తన శ్రమశక్తికి యజమానిగా మార్కెట్టుకు ఇతర సరుకుల యజమానుల లాగానే వెళ్తాడు. బేరం ముగిసేటప్పటికి తన రక్తాన్ని పీలుస్తున్న జీవి, తన నరాలను, మాంసాన్ని, ఎముకలను, వీటిలోని మూలిగను కూడా పీల్చి దోపిడీ చేస్తున్నదని తెలుసుకుంటాడు'. ప్రపంచ విపణులలో రైతు - వర్తకుల మధ్య లావాదేవీలకు ఈ పోలిక చక్కగా అన్వయిస్తుంది. రైతు తన ఉత్పత్తులకు స్వతంత్ర ప్రతినిధి. తన సరుకుకు హక్కుదారుడు. మార్కెట్టులో వర్తకుని కొనుగోలు శక్తితో, ధనబలంతో అతను తలపడవలసి వస్తుంది. తన సరుకు విలువను వర్తకుని ధనంతో మారకం (Exchange)

లో భాగస్వామి అవుతాడు. చెమటోడ్చి, రక్తంచిందించి, సంపాదించిన తన సర్వస్వాన్ని పోగొట్టుకొని వ్యాపారస్తుని నుండి ధనరూపేణా కొంత మొత్తం మాత్రం పొంద గలుగుతాడు.

'ఇతర ఉత్పత్తులు, సరుకుల వలెగాక శ్రమశక్తిధర, శ్రమవిలువకన్నా తక్కువ' అని లియన్‌తోవ్ గుర్తించాడు. రైతుల పరిస్థితి కూడా ఇదే విధంగా వున్నదని గుర్తించలేదు.

'వ్యవసాయోత్పత్తి దారులు కూడా పెట్టుబడి దారులని, రైతులు పెట్టుబడి వర్గాలలో క్రిందమెట్టుపై వున్నారనే లెనిన్ అభిప్రాయం రైతుల నిరాదరణకు కారణం కావచ్చు(Leontove P. 204). వాణిజ్య పెట్టుబడి, సన్నకారు స్వతంత్ర ఉత్పత్తి దారులను, తమ స్వగృహాల్లో పనిచేసుకొనే కూలీలుగా మారుస్తుంది అనే నిజాన్ని లియన్‌తోవ్ గుర్తించాడు. కానీ పెట్టుబడిదారీ వ్యవస్థాపకులకు, (Enterprenuers) వ్యవసాయదారులకు గలతేడాను గమనించలేకపోయాడు. పారిశ్రామిక వేత్త తన అదనపు విలువలో స్వల్ప భాగాన్ని, వ్యాపారస్తునికి, అతని సేవలకు ప్రతిఫలంగా ఇస్తాడు. రైతు తను తన కుటుంబం ఉత్పత్తి చేసిన అదనపు విలువనేగాక తన వ్యవసాయక ప్రతిఫలం అంటే తన పోషణ (Maintainance) లో భాగాన్ని కూడా వదులుకోవలసిన వాడౌతున్నాడు. వ్యవస్థాపకులు - రైతులు విభిన్న నైజాలకు చెందినవారు. వ్యవస్థాపకులు పెట్టుబడి దారీ వర్గంలో భాగస్వాములు. వ్యవసాయ దారులు పెట్టుబడి వర్గానికి శత్రువులు. వారిచే పీడింపబడేవారు. ఇరువురు తమ ఉత్పత్తి సాధనాలకు యజమానులే. ఇద్దరూ ఉత్పత్తిదారులే. ఇద్దరూ అదనపు శ్రమ - అదనపు విలువను తమ శ్రామికులనుండి పోగుచేసేవారే. అయితే మొదటి వర్గం (పారిశ్రామిక వర్గం) ఇతర శ్రామికులను వినియోగించుకుంటారు. రెండవ వర్గం (రైతులు) తాము, తమ కుటుంబ సభ్యులు కొద్దిమంది కూలీలతో కొన్ని ఉత్పత్తులు సాధిస్తారు. పారిశ్రామికవేత్త కనుసన్నలలో పెట్టుబడి వుంటుంది. అతడు వర్తకులను, వ్యాపారులను, విపణులను శాసించగలడు. ఏ మార్చగలడు. రైతులు బీదవారు. వారు వడ్డీవ్యాపారుల, బాంకుల, మార్కెట్ల దయాదాక్షిణ్యాలకు బానిసలు. పారిశ్రామికవేత్త తన లాభాల శాతం కన్నా తక్కువ శాతం వడ్డీగా చెల్లిస్తాడు. రైతు చక్రవడ్డీలు కడ్తాడు. పారిశ్రామికవేత్తలు సంఘటిత శక్తిగా రూపొంది, ఆధునిక సమాజంలో రాజకీయవ్యవస్థను తమ చెప్పుచేతలలో వుంచు కొంటున్నారు. అసంఘటిత రైతాంగం నిస్సహాయులు అధికార హీనులు. 'ఉత్పత్తిదారుడు అస్వతంత్రుడైనప్పుడు మాత్రమే అతని అదనపు విలువ దోపిడీ చేయబడుతుంది.' అనే తొందరపాటు నిర్ణయానికి మార్క్సు వచ్చాడు.

మార్క్సు అవగాహన (పైన చెప్పినది) అతని సహచరుడయిన ఏంగెల్సు అవగాహన కన్నా స్వల్పంగా సంకుచితమయినది. 'ఏంగెల్సు రాజకీయ ఆర్థికత్వం దాని విస్తృత పరిధిలో - ఉత్పత్తి - మానవ సమాజ మనుగడల భౌతిక అవసరాల మధ్య జరిగే Exchange (మారకం)ను పాలించే సూత్రాల శాస్త్రంగా భావించాడు. ఉత్పత్తి నిర్దేశాల పంపిణీ పరిణామమే వినియోగాల పంపిణీ అని మార్క్సు భావించాడు.

"ఒక నిర్ణీత చారిత్రక సమాజం పుట్టుక, పెరుగుదల, వినాశనాలను ఉత్పత్తి సంబంధాలుగా మార్క్సు బోధించాడు. మార్క్సు బోధనలను లెనిన్ సమాజపరమయిన ఉత్పత్తి సంబంధాలుగా అర్థం చేసుకొని అధ్యయనం చేశాడు. వ్యవసాయోత్పత్తులను సంఘపరం చేసినపుడు ఏం జరుగుతుందీ, సంపద పంపిణీ యంత్రాంగమేమిటి అనే విషయాల అధ్యయనాన్ని మార్క్సు నిర్లక్ష్యం చేశాడు. మార్క్సు ముడి సరుకుల ప్రాసెసింగు (ముడి సరుకు వినియోగ వస్తువుగా మార్చే వివిధ దశలు) సమాజ ఆర్థిక జీవితంలోనికి ప్రవేశించినప్పటి నుండి జరిగే పరిణామాలను అధ్యయనం చేశాడు. (అంటే Finished Products - వినియోగ వస్తువులు సమాజంలోకి ప్రవేశించినప్పటినుండి) ముడి సరుకుల ఉత్పత్తిలో, ఉత్పత్తి తరువాత ప్రభావం చూపే ఆర్థిక శక్తులను పరిశీలించలేదు'. (Mr. షిమనోకా).

లెనిన్ ఉత్పత్తి పంపిణీ సంబంధాల ప్రాముఖ్యతను అవగాహన చేసుకొన్నాడు. వర్గాలనగా అధిక సంఖ్యలో వున్న వ్యక్తులు, వారి సాంఘిక ఉత్పత్తి వ్యవస్థల, ఉత్పత్తి కారకాల సంబంధాల వలన, సామాజిక శ్రమలో వారి పాత్ర వలన వీరు భిన్నంగా వుంటారు. ఈ పరిణామంగా వారు వారి వాటా సామాజిక సంపదను పొందుతారు.' (Lenin - Quoted by Leontoev - Political Economy P 9 - 18)

ధరలు తగ్గినయ్. సరఫరా మరీ తగ్గింది. అందువలన కొంత డిమాండు పెరిగింది. ఈ పెరిగిన డిమాండు వలన సరఫరాలకు కొంత గిట్టుబాటు కలుగుతుంది. ఈ గిట్టుబాటు ధర వచ్చే వరకు పట్టే కాలవ్యవధిని (కాలవిలంబం - Time lag) సాంప్రదాయ మార్క్సిస్టులు పరిశీలించలేదు.

డిమాండు పెరిగేలోగా ఏ ఆర్థిక మాంద్యమో రావచ్చు. ఈ కాల వ్యవధి చాలా ఎక్కువగా గానీ - చాలా తక్కువగా గానీ వుండవచ్చు. ఈ లోగా చాలా సంపద ఉత్పత్తిదారులనుండి - వినియోగదారులకు - లేక వినియోగదారులనుండి ఉత్పత్తి దారులకు బదిలీ కావచ్చును. సమాజాన్ని అతలాకుతలం చేసే ఈ విపరీత పరిస్థితులు

- ఈ పరిస్థితులలో ఏం జరుగుతుందో పరిశీలించకుండా 'కాలగతిలో డిమాండు - సప్లైలు ఒక దానితో ఒకటి సర్దుబాటు జరిగి సమతూకంలో వుంటాయి' అని చెప్పి తృప్తి పడే శాస్త్రం తన ప్రాధమిక పరిశోధనలోనే వైఫల్యం చెందిందిగా మనం గుర్తించాలి.

వ్యవసాయోత్పత్తుల డిమాండు షెడ్యూలు (Demand Schedule) పడిపోయి నప్పుడల్లా - (తగ్గిన ధరల కనుగుణంగా సప్లై తగ్గితేనే మరల డిమాండు పెరుగుతుంది.) మారిన పరిస్థితులకు అనుగుణమయిన సర్దుబాటు జరగటానికి కొంత వ్యవధి పడు తుంది. ఈ కాలవిలంబం సంవత్సరానికి పైగా వుంటుంది. దీనికి కారణం — వ్యవ సాయోత్పత్తుల సరఫరా యొక్క వ్యాకోచత్వం (Elasticity) చాలా స్వల్పం. వ్యవసాయ ఉత్పత్తుల తరుగుదలల - పెరుగుదలల నియంత్రణ అవ్యాకోచం (Inelastic). వ్యవసాయదారుని స్తోమత (Staying Capacity) చాలా స్వల్పం. వ్యవసాయ ఉత్పత్తుల, ఉత్పాదితాల డిమాండు యొక్క వ్యాకోచత్వం చాలా ఎక్కువ. ప్రతి ఆర్థిక మాంద్యం ఇతర వర్గాల వారికన్నా రైతుల పైనే ఎక్కువ ప్రభావం చూపుతుంది.

సాధారణ పంటల ఉత్పత్తులు తగ్గినపుడు వచ్చే పరిణామాలను సూక్ష్మంగా పరిశీలిద్దాం. సరుకుల సరఫరాదారులు (వ్యవసాయదారులు) తమ సరఫరాలను తగ్గించ గలగటం చాలా కారణాలపై ఆధారపడి వుంటుంది. సరఫరాలను తగ్గించే శక్తి రైతులకు - పెద్ద వ్యవసాయదారులు, భూస్వాములు, యాంత్రికోత్పత్తిదారుల కన్నా చాలా స్వల్పం. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు ప్రపంచానికి కావలసిన గోధుమల నిల్వలు రెండు సంవత్సరాలకు సరిపడావున్నయ్. పండించటం రైతులు మానుకొన్నా, వర్తకుల, వ్యాపారుల చేతులలో వున్న ఈ నిల్వలు, ధరలు పెరగటానికి రైతులు చేపట్టే ప్రయత్నాలను విఫలం చేస్తాయి. కేవలం తమ మనుగడకై చేసే ఉత్పత్తులను తగ్గించుకోగలగటం కానీ, ఆపి వేయటం గానీ సాధ్యంకాదు. టాక్సులు, కవుళ్ళు, వడ్డీలు, ఎరువుల, వ్యవసాయ పనిముట్ల కొనుగోళ్ళు, విత్తనాల కొనుగోళ్ళు, బట్టలు, కిరసనాయిలు, అగ్గిపెట్టెలు వగైరా కొనుగోలు అవసరాలకై ఈ ఉత్పత్తి చేపట్టవలసి వుంటుంది.

ప్రస్తుతం సాధారణ పంటలు (Staple Crops) పండిస్తున్న చాలా భూమి ఇతరపంటలకు పనికిరాదు. అందువలన ఈ భూమి నుండి వచ్చే ఉత్పత్తులు ధరలతో నిమిత్తం లేకుండా మార్కెట్లలోనికి ప్రవహిస్తూనే వుంటయ్. కేవలం మనుగడ కోసం (తమ అవసరాల కోసం) రైతులు చేసే ఉత్పత్తులు మొత్తం ఉత్పత్తులకు జమపడి ధరల తగ్గుదలకు కారణమవుతున్నవి. అధిక భాగం రైతులు తమకు, తమపై ఆధారపడిన

వారికి, వ్యవసాయ కూలీలకు, తమ పశువులకు పని కల్పించుకోవటం కొరకు అతి స్వల్పమయిన లాభాలాశించి ఉత్పత్తులు సాగించవలసిందే. వారి పనికల్పనకు ప్రభుత్వం చేయూత నీయకపోవటం, వేరేమార్గాలు లేకపోవటం ముఖ్య కారణాలు. ఇంగ్లాండులో కొంత ఉద్యోగభద్రత, నిరుద్యోగ భృతులు కల్పించినా అవి వ్యవసాయదారులకు కాదు. వ్యవసాయకూలీలకే. చాలారకం పంటలు బహువార్షికాలు, చెరకు, పండ్లతోటల వంటివి. ఈ పంటల ఉత్పత్తి క్షణాల్లో ఆపలేము. అలానే పశుసంపద. వాతావరణం భూమి, వర్షపాతం, విత్తనాల ధరలు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, నీటి వసతి, సీజను వారీ పైర్లకు అవసరమయ్యే పని విధానం, పెట్టుబడులు వీటన్నిటి ప్రభావం వలన పంటమార్పిడులు వెంట వెంటనే చేయటం సులువుకాదు. ప్రపంచ మార్కెట్ల అవగాహనా లోపం వలన, వ్యవసాయదారులు విత్తటం, నాట్లు వేయటం వంటి సేద్యపు పనులను, క్రమబద్ధీకరించి లేక తగ్గించి ఉత్పత్తుల సరఫరాను ధరల స్థాయికి అనుగుణంగా వుంచ లేక పోతున్నారు.

## కొన్ని ఉత్పత్తుల మార్కెటింగు

బీఫ్ (ఎద్దుమాంసం) మటన్ (వేటమాంసం) పాల ఉత్పత్తుల ధరలు పూర్తిగా పతనమయినవి. కానీ పశుపోషణకు అవసరమయిన పచ్చిక బీళ్ళను వెంటనే సేద్యపు భూములుగా మార్చలేము. ఎక్కువ పెట్టుబడి వుంటే, కనీసం రెండు సంవత్సరాలు పడుతుంది. పచ్చిక బీళ్ళను పంటపొలాలుగా మార్చటానికి యుద్ధ సమయంలో ఇంగ్లాండు ప్రభుత్వం అధిక ధన సహాయం చేసింది. వ్యవసాయదారులు ఆశాజీవులు. ధరలు తగ్గి పంటల మార్పిడి ఆవశ్యకతను గుర్తించినప్పటికీ, వారి భూములు పంటల మార్పిడికి అనుకూలమయినప్పటికీ చేయగలిగిన సత్తా వున్నా, నాలుగు సంవత్సరాలు వారు వేచి చూశారు. బాంకులు తగిన ఋణ సహాయం అందించటానికి ముందుకు రాలేదు. ధాన్యం, జూటు, ప్రధానంగా మాగాణి సేద్యమయితే మార్పిడి సాధ్యంకాదు. ఇవి నీటి పారుదలతో గాని, పల్లపు భూముల్లోగాని, అధిక వర్షపాతం వున్నచోటగానీ వేసే పంటలు. భూసార పరిరక్షణ కొరకు, చీడపీడలనరికట్టటం కొరకు పంటలు మార్చి మార్చి వేయటం జరుగుతుంది. ధరలు లేని పంటలకు ప్రత్యామ్నాయంగా, జాతీయస్థాయిలో మొత్తం

ఉత్పత్తులను విస్తృతంగా తగ్గించటం సాధ్యకాదు. 1932-36లో బర్మా, మలయా, సియామ్, ఇండోనేషియా, ఇండియా, చైనాలలో బియ్యం ఉత్పత్తులను - గిరాకీ కనుగుణంగా తగ్గించలేక పోవటం ఇందుకు చక్కని ఉదాహరణ. ఇండియాలో ప్రత్తి, వేరుశనగ రైతులు ఇదే విధంగా బాధపడ్డారు. అదే సమయంలో వచ్చిన యుద్ధం వలన కాంటినెంటల్, జపాను మార్కెట్లలలో వారి అమ్మకాలు నిలిచిపోయినవి. ఉత్పత్తుల సరఫరాను అడ్డుకోవటం సాధ్యపడలేదు. స్థానిక వినియోగం పెరుగలేదు. మరల గిరాకి రావటానికి మూడు సంవత్సరాలు పట్టింది. బియ్యం, జూటు, చెరకు, ప్రత్తి, నూనె గింజలు, కొబ్బరికాయలు, కొబ్బరి, అరటి సంవత్సరాల పర్యంతం ధరలు లేకపోయినప్పటికీ పండించవలసి వచ్చింది. ఈ ధరల పతనానికి రైతులు మరింతగా ప్రత్తి సాగును పెంచటం ద్వారా స్పందించారు. 1933లో 60 శాతం అధికంగా ప్రత్తి పండించారు. ఈ సేద్యం వారికి భారీ నష్టం కలుగజేసింది. ప్రత్తి పంటకొన్ని విలక్షణాలతో కూడు కొన్నది. ధరల హెచ్చు, తగ్గుదలల నుండి రక్షించుకొనటానికి, భిన్న మార్గాల వ్యవసాయ ఆర్థికత్వాన్ని ఆశ్రయించటానికి ఈ పంట వీలు కలిగించదు. అమెరికాలో ఎక్కడెక్కయితే ప్రత్తి ప్రధాన పంటగా వుందో అక్కడ అది ఒక్కటే పంటగా మిగిలింది. గోధుమలు, ఓట్సు, మొక్కజొన్నలను ఋతువులకు డిమాండుకు అనుగుణంగా మార్చుకోవచ్చును. ప్రత్తికి ఆ సౌలభ్యం లేదు. సంవత్సరం పొడుగునా శ్రమించాలి. ఇతర పంటలపై ధ్యాస పెట్టటానికి వీలుకలుగదు. 'ధరలు పతనమయితే, ఉత్పత్తులునిలుపుదల చేస్తే, అదనపు ఖర్చులు ఆదా అవటం వలన రైతులు లాభిస్తారు.' అని మార్షెలియన్ శాస్త్రవేత్తలు భావించారు. చాలా సందర్భాలలో ఈ ఊహ సమంజసం కాదు. అదనపు ఖర్చులు (Marginal Costs) వ్యవసాయోత్పత్తుల ధరలను నిర్ణయించవు. బీదపొలాల్లో (Marginal Lands) సేద్యం చేసే రైతులు కూడా U.S.A. ఈశాన్య రాష్ట్రాలలో తమ వ్యవసాయాన్ని మానలేకపోయారు. పెట్టిన పెట్టుబడులను తిరిగిరాబట్టు కొనటానికి, లేక పూర్తిగా వదులుకొనటానికి, వేరే భూములను సంపాదించుకొనటానికి, లేక వేరే వృత్తులనాశ్రయించటానికి చాలా కాలం పడుతుంది.

వ్యవసాయ భూములు సారవంతమయినచోట వ్యవసాయ దారుల స్థితిగతులు బాగా వున్న ప్రదేశాల్లో ధరలు గిట్టుబాటుకానప్పుడు గిట్టుబాటుగాని పంటల విస్తీర్ణం తగ్గించటం లేక మానుకోవటం చేస్తారు. బీదపొలాల కన్నా సారవంతమయిన భూముల ఉత్పత్తులు తగ్గుతవి. ఈ భూములలో ఉత్పత్తి ఖర్చులు తక్కువగా వుంటయ్. అందువలన అదనపు ఖర్చులు (Marginal Costs) వ్యవసాయ ఖర్చులు ఏవిధంగానూ

మార్పు చెందవు. కానీ ఆ పంట సగటు ఉత్పత్తి మొత్తంగా తగ్గుతుంది. సగటు ఉత్పత్తి ఖర్చులలో వ్యత్యాసం లేకపోయినా, నిలకడగా వున్నా మొత్తం అదనపు ఉత్పత్తి తీవ్రంగా దెబ్బతింటుంది.

'లాభదాయకంగాని పరిశ్రమలను మూసివేసినంత తేలికగా లాభదాయకం కాని వ్యవసాయాన్ని మానివేయలేము.'(I. Lorepot) 'ధరలు పతనమయినవి, ఉత్పత్తులు తగ్గలేదు. పరిశ్రమలలోవలెకాక నష్టాలు వస్తున్నా, వ్యవసాయ ఉత్పత్తుల స్థాయి తగ్గలేదు.' (P. 252).

వాణిజ్య పంటలయిన పొగాకు చెరుకు మిరియాలు సుగంధ ద్రవ్యాలు తమల పాకులు వంటి గిరాకీ సరుకులు ఇతర పంటలకంటే ఎక్కువ లాభాలార్జించుతయ్. రైతు అజమాయిషీ శ్రమ, అనునిత్యం వీటిపై వుంటుంది. వీటి ధరలు తగ్గినా, లాభసాటిగా లేక పోయినప్పటికీ ఇతర పంటల ధరల కన్నా తగ్గుదల వుండేవరకు రైతులీ పంటలనే పండిస్తుంటారు. 'సప్లై షెడ్యూలు అవ్యాకోచత్వం, డిమాండు షెడ్యూలు అత్యంత వ్యాకోచత్వం కలిగి వుండం వలన - రైతులు సరుకుల గిరాకీ (Demand) పై ఆధారపడ వలసి వస్తున్నది. స్వల్పకాలిక పరిస్థితులలో ఈ స్థితి ఎక్కువగా వుంటుంది.

'వ్యాపార వాణిజ్యాలలో హఠాత్పరిణామాలెన్ని వచ్చినా మొత్తం వ్యవసాయ ఉత్పత్తులలో, పరిమాణంలో గణనీయమయిన మార్పులు లేవు. (League of Nations Survey).

సరఫరాల అవ్యాకోచత్వం - డిమాండు యొక్క వ్యాకోచత్వం ప్రభావం వినియోగ దారులపై ఎలా వుంటుందో పరిశీలిద్దాం. ధరలు ఎక్కువగా వున్నప్పుడు వినియోగదారుడు బియ్యం, గోధుమలకు బదులుగా రాగి, జొన్న, మొక్కజొన్న, బీఫ్‌కు మారుగా మాంసాన్ని లేక పోర్కును (పందిమాంసం) పాలకు బదులు పెరుగు - మజ్జిగను, బ్రెడ్ నుండి బియ్యానికి, పంచదార నుండి బెల్లానికి - ఖరీదయిన పండ్లకు బదులు స్వల్పధరకు లభ్యమయ్యే పండ్లకు తన అవసరాలను మార్చుకోగలడు. వినియోగదారుని అవసరాలను వ్యాపారస్తుడు నియంత్రించగలడు. ప్రచారం ద్వారా, ధరలలో కనుపించని మార్పులు చేయటం ద్వారా, విదేశీ దిగుమతుల ద్వారా, వినియోగదారులకు అసౌకర్యం కలగకుండా చూస్తాడు. ఉత్పత్తులు, లేక సరఫరాలు తగ్గినప్పటికీ ఈ కారణాల వలన రైతులు లబ్ధిపొందలేక పోతున్నారు.

ఏ దేశమయినా తన ఉత్పత్తులపైనే ఆధారపడినప్పుడు ఆదేశంలోని ధాన్యం సరఫరా నూర్పిడులకే పరిమితం అవుతుంది. మిగతా సంవత్సరం పొడుగునా గిరాకీ ఎక్కువగా వుంటుంది. ప్రస్తుతం ధాన్యం పప్పుదినుసులు వివిధ దేశాలలో వివిధ సీజన్లలో పండుతున్నవి. అందువలన అంతర్జాతీయ ధాన్యవ్యాపారం ధరలను స్థిరీకరించ గలుగుతున్నది. వ్యవసాయదారులు, కార్మికులు కొనుగోలు చేసే యాంత్రిక ఉత్పత్తుల ధరలు నిలకడగా వుండవు. ప్రభుత్వాలు, బాంకులు, వ్యాపారులు అందరూ వీటి ధరలను వ్యవసాయోత్పత్తుల ధరలకన్నా హెచ్చుగా వుంచటానికి కుట్రపన్నుతున్నారని అనుకోవలసి వస్తుంది.

పై కారణాల వలన వినియోగదారులు పూర్తి లాభం పొందుతున్నారని అనుకోవటం సరికాదు. వారి అవసరాలు, గిరాకీలలో పూర్తి వ్యాకోచత్వం లేదు. (తన ఇష్టానుసారం కొనుగోలు చేయలేడు.) వ్యాపారస్తుల మాయాజాలం దీనికి కారణం. వారి వినియోగ అవసరాలను మార్చుకోవటంలో వారు చాలా మందకొడిగా వుంటారు. ధరలు ఆకాశాన్నంటినప్పుడే వారు తమ వినియోగావసరాలను మార్చుకొంటారు. ఇందువలన మార్కెట్లో అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుంది. ఒకవైపు వ్యవసాయ ఉత్పత్తులకు ధరలు వుండవు. ధరల బరువుకు వినియోగదారులు క్రుంగిపోతుంటారు. మధ్య దళారీలు, గ్రామీణ వ్యాపారస్తులనుండి పట్టణ వ్యాపారుల వరకు - చిల్లర వ్యాపారి నుండి, టోకు వ్యాపారి వరకు లాభాలు పండించుకొంటారు. అవినీతి అధికారుల సంపాదన పెరుగుతుంది.

# యుద్ధ ప్రభావం - ఆర్థిక సంక్షోభం

(Impact of Wars - Economic Crisis)

యుద్ధకాలం, ఆ తర్వాతపన్నెండు సంవత్సరాలు, అమ్మకపు దారుల మార్కెటు నడిచింది. ఈ శతాబ్దంలో ఇది ఏకైక సంఘటన. అమ్మకపుదారులకీ అవకాశం ఆర్థిక శాస్త్రసూత్రాల వలన గాక, యుద్ధకాలపు రాజకీయ మతలబుల వలన సాధ్యపడింది. అమెరికా, ఆసియా దేశాలలో వ్యాపార సరుకులకు మంచి అవకాశాలు లభించినయ్. ప్రభుత్వాల పక్షపాత వైఖరి వలన మాన్యుఫాక్చరర్ల లాభాలతో పోలిస్తే, వ్యవసాయ దారులకు ఈ సమయంలో కూడా 50 శాతం మించి లాభాల వాటా రాలేదు.

కొన్ని దేశాలు యుద్ధానంతరం ధరల స్థిరీకరణకు ముందుగానే వ్యవసాయో త్పత్తులను దిగుమతి చేసుకొన్నయ్. వ్యవసాయ ఉత్పత్తుల అదనపు ప్రొక్యూర్‌మెంటు విధానాలతో ప్రభుత్వాలు రైతులను దెబ్బతీసినయ్. చిన్న పరిశ్రమల ఉత్పత్తులకు రక్షణలు కల్పించి వారికి లాభాలనార్జించి పెట్టినయ్. కంట్రోళ్లు, ప్రొక్యూరుమెంటులపై రైతులు తెలియచేసిన నిరసనలు పట్టణవాసులకు కంటగింపైనవి. ప్రజాస్వామ్య ప్రబోధాల ముసుగులో కాపిటలిజం ఎంత క్రూరంగా, అన్యాయంగా, నిరంకుశంగా వ్యవహరిస్తుందో, కమ్యూనిష్టులు రైతులను అణచివేయటానికి ఎంత ఆత్రంగా వున్నారో రైతులు అవగాహన చేసుకొన్నారు.

దీర్ఘకాలంలో అంటే అయిదు నుండి ఏడు సంవత్సరాల వరకు కూడా రైతుల స్థితిగతులు మెరుగు పడలేదు. ఉత్పత్తుల తగ్గుదల వలన ధరల పెరుగుదల కనిపించినా ఈ కాలంలో పారిశ్రామిక ఉత్పత్తుల సరఫరా డిమాండ్లతో పోలిస్తే, ఈ ధరల పెరుగుదల అతి స్వల్పంగా వున్నది. వ్యవసాయ ఉత్పత్తుల నియంత్రణ సక్రమంగా లేకపోవటం

వలన, ఉత్పత్తుల డిమాండు షెడ్యూలు ఎప్పుడూ తక్కువగానే వుంటుంది. సరఫరాల కనీస ఖర్చులు కూడా గిట్టుబాటు కావు. మార్జినల్ రైతులు, చిన్నరైతుల కన్నా పెద్ద రైతులు, భూస్వాములు, మెరుగయిన వ్యవసాయ పద్ధతుల ద్వారా, తమ మేలురకం భూముల ద్వారా ఎక్కువ ఉత్పత్తి సాధించగలరు. పెద్దరైతులు సరఫరాపై ఆధిపత్యం సంపాదించి, తద్వారా ధరలను నిర్ణయించగలుగుతున్నారు. చిన్న తరగతి రైతులకీ అవకాశం లేదు.

మార్కెట్లలో అన్ని సరుకుల ధరల పెరుగుదలలో భాగంగా వ్యవసాయ ఉత్పత్తులు ధరల పెరుగుదల వస్తే అది చాలా ఆలస్యంగా వస్తుంది. పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు వెంటనే పెరుగుతయ్. ఈ పెరుగుదల ఒక సీజను కన్నా ఎక్కువ కాలం వుంటే రైతులకు కొంత లాభం చేతికందుతుంది. అటువంటి పరిస్థితులలో కూడా రైతులు, పారిశ్రామిక, వాణిజ్య వర్గాల వారికన్నా ఎక్కువ వెనుకబడి వున్నారు. 1922 లో పై కారణాల వలన U.S.A. లో చాలా బాంకులు, వ్యవసాయదారులు, దివాలా తీసారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ధరల పెరుగుదల వున్నప్పటికీ, ఆ పెరుగుదల పారిశ్రామిక ఉత్పత్తులతో 1:2 లేక 1:3 నిష్పత్తులలో వుండటం వలన వ్యవసాయం నష్టపోయింది.

పారిశ్రామిక వర్గాలు ఐక్యతా, అవగాహనల వలన వారి ఉత్పత్తులు తగ్గించుకొని ధరలు దిగజారకుండా రక్షించుకోగలరు. రైతుల అనైక్యత, మార్కెట్లపై అవగాహనాలోపం వలన తమ ఉత్పత్తులను నియంత్రించలేరు. ఉత్పత్తుల పెరుగుదల ధరల తగ్గుదలకు కారణమౌతుంది. అందువలన వ్యవసాయధరలు ఎక్కువ కాలం తగ్గుముఖంగానే వుంటయ్. పెరుగుదల స్వల్పకాలికం.

వాస్తవానికి రైతులు ఉత్పత్తులు పెంచటానికై చేసే కృషి, పారిశ్రామిక వాణిజ్య వర్గాల దోపిడికి అనుకూలంగా వుండి ధరల, రైతుల పతనానికి కారణమౌతున్నది.

ఈ వినాశకర విధానం నేటికీ కొనసాగుతునే వుంది. భూస్వాములు, సాధారణ రైతాంగం, ఈ విపరీత దీర్ఘకాలిక ఆర్థిక మాంద్యం వలన నష్టాలపాలై కేవలం మనుగడ మాత్రమే సాగిస్తున్నారు. అరక్షిత రైతాంగాన్ని నిరాటంకపు దోపిడీ చేస్తూ పారిశ్రామిక వర్గాలు, వాణిజ్య వర్గాలు ఎంతో శక్తి వంతంగా ఎదగ గలిగినవి.

గవర్నమెంటు ఆఫ్ ఇండియా 1936-37, మద్రాసు ప్రభుత్వము తరపున నేను (N.G. రంగా 1928-30) ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీ మరియు ఇండియన్

కౌన్సిల్ ఫర్ అగ్రికల్చరల్ రీసర్చ్ 1927-37లలో వ్యవసాయ వ్యయాలపై చేసిన పరిశోధనలో, దేశంలోని మొత్తం ప్రత్తిపై ఆధిపత్యం కలిగిన ప్రత్తి డిమాండు షెడ్యూలు, కనీస సరఫరా షెడ్యూలు కంటే స్వల్పంగా ఎక్కువగా వుంది. రైతుల వడ్డీలు, టాక్సులు, కవుళ్ళు, ఎరువుల ధరలు వ్యవసాయ పనిముట్లు, ఎరువుల కొనుగోళ్ళు, వీటన్నిటినీ పరిగణనలోనికి తీసుకొని కనీస సరఫరా షెడ్యూలును కలిపి హెచ్చవేస్తే ప్రత్తిధర రైతుకు గిట్టుబాటుగా లేదు. అంటే డిమాండు షెడ్యూలు అధికంగా వున్నప్పటికీ పై కారణాల వలన ధర గిట్టుబాటుకాలేదు. 'బియ్యం, గోధుమలు, రాగి, బార్లీ రైతుల స్థితి మరీ దయనీయంగా వుండి, వారి బిడ్డలకు చాలినంత ఆహారం, వంటికి చాలినంత బట్ట లేకుండా వున్నారు. కనుక వెనుకటి తరం శాస్త్రవేత్తలు చెప్పిన 'విలువల' సూత్రం వ్యవసాయానికి అన్వయించదు. డిమాండు దూకుడు ఉత్పత్తిని నియంత్రిస్తుంది. వ్యవసాయ శ్రామికుల జీతాలు, రైతు తిండి, బట్ట, పోషణ, వ్యవసాయ సామర్ధ్యం సంస్కృతీ వికాసాలు - అన్నీ డిమాండుతో ముడిబడి వున్నాయి. అణచివేతకు గురి అయి వికలమయిన వ్యవసాయం రైతులపై రుద్దబడింది. కొనసాగించ బడుతున్నది.

రెండవ ప్రపంచ యుద్ధానికి కొద్ది ముందుగా కేంబ్రిడ్జి యూనివర్శిటీ చేసిన అధ్యయనంలో, వ్యవసాయదారుని సగటు ఆదాయం వారానికి పదునెనిమిది (18) షిల్లింగులు. ఇది అతను తన వ్యవసాయ కూలీల కిచ్చే జీతం కన్నా తక్కువగా వుంది. ఈ జీతాలు దేశ విదేశాల్లో వేరు వేరుగా వున్నా ఇరువయి అయిదు (25) నుండి నలభయి (40) షిల్లింగులకు ఎప్పుడూ తక్కువగా లేవు.

ధరల తగ్గుదల హెచ్చుగా వున్న కాలంలో (1932 - U.S.A.) కూడా వ్యవసాయోత్పత్తులను 42శాతం మాత్రమే ఉత్పత్తి దారులు తమ స్వంత ఉపయోగానికి వాడుకోగలిగారు. మిగిలిన ఉత్పత్తులన్నీ మార్కెట్టులోకి విడుదలయినవి. వ్యవసాయోత్పత్తులు - ఇతర ఉత్పత్తులతో పోలిస్తే 37 శాతం తమ విలువను కోల్పోయినవి. (U.S.A) కానీ వారి ఉత్పత్తులలో మాత్రం తగ్గుదల కనిపించలేదు. రైతులు ధరలు గిట్టుబాటుగా లేనప్పటికీ తమ ఋణాలు, వాటిపై వడ్డీలు తీర్చటం కోసం, వ్యవసాయ పెట్టుబడులకోసం, డిమాండుతో సంబంధం లేకుండా చేసే వత్తిడి ఉత్పత్తి వలన వారి జీవన ప్రమాణాలు ఎలా పెంచుకో గలరు? ధరలు పతనమయినప్పుడే వారి ఉత్పత్తులను తగ్గించుకోవలసిన అత్యావశ్యకత ఏర్పడుతుంది. వారి నికరాదాయంలో 57.2 నుండి 87.2 శాతం వరకు పెరుగుతున్న వడ్డీలకే జమ పడుతున్నది (U.S.A. 1931-32). "అవసరమయిన పెట్టుబడులకోసం, నిధులకోసం సరుకులతో నిండిన మార్కెట్లలోనికి

మరలా తన సరుకును, అతి స్వల్పధరలకు అమ్ముకొని నష్టాన్ని భరించవలసి వస్తున్నది. ఇందువలన వడ్డీవ్యాపారికతడెల్లప్పుడూ ఋణగ్రస్తుడౌతున్నాడు. ఆదాయం, పన్నుల చెల్లింపులకే చాలక బీదరికం పెరగటానికి కారణమగుతున్నది. (J.C. కుమారప్ప - Public Finance and Poverty P. 60) వడ్డీలు చెల్లించ లేక పోవటం వలన వారు చేయగలిగింది కొత్త బాకీలు చేయటమే.'(League Survey).

రెండవ ప్రపంచ యుద్ధం మొదలయిన తరువాత పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు 250 నుండి 450 శాతం పెరిగినవి. ద్రవ్యోల్బణం కారణంగా వ్యవసాయ ఉత్పత్తుల - పారిశ్రామిక ఉత్పత్తుల ధరల వ్యత్యాసం అనూహ్యంగా పెరిగింది. ఈ వ్యత్యాసాలు రైతులకు ఎక్కువ నష్టం కలిగించినవి. ఇండియా, ఇంగ్లాండు దేశాలలో ప్రభుత్వాలు వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పెరగకుండా కట్టు దిట్టమయిన చర్యలు చేపట్టినయ్. ప్రపంచ మార్కెట్ల పూర్తి వైఫల్యం కారణంగా పారిశ్రామిక ఉత్పత్తుల ధరలను అదుపు చేయలేక పోయింది. ఏదో కారణంగా పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు, పారిశ్రామికవేత్తల (వ్యవస్థాపకుల -) పారిశ్రామిక కార్మికుల సంపాదనలు మెరుగుపడినప్పుడల్లా రైతుల, వ్యవసాయకూలీల సంపాదన తగ్గటం ఆనవాయితీ అయింది.

'పారిశ్రామిక, వాణిజ్య, పట్టణ వర్గాలకు లాభదాయకంగా ప్రపంచ విపణులు ఆవిర్భవించి, వ్యవసాయోత్పత్తులను, రైతులను సంపూర్ణంగా నాశనం చేసినవి.'

'రష్యా, ఇండియా, వ్యవసాయ క్షేత్రాల ఉత్పత్తులలో అధికభాగం పన్నుల చెల్లింపులకై రైతులు అమ్ముకొన్నారు. ఇది ఐచ్ఛికంగా చేసింది కాదు. దయారహితంగా ప్రభుత్వాలు రైతులను హింసించి వసూళ్ళు చేసినయ్. ధరల మాంద్యంగానీ, వ్యవసాయ పెట్టుబడులను గానీ పరిగణించలేదు. పన్నులు చెల్లించే తేదీకి, డీలర్లు అడిగిన ధరకు తమ ఉత్పత్తులను రైతులు అమ్ముకొన్నారు (Marx Cap. Vol.III P 842-43). ఈ బలవంతపు అమ్మకాల ద్వారా 10 శాతం చెల్లింపులు జరిగినవి. గిట్టుబాటు ధరలతో నిమిత్తం లేకుండా రైతులు వ్యవసాయం చేయవలసి వచ్చింది'. 'రైతులకు లాభసాటి కాకపోయినా, వ్యవసాయం చేయటం మినహా వేరే గత్యంతరం లేదు. వారి స్వంత అవసరాలకు, భూ పరిరక్షణకు, వారిపై ఆధారపడిన వారి కొరకు వారు వ్యవసాయం కొనసాగించవలసిందే'.

ఇది రైతుల శాశ్వతమయిన బలహీనత, వారి జాతీయ సంపదతో నిమిత్తం లేకుండా, వ్యవసాయ దేశాల్లో, పాక్షిక వ్యవసాయ దేశాల్లో, డిమాండు యొక్క ఆధిక్యతా

స్థానం, దాని వెనుక నున్న కాపిటలిస్టు శక్తుల పుణ్యమాని, వ్యవసాయం శాశ్వతంగా అణచి వేయబడిన పరిశ్రమ అయింది.

'కాలక్రమంలో (దీర్ఘకాలంలో) డిమాండు - ధరలు - సప్లైల సర్దుబాటు జరుగుతుందని, అందువలన వ్యవసాయ దారులకు న్యాయమయిన వాటా వస్తుందా - రాదా, వ్యవసాయోత్పత్తులకు సంబంధించి ఉత్పత్తి, పంపిణీలను నియంత్రించే ఇతర సూత్రాలేమయినా వున్నాయా, లేదా అని ప్రత్యేకంగా విచారించాలిసిన, అధ్యయనం చేయవలసిన పని లేదని కొట్టిపారేసిన సాంప్రదాయ మార్క్సిస్టుల వాదన తప్పు.

ఉత్పత్తి (వ్యవసాయ) వత్తిళ్ళకు లోనై చేయబడుతుంది అనేది స్పష్టం. మార్షెలి యన్ శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించినట్లుగా వ్యవసాయం క్షీణకర ప్రతిఫలాల సూత్రం (Law of Deminishing returns) పైనే కాక వత్తిడి ఉత్పత్తి సూత్రం (Law of Production under duress) పై కూడా ఆధారపడి ఉంది. వివిధ వ్యవసాయ ఉత్ప త్తులు పండించి మార్కెట్లలోనికి విడుదల చేయటం మినహా రైతులకు మార్గాంతరం లేదు.

ఈ పరిస్థితులలో, రైతులకు స్వతంత్రం ఎక్కడుంది? చట్టాలలో వారు స్వతంత్రులు. వాస్తవానికి బానిసలు. వ్యవసాయంలో వత్తిడి ఉత్పత్తి మాత్రమే జరుగు తుంది. జీవితావసరాలకోసం శ్రామికుడు తన శ్రమనే విధంగా అమ్ముకోవలసి వస్తుందో అలానే వ్యవసాయదారుడు మనుగడకోసం ఉత్పత్తుల చేసి మార్కెట్లకు అందిస్తున్నాడు. కొన్ని దేశాలలో నిరుద్యోగంనుండి, అక్రమమైన శ్రమనుండి, ట్రేడ్ యూనియన్లు, సాంఘిక సంస్థల ద్వారా కార్మికులు రక్షణ పొందుతున్నారు. వ్యాపారుల సరళి బాగాలేనప్పుడు, ధరలు పతనమైనప్పుడు కూడా రైతులు తమ ఉత్పత్తులను అమ్మకుండా వుండే హక్కు లేకుండా వున్నారు. ఈ 'వత్తిళ్ళ ఉత్పత్తి' రైతుల అణచివేతకు ప్రాధమిక కారణం.

ఇండియా, చైనాలలో లెక్కకు మిక్కిలిజనాభానిరుద్యోగంతో, సీజనల్ ఉద్యోగా లతో, ఉద్యోగ అవకాశ మార్గాలు మూసుకుపోవటంతో, చాలీ చాలని జీతాలకు పొలాల్లో శ్రమిస్తూ, అర్ధాకలితో అలమటిస్తున్నారు. మహాత్మాగాంధీ భారతదేశంలోని నిరుద్యోగం 50 మిలియన్ ప్రజల శ్రామిక శక్తిగా వున్నదని అభిప్రాయపడ్డారు. సర్.యం.విశ్వేశ్వరయ్య ఇది 40 శాతం మిలియన్ ప్రజల శ్రమశక్తిగా భావించారు. 'చాలీ చాలని ఆహారం, బట్ట, గృహవసతి, భారతదేశం పరిస్థితుల దృష్ట్యా కూడా నిరుద్యోగుల సంఖ్య 100 మిలియన్లు వుంటుందని సర్. యం. విశ్వేశ్వరయ్య తన "Unemployment in India P. 64 లో తెల్పారు. బెంగాలు కరువు ఈ అంచనాలనన్నిటినీ తల్ల క్రిందులు చేసింది. నిరుద్యోగం, అసమగ్రపోషణ, ఆకలి, కూటికి లేక పోవటం, కాపిటలిజం మనుగడకు ఏడుగడ్డైంది.

కొందరు రైతులు అదనపు విలువను, కొన్ని సరుకుల అదనపు ఉత్పత్తుల ద్వారా (Marginal Production) పొందగలగటం పై నిర్ణయానికి విరుద్ధం కాదు. U.S.A., కెనడా, న్యూజిలాండ్, అర్జెంటినా, బ్రెజిల్ దేశాల్లో రైతులు గిరాకీ వున్న ఉత్పత్తులకు తమ పంటలను వెంట వెంటనే ఎక్కువ విస్తీర్ణంలో మార్చుకోగలుగుతున్నారు. మార్జినల్ రైతులు తమ అదనపు ధరల (Marginal Costs) ను సంపాదించలేక పోతున్నారు. మార్కెట్టు ధరలు, అదనపు ధరలకన్నా (Marginal Costs) తక్కువగా ఉండి నిజమయిన ఉత్పత్తి ధరకు కూడా గిట్టుబాటుగావటంలేదు. (ఉత్పత్తి మామూలు కన్నా ఒక యూనిట్ (ఒక పరిమాణం) లేక కొన్ని యూనిట్లు ఎక్కువగా వుంటే దానిని మార్జినల్ ఉత్పత్తి అంటారు. ఈ అదనపు ఉత్పత్తి స్వల్పంగా వున్నప్పుడే దీనిని Marginal Production అంటారు. అలానే ధరలు ఒక యూనిట్ పెరిగినా - ఒక యూనిట్ తగ్గినా వీటిని మార్జినల్ కాస్ట్ అంటారు. అంటే స్వల్ప వ్యత్యాసాలు. ఒక యూనిట్ ఎక్కువ ఉత్పత్తి జరిగితే సాధారణంగా ఒక యూనిట్ అదనపు ధర రావాలి. ధరలు అసలు ఉత్పత్తి కన్నా తక్కువగా వున్నప్పుడు ఇది సాధ్యం కాదు.) వ్యవసాయ సామర్థ్యంగల రైతులు తమ ఉత్పత్తుల పరిమాణాన్ని గణనీయంగా పెంచగలగటం వలన, మార్కెట్లలలో పలికే ధరకే తమ మొత్తం ఉత్పత్తులను అమ్ముకొంటున్నారు. ఉదా:- బియ్యం ధర చాలా తక్కువగా ఉన్నప్పుడు (ఇండియా) విదేశాల నుండి అతి చౌకగా ఎక్కువ మొత్తంలో 'విరిగిన గింజలు' (Broken Rice) (లేక నూకలు) దిగుమతి జరిగింది. ఇవి చాలా చౌకగా వుండటంలో వినియోగదారులు బియ్యం బదులు ఈ నూకలనే కొనుగోలు చేశారు. ఇండియాలో బియ్యం ధర పడిపోయింది. అర్ధరూపాయి దిగుమతి సుంకం - (82 పౌన్లుకు) సియామ్ దిగుమతులపై ప్రభుత్వం విధించడంతో మరల బియ్యం ధరపెరిగింది. అందువలన స్వల్ప అదనపు ఉత్పత్తి (Marginal Production) పెరుగుదల, ధరల పెరుగుదలపై ప్రభావం చూపదు. మార్కెట్లలోనికి చౌకగా ఉత్పత్తులు ఎంత స్వల్ప పరిమాణంలో వచ్చి చేరినా ధరల తగ్గుదలకు దోహదం చేస్తున్నవి. మార్జినల్ ఉత్పత్తుల ధరలు గిట్టుబాటు కానట్లయితే మొత్తం సరఫరా తగ్గుతుంది. మార్జినల్ ఉత్పత్తుల పరిమాణాలు క్రమేపీ సన్నబడతాయి అని మార్షెలియన్ శాస్త్రవేత్తలు చెప్పినది నిజం కావచ్చు. కానీ వత్తిడి ఉత్పత్తి సూత్రం ఆధారంగా వారి సిద్ధాంతాన్ని మార్చుకోవలసి వుంది. క్షీణకర ప్రతిఫలాల సూత్రాలు, మార్జినల్ ఉత్పత్తులు - మార్జినల్ ధరల పరస్పర ప్రభావాలను ప్రక్కన పెట్టవలసి వుంది. ఈ 'వత్తిడి ఉత్పత్తుల సూత్రం' దుష్పరిణామాలు చాలా వున్నాయి. ఈ సూత్రాన్ని గమనించనట్లయితే వ్యవసాయ ఆర్థిక జీవితంలో చాలా విషయాలను అవగాహన చేసుకొనలేము.

# పెట్టుబడిదారీ పిడికిలి - గ్రామీణ ఆర్థికత

(Capitalist Tentacles over Rural economy)

పారిశ్రామిక, వాణిజ్యవర్గాలకు, వృత్తి జీవులకు ఊడిగం చేస్తూ కాపిటలిజం, క్రీస్తు శకారంభం నుండి ప్రాగ్దేశాలలోను, 16వ శతాబ్దం నుండి పాశ్చాత్య దేశాలలోనూ, వ్యవసాయ రంగాన్ని అణచివేసి, దోపిడీ చేస్తున్నది. శతాబ్దాలుగా వ్యవసాయ ఉత్పత్తులకు, అటవీ సంపదకు, పాలు వెన్నలకు స్వల్ప మూల్యాలు చెల్లింపబడినవి. ఢిల్లీ, బెంగాలు, దక్కనులలో ముస్లిం సామ్రాజ్యాధికారంవచ్చేటంత వరకు రైతుల స్వయం సమృద్ధి, గ్రామీణ ఆర్థిక విధానం పెద్దగా చెక్కు చెదరలేదు. విదేశీయుల భారీ సైనిక శిబిరాల వలన, ఆహారం ఇతర నిత్యావసర వస్తువుల వర్తకం, సరుకుల మార్పిడి పెరిగింది. ఈ పరిస్థితిలో కూడా రైతుల స్థితి గతులలో చెప్పుకోదగిన మార్పులేదు. అవసరానికి ఉత్పత్తులను పెంచటం, మార్పులు చేసుకోవటం జరిగింది. కొందరు చేతి వృత్తులవారు పట్టణాలకు, నగరాలకు వలస వెళ్ళారు.

జాతీయ, అంతర్జాతీయ వాణిజ్యం పట్టణాలకు, నగరాలకు పరిమితమయింది. ఇండియా, చైనా, ఇండోనేషియా చక్రవర్తులు, రాజులు వారి సేనాధిపతులు భూస్వామ్య వర్గాలు కొత్తగా ఎదుగుతున్న వర్తక వర్గాలను, టోకు వ్యాపారాన్ని ప్రోత్సహించ సాగారు. ఇండియా, చైనాలకు మొదటి రెండు శతాబ్దాలలో రోముతో గణనీయమయిన వర్తక, వాణిజ్య సంబంధాలుండేవి. అప్పుడు కూడా గ్రామ కామన్వెల్తుల (గ్రామ స్వరాజ్యపు) స్వయం సమృద్ధి దెబ్బతినలేదు.

గ్రామ కామన్వెల్తులలో వర్తకం జరగలేదని దీని అర్థం కాదు. వీటి వర్తక లావాదేవీలు ద్రవ్య చలామణీ జరగవలసినంత భారీగా వుండేవి కావు. అవసరాలమేరకు గ్రామీణ ఆర్థిక ఉత్పత్తులు జరిగేవి.

ఆఫ్రికా నీగ్రో, అమెరికన్ ఇండియన్ తెగల సమాజాలు, ఇండియాలో గ్రామ కామన్వెల్తులు ఉచ్ఛదశలోనున్నప్పుడు వడ్డీ వ్యాపారి పాత్ర ఆలస్యంగా రంగ ప్రవేశం చేసింది. ప్రజల ఆర్థిక వ్యాపకాలపై ఇతనికి పట్టు వుండేది కాదు. పట్టణాల సంఖ్య, వాటి జనాభా, ప్రభుత్వ సంస్థలు, వాటి వ్యయం పెరిగి, ధనరూపేణా పన్నుల చెల్లింపుల అవసరాలతో, ద్రవ్య చలామణీ ప్రజల జీవితాలలో ప్రవేశించిన తరువాత పరిశ్రమలు, వర్తకం ప్రజల ఆర్థిక జీవితంపై విస్తృతమయిన అధికారం సంపాదించిన తరువాత వడ్డీ వ్యాపారి ప్రధానమయిన, అవసరమయిన ఆర్థిక పరికరంగా ఎదిగాడు. అతని మోసం వలన కలిగే భయంకర పరిణామాలను ప్రపంచం తెలుసుకోగలగింది. వివిధ దేశాలలో, వివిధ దశలలో రకరకాల మార్గాలతో అతడు ప్రత్యక్షమయ్యేవాడు. వాణిజ్యపరంగా ఎంతో ఎదిగిన రోమ్ సామ్రాజ్యంలో కూడా సంఘం అతనిని చిన్న చూపు చూసేది. 15-18 శతాబ్దాలలో, ప్రాక్ పశ్చిమదేశాల నాగరిక సమాజంలో వడ్డీ వ్యాపారి ప్రభావం రైతుల నుండి రాజుల వరకు క్రమేపీ ఎగబ్రాకింది. వడ్డీ వ్యాపారం చంద్ర గుప్త మౌర్యుని కాలంలో ఇండియాలో, రోమను సామ్రాజ్యంలోనూ గుర్తింపు పొందిన వ్యవస్థే. అరబ్బులు, యూరోపియన్లు తమ ఆర్థిక దురలవాట్లను ప్రవేశ పెట్టే వరకు ఆఫ్రికా తెగలకు వడ్డీ వ్యాపారం తెలియని విషయం. అమెరికాలో రెడ్ ఇండియన్ల పరిస్థితి కూడా ఇంతే. 18వ శతాబ్దాంతానికి అధిక భాగం రైతులు వడ్డీ వ్యాపారుల చేతులలో చిక్కుకున్నారు.

పెద్ద రైతుల నుండి, అధిక ధరలకు భూములను కవులుకు తీసుకున్న రైతులు కవులు ధనాన్ని డబ్బు రూపంలో చెల్లించవలసిన వారయ్యారు. 'డబ్బు'తో భూస్వాములు తేలికగా తమ విలాసాలను కొనగలిగేవారు. అప్పులు, వాటిపై వడ్డీలను తీర్చుకొనేవారు. రాజులు కూడా పన్నులు 'డబ్బు'గా చెల్లించమని వత్తిడిచేశారు. రైతులు తమ శిస్తులు, పన్నులు, కవులు 'డబ్బు'తో చెల్లించవలసి పంట పొలాల్లో వుండగనే వడ్డీ వ్యాపారులతో సర్దుబాట్లు చేసుకోసాగారు. పారిశ్రామిక విప్లవానికి చాలా ముందు నుండి, వడ్డీ వ్యాపారులు వర్తకులు వారి ఆయుధాలయిన మార్కెట్లు, రైతులను తమ పిడికిళ్ళలో బిగించినయ్.

ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం[1] తరువాత, నెపోలియన్ యుద్ధాలు ముగిసిన

పిదప మాత్రమే గ్రామీణ స్వయం సమృద్ధి ఆర్థిక విధానం పై, పారిశ్రామిక వాణిజ్య అనిశ్చితలను లక్ష్య పెట్టని ప్రపంచ రైతాంగంపై, యుద్ధభేరీ మ్రోగించబడింది. డచ్, ఇంగ్లీషు ఈస్టిండియాకంపెనీలు లక్షలాది ఇండియా ఇండోనేషియా చేనేత వారిని, చేతి వృత్తుల వారిని ఉపయోగించుకొని, ప్రఖ్యాతి గాంచిన ఢక్కా మస్లిన్లు, మచిలీపట్నం కాలికోలు, సిల్కులు యూరోపియన్ మార్కెటుకు ఎగుమతి చేసేవారు. పారిశ్రామిక విప్లవం తరువాత ఈ దేశాల్లోని ఫాక్టరీలను మూసివేసి, తమ దేశాల నుండి మిల్లు బట్టను చౌకగా తూర్పు దేశాలకు దిగుమతి చేశారు. ఈ దిగుమతుల వలన మిలియన్ల సంఖ్యలో నేతవారు, నూలు తీసేవారు, ఉన్ని తీసేవారు, బాగుచేసేవారు. తమ జీవనాన్ని కోల్పోయారు. తమ అదుపు ఆజ్ఞలలో వున్న ఈ దేశాల (ఇండియా - ఇండోనేషియా) ప్రభుత్వాలనుపయోగించుకొని బ్రిటీషు సరుకులను ఓరియంటల్ (తూర్పు) దేశాలలో క్రుమ్మరించారు. వారు తమ దిగుమతులకు నామ మాత్రం సుంకం చెల్లిస్తూ ఓరియంటల్ దేశాల దిగుమతులపై టాక్సులు పెంచి, ఈ దేశాల సరుకుల ఎగుమతి అసాధ్యం చేశారు. ప్రభుత్వాధికారం నూతన ట్రేడ్ టారిఫ్‌లతో (కష్టమ్స్ డ్యూటి వగైరాలు) సామ్రాజ్యాధికారాలతో అంతర్జాతీయ వర్తకానికి విస్తరించి, స్వయం సమృద్ధి ఆర్థిక విధానాలుగా గల దేశాల పతనావస్థకు కారణమయింది. 1850 సంవత్సరానికి పర్షియా, టర్కీ, ఇండియా, ఇండోనేషియా, చైనాల్లో ప్రతి పట్టణము, ప్రతి అయిదు గ్రామాలలో ఒక గ్రామము పశ్చిమ దేశాలతో ఐచ్ఛిక లేక బలవంతపు వొప్పందాల వలన, పాశ్చాత్య వాణిజ్యము, పరిశ్రమలు వారి పంటలు, వారి నూతన ప్రభుత్వాధికారం వలన - చేదు అనుభవాలు రుచి చూసినవి. ఫ్రెంచి - జర్మను యుద్ధకాలంలో (1870) తూర్పుదేశాలలోని ప్రతి గ్రామములో పట్టణంలో చేనేత పరిశ్రమకు మొదట దెబ్బ తగిలింది. వేల సంవత్సరాల చరిత్ర కలిగిన గ్రామీణ ఆర్థిక విధానం బీటలు వారింది. ప్రపంచ విపణులు - మార్కెటింగు పైన, వ్యవసాయ ధరలపైనా తమ ఆధిపత్యాన్ని భద్ర పరుచుకొన్నవి.

అమెరికా అంతర్యుద్ధం, బ్రిటను స్వయంసమృద్ధి, సామ్రాజ్య విస్తరణ ప్రయోజనాలను త్వర పెట్టింది. ముడి సరుకు ముఖ్యంగా బ్రిటను పరిశ్రమలకు అవసరమయింది. స్టీమ్ షిప్పులు రాక, సూయాజు కాల్వ తెరవటం, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానంతరం ఇండియాలో తన సార్వభౌమాధికారాన్ని సుస్థిరం చేసుకోవటం, బాక్సరు విప్లవాల[2] తరువాత చైనా పై గెలుపొందటం, ఇంగ్లాండులో బాంకింకు చట్టాలు చేయటం, లండను 'మనీ మార్కెట్' ప్రపంచ ఆర్థిక కేంద్రంగా ఎదగటం, బ్రిటిషు

కరెన్సీ సంస్కరణ, బ్రిటీషు యాంత్రిక ఉత్పత్తులు ఇవన్నీ బ్రిటీషు సార్వభౌమాధికారాన్ని ప్రపంచంలో సుస్థిరం చేసినవి.

గత శతాబ్దాంతంలో రష్యా, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, హాలండు వంటి యూరపు దేశాలు వలసలను వ్యవసాయ ప్రాంతాలను మార్కెట్లను కైవసం చేసుకొనే ప్రయత్నాలలో వున్నయ్. వలస దేశాలు, లాటిన్ అమెరికా, బ్రిటీషు డొమినియన్ల సముద్ర వర్తకంపై ఆధిక్యత సంపాదించాయి. విదేశీ వర్తక పెట్టుబడులు, ప్రపంచ వాణిజ్యం, ప్రాసెసింగు సంస్థలు వడ్డీవ్యాపారులతో సంబంధంగల బాంకింగు వలన వలసదేశాలలోని స్థానిక మార్కెట్లు స్వాధీన పరుచుకొన్నారు. వలస దేశాల రైల్వేలు, నావల నిర్మాణం, రిపేరు కేంద్రాలు, నూనె బావులు, గనులు అన్నీ ఈ దేశాల అధీనంలోనికి వచ్చినవి. పాశ్చాత్య దేశాల, అమెరికా దేశపు పారిశ్రామికత గ్రామీణుల, రైతుల ప్రత్యేక ఉపవృత్తుల సంపాదనను దోచుకొని వారి వ్యవసాయోత్పత్తులను మార్కెట్లకు తరలించి, అమ్మించి, వచ్చిన డబ్బుతో పారిశ్రామిక సరుకులను కొనుగోలు చేయించటమేగాక, రైతులు తమ అవసరాలకై ఇంతకు పూర్వం ఉత్పత్తి చేస్తున్న వ్యవసాయ సరుకులను కూడా కొనేటట్లు చేసింది. రైతులను వారి బహుముఖీన వ్యవసాయాన్నుండి, 'ఒకే పంట' కు - స్వయం సమృద్ధిగల ఉత్పత్తులనుండి వాణిజ్యోత్పత్తులకు అధిక ధరల ఆశ చూపి మరలించి, వారి ఆహార పదార్థాలను కూడా మార్కెట్లలో కొనిపించగలిగారు. వర్తక పారిశ్రామిక వర్గాలు, వ్యవసాయోత్పత్తులను, ప్రపంచ విపణుల ద్రవ్య చలామణీల సుడిగుండంలోనికి నెట్టి, లాభాలన్నీ స్వంతం చేసుకొన్నారు.

శతాబ్దాలుగా మిశ్రమ పంటగా వున్న ప్రత్తిని, ఒకే వాణిజ్య పంటగా అమెరికా, యూరపు, జపాను దేశాలు మార్చినవి. మిల్లు బట్టలకు ప్రత్తి అవసరం ఎక్కువ గనుక ఇండియా, ఆఫ్రికా వలసలలో, నూతన ప్రాంతాలలో అతి పెద్ద విస్తీర్ణాలలో ప్రత్తిని సాగు చేయించారు. (అమెరికా, యూరప్, జపాను వారు). ప్రపంచ విపణుల సారథ్యం వలన ఈ సాగు వీలుపడింది. ఇందువలన మన ప్రాచీన చేనేత వృత్తికి ఆశ్రయం లేకుండా పోయింది.చేనేత కార్మికులకు జీవనాధారం పోవటమే కాక - గ్రామీణులు తమ బట్టల ఖర్చును పొదుపు చేసుకొనే అవకాశం పోగొట్టుకున్నారు. ఉపాధికై బట్టల మిల్లులను, కాటన్ మార్కెటును ఆశ్రయించారు. బెంగాలు, బీహారు, ఒరిస్సాలలో జూటు వ్యవసాయం పై ఆధారపడి బ్రతికేవారికీ ఇదే గతి పట్టి 1943 కరువులో లక్షలాదిమంది ఆకలితో మరణించారు. బ్రెజిల్‌లో కాఫీ ప్లాంటేషన్లపై ఆధారపడినవారు, కాఫీ చీడ

పీడలతో నాశనమయినపుడు అధిక మూల్యం చెల్లించ వలసి వచ్చింది. చక్కెర ఉత్పత్తి దారులు, ప్రపంచ మార్కెట్లలో రైతుల ఉత్పత్తుల అమ్మకాలను దెబ్బతీసి, బెల్లం తయారీని అరికట్టి, చెరుకు రైతులను చక్కెర కర్మాగారాల దయపై ఆధారపడేటట్లు చేశారు.

రైతుల వ్యవసాయ ఆర్థికతను, స్వతంత్రను అదుపులో వుంచటానికి, తమ సరఫరాలకు మద్దతుగా కాపిటలిజం తానే స్వయంగా కొన్ని ప్రధాన వాణిజ్య పంటలను - చూయింగ్ గమ్, కాఫీ, టీ, రబ్బరు, కోకో, సిల్కు, చెరకు, వీటినుండి ఉపతయారీలకై ఆఫ్రికా, దక్షిణ అమెరికా, ఇండియా, సిలోను, ఇండోనేషియా, మలయా దేశాలలో రైతుల భూములను అధిక విస్తీర్ణంలో 'కబ్జా' చేసి, ఆక్రమణలోలేని భూములకు నామ మాత్రపు ధరలు చెల్లించి కొనుగోలు చేసారు. దీని వలన చిన్న భూకమతాల పరిమితి మరింతగా క్షీణించింది. ప్లాంటేషన్లలో పనికి రోజువారి కూలీల అవసరం పెరిగింది. రోజువారీ కూలీలుగా పనిచేయటానికి అయిష్టంగా వున్న రైతులను స్థానిక ప్రభుత్వాలతో, వారి అధికారులతో హింసించి - అతిక్రూరము, అమానుషము అయిన గుడిశ - తల పన్నులు వారిపై విధించి, అతిస్వల్ప జీతాలకు వారిని తమ బానిసలుగా మార్చారు. డబ్బు చెల్లింపుల అవసరాన్ని వారి నెత్తిన రుద్దారు. సామ్రాజ్యవాదుల కాష్ డిమాండు (Cash Demand) తట్టుకోవటం, జీతాలవలన, కాంట్రాక్టు కూలీ (Indentured Labour)[3] విధానం వలన మాత్రమే సాధ్యపడుతుంది. బర్మా, మలయా గనులలో, వరి పొలాలలో పనిచేయటానికి ఇండియా, చైనాల నుండి ప్రజలను దిగుమతి చేశారు. యాంత్రిక ఉత్పత్తిదారులయిన ఈ భూస్వాములు రైతులపై ఆధారపడకుండా వుండటానికి, రైతులు సహకరించక పోయినా తమ సరఫరాలు నిరాటంకంగా జరగటానికి ఈ మార్గాన్వేషణ చేశారు. భూములనాక్రమించుకొన్న మాన్యుఫాక్చరర్లు వారి యాంత్రిక తయారీల ప్రయోజనాల రక్షణకు - తీరికగా భూస్వాములుగా మారారు. రైతుల పూర్తి అణచివేతకు, పతనానికి, సామ్రాజ్య వాదపు పిడికిలి బిగుసుకొనటానికి కారణమయినారు.

తమ ఇరుగు పొరుగు రైతులచే ఒకటి, రెండు వాణిజ్య పంటలు ప్రోత్సహించి, కాపిటలిస్టు వ్యవస్థ అనేక మార్గాలతో రైతులను తనపై ఆధారపడేటట్లు చేసుకొన్నది. ఈ వాణిజ్య పంటలపై శ్రద్ధచూపించే ప్రాంతాలలో ధాన్యం, పశువులమేత, పచ్చి ఎరువుల కొరత ఏర్పడుతుంది. వీటిని దిగుమతి చేయాల్సి వుంటుంది. దిగుమతులకు కాపిటలిస్టు వ్యవస్థ సహకారం కావాలి. చిలీ దేశం తన ఆహార ధాన్యాలకు పూర్తిగా దిగుమతుల పై

ఆధారపడింది. బ్రిటను, డేనిష్ దేశాలు పశువుల మేత దిగుమతి చేసుకొనవలసివచ్చింది. గతంలో (రెండవ ప్రపంచ యుద్ధకాలంలో) తమ నిత్యావసరాల ఉత్పత్తులతో పాటు, అదనపు ఉత్పత్తులు సాధించిన రైతాంగం నేడు ఆహార ధాన్యాలను, క్షేత్రావసరాలను దిగుమతి చేసుకొంటున్నారు.

భారతదేశపు గ్రామీణ సామాజిక ఆర్థిక విధానం ఏ విధంగా నూతనకాపిటలిస్టు విధానపు ప్రభావానికి లోనయినది రూరల్ క్రెడిట్ సర్వే (1954) సూచించింది.

'ద్రవ్య చలామణీ పెరిగింది. బ్యాంకులు ఇతర ఆర్థిక వ్యవస్థలు పట్టణాలలో, గ్రామీణ వడ్డీ వ్యాపారస్తులు, కమీషన్ దారులు పల్లెలలో ఆర్థిక లావాదేవీల పరికరాలయినారు. బ్యాంకింగ్ వ్యవస్థ గ్రామీణ వాణిజ్యాన్ని పట్టించుకొనక పోవటంతో వడ్డీ వ్యాపారి అధిక శక్తిమంతుడయినాడు. వ్యవస్థీకృతమయిన పరిశ్రమలతో కుటీర పరిశ్రమలు పోటీపడలేకపోయినవి.'

రైళ్ళు, లారీల రవాణా సౌకర్యాలతో ఎద్దుల బండ్ల రవాణా తగ్గి, తద్వారా వచ్చే అదనపు ఆదాయం పోయింది. స్థానికంగా వస్తు రూపేణా చెల్లింపులతో తమ వ్యవసాయ పనిముట్లు తయారీ, బాగు చేసుకొనటం చేసే రైతులు, పట్టణాలలో అధిక ఖర్చుతో ఈ పనులు చేయించుకోవలసి వచ్చింది. పొలాలకు పచ్చిరొట్ట, పేడ మొదలయిన సేంద్రియ ఎరువులకు మారుగా, అధిక ధరలు చెల్లించి రసాయనిక ఎరువులు కొనవలసి వచ్చింది. పెరిగిన వ్యవసాయ ఖర్చులు, పెట్టుబడులు బ్రిటీషు రైతాంగానికి కూడా సమస్యగా మారింది. పెరుగుతున్న ప్రాసెసింగు - మాన్యుఫాక్చరింగు ఖర్చులతో అమెరికా రైతులు ఆందోళన చెందారు. పెరిగిన ఈ ఖర్చుల వలన వినియోగదారుల నుండి స్వల్ప ప్రతిఫలం మాత్రమే రైతులకు అందుతుంది.

పెద్ద పెద్ద రైతులకు మారుగా జాయింటు స్టాక్ హోల్డింగు కంపెనీలు నెలకొల్పబడటం కలలో కూడా ఊహించని పరిణామం.

కాపిటలిజం ప్రపంచ విపణుల పునరావాసం ద్వారా, పారిశ్రామిక వర్గాలకు, భవిష్యత్తులో రైతులు ఉత్పత్తులు తగ్గించి, ధరలు పెంచగలరనే భయంతో, భీమా సౌకర్యంలాగా నిరంతరం చౌకగా సరుకుల సరఫరాకు, నమ్మకమయిన ఏర్పాట్లు చేస్తున్నది.

ఆర్థిక, సామాజిక వ్యాపకాలకు కేంద్ర బిందువయిన వ్యవసాయాన్ని, శృంఖలా బద్ధం చేసి కాపిటలిజం అణగదొక్కుతున్నది.

'ప్రపంచ కాపిటలిజం గ్రామీణ ఆర్థికతను గొంతు పిసికి, కొండ చిలువలాగా చుట్టుక పోతుంది' అన్న మార్క్సు ఉవాచ 1945-46 వరకు నిజమయింది. కానీ జర్మనీ ఆర్థిక విధానమయిన 'ఆటార్కీ' (Autaurchy) యుద్ధ సమయంలో వ్యవసాయంపై ఆధారపడటం, భారతదేశ స్వతంత్రం, ఇథియోపియా, సిలోను, బర్మా, ఇండోనేషియా, ఈజిప్టు, సూడాను, ఫిలిప్పైన్ల విముక్తి, మొరాకో, టునీసియా, గోల్డుకోస్టు, నైజీరియాలలో పెరుగుతున్న స్వాతంత్ర్యం - కాపిటలిజపు, దాని ప్రధాన ఆయుధమయిన ప్రపంచ విపణుల పట్టుకోల్పోయేలా చేసిన మంచి పరిణామాలు. అమెరికా వ్యాపారులు కూడా జాతీయ వ్యవసాయ ఆర్థిక విధానాన్ని అంగీకరించగలిగారు. సహకారోద్యమం, దేశ దేశాలలో మద్దతు ధరలు, వ్యవసాయ ఆర్థిక విధానానికి కొత్త జీవం కలిగిస్తున్నవి. యుద్ధానంతరం నూతన శకానికి శుభారంభం జరిగింది.

# పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రభుత్వాల మద్దతు

(Govts have Aided Capitalism)

వివిధ ప్రభుత్వాలు, భాగ్యవంతులయిన, వర్తక వాణిజ్య వర్గాల కన్నా రైతుల మీదనే ఎక్కు ౯ ప్రత్యక్ష పరోక్ష పన్నుల భారం మోపినవి. ఇంగ్లీషు రైతులు స్థానిక పన్నుల భారానికి కుంగిపోయారు. ప్రభుత్వపు పన్నులు, పొలాల కవుళ్ళు ఇండియాలో చాలా ఎక్కువగా వున్నాయి. పంటలు చేతికి వచ్చి, ధరలు తగ్గు ముఖంలో వున్న సమయంలో పన్నులు చెల్లించవలసి వచ్చేది. ఇండియన్ టాక్సేషను కమీషను (మత్తయ్ కమీషను) ఇరవయి సంవత్సరాలుగా వున్న ఈ పరిస్థితులను మార్చింది. ప్లానింగు కమీషన్ (ప్రణాళికా సంఘం) - లాండ్ రెవిన్యూ పై సర్‌ఛార్జి, బెటరుమెంటు లెవి, వ్యవసాయపు ఆదాయపు పన్నులకు విధించాలని కోరుతున్నది. ఆఫ్రికా ప్రభుత్వం గుడిసెపై, ప్రతి తలపై పన్నులను (HUT and POLL Tax) విధించింది.

ప్రభుత్వాల ద్వేషపూరితమయిన వత్తిడుల వలన రైతులు ముఖ్యంగా ఆఫ్రికాలో డబ్బుతో పన్నులు చెల్లించవలసి రావటం వలన రైతాంగం జీతగాళ్ళుగా మారి, అరబ్బు, ఇండియన్, యూరోపియన్ భూస్వాములకు బానిసలయినారు. వీరి డబ్బు అవసరాలను వర్తకులు సత్వరంగా స్వలాభానికి మలచుకొన్నారు. చెల్లింపుల కొరకు ఆఫ్రికా రైతులు తమ అడవులను, అటవీ సంపదను నామమాత్రపు ధరలకమ్ముకొన్నారు.

డబ్బు రూపేణా చెల్లింపుల దుష్ప్రభావం వలన ఆర్థికమాంద్యం అణచివేతలకు వీరు గురయ్యారు. వత్తిడి ఉత్పత్తుల సూత్రం, వ్యవసాయానికి కొండగుర్తైంది. కాపిట లిస్టులు మొదటినుండీ ఈ అవకాశాన్ని అందిపుచ్చు కొన్నారు. '14వ లూయి[1] పాలనలో

ఫ్రాన్సు రైతాంగం వస్తు రూపపు చెల్లింపుల బదులు డబ్బు చెల్లింపులు వలన అతిబీదరికం అనుభవించారు. దీనికి విరుద్ధంగా వస్తు రూపంలో పన్నులు వసూలు చేసి ఒట్టోమాన్ సామ్రాజ్యం[2] నిలబడగలిగింది. పాశ్చాత్య దేశాలు బలవంతంగా జపాను దేశంపై రుద్దిన విదేశీ వర్తకం, భూమి కవుళ్ళను ధన రూపేణా చెల్లించేటట్లు చేస్తే ఆదేశంలోని ఆదర్శ వ్యవసాయం అంతరిస్తుంది. (మార్క్సు Vol. 11. Page - 123).

ప్రాచీన యుగంలో జరిగిన వర్గపోరాటాలు ముఖ్యంగా ఋణదాతలు - ఋణగ్రహీతల మధ్యే జరిగినవి. రోమ్‌లో ప్లెబియన్లు బానిసలయ్యారు. మధ్య యుగంలో భూస్వాములు అప్పులపాలై, తమ ఆర్థికస్తోమత వలన సంపాదించిన రాజకీయాధికారాన్ని కోల్పోయి నశించారు. బ్రిటీషు వారు బర్మాలో ఇండియా చెట్టియార్లకు, ఫ్రెంచి ప్రభుత్వం బర్మా, ఇండోచైనాలో - ఫ్రెంచి పెట్టుబడిదార్లకు ఎస్టేట్లు ధారాదత్తం చేశారు. (History South East Asia - Pr of. HALL).

పన్నులు, భూమి కవుళ్ళు డబ్బు రూపంలో చెల్లించవలసి, రైతులు వడ్డీ వ్యాపారుల చేతుల్లో చిక్కుకున్నారు. సంవత్సరానికి 24 నుండి 50%, సీజనుకు 30 నుండి 50% వరకు వడ్డీలుండేవి. రైతులు వడ్డీలు కట్టలేక పోయినప్పుడు, వడ్డీ వ్యాపారులు వారి భూములను స్వాధీనం చేసుకొని, ఆ భూములలోని రైతులను కౌలు దార్లగా మార్చేవారు. వారి బాకీ ఏ నాటికీ తీరేదికాదు. ఋణదాతలకు - ఋణగ్రహీతలకు ఇందువలన ఘర్షణలు అనివార్యమయ్యేవి.

ప్రభుత్వ వ్యయం (Public Expenditure) వలన వాణిజ్య పారిశ్రామిక వర్గాలు లాభపడుతున్నవి అని మన రెండవ పంచవర్ష ప్రణాళిక ఋజువు చేస్తున్నది. సివిల్ సర్వెంట్లు, మిలటరీ ఆఫీసర్లు పై వర్గాలనుండి ఎక్కువగా సర్వీసులోనికి తీసుకోబడు తున్నారు. రక్షణాయుధాల, ఉత్పత్తుల కంట్రాక్టర్లు కూడా ఈ వర్గం వారే అవటం వలన వారే లాభిస్తున్నారు. ప్రభుత్వ వ్యయం ఎక్కువ మొత్తంలో సివిల్, మిలటరీ కంట్రాక్టుల ద్వారా పట్టణ పెట్టుబడి దారీ వర్గాలకు అందుతున్నది. మనకేంద్ర ప్రభుత్వం ప్రణాళికా వ్యయంలో 6300 కోట్లకు గాను, 200 కోట్ల రూపాయలు మాత్రమే గ్రామీణాభివృద్ధికి కేటాయించింది. ప్రభుత్వ వ్యయం 4800 కోట్లు వుండగా వ్యవసాయం, కమ్యూనిటీ ప్రాజక్టులకు 12% కేటాయించింది. దళితులకు ఇతరతాడిత పీడిత వర్గాల గృహవసతికి 200 కోట్లు కేటాయించబడింది. 15% మాత్రమే వున్న పట్టణ ప్రజల గృహనిర్మాణానికి 160 కోట్లు కేటాయింపు జరిగింది. ప్రభుత్వ వ్యయంలో అతిస్వల్ప

వాటా మాత్రమే గ్రామీణుల కందుతున్నది. దేశంలోని రెవిన్యూను గ్రామీణులనుండి ప్రభుత్వాలు గుంజుతూ, అధిక భాగాన్ని తెల్లవారికి పంచుతున్నది. ప్రపంచ వ్యాప్తంగా ప్రభుత్వాలు, బీదలనుండి ధనవంతులకు, రైతులు కార్మికుల నుండి వాణిజ్య, పారిశ్రామిక వర్గాలకు వృత్తిజీవులకు (బుద్ధిజీవులు) గ్రామీణుల నుండి పట్టణ ప్రజలకు సంపద బదిలీ చేస్తున్నవి.

కాపిటలిస్టుల చెప్పుచేతలలో వున్న ప్రభుత్వాలు, వారు ప్రత్యక్షంగా వ్యవసాయ రంగంలో చేసే దోపిడీకి అదనంగా, రైతుల కార్మికుల అదనపు విలువను పెట్టుబడిదారీ వర్గాలకు అందజేస్తున్నవి.

మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం చేసిన చట్టాలు రైతుల, కార్మికుల బలహీనతను గుర్తించలేకపోయినవి. అందువలన అవసరమయిన రక్షణ చర్యలు తీసుకొని, బలహీనులయిన వీరి కొనుగోలు శక్తిని పెంచలేకపోయినవి. కంట్రాక్టులలో భాగస్వాములయిన ఇరుపక్షాలు ఒకరినొకరు అర్థం చేసుకోవటంలోనూ, లాభాల రక్షణలోనూ, లాభాలు పెంచుకోవటంలోనూ సమానంగా వుండగలరనే ఊహాగానాలు చేసి, లావాదేవీలలో భాగస్వాములయిన వారిద్దరు లేక ముగ్గురూ సమానులనీ, స్వతంత్రులనీ, వారుతమ ఆస్తులను యథేచ్ఛగా అమ్ముకొనవచ్చునని చరిత్రకు తెలిసినప్పటినుండీ చట్టాలు చేయబడినవి. అలా చేసి తూర్పు, పశ్చిమ దేశాల ప్రభుత్వాలు సామాన్యులకు తీరని అన్యాయం చేసినవి. 19వ శతాబ్దపు కాపిటలిస్టు సామ్రాజ్య వాద "స్వేచ్ఛా వ్యాపార[3]" నినాదం, చట్టాలను కూడా రైతులకు, కార్మికులకు వ్యతిరేక ధోరణి నలవర్చినవి. బూర్జువా వర్గాలనుండి వచ్చిన న్యాయాధికారులు సామాన్యుల - పెట్టు బడిదార్ల ఘర్షణలలో సామాన్య ప్రజలు పెచ్చరిల్లుతున్నారని, తప్పువారిదేనని భావించారు.

రైతుల పట్ల ప్రభుత్వాల నిరాదరణ ప్రపంచకాపిటలిజానికి ఎంతగానో తోడ్ప డింది. అసమంజసమయిన వర్తక - వాణిజ్యాల ఒప్పందాలు కొట్ట వచ్చినట్లు కన్పించినా ప్రభుత్వాలు వీటిని సమర్ధిస్తూ కాలయాపన చేసినయ్. ఆస్తులు అన్యాక్రాంత మగుతున్నా, పూర్వీకులనుండి సంక్రమించిన ఇళ్ళనుండీ, భూముల నుండీ వెళ్ళగొట్టబడుతున్నా, లక్షలాది ఎకరాలను నామ మాత్రపు ధరకు పరోక్ష వ్యవసాయదారులు, వడ్డీ వ్యాపారులు, ప్లాంటర్లు స్వంతం చేసుకున్నా ప్రభుత్వాలు అడ్డుపడలేదు. వ్యవసాయోత్పత్తులకు కనీస ధరలు, వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించక రైతులు, కూలీలు గౌరవ

ప్రదమయిన జీవితం గడిపే అవకాశాలు కల్పించలేదు. 1954-55లో భారత ప్రభుత్వం గోధుమలకు మద్దతు ధరను[4] నిర్ణయించినా, ఆ ధర అతి స్వల్పంగా వుండి ఆర్థికంగా నిరుపయోగమయింది.

సామ్రాజ్య వాద దేశాలు, స్వతంత్ర దేశాలు, వలస దేశాలు - యుద్ధాల మధ్య విరామకాలంలో ఆర్థిక మాంద్యం నుండి రైతులను రక్షించటానికై చట్టాలు చేయ ప్రారంభించినవి. కొన్నిదేశాలు ఋణాలు వాయిదా (MORATORIUM) వేసినవి. కొన్ని ప్రాంతాలలో సహకార పరపతి సౌకర్యాలు విస్తరింపబడినవి. కవులుదార్లకు రక్షణ కల్పిస్తూ కవులు దారీ చట్టాలు తెచ్చినవి. వ్యవసాయ మార్కెట్లను నియంత్రిస్తూ, వాటిలోని లోపాయ కారీ వ్యవహారాలను అరికట్టటానికి చేసిన ప్రయత్నాలు రైతులకు సంపూర్ణ రక్షణ కల్పించలేక పోయినవి. ఆర్థిక మాంద్యంలో చాలా దేశాలు, కాపిటలిస్టుల, ప్రపంచ విపణుల దౌష్ట్యం నుండి రైతులకు రక్షణ కల్పించటం తమ బాధ్యతగా స్వీకరించినవి. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో దాదాపు ప్రతిదేశం వ్యవసాయ రక్షణకు, నియంత్రణకు చట్టాలను, అతి త్వరగా ప్రవేశ పెట్టినవి. ఈ చట్టాలు రైతుల రక్షణకు కాక వినియోగ దారుల ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకొని చేసినట్టివి. యుద్ధానంతర ప్రపంచం వినియోగదారుల ప్రయోజనాలే కాక వ్యవసాయదారుల అభివృద్ధిని కాంక్షిస్తున్నది. ఈనాటికీ రైతులకు, ఇతర వర్గాలకు జరిగే ఘర్షణలలో రైతుల పక్షం వహించటానికి ప్రభుత్వాలు సందేహిస్తున్నవి. ప్రభుత్వాలు రైతులపై సవతితల్లి ప్రేమ చూపిస్తూ, కాపిటలిస్టు వర్గాల పట్ల చాలా ఉదారంగా వ్యవహరిస్తున్నవి. కాపిటలిస్టు వర్గ ప్రయోజనాలకై ప్రభుత్వాలు చేపట్టిన చర్యలు పరిశీలిద్దాం. 1914 లో యుద్ధ ప్రకటన వెలువడినప్పుడు 1934 లో బంగారపు విలువ పడిపోయినపుడు బ్రిటీషు ప్రభుత్వం 'మారొటోరియం' ప్రకటించింది. 1932-33 లో గ్రామీణ బాంకులు 'అధోగతిలో వున్నప్పుడు అమెరికా ఇతర కాంటినెంటల్ బాంకులు, డిపాజిటర్ల రక్షణ కొరకు ఋణాల చెల్లింపులు వాయిదా వేసినవి. వలస దేశాలు రైల్వే కంపెనీలకు ఇతర వ్యవస్థలకు కనీస లాభాలు రాబట్టటానికి నిర్ణయాలు చేసినవి. ధరల పతనంతో క్రుంగిపోయిన రైతుల శిస్తులు - పన్నులు యథావిధిగా వుంచి బలవంతపు వసూళ్ళకు పాల్పడి, - ఆర్థిక సంక్షోభకాలంలో - ఇన్‌కమ్‌టాక్సు, సూపర్ టాక్సులను తగ్గించి కాపిటలిస్టులనుద్ధరించినవి.

ప్రపంచ ఉత్పత్తిదారుల పోటీ, తద్వారా వచ్చే ప్రపంచ ధరల మార్పులు నుండి పరిశ్రమలకు రక్షణ కల్పించటానికి ప్రభుత్వాలు - సబ్సిడీలు - టారిఫ్‌లు ద్వైపాక్షిక

వొప్పందాలు, బార్టర్ కొనుగోళ్ళను సమాన మారకపు నిధులను కొత్తగా కనిపెట్టినయ్. ధరలలో వ్యత్యాసాలు దేశాల మధ్యేకాక, ఒకే దేశంలో రాష్ట్రాల మధ్య, వివిధ ప్రాంతాల మధ్య వుండి స్వదేశీ వినియోగదారులు ఒకే రకపు వస్తువులకు అధిక ధరలు చెల్లిస్తుంటే, సబ్సిడీలు వగైరాల వలన ఇతరుల ప్రయోజనాలు సులభతరం చేయబడినయ్. స్వదేశీ పరిశ్రమలు గవర్నమెంటు డిపార్ట్‌మెంట్ల స్టోర్లను కొనుగోలు చేయదలిస్తే, వాటికి అధిక ప్రాధాన్యత నిచ్చినయ్. స్థానిక పరిశ్రమలకు ఇండియాలో 10% ప్రాధాన్యత ఈయబడింది. రెవిన్యూ టాక్సులకై విధించబడిన రెవెన్యూ డ్యూటీలు కూడా కాపిటలిస్టు పరిశ్రమలకు రక్షణగా మారినయ్. పెట్టుబడి దారీ దేశాల పారిశ్రామిక ఉత్పత్తుల రక్షణ కొరకు అతి జాగ్రత్తగా రూపొందించిన బార్టర్ విధానం, కొన్ని సరుకుల ఎగుమతుల పై నిషేధం, సులభ దిగుమతి విధానాలు, ఎగుమతులకు ప్రోత్సాహకాలుగా రైల్వే, షిప్పింగు ఛార్జీల తగ్గింపు, రవాణా నష్టాలకు పరిహారాలు, విదేశీ ద్రవ్య మారకాలలో జరిగే గమ్మత్తులతో, సామ్రాజ్యవాద ప్రభుత్వాలే కాక ప్రజాస్వామ్య ప్రభుత్వాలూ వారి స్థానిక ప్రభుత్వాలను, వాణిజ్యాన్ని వారి ఇతర ప్రయోజనాలను రక్షించే ఏకైక ధ్యేయంతో కృషి చేస్తున్నయ్. పారిశ్రామిక ఉత్పత్తుల అమ్మకాలపై వర్తక దౌత్యాలను నెరపుతున్నయ్.

ఇటీవల కాలంలో ఏర్పాటు చేయబడిన గాట్ (GATT)[5] వరల్డ్ మానిటరీఫండ్ (ప్రపంచ ద్రవ్యనిధి) జెనివా, హవానా వర్తక సమావేశాలు, ప్రపంచ దేశాల కరెన్సీని ప్రపంచ మారకాలను నిలకడగా వుంచి కాపిటలిజానికి పునరాశ్రయం కల్పించటానికి ఉద్దేశించబడినవే. యుద్ధానికి పూర్వం విదేశీ మార్కెట్లకు ప్రవేశం లేనప్పుడు, వారి విపణులను వారి దేశాలకే పరిమితం చేసుకొన్నారు. విదేశీ ద్రవ్యపు కొరత వలన బడుగు, బలహీన దేశాలు ఆంగ్లో అమెరికన్ యాంత్రిక తయారీలను కొనలేకపోయినయ్. ప్రపంచ ద్రవ్యనిధి వాస్తవానికి పారిశ్రామిక దేశాల ప్రయోజనాలకై ఉద్దేశించబడినది. అభివృద్ధి చెందిన దేశాలు చట్టాలు స్వంతం చేసుకొని త్వరితంగా అభివృద్ధి చెందుతున్న దేశాలను ఆర్థికంగా నష్టపరచి తాము లాభిస్తాయి. (HINDU 10.4.43) ప్రపంచబాంకు ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్టు బాంకులు, పాశ్చాత్యదేశాలకు సాయం చేస్తూ, భారతదేశం వంటి బలహీన దేశాలకు ఐక్యరాజ్య సమితి ద్వారా సన్‌ఫెడ్ కై చేసే ప్రయత్నాలను సాగనీయటంలేదు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనూ, ఆ తర్వాత ఇండియాలో పారిశ్రామిక వాణిజ్య, పట్టణ వర్గాల రక్షణకై పారిశ్రామిక ఆర్థిక మరియు అభివృద్ధి సంస్థల నేర్పాటు చేసి, ఆహార వస్తువులు, ఇతర నిత్యావసరవస్తులపై కంట్రోళ్ళు, రేషనింగులు పెట్టి పట్టణ

వృత్తి జీవులను, కార్మికులను తృప్తి పరచింది. ప్రభుత్వ ప్రైవేటు రంగాలలోని జీతగాళ్ళందరికీ ధరల ఇండెక్సుననుసరించి యుద్ధకాలంలో అలవెన్సులు ఇవ్వబడినవి. స్థానిక ఆహార నిల్వలను యుద్ధావసరాలకు తరలించటంతో, బెంగాలు, బీహారు, ఒరిస్సాలలో ఆకలి - కరువులు తాండవం చేసినయ్. పారిశ్రామిక వస్తువుల ధరలు, సేవలపై తిండి బట్టలపై గ్రామీణ ప్రాంతాలలో విధించిన కంట్రోళ్ళు, రేషన్లను ప్రభుత్వం సమర్ధవంతంగా అమలు చేయలేక పోయింది. దీనివలన గ్రామాలనుండి పట్టణాలకు సంపద అదృశ్యబదిలీ ఎక్కువైంది. యుద్ధకాలపు పన్నుల విధానం, టాక్సేషన్ల వలన రైతులు కూటికి కూడా గతిలేని వారయ్యారు.

పారిశ్రామిక ఉత్పత్తుల దిగుమతులు పెంచి, స్థానిక పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు రక్షణ కల్పించక కళలను చేతి వృత్తులను నాశనం చేసి రైతులను, వృత్తి కళాకారులను నిరాధారులను చేసినవి.

ఋణ విముక్తి సౌకర్యం వలన పాత బాకీలనుండి రైతులకు కొంత వెసులు బాటు కల్పించినా, భూమి తనఖా బాంకులు, బహుళార్థ సాధక సహకార సంఘాలు ఆర్థిక పుష్టి లేకపోవటం వలన ఫార్వర్డ్ కంట్రాక్టుల వలన, వడ్డీ వ్యాపారుల కబంధహస్తాల నుండి రైతులకు విముక్తి కలుగలేదు.

కాపిటలిజం ప్రత్యేక ఉత్పత్తుల పెరుగుదలకు రకరకాల వత్తిళ్ళను అమలు పరచేది. ఆఫ్రికా దేశంలోని 'బలవంతపు శ్రమ' దీనికి (Forced Labour) ఉదాహరణ. ఇండియాలో ఇండిగో (నీలిమందు) ప్లాంటర్లకు, యూరోపియన్ వర్తకులకు బ్రిటిషు ప్రభుత్వం సహాయకారిగా వుండి బీహారు - చంపరాన్ మొదలయిన రైతులకు అత్యంత దుర్భర పరిస్థితులు కల్పించి, బలవంతంగా నీలిమందు పండించారు. ఆహారం, పశువుల మేతలను కూడా పండించనీయలేదు. ఆధునిక ప్రపంచ చరిత్రలో, మొట్టమొదటి చరిత్రాత్మకమయిన సత్యాగ్రహోద్యమం చేసి మహాత్మాగాంధీ, బాబూరాజేంద్రప్రసాద్‌లు, యూరోపియన్ ప్లాంటర్ల ఉక్కు పిడికిలి నుండి రైతులను విడిపించారు.

అలానే కూలీలను అయిదు సంవత్సరాల కంట్రాక్టుతో (Indentured Labour) నేటాల్ ఇతర ఆఫ్రికా దేశాలకు ఇండియాలో డార్జిలింగు, నీలగిరి వంటి ప్రాంతాలకు బర్మా, మలయా, సిలోన్‌లకు వాస్తవానికి బానిసలుగా వేలాది మందిని ఎగుమతి చేశారు. కంట్రాక్టు ముగిసిన తరువాత వారు ఇళ్ళకు తిరిగిరావటానికి ఏ

వసతులూ కల్పించేవారు కాదు. ఇండియన్ గవర్నమెంటు ఇతర వలస సామ్రాజ్యాధిపతులతో, యూరోపియన్ ప్లాంటర్స్‌తో కుమ్మక్కై, నిరుపేదలయిన భారతీయులను ఈ కంట్రాక్టు కూలీలుగా మార్చింది. బానిసత్వాన్ని రద్దు చేశామని చట్టాలు చేసిన పది సంవత్సరాలకు 1853లో ఈ దౌర్భాగ్యపు కంట్రాక్టుకూలిని గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టబద్ధం చేసింది. 1860 లో ఒక పరిశీలకుడు ఇలా వ్రాశాడు. 'పశువులను సంతలో కొన్నట్లు, U.S.A. లో బానిసల వ్యాపారం సాగినట్లు ఈ వ్యవహారం సాగింది.' మగ కూలీలకు నెలకు 5 రూపాయలు, ఆడవారికి 4 రూపాయలు చెల్లించేవారు. కంట్రాక్టు ముగియకముందే పారిపోవటానికి ప్రయత్నించిన వారిని తమ ప్లాంటేషన్లలో నిర్బంధించేవారు. జైళ్ళలో వేయించేవారు. వీరు దాదాపు తమ కంట్రాక్టు కాలమంతా నిర్బంధంలోనే గడిపేవారు. దేశబంధుమిత్ర తదితరుల పోరాటంతో, ఈ చట్టం యుద్ధానంతరం రద్దు చేయబడింది. 1926 వరకు అగ్రిమెంటు అతిక్రమణ చట్టం అమలులో వుంది. ఈ దుర్మార్గం, వివిధ మాయోపాయాలతో, కిడ్నాపులతో స్త్రీ, పురుషుల పై అత్యాచారాలతో కొనసాగింది (అస్సాం టీ ప్లాంటేషన్లు). రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ లేబర్' "నిర్బంధాలు ఎంత భారీగా జరుగుతున్నదీ తెలియరాదు. కానీ అమలులో వున్నవి" అని అభిప్రాయపడింది. 1935-55 మధ్య కాలంలో నేను సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యునిగా వున్న కాలం వరకు నా పరిశీలనలో, అనుభవంలో ఇండియా, అస్సాంలలో ఈ దుర్మార్గాన్ని అరికట్టటానికి ప్రత్యేకమయిన చర్యలేవీ చేపట్టలేదనే అవగాహనకు వచ్చాను. నేటి భారతదేశంలో ప్లాంటేషన్ కూలీల పరిస్థితి ఇలా వుంటే విదేశాలలో వలసలలో ఈ ఇండెంచర్డు లేబరు ఇంకెంత దుర్భరంగా వుండేదో ఊహించవచ్చు.

అమెరికా అంతర్యుద్ధ సమయంలో (Civil War)[8] బ్రిటీషు గవర్నమెంటు లాంక్‌షైరు ప్రత్తి వ్యాపారులకు ప్రత్తి కరువు ఏర్పడిందని గ్రహించారు. వెంటనే బ్రిటీషు గవర్నమెంటు, ఇండియా ప్రభుత్వాన్ని 'పొడుగు పింజ' ప్రత్తిని భారతదేశంలో ఉత్పత్తి చేయటానికి సత్వర చర్యలు చేపట్టాల్సిందిగా ఆదేశించింది. ఇండియా గవర్నమెంటు ప్రత్యేక పరిశోధనా కేంద్రాలు నెలకొల్పి, కొన్ని రకాల పొడుగుపింజ ప్రత్తి విత్తనాలను అమెరికా నుండి దిగుమతి చేసుకొన్నది. సుక్కూరు బారేజీ ఇరిగేషను ప్రాజక్టు, ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీలీవిధంగా ఏర్పడినవే.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటీషు గవర్నమెంటు ప్రత్తి, నూనె గింజలు, కోకో, రబ్బరు వగైరాలను ఆఫ్రికా దేశాలలో ఇలానే అభివృద్ధి పరచింది.

ఆర్థిక మాంద్యంలో (1930-35) ప్రభుత్వాలు ప్రత్యేక చట్టాల ద్వారా కాఫీ, టీ, రబ్బరు ప్లాంటేషన్ల విస్తీర్ణం ఉత్పత్తులు తగ్గించి ప్రపంచ మార్కెట్లలో వీటి ధరలు పెంచినవి. యూరోపియన్ ప్లాంటర్లు అధికంగా లాభాలార్జించారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో కాపిటలిస్టు ప్రభుత్వాలు ఆహార వాణిజ్య పంటలు, ప్లాంటేషన్ల ఉత్పత్తులను అధికం చేసినవి. శ్రామికులకు అదనపు బోనసులు, వ్యవసాయ ఉత్పత్తులకు అధిక ధరలు, పచ్చిక భూములను వ్యవసాయ భూములుగా మార్చి, అనధికార మాగాణీ సాగుకు అనుమతులు ఇచ్చి శిస్తులలో మినహాయింపులు, దళారీలను వెళ్లకొట్టి, వ్యవసాయ మార్కెట్ల సామాజీకరణ, కొన్ని రకాల పంటలకు గరిష్ఠ ధరలు, వగైరా ప్రోత్సాహకాలు కల్పించి యువకులను వ్యవసాయం వైపు మళ్ళించినవి.

ఇంత వరకు నిర్లక్ష్యం చేయబడిన ఈ పరిశ్రమపై వీరెందుకింత శ్రద్ధ చూపెట్టారు? లాయడ్ జార్జి (బ్రిటన్ ప్రధాని) 13-4-40 న బ్రిటీషు పార్లమెంటులో 'యుద్ధంలో భాగస్వాములయిన గొప్ప ప్రభుత్వాలు, యుద్ధ భీతితో ఇతర ప్రభుత్వాలు' - ముస్సోలిని, హిట్లరు, స్టాలిన్ వంటి వారు అధిక ఆహారోత్పత్తి యుద్ధసన్నిద్ధతలో భాగం అని భావించారు' అని చెప్పారు. ఆహారం, నూనె గింజలు, ప్రత్తి, జూటు ఉన్ని వంటివి లేకుండా యుద్ధాలు చేయలేరు. ప్రపంచ మార్కెట్లు విచ్ఛినమయినవి. విదేశీ దిగుమతులపై ఆశలేదు. అందువలన వ్యవసాయధరలను అదుపులో వుంచటానికి గతంలో చేసిన నిబంధనలనన్నిటినీ సడలించినవి.' ప్రపంచ వర్తకం ఎండమావి అయింది. స్వయం సమృద్ధి సాధనే వీరికి శరణ్యం.' గిట్టుబాటుకాని ధరలకు రైతులు వళ్ళు విరుచుకొని పనిచేయరని, వారిని అధికంగా శ్రమింప చేసి, ఆహార నిల్వలు పెంచు కోవటానికి ఈ ప్రభుత్వాలు రైతుల పట్ల ఉదార వైఖరి నవలంబించినవి.

ఈ పరిస్థితులలో కూడా కాపిటలిస్టు ప్రభుత్వాలు, వారితాబేదార్లు తమ పాత అలవాటు మానలేదు. బీద రైతుల దోపిడీ జరుగుతునే వుంది. పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు వ్యవసాయ ఉత్పత్తులను కరెన్సీ చలామణీ పెరుగుదలతో పోల్చిచూస్తే వ్యవసాయ ధరలు పెరుగుదల చాలా తక్కువగా వుంది.

బ్రిటీషు వ్యవసాయ మంత్రి 5-1-1940లో వ్యవసాయ ఉత్పత్తుల గ్యారంటీ ధరలు యుద్ధం ముగిసిన వెంటనే మెల్లగా తగ్గించబడతవి' అని గ్యారంటీ ధరలు యుద్ధ సమయంలో మాత్రమే అమలులో వుంటవని' చెప్పాడు. 1954 కు వ్యవసాయదారులకు కల్పించిన రక్షణలన్నీ ఉపసంహరింపబడినయ్.

ఆర్థిక మాంద్యపు దుష్ప్రభావాలనుండి రైతుల రక్షణ కొరకు U.S.A. 'న్యూడీల్' తో చొరవతీసుకున్నది. (F.D. రూజ్‌వెల్టు 193-40 సామాజిక న్యాయం కొరకు చేపట్టిన చర్యలనే NEW DEAL అని పిలిచారు.) ఆగ్రహించిన అమెరికా రైతాంగపు వత్తిడి ఫలితంగా ఇది సాధ్యపడింది. ఎట్టకేలకు 'యుద్ధకాలపు ధరలలో 90% ధరలను, యుద్ధానంతరం రెండు సంవత్సరాలు పొడిగించుటకు అమెరికా ప్రభుత్వం అసెంబ్లీలో చట్టం చేసింది. ఈ రక్షణ 1954 వరకు కొనసాగింది. ఇండియా ప్రభుత్వం ధాన్యం, గోధుమలకు కనీస ధరలను నిర్ణయించింది. 1952 వరకు వీటిని గరిష్ఠ ధరల నిర్ణయంతో అదుపు చేసేవారు.

ప్రపంచ యుద్ధానంతరం F.A.O.[10] (ఫుడ్ అండ్ అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్) ఆవిర్భావం తర్వాత, 1939 నుండి వచ్చిన కరువులు కాపిటలిస్టుల దృక్పధాన్ని మార్చలేదు. అలానే ఇంటర్నేషనల్ బాంకు, కొలంబో ప్లాను[11], మార్షల్ ప్లాను[12] లు కూడా వ్యవసాయం పట్ల ప్రపంచపు బాధ్యతను గుర్తించలేదు.

ఇంటర్నేషనల్ బాంకు 2274 మిలియన్ డాలర్ల అడ్వాన్సులలో వ్యవసాయానికి 223 మిలియన్లు అంటే 10.4% అమెరికానుండి ప్రైవేటు పెట్టుబడులకు గాను 1946-53 కాలంలో 5081 మిలియన్ డాలర్లు ఖర్చు జరిగితే అందులో 42 మిలియన్లు అంటే ఒక శాతం కన్నా తక్కువ వ్యవసాయానికివ్వటం జరిగింది. ఇందులో 36 మిలియన్లు లాటిన్ అమెరికా కివ్వబడింది. అమెరికా ఎగుమతి మరియు దిగుమతుల బాంక్ (U.S. Export and Import Bank) 1954 సంవత్సరాంతానికి 261 మిలియన్ డాలర్లు వ్యవ సాయానికి కేటాయించింది. ఈ మొత్తం ఆ బాంకు ఇతర వర్గాలకు కేటాయించిన దానిలో 4.5% మాత్రమే.

బ్రిటీషు ప్రభుత్వం వ్యవసాయానికి 10% మాత్రమే తన విదేశీ పెట్టుబడులలో కేటాయించింది. మార్షల్ ప్లాను ద్వారా యూరప్ దేశాలకందించిన 14000 మిలియన్ డాలర్లలో, 200 మిలియన్లు ట్రాక్టర్లు ఇతర వ్యవసాయ యంత్రాల ద్వారా అందించటం జరిగింది. రైతుల సేవింగ్సు (పొదుపు) చాలా తక్కువ. వారి కందించబడుతున్న సహాయం చాలీచాలకుండా వుంది' అని F.A.O. అంగీకరించింది. 'చాలా దేశాలు తమ దేశాలలోని ఆర్థిక వసతులు స్వల్పమనీ, ఈ వసతులతో సామాన్యమయిన అభివృద్ధిని సాధించటం కష్టమనీ అభిప్రాయపడినవి. అధిక శాతం ప్రపంచ జనాభాకు బ్రతుకు దెరవు కల్పిస్తున్న వ్యవసాయం అనైతికంగా నిర్లక్ష్యం చేయబడుతున్నది.

'ఋణ సౌకర్యం కలిగించే దేశాలకు వలసలుగా వుండటానికి యిష్టపడని బలహీన దేశాలకు - ఉత్పాదక రంగంలో పెట్టుబడులను అంతర్జాతీయ ఒప్పందాలు ప్రోత్సహించగలవు' అని Mr. వోయటిన్స్కీ అభిప్రాయపడ్డాడు.

అమెరికా ప్రభుత్వాన్ని 'ఆర్థికాభివృద్ధి సమావేశం' కాపిటలిస్టులపై పక్షపాతవైఖరి ప్రదర్శించిందనీ, వ్యవసాయ ప్రయోజనాలను నిర్లక్ష్యం చేసిందనీ ఆరోపణ చేసింది. యుద్ధానంతరం వివిధ రంగాల నష్టాలను భరించిన ట్రెజరీ - యుద్ధకాలంలో ఉత్పత్తులను ప్రోత్సహించి, యుద్ధానంతరం అదనపు ఉత్పత్తుల గతి పట్టించుకోలేదు అని అభిప్రాయపడింది.

'జీవన ప్రమాణాల పెంపుదల, వార్ధక్య ఫింఛన్లు, విద్యా, వైద్య అవకాశాలు, గృహవసతి, ఋణ విముక్తి ఇవన్నీ ఆర్థికంగా తలసరి ఆదాయం ఎక్కువగా వున్న వర్గాలకే కల్పించబడినవి. అమెరికా ప్రభుత్వం మద్దతు ధరలను ప్రవేశ పెట్టిన నాటి నుండీ వ్యవసాయానికి అందించిన తలసరి సాయం ఒకడాలరు కన్నా తక్కువ.

1955లో బ్రిటీషు రైతుల డిమాండ్లను మాసింగ్ హామ్ ఈ విధంగా చెప్పాడు. స్థిరమయిన ధరలు, వడ్డీలేని పెట్టుబడులు, ఋణసౌకర్యం, మిశ్రమ, సాంద్ర వ్యవసాయం, పని కల్పన, మనుగడకై సమైక్య ఆర్థిక విధానం, తద్వారా ఇల్లు - కుటుంబం - శ్రమల పరస్పర అనుసంధానం, భూసారాన్ననుసరించి పరిపూర్ణమయిన ఉత్పత్తులు, అదనపు నిల్వల అమ్మకాలు, వాణిజ్య పంటల ఎగుమతులను నిరోధించటం, పలురకాల పంటలు, నిల్వలు, చిన్న యంత్రాలతో వ్యవసాయక శ్రమ, ప్రాంతీయంగాను, సహకార వ్యవస్థల ద్వారాను అమ్మకాలు కొనుగోళ్ళు, యజమాని విద్యార్థి సంబంధం, పని ఒక జీవన మార్గం అదే జీవితపు ధ్యాసకాదు, తక్కువ పనిగంటలు ఎక్కువ జీతాలు, ప్రాంతాల వారిగా చిన్న వర్కు షాపులు వీటిని ఒక కేంద్ర వ్యవసాయ క్షేత్రాధీనంలో వుంచటం, తమ వసతులన్నిటినీ భారీ కార్యక్రమాలకు అంకితం చేయటం, స్వంత అవసరాలకు పని విరామ సమయాలలో తమ స్వంత భూముల్లో వ్యవసాయం చేయటం (Part - Time) వికేంద్రీకరణ, ఆత్మగౌరవం, పరస్పర సహకారం". (Prophery of Famine P - 130).

ప్రపంచ ప్రజాస్వామ్యదేశాలలోని రైతులందరి డిమాండ్లు పై విధంగానే వున్నవి.

సాయిల్‌బాంకులు భూసార పరిరక్షణ చర్యలు సరైన ఎరువులు తగిన మోతాదులో అందించటం, స్వల్ప ఖరీదు ఉపయోగం కల యంత్రాల వాడకం, కొనుగోలు, వ్యక్తిగతంగా, సంయుక్తంగా, పశుగణాభివృద్ధి, కోళ్ళ పరిశ్రమ, పాడి పరిశ్రమ, తేనెటీగల

పెంపకం రైతులు చేపట్టనట్లయితే ఆ తప్పు ప్రభుత్వాలదే. ఈ ప్రభుత్వాల ధ్యేయం కాపిటలిస్టులకు లాభాలార్జించి పెట్టడమే.

స్వల్ప వడ్డీలకు ఋణసౌకర్యం, అతివృష్టి అనావృష్టి వరదలు, అగ్ని ప్రమాదాల వలన నష్టాలకు, పశునష్టానికి భీమా సౌకర్యం, బహుముఖీనమయిన సాంద్ర వ్యవసాయ పద్ధతులు, సహకార వ్యవసాయ ప్రోత్సాహం, శాస్త్రీయ వ్యవసాయంలో శిక్షణ, పనిలో నైపుణ్యం సామర్థ్యం పెంపుదల లేకపోతే అవి ఎవరి తప్పులుగా భావించాలి? ఆధునిక ప్రభుత్వాలే దోషులు.

భరించలేని వడ్డీల వలన మరియు సహకార మార్కెటింగు అభివృద్ధి, పాత ఋణాల రద్దు, తగినంత ఋణ సౌకర్యం, ప్రభుత్వ సాయంతో ప్రాసెసింగులను ప్రభుత్వాలు కల్పించక పోవటం వంటి వాటి వలన వ్యవసాయంలో మాంద్యం ఏర్పడు తున్నది. బలహీన దేశాల ఆర్థికావశ్యకతలను, అధ్యయనం చేసిన ఎవరికయినా నీటి మురుగు పారుదల సౌకర్యాలు, భూసార పరిరక్షణ, అడవుల పెంపకం, కోట్లాదిగా వున్న విద్యావిహీనులు బీదలు, నిర్లక్ష్యం చేయబడినవారు అయిన రైతాంగానికి, ఈ చిన్న పెద్ద కార్యక్రమాలు స్వంతంగా నిర్వహించటం ఎంత కష్టమో అర్థం కాగలదు. ఆధునిక ప్రభుత్వాలు 1931-33లో వచ్చిన ఆర్థిక మాంద్యంలో మినహా వ్యవసాయం పట్ల ఆత్మహత్యా సదృశ్యమయిన విధానాన్నే అనుసరిస్తున్నవి.

2% శాతం వ్యవసాయ ఉత్పత్తులు పెరగటానికి సంవత్సరానికి (జపాన్ మినహాయించి) 2 బిలియన్ డాలర్ల పెట్టుబడి అవసరమవుతుందని F.A.O. శాస్త్రవేత్తలు భావించారు (1955).

రిజర్వుబాంక్ ఆఫ్ ఇండియా మరియు దాని రూరల్ క్రెడిట్ సర్వే కమిటీ కోఆపరేటివ్‌లలో ప్రభుత్వ జోక్యపు ఆవశ్యకతను నొక్కి చెపుతూ, ఈ శతాబ్దపు ప్రథమార్ధంలో ప్రభుత్వాల వైఫల్యాలను దుయ్యబట్టినవి.

సహకారావశ్యకతను తెలియజేస్తూ "ఎవరయితే అణచబడి వున్నారో వారి జీవిత స్థితిగతులను వారే మార్చుకోలేరు' అని పేర్కొన్నవి.

'బీద, మధ్య తరగతి రైతులను బాల్యంలోనే కాళ్ళకు పక్షవాతం వచ్చిన బిడ్డలతో పోలుస్తూ ఈ బిడ్డలు తమపై తామాధారపడి తామే ఒక సంఘంగా ఏర్పడి వ్యక్తిగతంగా పునరావాసం కల్పించుకోవలసిందని నేటికి ఎవరూ వారికి చెప్పలేదు." (రూరల్ క్రెడిట్ సర్వే).

"ఇండియాకు నేడు కావలసింది సమగ్రమయిన, నిశ్చితమైన నీతి వంతమయిన భావోద్రేకపూరితమయిన సత్ సాంప్రదాయాలతో కూడిన గ్రామీణ పునరుజ్జీవన కార్యక్రమం. వివక్షతలేని, పనిపై ప్రత్యేక శ్రద్ధతో, భారతదేశ ఆర్థిక రంగంలో అభివృద్ధి పరిపూర్ణత సాధించే సశాస్త్రీయమయిన ఒక బృహత్ప్రణాళిక. ఎందరో మహానుభావులు ఈ దేశ జన బాహుళ్యానికి అందించిన ఆధ్యాత్మిక సందేశం నేటి అవసరం" అనిఆసర్వే ఉద్ఘాటించింది.

అపరిష్కృతంగా వున్న గ్రామీణ ఋణసౌకర్య విస్తృత పరిధిని ఈ సర్వే వెలికితెచ్చింది. పరిష్కారానికి తీవ్రచర్యలు సూచించింది. ఈ సలహాలు రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో (1956-61) పాటించే అవకాశముంది.

రైతులు తమకు తాము సహాయకారులు కాదని, ఆధునిక వ్యవసాయ పద్ధతు లలో సైన్సు పాఠాలు నేర్చుకోరని వారి నెవరూ నిందించలేరు. బూర్జువా యూనివర్శిటీలకు ఈ విధమయిన ఆరోపణలు చేయటం రివాజయింది. ప్రభుత్వ వైఫల్యాలనీవిధంగా వారు కప్పిపుచ్చుతున్నారు. ఎక్కడో మారుమూల గ్రామాలలో కతాచితుగా జరిగే సంఘటనలను ఉదహరించి, రైతులు శాస్త్రీయంగా కాలానికి ముందు నడవలేరనటం భావ్యం కాదు. రైతులందరినీ గురించి, నిజానికి దగ్గరగా వున్న సరియైన అవగాహనతో చెప్పటం అవసరం. అవసర పరిస్థితులలో తమకు లాభదాయకము, అభివృద్ధికరమయిన ప్రతిస్పందన రైతులలో ఎప్పుడూ కన్పిస్తునే ఉంది.

నూతనావిష్కరణలకు, అభివృద్ధికి రైతులు వ్యతిరేకులయినట్లయితే - గత 50 సంవత్సరాలలో ఇంతభారీగా వేరుశనగ లిన్‌సీడ్, నూనె గింజలు, టీ, కాఫీ, రబ్బరు, వర్జీనియా పొగాకు ఇంగ్లీషు కూరగాయలు, చెరుకులను ఇండియా - చైనా ఇంకా ఇతరదేశాల రైతులు ఎలా సాగుచేయగలిగారు? కంబోడియా, అమెరికా దేశాల పొడుగు పొట్టి పింజరకాల ప్రత్తి పండించటానికి ఉత్సాహం ఎందుకు చూపారు? వర్జీనియా పొగాకును, ఆంధ్ర, మైసూరు, గుజరాతు రాష్ట్రాలలో ఇంత భారీగా ఎలా పండించ గలుగుతున్నారు. అమెరికాలో ప్రత్తి, మలయా, ఇండోనేషియాలలో రబ్బరు, ఆస్ట్రేలియాలో గోధుమలు, బాల్కన్ దేశాలు, మధ్యయూరప్‌లో మొక్కజొన్న, పొటాటో ఈ పంటలన్నీ ఈ మధ్యకాలంలో వచ్చినవే. ఒకవేళ వీటి సాగు యూరోపియన్ కాపిటలిస్టులు భారీగా చేయటం వలన సాధ్యపడిందని చెబితే, పశ్చిమ ఆఫ్రికాలో కోకో, కాటన్; సిసల్, నూనె గింజలు, మలయా, జపాను రైతుల బియ్యం, రబ్బరు పండించటానికి చూపిన ఉత్సాహాన్ని

ఏ విధంగా కొట్టిపారవేయగలం? 1921లో మెక్సికోలో చట్టం చేసిన పది సంవత్సరాలకు చెరకు ఉత్పత్తి 2వేల టన్నుల నుండి నాలుగున్నర మిలియన్ టన్నులకు పెరిగింది. బార్లీ 85000 నుండి 97683 టన్నులకు, ధాన్యం (బియ్యం) 30వేల టన్నుల నుండి 78వేల టన్నులకు పెరిగింది. మెక్సికో ఆహారంలో స్వయం సమృద్ధిసాధించింది.

జపాను వరి సేద్యం ఇండియారైతుల నాకర్షించగనే ఈ వ్యవసాయ పద్ధతి నమ్మశక్యంకాని ఆదరణ పొందింది. స్వరాజ్యం వచ్చిన నాలుగు సంవత్సరాల తర్వాత జూటు ఉత్పత్తి 60% దేశావసరాలను తీర్చింది. సాంప్రదాయక (పాత) వ్యవసాయ పద్ధతుల నుండి నూతన విధానాలకు, నూతన విధానాలలో కొత్త పంటలకు, పాత పంటలకు తాము మారగలమని వ్యవసాయ ఆర్థికత్వాన్ని విప్లవాత్మకంగా ఉద్ధరించ గలమని ఎన్నో ఉదాహరణలు చూపవచ్చు. నిజానికీ విషయాలలో రైతులు అనావశ్యక మయిన తొందర పాటును ప్రదర్శించారు. మనుగడకు వాణిజ్యావసరాలకు తరతరాలుగా వస్తున్న సమతూకం కలిగిన సాంప్రదాయిక పద్ధతులు వదలి, నమ్మికలేని ప్రమాద భూయిష్ట మయిన కాపిటలిస్టుల 'ఒకే పంట' విధానాన్ని అనుసరించారు.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచ వ్యాప్తంగా ఫెర్టిలైజర్ల వినియోగం రెట్టింపయింది. ట్రాక్టర్ల వాడకం మూడు రెట్లు పెరిగింది. బలహీన దేశాలు ఆహార పంటలపయి ప్రత్యేక శ్రద్ధ వహించినయ్. సింథటెక్ పెస్టిసైడ్లు, కలుపు నివారణ మందులు తోడ్పడినవి. పచ్చిక బీళ్ళు పెరిగినవి. పశుపోషణలో పాడి పరిశ్రమలో నూతన అభివృద్ధి జరిగింది. పశువుల జాడ్యాలను నివారించగలిగారు. కృత్రిమ పశుసంపర్క కేంద్రాలు ఏర్పడినవి. వివిధ ఆర్థిక, సాంకేతిక, సామాజిక పద్ధతుల ద్వారా కమ్యూనిస్టు దేశాలను మినహాయించి 25% వ్యవసాయాభివృద్ధి 1938-54 మధ్య కాలంలో ప్రపంచమంతా జరిగింది. రైతుల అదనపు ఉత్పత్తి రాశులు పెరిగినవి. ఐసన్‌హోవర్ (అమెరికా ప్రెసిడెంటు) 'ఒక బుషెల్ (8 గాలన్లు) అమ్మకం జరిగితే ఒకటిన్నర బుషెల్ వచ్చి చేరిందని' ఆశ్చర్యంతో ప్రకటించాడు.

సీజన్లకు (ఋతువులకు) నేలకు, మార్కెటుకు అనువయిన, తమకు లాభ దాయకమయిన మార్పును రైతులు ఎల్లప్పుడూ అంగీకరిస్తున్నారు. పరిశ్రమలే ఈ విషయంలో వెనుకబడివున్నయ్. తమ ఖరీదైన యంత్రాలు అరిగిపోయేవరకు, ఆశించిన లాభాలు వచ్చేవరకు వారు ఆగుతారు. రైతులు కాపిటలిజం రుచి మరిగి త్వరత్వరగా పద్ధతులు మార్చుకొని నష్టాలపాలవుతున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచంలో వ్యవసాయ ఉత్పత్తుల కొరత చాలా ఎక్కువగా ఏర్పడింది. ఈ కొరత నుండి రక్షించుకోవటానికి, ప్రపంచ దేశాలు వ్యవసాయ ఉత్పత్తులు పెంచి, ప్రపంచ ప్రజల ఆకలిమంటను చల్లార్చటానికి ప్రపంచ దేశాల వత్తిడి వలన F.A.O. ఆవిర్భవించి, ఉద్ధృతమయిన ప్రచారం ప్రోత్సాహకాలతో ప్రపంచ రైతాంగాన్ని తమయావచ్ఛక్తినీ ఉత్పత్తికై వినియోగించేలా చేసింది. యుద్ధానంతరం ఈ పన్నెండు సంవత్సరాలు రైతులు తమ పై మోపబడిన ఈ బాధ్యతను ఆశించిన దాని కన్నా ఎక్కువగా నిర్వర్తించారు. ఉత్పత్తులు అధికంగా పెరగటంతో నార్త్ అమెరికాలో గోధుమరైతులు, బర్మా, థాయిలాండులలో బియ్యం రైతులు అదనపు పంటతో చిక్కులలో పడ్డారు. వారికేవిధమయిన రక్షణలు లభించలేదు.

1930 నుండి ట్రాక్టర్ల వినియోగం రెండింతలు, పంటనూర్పిడి యంత్రాల సంఖ్య 16 రెట్లు, ఫెర్టిలైజర్ల వాడకం మూడు రెట్లు పెరిగినవి. 1955లో ప్రత్తి పంట విస్తీర్ణం 14 శాతం తగ్గింది. 5% మొత్తం సాగులో తగ్గుదల కన్పించింది. 1954లో 6% విస్తీర్ణం తగ్గింది. కానీ దిగుబడులు 19% అదనంగా వున్నవని అంచనా వేయబడింది. పని గంటలు 47% తగ్గినవి. ప్రత్తిలో పనిగంటల తగ్గుదల 6% వుంది. రైతులు మారిన పరిస్థితులకు అనుగుణంగా మారగలిగారు. వీరిని ఎవరూ గుర్తించి గౌరవించలేదు అని' ఆర్థికాభివృద్ధి సమావేశం ఆక్షేపించింది.

అభివృద్ధి కాముకులు, గౌరవనీయులు అయిన రైతాంగానికి చేయూతనీయక పోగా ఆటవిక న్యాయంగా ఇష్టారాజ్యంగా ఏకపక్షంగా టాక్సులు ప్రభుత్వ వ్యయం వర్తక పారిశ్రామిక విధానాలు, కార్యక్రమాలతో వ్యవసాయ సంపదను వివిధ మార్గాలలో పారిశ్రామిక వాణిజ్య వర్గాలకు నిరంతరం ఆధునిక ప్రభుత్వాలు బదిలీ చేస్తున్నవి. కాపిటలిస్టుశక్తులనుండి, పట్టణ వాసుల, పెట్టుబడిదారుల వ్యామోహం నుండి, ప్రభుత్వాలు బయటపడనంత కాలం, రైతులు రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకోనంతవరకు, కార్మికులు రైతులపై ఈర్ష్య వీడనంతవరకు, మార్క్సియన్ శాస్త్రవేత్తలు గ్రామ స్వామ్యంపై తప్పుడు ధోరణి మాననంత వరకు, ఈ అన్యాయం విపణులలో వాణిజ్యంలో చట్ట సభలలో విశ్వవిద్యాలయాలలో అంతం లేకుండా కొనసాగుతుంది. ప్రజాస్వామ్యదేశాలలోనే ఇంతటి సాంఘిక అన్యాయం రైతులనెత్తిన కుమ్మరింప బడుతుంటే, కమ్యూనిష్టు నియంతల పాలనలో వారి ఉద్దేశపూరితమయిన అణచివేతకు ఆశ్చర్యపడనవసరం లేదు. కమ్యూనిష్టు ప్రభుత్వాలు రైతులను తమ ప్రధమ శత్రువులుగా పరిగణిస్తున్నవి.

# పెట్టుబడిదారీ దోపిడి - రైతాంగం

(Capitalistic Exploitation of peasants)

భూవ...లుగల, భూములులేని రైతుల ఆదాయాలలో దేశానికి, దేశానికి మధ్య అంతరాలుచాల ఎక్కువని కొందరి అభిప్రాయం. ఈ అంతరాలు రంగుజాతులవారు-తెల్లవారువున్నదేశాలలో వారివారి పనిసామర్ధ్యాన్ని బట్టి కలిగిందేగాని, కాపిటలిజానికి-సామ్రాజ్యవాదానికి ప్రమేయంలేదని వీరి వాదన. ఈ అంతరాలుండటమే పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దోపిడీకి వ్యతిరేక భావన లేక సిద్ధాంతం అని కూడా కొందరు చెప్పవచ్చు. (అంతరాలున్నాయి కనుక దోపిడీ లేదు అని వీరి సిద్ధాంతం)

వాస్తవానికి రైతులను, కార్మికులను దోపిడీ చేసి - శ్రామికులందరి రక్తం పీల్చి, బూర్జువానాగరికతను అభివృద్ధిపరచటమే - కాపిటలిజపుధ్యేయం. కాపిటలిజపు దోపిడీ సామర్ధ్యం, ఆ దేశాల ప్రజల రాజకీయ ఆర్ధికస్థాయి, స్థితిగతులు, రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాలతో ప్రత్యక్ష నిష్పత్తిలో (Directly proportional) వుంటుంది.

లెనిన్ నిర్వచించిన "కాపిటలిజపు అసమానాభివృద్ధి సూత్రం[1]" ఈ దోపిడీని బట్ట బయలు చేస్తుంది. కాపిటలిజం ఉచ్ఛస్థితిలో వున్నదేశాలు, అంతగా ఉచ్ఛదశలో లేని దేశాలపై పెత్తనంసాగిస్తవి. సామ్రాజ్యవాద కాపిటలిస్టు యంత్రాంగం హీనస్థితిలో వున్న కాపిటలిస్టు వలసలను (Colonies) దోపిడీ చేస్తాయి. ఫ్రాన్సుదేశస్తుల దృష్టిలో వారి వలసలు ఫ్రాన్సులోని సరుకులతో పోటీపడకుండా, మాతృభూమికి (ఫ్రాన్సుకు) అవసరమయిన ఉత్పత్తులను సరఫరా చేసే బాధ్యతగలిగినవి అని Prof. హాల్ తన "హిస్టరీ ఆఫ్ సౌత్ ఈస్ట్ ఏసియా" (ఆగ్నేయ ఆసియా చరిత్ర) అనేగ్రంథంలో వ్రాశాడు.

P.S. లోకనాథన్ వంటి భారతీయ శాస్త్రవేత్తలీవిషయం గ్రహించారు. కానీ వారి అవగాహన మాత్రం వేరుగా వుంది. వేరువేరు దేశాల ఆర్థికాభివృద్ధిలో సాధ్యపడే తరతమ భేదాలు దీనికి కారణంగా వీరర్థంచేసుకున్నారు. ఈ అవగాహనా వైరుధ్యానికి "కాపిటలిజపు అసమానాభివృద్ధి" కారణం, ఇంగ్లాండు-అమెరికాలలో పారిశ్రామిక-వాణిజ్యాలస్థాయి ఇప్పటికే ఉచ్ఛదశలో వుంది. అందువలన అక్కడ అభివృద్ధి రేటు స్వల్పంగా వుంటుంది. అంతగా అభివృద్ధి చెందని (Under developed ) ఇండియా-చైనాలలో అధిక అభివృద్ధి రేటును సాధించటానికి కృషి జరుగుతున్నది.

అత్యధిక ఆర్థికాభివృద్ధి కల సామ్రాజ్యవాద శక్తులు, రెండు లక్ష్యాలు సాధించగలవని లెనిన్ ముందుగా గ్రహించాడు. ఒకటి- అవి ఆర్థికాభివృద్ధి హీనంగా వున్న దేశాలను దోపిడీ చేయగలవు. రెండు ఆ దేశాల ఆర్థికాభివృద్ధిని, ప్రగతిని నిరోధించగలవు. మన ఆర్థిక శాస్త్రవేత్తలు - ఆంగ్లో -అమెరికన్ కరన్సీలను నిలకడగా వుంచటానికి పన్నే పన్నాగాలు (ప్రణాళికలు) వలస దేశాల ఆర్థిక ప్రగతిని నిరోధిస్తాయని తెలుసుకోవాలి. కానీ పెట్టుబడిదారీ సార్వభౌమాధికారం, వివిధదేశాల రైతాంగంపై చూపే ప్రభావాన్ని - అంతరాల అవగాహనను లెనిన్ సూత్రం తెలియచెప్పదు. ఈ అవగాహన పెట్టుబడిదారీ అసమానదోపిడీ ఘటనల (Law of uneven incidence of capitalistic explotation) సూత్రం అన్వయిస్తేనే తెలుస్తుంది. ఈ సూత్రపు అర్థాన్ని ఇలా వివరించవచ్చు- రైతులపై, కార్మికులపై ప్రపంచకాపిటలిజం ప్రభావం ఒకే విధంగా వుండదు. సంపూర్ణ రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యం, సంఘటితశక్తి, వర్గస్పృహ, విప్లవ చైతన్యం గల ప్రజలున్న దేశాలలో తక్కువ హానికరంగాను, ఒకటి లేక ఎక్కువదేశాల ఆర్థిక సార్వభౌమాధికారానికి లొంగివుండి, అభివృద్ధి నెరుగని రైతులు, కార్మికులు వున్న దేశాలలో, రాజకీయంగా ఆర్థికంగా సార్వభౌమాధికారంగల దేశాలకు అణగివున్న ఎక్కువదేశాలలో ఈ హాని ఎక్కువగా వుంటుంది. వలస దేశాలెందుకుదోపిడీ చేయబడుతున్నవో, ఈ దోపిడీలలోకూడా తేడాలెందుకున్నవో, ఈ దేశాల ప్రజల ముఖ్యంగా కర్షకుల - కార్మికుల రాజకీయ - ఆర్థికస్థితిగతులలో వ్యత్యాసాలెందుకున్నవో - ఈ రెండు సూత్రాల - కాపిటలిజం అసమానాభివృద్ధి సూత్రం - అసమాన దోపిడీ ఘటలన సూత్రం - ఆధారంగా వివరణ లభిస్తుంది.

కాపిటలిస్టు అసమానదోపిడీ ఘటనల సూత్రం - ఏ ప్రాంతంలో నయినా, ఏదేశంలోనయినా, కాపిటలిస్టుదోపిడీ బారినపడని కర్షక-కార్మికులను ఏ విధంగా

అణచివేసేది, ఏ విధంగా కాపిటలిజం, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు కాపాడబడేది, అర్ధం చేసుకొనటానికి ఉపయోగపడుతుంది. దేశాల మధ్య నెలకొన్న ఆర్థిక అసమానతల వలన, వివిధ సరుకుల ఉత్పత్తులలో అసమానతలుగల వివిధ దేశాలలోని శ్రామికులను - ఒకరిపై ఒకరిని రెచ్చగొట్టటానికి, శ్రామికులందరికీ ఆ దేశ ఆర్థిక పటిష్టతతో సంబంధం లేకుండా, ఉత్పత్తుల అసమానతలను పరిగణించకుండా - అందరికీ ఒకే విధమైన జీతాలు, ప్రతిఫలాలు, ఒకే విధమైన ధరలను కల్పిస్తూ, ప్రపంచకాపిటలిజం ఏ విధంగా పైచేయి అవుతున్నదో ఈ అసమాన ఘటనల సూత్రం తెలియచెప్తుంది.

పేరుకుమాత్రమే సామ్రాజ్యవాద దేశంగా వున్న స్వతంత్ర పోర్చుగల్ దేశంలోని బలహీనులయిన రైతులు ప్రపంచ కాపిటలిజం దోపిడీకి ఎక్కువ గురౌతారు. బ్రిటీషు కాపిటలిజం దోపిడి కెనడా కాపిటలిజపు దోపిడి కంటే ఎక్కువగా వుంటుంది. కెనడియన్ రైతుల ప్రతిఘటనాశక్తి ఎక్కువ. వ్యవసాయధరల స్థిరీకరణల శకారంభంలో, మద్దతు ధరల విధానం, సమన్వయధరల (Parity prices)[2] సిద్ధాంతం U.S. ప్రభుత్వం ప్రవేశపెట్టటానికి, అమెరికా రైతుల బలీయమయిన ఆర్థిక శక్తి, రాజకీయ ఒత్తిడీ ముఖ్య కారణం. ఆ తర్వాత తమ హక్కులను గుర్తించిన ఆస్ట్రేలియా, న్యూజిలాండు, జర్మనీ, ఫ్రాన్సు రైతాంగం ఈ బాటనేనడచినయ్. స్వరాజ్యం ఆలస్యంగా రావటం, రైతుల రాజకీయ వత్తిడులు ఆ కారణంగా ఆలస్యం కావటం వలన భారతదేశంలో మద్దతు ధరల విధానం ఆలస్యంగా 1954లో ప్రవేశపెట్టబడింది. సంఘటితమయిన భారత కార్మిక వర్గం - సిలోన్ వంటి ఇతర బ్రిటీషు వలసల కన్నా కాపిటలిజం చొరబాటును సమర్ధవంతంగా ప్రతిఘటించగలదు. కార్మికులు - కర్షకుల కన్నా దోపిడీని ఎక్కువ శక్తివంతంగా ఎదుర్కోగలరు. కార్మికుల సంఘటిత శక్తి, వారి వర్గస్పృహ, సిద్ధాంతపటిమ, శతాబ్దకాలపు దోపిడీ వ్యతిరేక చరిత్ర, ఇంటర్నేషనల్ ఆఫీసు అండ దండలు, రష్యా, చైనాలలో విప్లవ విజయాలు ఇందుకు కారణాలు, కర్షకుల ప్రతిఘటనా శక్తి అంతస్థాయికి ఎదగలేదు. బ్రిటీషు-అమెరికా కార్మికవర్గపు పనిసామర్ధ్యం -జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ,జపాను కార్మిక వర్గపు పని సామర్ధ్యం కన్నా ఎక్కువ గనుక, అధికవేతనాలు పొందుతున్నారనటం ఎంత అసమంజసమో, రైతులు తమతమ పనిసామర్ధ్యాన్ని బట్టి వారి ప్రతిఫలాలు పొందుతున్నారనటం అంతే అసమంజసం. ఒకే దేశంలో, లేక వేరువేరుదేశాల్లో ఒక వర్గపు వేరొక వర్గపు లేక రైతాంగపు- కార్మిక వర్గపు పనిసామర్ధ్యాలు ఒకే విధంగా వుండగలవనిచెప్పటం నా ఉద్దేశ్యం కాదు. వేతనాలు లేక వ్యవసాయ ధరల వ్యత్యాసాలు

- వారి పనిసామర్థ్యపు వ్యత్యాసాలకన్నా ఆయాదేశాలలోని శ్రామిక వర్గాల (కర్షక-కార్మిక) ప్రతిఘటనాశక్తి, రాజకీయ, ఆర్థిక స్థాయిలనుబట్టే నిర్ణయించబడుతున్న వని నా అభిప్రాయం. ఈ విషయం మనం జ్ఞప్తిలోవుంచుకోనట్లయితే, వివిధ వర్గాల ఆదాయాలు వారిపనిపాటవాలను బట్టి వుంటవని కాపిటలిస్టులు చేసే మోస పూరిత ప్రచారాన్ని గ్రహించలేము. వలసరాజ్యాలలోని రైతుల విశదీకరించలేని బీదరికాన్ని, శ్రామిక బాహుళ్యపు పతనాన్ని మనం అర్థం చేసుకొనలేక నిర్లక్ష్యం చేసినవారమౌతాము. అలాగే సోవియట్ దేశాలలో వ్యవసాయ ఆదాయాలు పారిశ్రామిక - వాణిజ్య - వృత్తి జీవుల వర్గాల ఆదాయాలకన్నా తక్కువగా వుంటవి అనే కమ్యూనిష్టుల ప్రచారాన్ని జాగరూకతతో గమనించి, ఎదుర్కొనాలి. వారి పనిసామర్థ్యపు స్థాయి- ప్రభుత్వ క్షేత్రాలలో గాని, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోగాని ఇంచుమించుగా సమానంగా వున్నప్పటికి - సహకార వ్యవస్థలలోని వారి ప్రతిఫలాలు, సామాజిక భద్రతలు, ఇతర హక్కులు - పై వర్గాల కంటే చాలా తక్కువగా వున్నవని నేను 1955లో తెలుసుకొన్నాను. ఎప్పుడు, ఎక్కడ రైతులు రాజకీయంగా బలవంతులవుతారో, అక్కడవారు ఆర్థిక, రాజకీయ అనిశ్చిత లనుఎదుర్కొని వ్యవసాయోత్పత్తులకు కనీస ధరలు, వేతనాలను పొందగలరు. (ఉదా: యుద్ధానంతరం పది సంవత్సరాల చరిత్రలో స్వీడన్, డెన్మార్క్కు, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, పశ్చిమ జర్మనీ దేశాలు).

# పీల్చుకుతినే వ్యవసాయ వ్యయం

(Parasitic costs of cultivation)

మార్షెలియన్ శాస్త్రవేత్తలు, భూమికౌలు (భాటకం-కవులు) నికరాదాయంలో భాగమే గాని, వ్యవసాయవ్యయంలోనిదికాదని అంటారు. మార్క్సిస్టులు,వ్యవసాయ పెట్టుబడుల వడ్డీకూడా నికరాదాయంలోనిదే అంటారు. భూమికౌలు -వడ్డీలు నికరాదాయం నుండి చెల్లిస్తున్నారు కనుక ఇవి వ్యవసాయవ్యయం (వ్యవసాయ ఖర్చుల) లో భాగం కాదు అని వీరిరువురి వాదన. ఇందువలననే బ్రిటీషు లాండు సెటిల్‌మెంటు అధికారులు, రైతులు భూస్వాములకు చెల్లించే 'కౌలు - కనీస నికరాదాయమనితప్పుగా అభిప్రాయపడ్డారు.

ఈ ఆలోచనలపర్యవసానం - వ్యవసాయం చేయటానికి అనువుగావున్న ఉత్తామధ్యం భూముల(Marginal Lands) నుండి కౌలుగాని వడ్డీగాని ఉత్పత్తికాదు అని. మార్క్సు కాలంలోకూడా అమెరికాలో న్యూసెటిలర్స్ (New - Settelers కొత్తగా స్థిరపడటానికి వచ్చినవారు) మార్జినల్ భూములు కొనుగోలు చేసి వ్యవసాయం చేయటానికి, తమ స్వంతడబ్బేగాక, వడ్డీలకు కూడా డబ్బు తెచ్చిపెట్టుబడి పెట్టవలసి వచ్చింది. ఇండియాలో పోడు వ్యవసాయం చేసేకొండ ప్రాంతాలలో కూడా "కౌలు" చెల్లించేవారు. మార్జినల్ భూములకన్నా బలహీనమయిన భూములలో "పాలి" కి వ్యవసాయం చేసేవారు. సగం పంట భూస్వామికి చెందుతుంది. భూమి పన్ను (Land Tax) ఇండియాలో నికరాదాయంలో 50 % మాత్రమే అని ప్రకటించినా, ఈ పన్ను రైతుల నికరాదాయంలో అధికభాగాన్ని మింగేది. స్వల్పంగా మాత్రమే లాభాలు వచ్చే అవకాశాలున్న భూము

లన్నిటిపై కూడా ఇంత పన్ను విధించబడింది. బీద పొలాల్లో దిగుబడులుండవు. పంటల వైఫల్యాలు ఎక్కువ. వడ్డీల బరువుకూడా అధికం (పెట్టుబడులధికం కనుక). కనుక వడ్డీ-భూమి కవులు వ్యవసాయ వ్యయంలో భాగం కాదనే పాత ఆలోచనలుతప్పు. ఆదర్శవంతమయిన వ్యవసాయవాతావరణంలో కూడా వడ్డీ - కౌలు వ్యవసాయవ్యయంలో భాగంగా పరిగణించాలనేదినా అభిప్రాయంకాదు. భూస్వామ్యంపై సంఘపు - ప్రభుత్వపు చట్టాల, సాంప్రదాయాల వత్తిళ్ళు లేనప్పుడు, పెట్టుబడి స్వల్పవడ్డీకి గాని, అసలు లేకుండాగాని ప్రభుత్వాలనుండి - సమాజంనుండి లభ్యమయేటప్పుడు. ప్రజలు వారికైవారే తిండికీ - పనికీ వెతుకులాడకుండా పుష్టికరమయిన ఆహారం, ఉద్యోగం, ప్రభుత్వాలు, సమాజం వారికి కల్పించినప్పుడు మాత్రమే అది ఆదర్శవంతమయిన వాతావరణం. ఇప్పటి పరిస్థితులలో రైతు, లాండ్ రెవిన్యూ, కౌలు, వడ్డీలు ముందుగా చెల్లించి మాత్రమే పొలంలో కాలు బెట్టగలుగుతున్నాడు. ఆ తర్వాత మాత్రమే వ్యవసాయ వ్యయం నికారాదాయాల బేరీజు వేయబడుతుంది. నూతన ఆర్థికవిధానం ఆ తర్వాత వచ్చిన సామ్యవాద నిర్మాణంలో గాని, పెట్టుబడులకు వడ్డీలు చెల్లించాలని, ధాన్యం చెల్లింపులు ప్రభుత్వానికి చేయాలని ఆదేశించటం జరిగింది.

కాపిటలిస్టులు, వారి శాస్త్రవేత్తలూ - లాండ్‌రెవిన్యూ, కౌలు, వడ్డీలు రైతులు చెల్లించగలిగితే, వారి వ్యవసాయవ్యయాన్ని, ఉత్పత్తుల మార్కెటు ధరలు భర్తీ చేయగలవని "ఉష్ట్రపక్షి" చందంగా విశ్లేషించారు. రైతులు లాండ్‌రెవిన్యూ, కౌలు, వడ్డీలు చెల్లించు తున్నారు గనుక వారు వ్యవసాయ వ్యయం రాబట్టుకొంటున్నారనే వారి భావన - ఆలోచనావలయాల్లో గిరికీలు కొట్టటం వంటిది. ఈ వాదనతో వారంతరాత్మలకు సర్దిచెప్పు కొంటూ తమ ప్రయోజనాలను నెరవేర్చుకొంటున్నారు. బ్రిటీషు లాండ్ రెవిన్యూ అధికారులు "వ్యవసాయవ్యయం తేలకపోతే, తరతరాలుగా రైతులు వ్యవసాయం ఎలా చేయగలుగుతున్నారని అమాయకంగా ప్రశ్నిస్తున్నారు. వారి ఆర్థిక శాస్త్ర పాఠాలు బాగా వంటబట్టి మన స్వతంత్ర భారతదేశపు ఆహార - వ్యవసాయ మంత్రులు ఇదే తప్పుడు వాదనతో, బలాత్కారంగా ధాన్య సేకరణ (Procurement) చేస్తూ, ప్రొక్యూరు మెంటుధరలు గిట్టుబాటుకానట్లయితే రైతులెందుకు వ్యవసాయం చేస్తారని ప్రశ్నిస్తున్నారు.

ప్రస్తుత సామాజిక పరిస్థితి అనివార్యమని భావిస్తే (కాపిటలిష్టులకీ మాట అనే ధైర్యం లేదు) - లాండ్ రెవిన్యూ, కౌలు, వడ్డీలు వ్యవసాయ వ్యయంలోభాగంగానే భావించాలి. ఆదర్శవంతమయిన వ్యవసాయ పరిస్థితులలో వ్యవసాయరంగం వుందంటే

లాండ్‌రెవిన్యూ,కౌలు, వడ్డీలు, వుండటానికే అవకాశంలేదు. వీటిని వసూలు చేసేవారిని నూటికి నూరుపాళ్ళు పరాన్నజీవులుగా చెప్పాలి. ఈ చెల్లింపులు రైతుల నికరాదాయం (Net income) నుండి గాక - రైతుల పోషణావ్యయం నుండి భరించబడుతున్నవి. ఈ చెల్లింపులు రైతుల జీవితాల్లో తిష్ఠవేసుకొని, వారిని, వారి పశుసంపదను, భూములను దరిద్రంతో క్రుంగదీస్తున్నవి. వ్యవసాయవ్యయం (Cost of Agriculture) అంటే ఏమిటి? మార్షెలియన్ శాస్త్రపరంగా - వ్యవసాయ ఉత్పత్తికి అవసరమయిన కారకాల (Factors) ఒక్కొక్క దాని ధరను ఇంచుమించుగా నిర్ణయించాలి. అనుభవంలో ఈ ఫాక్టర్ల ధరలు సరుకులకై ఏర్పడే పోటీవలన గాక - ఇరువర్గాల (మాన్యుఫాక్చరర్లు, బాంకర్లు, వాణిజ్యప్రయోజనాలు ఒక వర్గం, రైతులు రెండో వర్గం) "బేరశక్తి" (Bargaining Capacity) పై ఆధారపడి వుంటుంది. మొదటి వర్గం (మాన్యుఫాక్చరర్లు, బాంకర్లు వగైరాల) జాతీయంగా - అంతర్జాతీయంగా వ్యవస్థీకృతమై, రక్షణలు కలిగినది. రెండవ వర్గం - రైతులు. అనైక్యంగా - రక్షణ లేనటువంటిది. మొదటి వర్గం ధరలు కృత్రిమంగా, పెంచగలదు. ధరలను వారి సరఫరాపట్టీ (Supply shedule) కన్నా అధికంగా ఉత్పత్తి ధరలకన్నా అత్యంత అధికంగా నిర్ణయించగలరు. భూమిలేని వ్యవసాయదారులు పైవర్గం వారి వలె ఈ "దొంగాట"లాడలేరు. కేవలం బ్రతకటానికి (subsistance) సరిపడే ప్రతిఫలాలు వారి చేతికందితే వారదృష్టవంతులు, ఈ స్వల్పప్రతిఫలం కూడా వారికి చాలా సార్లు దక్కదు. వారి పోషణాలోపాలకు- దుర్భరదారిద్ర్యానికి ఇదే ముఖ్యకారణం.

రైతులను పీల్చి పిప్పిచేసే భూస్వాముల, వడ్డీవ్యాపారుల, రసాయనిక ఎరువుల, వ్యావసాయక పరికరాల, ఇతరదైనందిన అవసరాల భారీ తయారీదారుల (మాన్యుఫాక్చరర్ల) డిమాండ్లు - పొలాలకిచ్చే చాలీచాలని ఎరువులు, పశువులమేత, సంసారం గడపటానికై ఖర్చు పెట్టుకోగలుగుతున్న అల్పప్రతిఫలాలు - అన్నీ వ్యవసాయవ్యయంగానే ఆధునిక వ్యవసాయదారుడు భావించాలి. నానాటికీ పెరుగుతున్న భూసారలోపం, పశువుల జాడ్యాలు, చావులు, తరుగుతున్నవాటి పని సామర్ధ్యం, దీర్ఘకాలిక పోషణాలోపం, తగ్గిపోతున్నవారి జీవితప్రమాణం, - ఉత్సాహం, వారి అనారోగ్యం, నిస్సత్తువ, ప్రబలుతున్న అంటువ్యాధులు, సుఖరోగాలు, మలేరియా, బెంగాలు, ఒరిస్సా కరువులు, సామాజిక రుగ్మతలు - ఈ వర్తమాన ఆర్ధికవ్యవస్థావైఫల్యాల కారణంగా రైతులు అసంబద్ధమైన, చాలీచాలని, స్వల్పవ్యవసాయవ్యయాన్నికూడా రాబట్టుకోలేక పోతున్నారు. అసంబద్ధమూ, స్వల్పమూ అయిన వ్యవసాయవ్యయం ఆర్ధికంగా నష్టకరం. కాన్సరులాగా వ్యాపిస్తున్న

ఈ విధానం వైపు కాపిటలిష్టు ప్రపంచం పరుగులు పెట్టున్నది. ఈ పరుగువారిని, రైతులను - ప్రపంచాన్ని నరకకూపంలోనికి నెట్టుతున్నది. కనీస వ్యవసాయవ్యయంతో కూడా కాపిటలిజం సర్దుబాటు చేసుకోలేక పోవటంవలననే ప్రపంచయుద్ధాలు సంభ విస్తున్నవి. రైతులు అర్ధాకలితో మాడుతున్నప్పుడు కలిగే పరిణామాలేమిటి? వారి కొను గోలు శక్తి క్షీణిస్తుంది. మాన్యుఫాక్చర్డ్ గూడ్సు (యాంత్రికోత్పత్తులు) వారికి మార్కెట్లో అందుబాటులో వుండవు. పెరుగుతున్న యాంత్రిక తయారీలతో పొర్లిపోతున్న మార్కెట్లు దివాలా తీస్తాయి. దోపిడీ ద్వారా చౌకగా వ్యవసాయసేవలను, ఉత్పత్తులను కబళించటానికై హ్రస్వదృష్టితో పడే పోటీ ప్రపంచదేశాల మధ్య విరోధాలు పెరిగియుద్ధాలకు కారణ మవుతుంది.

రైతుల సప్లైషెడ్యూలును (సరాఫరాపట్టీలను) క్రమబద్ధీకరించి, స్వార్ధ పర శక్తులయిన భూస్వాముల, కీలకసేవల వాటి ప్రాయోజితాలయిన బాంకింగు మార్కెటింగు వ్యవస్థల ఆటకట్టించగలవారెవరు? కాపిటలిస్టులీ బాధ్యత నిర్వహించలేరు. ఇందుకు వారసమర్ధులు. ఆధునిక ప్రపంచ రైతే ఈ బృహత్తరమయిన "స్వయంసేవ" కార్యక్రమాన్ని తలకెత్తుకోవాలి. కావాలని తెలిసికొందరు, తెలియక కొందరు రైతులను శ్రమింపజేసి, చెమటోడ్చేటట్లు చేస్తున్నారు. వారిని రైతులు ముందుగా గుర్తించగలగాలి. వీరిలో ఎవరిని తమ పక్షంలో చేర్చుకోవాలి ఎవరితో పోరాడి అంతం చేయాలనేది ఈ స్వయం సేవలో ప్రధాన ఘట్టం.

రైతులను బంకలాగా అంటిపెట్టుకొని పీడించే ఈ పరాన్న జీవులను గురించి విచారించే ముందు, రైతులకు "నికరాదాయం" అవసరమా? అనే విషయాన్ని తెలుసు కోవాలి. ప్రపంచంలో ఏ రైతునోటివెంట విన్నా - విన్పించే దేమిటి ? "మాకేమీ మిగలటం లేదు" అనేమాటే. వ్యవసాయంద్వారా, వారి వ్యవసాయవ్యయం, పోషణ గడచి ఎంతో కొంత అదనంగా మిగలాలని వారాశిస్తారు. ఈ అదనంగా మిగిలేదే నికరాదాయం. వీరి జ్ఞాపకాలలో, గ్రామకామన్వెల్తులలో గ్రామస్వామ్యంద్వారా వీరి నికరాదాయాల సాంఘిక వినియోగాలు ఇంకా నిలచివుండటం వీరిచ్చే సమాధానానికి కారణం. వేళకింత ముద్ద కోసం చేసే వెట్టిచాకిరీనిష్ప్రయోజనం అని వారి వుద్దేశ్యం. వారి సంపాదనతో ఆరోగ్య ప్రదమయిన గ్రామాలు, ఇళ్ళు నిర్మించుకోవాలని, విశ్రాంతి ననుభవించాలని, సాంస్కృతిక కార్యక్రమాలలో పాలుపంచుకోవాలనీ, శుభ్రమయిన బట్టలు, వున్నంతలో ఆభరణాలు ధరించాలని, మంచి పరిసరాలుకలిగివుండాలని కోరుకోవటం దురాశకాదు. తప్పు అసలే

కాదు. వారర్రులుచాస్తున్న ఈ గౌరవప్రదమయిన జీవితాలను, బూర్జువాలు, కార్మికులు సంతోషంగా, మరింతగా అనుభవిస్తున్నారు. రైతులు వ్యవసాయవ్యయం పోను, ప్రపంచ సంపదలో వారి కనీసవాటాగా కొంత నికరాదాయాన్ని ఆశపడటం న్యాయం. కాపిటలిస్టు దేశాలలో, వలసలలో రైతులుగా చలామణీ అయ్యే (Quasiagriculturists) కొద్దిమంది ఈ లాభాలను కొంతమేరకు పొందుతున్నారు. ప్రపంచంలో అధిక జనాభాగా వున్న, భూములుగల, భూములు లేని రైతులు నికరాదాయం మాట ప్రక్కన బెట్టి వ్యవసాయ వ్యయం రాబట్టు కోవటానికి ఎంతో ప్రయత్నించ వలసివుంది.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటీషు ప్రభుత్వం, భూములు లేని రైతులకు, వారానికి 60 షిల్లింగుల నుండి 100 షిల్లింగుల వరకు వేతనాలు చెల్లించింది. యుద్ధ పూర్వం ఈ వేతనం 25 షిల్లింగులు. యుద్ధకాలంలో ఇంత ఎక్కువ వేతనాలు ఎందుకు యివ్వబడ్డాయి? అలా యివ్వకపోతే ప్రజలు గ్రామాలకు వెళ్ళి వ్యవసాయం చేయరు. బ్రిటీషు దేశం, యుద్ధకారణంగా స్వంత ఆహారోత్పత్తిపై ఆధారపడవలసి వచ్చింది. యుద్ధానికి ముందు చౌకగా ఇతర దేశాలనుండి ప్రపంచ విపణులు ఆహారా న్నందించినవి కనుక స్వల్పవేతనాలతో సరిపెట్టారు. యుద్ధకాలంలో వేతనాలకు, వ్యవసాయోత్పత్తులకు ప్రభుత్వం సబ్సిడీలు భరించి, వినియోగదారులపై అధిక భారం మోపి, ఎక్కువ వేతనాలు చెల్లించాయ్. సాధారణ పరిస్థితులలో తాము తమకూలీల కిచ్చే వేతనాల మాత్రం కూడా గిట్టుబాటుగాని రైతులు, తమ వ్యవసాయోత్పత్తులకు ప్రభుత్వం గ్యారంటీ ధరలు యివ్వటం వలన తామీ వేతనాలివ్వగలిగారు. ధరల పై కంట్రోళ్ళు పెట్టినప్పటికీ, వ్యవసాయోత్పత్తుల ధరలు యుద్ధకాలంలో చాలా చురుకుగా పెరిగాయి. ఈ యుద్ధాను భవం రైతులకు మార్గదర్శకం. మరలా ఒక యుద్ధమో లేక సామాజిక విప్లవమో రానిది వారికి న్యాయం జరుగదు.

వ్యవసాయవ్యయంలో భాగాలయిన (Factors) అన్నిటినీ చిందరవందర చేసిన ఏజెన్సీలు (ప్రాతినిధ్యసంస్థలు) - కీలకసేవలు, స్వార్థపరశక్తులు (వ్యవసాయానికి ఎంతో కొంత సాయంచేసినప్పటికీ) దోపిడీ చేస్తున్నామన్న స్పృహకలిగిన పరాన్న జీవులు (Conscious parasites). హ్రస్వదృష్టితో మామూలు ధరలు (customary prices) మాత్రమే వ్యవసాయోత్పత్తులకు చెల్లిస్తూ, ముడిసరుకులకు నామమాత్రపు ధరల (courtesy prices) చరిత్ర తెలియక, సామాజిక తప్పిదాన్ని సరిచేయాలనే అవగాహన లేక సరఫరాల అవ్యాకోచత్వాన్ని, డిమాండు అతివ్యాకోచత్వాన్ని అర్థంచేసుకోలేక

వ్యవసాయ ధరలను - మాన్యుఫాక్చర్డ్ గూడ్స్, వాణిజ్య సరుకుల, ఇతరవృత్తి సేవల ధరలకన్నా దిగజార్చేవారు - వినియోగదారులు, వీరు దోపిడీ స్పృహలేని (తెలియకుండా దోపిడీలో భాగస్వాముల) పరాన్నజీవులు. ముఖ్యంగా యాంత్రికోత్పత్తుల దేశాలవారు. ఈ రెండు రకాల పరాన్న జీవులకు రక్షణ పటాలంగా ముందుండేవారు వర్తకులు, మాన్యుఫాక్చరర్లు. వినియోగదారులు. వీరు ఈ వత్తిడి ఉత్పత్తులనుండి పూర్తిలాభం పొందుతారు. మాన్యుఫాక్చరర్ రసాయనిక ఎరువుల, వ్యవసాయపరికరాల, సాధారణ దైనందిన యాంత్రిక ఉత్పత్తుల అమ్మకాలలో అధికలాభమార్జిస్తాడు. వీరి ఉత్పత్తులు ప్రపంచ విపణులలో పాక్షికరక్షణ గలిగిన "B" క్లాసుగూడ్స్. మాన్యుఫాక్చరర్ బేరశక్తి ఎక్కువ. ఈ శక్తివలన మాన్యుఫాక్చరర్ తనసరుకులను అమ్మేటపుడు, వ్యవసాయోత్పత్తులను కొనుగోలు చేసేటపుడు వర్తకుని మాధ్యమికం ద్వారా అధికలాభాలార్జిస్తాడు. మాన్యు ఫాక్చరర్, వర్తకుడు, వినియోగదారుడు - వీరందరూ ఈ లాభాల్లో వాటాదారులు. వినియోగదారులు తమ డిమాండ్లను అవసరానికనుగుణంగా మార్చుకోగలరు. ఇందు వలన చెప్పుకోదగినంత వాటా వీరికి లభిస్తుంది. మార్కెట్లు అందుబాటులో వుండటం వలన పట్టణ వినియోగదారులు, గ్రామీణ వినియోగదారుల కన్నా తమ డిమాండ్లను త్వరితంగా మార్చుకోగలగటం వలన,వర్తకులు, టోకువ్యాపారులు, మాన్యుఫాక్చరర్ల మధ్య వున్న స్వల్ప పోటీ తమకు అనుకూలంగా మార్చుకొని, జేబుల్లో డబ్బుకలవారవటం వలన ఎక్కువ లాభిస్తారు.

ఆధునిక ప్రభుత్వం వీటన్నిటికంటే సిగ్గుమాలిన పరాన్నజీవి. రైతుల జీవితాలను గణించకుండా, పీడించి పన్నులు వసూలుచేసి, బూర్జువాలనుండి తక్కువ పన్నులు వసూలు చేసి ఎక్కువగా వారిని బాగు చేయటం ధ్యేయంగా పెట్టుకొన్నది. కార్మికులు, పట్టణాల ఉద్యోగులు -క్లర్కులు, టీచర్లు, షాపు గుమస్తాలు ఇతర బుద్ధిజీవులు వీరు తమకు తెలియకుండా కాపిటలిస్టు దోపిడీలో లబ్ధిదారులు. వీరికి రైతులను దోపిడీ చేయాలనే ధ్యాసలేదు. సుఖప్రదమయిన జీవితం. దోపిడీ నుండి రక్షణలు, తగిన ప్రతిఫలాలు వారికి కలిగించగలిగితే - రైతుల విముక్తి పోరాటానికి వీరు విముఖులు కారు. వీరు చేయూత నిస్తారు. వారిలో చాలా మంది రైతుల దోపిడీలో లబ్ధిదారులమని తెలియక, తెలిసి బ్రిటీషు-ఫ్రెంచి, అమెరికన్, జర్మన్, ఇండియన్ కార్మికవర్గం స్థానిక సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ లంచాల[1] ఆశతో రైతులను దోపిడీ చేస్తారు. 1948 లో ఇండియా కమ్యూనిస్టులు - సోషలిస్టులు, శ్రామికవర్గం "ధాన్యపు ఆర్థికత" పై ఆధార

పడిందని అందువలన కంట్రోళ్ళు పెట్టవలసిందని పట్టుబట్టారు. ఈ కంట్రోళ్ళు మరలా ఇండియన్ కమ్యూనిష్టుల, సోషలిష్టుల తీవ్ర నిరసనల మధ్య ఎత్తివేయటం జరిగింది. ఆధునిక కార్మికవర్గం తమ హెచ్చు వేతనాలు, పనిసామర్ధ్యం, నైపుణ్యం, అధిక్రమవలన పొందుతున్నారని,అసమర్ధత, అభివృద్ధి నిరోధకత, పనిపాలుమాలికవలన రైతులు పొందటం లేదని కాపిటలిజం ప్రచారాన్ని విశ్వసిస్తున్నారు.

వారు ముందుగా ఏర్పరుచుకొన్న అభిప్రాయాలను, అనవసరభయాలను ప్రక్కనబెట్టి, కొద్దిగా ఆలోచించితే కాపిటలిస్టుల ప్రచారాన్ని వారిలంచగొండి విధానాన్ని కార్మికులు అర్ధం చేసుకోగలరు. ప్రపంచోత్పత్తులు 1946-47 కంటే 1954 లో 30 శాతం ఎక్కువ. యుద్ధానికి ముందుకన్నా 20 శాతం ఎక్కువ. వలస రైతాంగం అసమర్ధులు, అనైక్యులు అని భావించినా, అమెరికా రైతాంగంపై ఈ నింద మోపలేము. కానీ అమెరికన్ రైతాంగపు తలసరి ఆదాయం, కార్మికుని ఆదాయంలో సగంకంటే ఎందుకుతక్కువగా వుంది? ఇంగ్లీషు, కెనడా, జర్మనీ రైతులు మెషిన్లూ, మెన్యూర్లు, ప్రభుత్వరక్షణలతో, అనుకూల వాతావరణంలో వ్యవసాయం చేస్తున్నారు. ఇంగ్లాండులో రైతులను వారిపని సామర్ధ్యాన్ని బట్టి వారి బోర్డ్ ఆఫ్ అగ్రికల్చర్ (Board of Agriculture) A.B.C. తరగతులుగా వర్గీకరించింది. అశ్రద్ధ, పనిమాంద్యంకల "C" క్లాసువారు కేవలం 1 శాతం మాత్రమే. గృహవసతిలోపం తక్కువవేతనాలతో ఇబ్బందిపడే పట్టణ కార్మికులకన్నా అక్కడ రైతుల జీవన ప్రమాణాలు సగం కన్నా తక్కువగా వున్నవి. 1914 లో నిరుద్యోగ భృతి కార్మికులకు కల్పించబడితే, వ్యవసాయకూలీలు 1938 వరకు ఈ అవకాశం కొరకు ఎందుకువేచివుండాల్సి వచ్చింది? కొన్ని దేశాలలో మైనింగ్, కిరోసిన్, పెట్రోలు వెలికితీతలవంటి ప్రత్యేక పనులున్నా, ఈ దేశాలలోని వేతన వ్యత్యాసాల కారణాలను ఎలా విశదీకరించాలి.

"జీవన ప్రమాణాలనుపెంచటానికి, వృద్ధాప్యభీమా, విద్య, ఆరోగ్యం, గృహ వసతి వంటి కార్యక్రమాలన్నీ తలసరి ఆదాయం హెచ్చుగా వున్న వ్యవసాయేతర రంగాల వారికే కల్పించబడుతున్నవి." (F.A.O. Review 1955). 1951లో వ్యవసాయ శ్రామికుల మరణాలు, వ్యవసాయేతరరంగాలవారికన్నా మూడు రెట్లు ప్రతి లక్షజనాభాలో ఎక్కువగా వున్నాయి. వ్యవసాయ శ్రామికులలో ప్రసూతి మరణాలు అధికం. చాలా రాష్ట్రాలలోశ్రామిక నష్టపరిహారచట్టాలు (workmen compensation laws) వ్యవసాయరంగానికి వర్తించబడటంలేదు. రైతులను కూడా సమదృష్టితో ఆదరించాలనే భావన ఈ రంగాల్లో కొరవడింది. (F.A.O. Review - P. 55).

కాపిటలిజం తన స్వార్ధంకోసం, అధికవేతనాలు, సామాజిక భద్రతలు, మినహాయింపులతో తమను బుజ్జగించుతున్నదని తద్వారా రైతులను అణచివేస్తున్నదని, కార్మిక సోదరులు గ్రహించాలి. తమ అసూయ, అనుమానాలను వీడాలి.

కార్మికుల "సమాన పనికి - సమానవేతన" మని ముఖ్యంగా స్త్రీలకు - డిమాండు చేసిన పాశ్చాత్య సోషలిస్టులు - రెండవ ప్రపంచ యుద్ధానంతరం వరకు - ఈ నినాదం వ్యవసాయ రంగానికి అత్యావశ్యకమని, ఉపయోగకరమని గ్రహించలేదు. కాపిటలిస్టుల వలలో చిక్కి వీరు స్థానికుల ఆర్థిక అసమానతలు,వేతానాలు, సంపదలపైనే తమ దృష్టిని కేంద్రీకరించారు. స్థానికకార్మికుల సౌఖ్యవంతమైన జీవితం కొరకు పాటుబడ్డారు. విభిన్న దేశాల కార్మికుల అసమాన వేతనాలవలన కలిగే ప్రమాదాలను గుర్తించి ఇంటర్నేషనల్ ఆఫీసు, కన్వెన్షన్లు ద్వారా వారికి ప్రాధమిక సామాజిక సేవలు, కొంతవరకు వేతన సమానతను సాధించారు. యజమానులందించే అదనపు సౌకర్యాలతో తృప్తిచెంది, ఎవరిపొట్టలు గొట్టి కాపిటలిస్టులు వారికీ సౌకర్యాలనందించుచున్నది కార్మికులు పట్టించు కోలేదు. అందువల్లనే వారి దేశాల్లోగాని, ఇతర దేశాలలో గానీ సోషలిజం ప్రభావానికి రైతులు లోనుకాలేదు.

వర్తమాన సామాజికన్యాయంలో అసమానతా వైపరీత్యం అధికంగా వుంది. ఫ్యాక్టరీ చట్టాలను, పనిగంటల నియంత్రణను, ఉద్యోగభద్రతను, ట్రేడ్‌యూనియన్ల నిర్మాణాన్ని బ్రిటీషు కాపిటలిస్టులు తీవ్రంగా ప్రతిఘటించారు. ప్రపంచ విపణుల ముడిసరుకులు, మాన్యుఫాక్చర్డ్ గూడ్సులన్నింటిపై గుత్తాధిపత్యం కల వీరు ఈ సంస్కరణలు భరించలేమని వాదించారు. ఇంగ్లాండు ఆ శతాబ్దాంతం వరకు కాపిటలిస్టు ప్రపంచాధినేతగా వుంది. కానీ కార్మికులకు ఏవిధమయిన మినహాయింపులు, సౌకర్యాలు కలిగించటానికాదేశం అంగీకరించలేదు. తమ దేశ సౌభాగ్యం దెబ్బతింటుందని వాదించింది. తమలో తాము కలహించు కొంటున్న 20 వ శతాబ్దపు కాపిటలిస్టు దేశాలు క్రమక్రమంగా కనీసవేతనాలు నిరుద్యోగభీమా, వృద్ధాప్య పెన్షన్, కుటుంబసేవలు, ఆరోగ్యభీమా, గృహవసతి, మురికివాడల నిర్మూలన,వయోజన విద్య, ట్రేడ్ బోర్డులు, రాజీ కమిటీలు, వర్కుకమిటీలు, లాభాలలో భాగస్వామ్యం వంటి సౌకర్యాలు కలిగించ సాగారు. బివరిడ్జ్‌ప్లానులనాధారంగా ప్రస్తుత బ్రిటీషు లేబరు గవర్నమెంటు సాంఘిక భద్రతలను అమలుచేస్తున్నది. పారిశ్రామిక కార్మికులకు ఈ అదనపు సౌకర్యాలు, భద్రతలు ఏర్పరచటానికి అదనంగా డబ్బు ఎక్కడ నుండి వచ్చింది ?

"ఆర్థికఅసమానతలు, సాంఘిక భద్రతలూ కాపిటలిస్టుదేశాలలో తగ్గక పోగా పెరిగాయి. ధరలు, వేతనాలు, పారిశ్రామికుల జీవన ప్రమాణాలు, సాంఘిక సేవలు

ఉదారంగా పెరిగినప్పటికీ, బూర్జువాసంపద, సంవత్సరాదాయాలు, సామాజిక స్థాయి, సాంస్కృతిక అవకాశాలు దిగజారలేదు. ఆర్థిక సంక్షోభాలు - యుద్ధాలు, ఎన్నివచ్చినా కాపిటలిస్టుల పురోభివృద్ధి, సౌభాగ్యం, లాభాలు పెరుగుతునే వున్నవి. " (Mr. Bowley and cole statistical survey).

ఈ మిస్టరీని ఛేదించటం ఎలా? సామాన్య ప్రజలు పాశ్చాత్యుల ఆకస్మిక సంపన్నతకు రెండు కారణాలూహించారు. అమెరికా ఖండంలోబంగారపు ఉత్పత్తి, లాటిన్ అమెరికా, ఇండియాలలో బంగారపు దోపిడీలు. వివిధ వనరులద్వారా విద్యుదుత్పాదన, పారిశ్రామిక, వాణిజ్యవ్యాపకాలలో దాని వినియోగం. సిగ్గులేకుండా దోపిడీతో సంపాదించిన బంగారం, వెండి 19వ శతాబ్దంలో పాశ్చాత్యదేశాల సంపదను పెంచింది. విద్యుదుత్పాదన మొదటగా వచ్చిన దేశాలు కొన్ని గుత్తాధిపత్యలాభాలు పొందాయి. లాటిన్ అమెరికా, మలయా, డచ్, ఈస్ట్ ఇండియా, మొగల్, పర్షియా దేశాల ప్రజలకన్నా వారి సామ్రాజ్యవాద యజమానులు, కాపిటలిస్టులు ఎక్కువగా లాభించారు. కాపిటలిస్టుదేశాల వనరుల పోటీలో ఈ దేశాలలో ప్రారంభంలో వచ్చిన లాభాలు బాలెన్సుకాగా నిరాటంకంగా వీరు లాభాలు గడించటానికి మిగిలిన ఏకైక మార్గం విద్యుత్ వనరులను కొల్లగొట్టటం, ఇదికూడా భూమిని కొల్లగొట్టటం వంటిదే. రెండింటిలోనూ శ్రమద్వారానే ప్రతిఫలాలు దక్కుతవి. ప్రాధమిక దశలో వ్యయమయ్యేది, ప్రతియూనిట్ శ్రమకంటే వచ్చేలాభాలు, ఖనిజాలు, భారీపరిశ్రమలు కానటువంటి, వ్యవసాయేతర రంగాలలో ఎక్కువ. శ్రామికత్వం, ఉత్పత్తులు ఒక దశను చేరిన తర్వాత గనులు, ఖనిజాలు, భూమి ఎక్కువగా వాడటం వలన కలిగే సమస్యలనెదుర్కొంటవి. ఈ దశలోగనుల - భూమి ఉత్పాదకతలలో - ప్రతిఫలాల్లో పెద్దగా వ్యత్యాసముండదు. పారిశ్రామిక కార్మికుల పనిసామర్థ్యం రైతుల కన్నా రెండురెట్లు ఎక్కువ అని భావించినా, రైతులు, వారికుటుంబం మొత్తం రెండు రెట్లు పనిగంటలు అధికంగా, ఉత్సాహంగా శ్రమిస్తారు. కానీ వారికుటుంబం మొత్తం ఆదాయం కార్మికుని ఆదాయం కంటే తక్కువ.

కార్మిక వర్గానికీ అదనపు ఆదాయం ఎలావస్తుంది ? భారీపరిశ్రమల నిర్వహణ వలన అభివృద్ధికర ప్రతిఫలాల సూత్రం ఆధారంగా వచ్చే అవకాశముంది. పారిశ్రామిక - వ్యావసాయిక శ్రామికుల వేతనాలలో ఇంత పెద్ద అంతరాలుండటం ఈ కారణం వలనకాదు.

కార్మికవర్గపు ఆదాయంలో అత్యధికభాగం పరిశ్రమలు - ఖనిజసంపద నుండి కాక వేరే మార్గాలనుండి వచ్చే అవకాశముంది. వృత్తిజీవులు, వాణిజ్యవర్గాలు అదనపు వేతనాలిచ్చే పారిశ్రామిక వర్గాలకు సన్నిహితులు. కార్మికులనుండి - బూర్జువాల నుండి

రైతులకేవిధమయినలాభం దక్కదు. కృత్రిమ వైకల్యాలయిన వత్తిడి వుత్పత్తులు, కీలక సేవలు, వడ్డీలు, ప్రపంచ విపణులు, కాపిటలిస్టులచే సృష్టించబడిన సామ్రాజ్యవాదదోపిడీ, మాన్యుఫాక్చరర్లు, వాణిజ్యం, ప్రభుత్వం ఇవన్నీ కలసి రైతుపై దాడి చేస్తున్నవి. రైతుల ఉత్పత్తులను అల్పధరలకు అమ్మించి, పారిశ్రామిక ఉత్పత్తులను అధిక ధరలకుకొనిపించి, వారి శ్రమ ప్రతిఫలాన్ని వారికి దక్కకుండా కాపిటలిజం చేస్తున్నది. ప్రతి దినం, ప్రతిచోటా ప్రపంచకాపిటలిజానికి, తద్వారా కార్మిక వర్గాలకు సంపద, సౌకర్యాలు ఈమూలం (source - రైతులశ్రమనుండి) నుండే ప్రవహిస్తున్నవి.

**మార్క్స్ - ఏంగెల్సు - ఇండియా:-** నిరంతరం, వత్తిడులవలన రైతులనుండి ప్రవహించే - శ్రమలేకుండా ఇతరులకు లభ్యమయ్యే - ఈ ఆదాయం వలననే - మార్క్స్ ఊహించినట్లుగా కాపిటలిజం పతనంకాలేదు. బ్రిటీషు కార్మికవర్గాలు మార్క్స్ ఊహలకు భిన్నంగా, విప్లవించక, ఫేబియనిజం[2], పార్లమెంటరీ విధానాలను కౌగలించుకోవటానికి కారణం, బ్రిటీషు వలసల దోపిడీలో కొంత భాగం శ్రామికులకు అందచేయబడటమే (లంచాలుగా) కారణమని లెనిన్ గ్రహించాడు. "సోషలిస్టుల మని చెప్పుకుంటూ తమదేశాలలో నిజాయితీగా పోరాటం చేయటానికి, అణచివేయబడుతున్న వలసల స్వతంత్ర్య సంపాదనకు విముఖులుగావున్నవారి "జింగోయిజం[3]" (రష్యావ్యతిరేక ధోరణి) పై వీడని పట్టుదలతో, ధృడనిశ్చయంతో సంఘర్షణసాగించాలి." అనిస్టాలిన్ ఆదేశించాడు.

వలసదేశాలలో కొన్ని ప్రాంతాలలో ఈ నాటికీ కొంత ప్రజ, ఖనిజసంపద, పూర్తిగా కాపిటలిస్టుల చేతుల్లోపడలేదు. వలసరైతులీ ప్రాంతాలలో ప్రపంచవిపణుల పుణ్యమాని, కొత్తగా వచ్చిన సామ్రాజ్య వాద ప్రాధాన్యతా విధానపు (Imperial preferential system) మాయాజాలం వలన అధికంగా కాపిటలిస్టులకు లొంగిపోతున్నారు. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, అర్జెంటినా, బ్రెజిల్, మెక్సికో, కెన్యా, చైనా, ఇండియా లలో ఇంతవరకు ఆక్రమించబడని, వ్యవసాయం చేయని, అతిసారవంతమయిన భూములు, సమర్ధవంతమైన వ్యవసాయవిధానం మేలురకం పంటలు పండించటం తెలియని రైతులు ఎక్కువగా వున్నారు. అందువలన వలసదేశాలను, అక్కడి రైతులను కాపిటలిస్టులు సంపూర్ణంగా దోపిడీ చేసే అవకాశాలు మెండుగావున్నాయ్. ప్రపంచ రైతాంగాన్ని, వ్యవసాయ సంపదను (ఈ కొత్తప్రాంతాలలో) దోపిడీచేసి, కార్మికులకు ఎక్కువ మినహాయింపులు సౌకర్యాలు కలుగ చేయటం ద్వారా వారి విప్లవధోరణులను సమాధానపరుస్తూ ప్రపంచ కాపిటలిజం మరికొంతకాలం మనుగడసాగించే అవకాశ

మున్నది. ఈ వెలికి తీయబడని సంపదవున్నంతకాలం, సోషలిస్టులు భావించినట్లుగా కార్మిక విప్లవం దానంతటదే పుట్టుకురాదు. రైతులు కార్మికుల "ఆపిల్ బండిని" బోర్లపడవేయనంతవరకు, కాపిటలిజంనుండి కార్మికులు మరిన్ని సౌకర్యాలు పిండు కుంటూ, దశాబ్దాలపాటు "ఎకనమిజానికి", పార్లమెంటేరియనిజానికి వత్తాసు పలుకుతారు. ఇంగ్లాండు - ఆస్ట్రేలియాలలో "లేబరు" అధికారం చేపట్టినా - శ్రమించ కుండా వచ్చే ఈ సంపదను వదులుకోవటానికి వారు ఇష్టపడటంలేదు.

కార్మికులు వారి సోషలిస్టులీడర్లు తమ రాజకీయ, ఆర్థిక అవగాహనలను పునర్విమర్శచేయనట్లయితే, కాపిటలిస్టు, సామ్రాజ్యవాద ప్రపంచంలో వారి స్థానం తెలుసుకోలేనట్లయితే, కాపిటలిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్న రైతులకు మద్దతు నిచ్చి, వారిని శక్తివంతులను చేయనట్లయితే - వారుకోరుకొనే సామాజిక విప్లవం త్వరలో సాధ్యపడదు.

ఇండియా, చైనాల గ్రామ కామన్వెల్తులలో, రైతుల "అదనపు విలువ" ప్రణాళికా బద్ధంగా వినియోగింపబడేది. వడ్డీవ్యాపారులు, వాణిజ్య, వ్యాపార, పారిశ్రామికవర్గాలు, వారి భాగస్వాములు, ఆశ్రితులు "అదనపు విలువ"నే కాక, రైతుల పోషణ, పశుపోషణ, ఆరోగ్యాలకు వుపయోగపడవలసిన సంపదలో అధికభాగాన్ని సమాజానికి అవసరమైన శ్రమగా గుర్తించబడినదానిని కూడా దోచుకొంటున్నారు. రైతుల అదనపు విలువలో, పోషణా సంపదలో అధిక భాగపు దొంగతనానికి స్వస్తి చెప్పటానికి కార్మికులు కూడా రైతులతో చేతులు కలుపుతారా అనేది నేటి ప్రశ్న ?

రైతుల సంస్కృతి, వ్యవసాయం, గ్రామీణ జీవితం, రాజకీయ ఆర్థిక శృంఖలాలు త్రెంచుకోవటానికై వారు జరిపే పోరాటాలపై - ముందుగా మార్క్సిస్టు ధోరణులతో ఏర్పరుచుకొన్న అభిప్రాయాలను, రైతులు కార్మిక నాయకత్వాన్ని, తద్వారా విముక్తిని, ఆ తర్వాత కార్మిక నియంతృత్వాన్ని అంగీకరించాలన్న డిమాండ్లను వీడకుంటే - వీరిని అనుమానించవలసివుంది. (సోషలిష్టులను, కార్మికులను) U.S.S.R లో సమిష్టి వ్యవసాయం రాకముందు, వచ్చినతర్వాత, రైతుల దుర్భరస్థితిని, సౌత్-ఈస్ట్ సోవియట్‌లో రైతాంగపార్టీల అణచివేతలు చూసిన రైతులు కార్మిక నియంతృత్వాన్ని విశ్వసించలేక పోతున్నారు. రైతుల సమస్యలు తమసమస్యలుగా భావించి కార్మికులు తమతో కలసి ఉద్యమించుతారనే నమ్మకం కలిగితే - రైతులు కార్మికులతో చేయి చేయి కలపి పోరాటానికి సిద్ధంగా వున్నారు. అయితే కార్మికుల కింతవరకు, అందుతున్న ముడుపులు తాత్కాలికంగా ఆగిపోతయ్. కార్మికులు ఇందుకు సిద్ధంగా వున్నారా?

# వ్యవసాయం మాంద్య పరిశ్రమా?

(Is Agriculture a depressed Industry)

ఉత్పత్తుల, ధరల, తలసరిఆదాయాల తరుగుదలలు 'వ్యవసాయమాంద్యం' గా చెప్పబడుతుంది.

వ్యవసాయమాంద్యంగా భావించబడుతున్న ఉత్పత్తుల,ధరల, తలసరి ఆదాయాల తరుగుదల స్వాభావికమయినది కాదు. రైతుల స్వాభావిక లోపాలవలనగానీ, వ్యవసాయపెట్టుబడుల కేటాయింపులలో లోపాల వలన గానీ, నిర్వహణాలోపంవలనగానీ రాదు. ఈ మాంద్యం కృత్రిమమయినది. భూస్వాములు - ఫ్యూడలిజంలో కీలక సేవలు ముఖ్యంగా వర్తకులు - కాపిటలిజంలో, సామ్రాజ్యవాదప్రతినిధులు - వలస సామ్రాజ్య వాదంలో, ప్రపంచ ఆర్థిక సంక్షోభాలు, తరచుగా వచ్చే పంటల వైఫల్యాలు, పెట్టుబడుల నష్టాలు, ఋణ సౌకర్యాలలోపం - కరువులు, కాటకాలు, వరదలు, తుఫాన్లవంటి ప్రకృతి వైపరీత్యాలు, భూసారక్షీణత - ఇవి ఈ కృత్రిమమాంద్యానికి కారణాలు.

"నల్లవారు బానిసలుగా వున్నంత వరకు తెల్లవారు విముక్తి నొందలేరు" - అని మార్క్సు చెప్పినది భూమిలేని రైతులకు - భూకామందులకు చక్కగా అన్వయిస్తుంది. "రైతుకు తనపంటలో స్వల్పంగా మిగులుతున్నదా, ఎక్కువ వాటావస్తున్నదా, అతడు సెర్ఫా (Serf –వ్యవసాయ బానిస) ఋణగ్రస్తుడా, స్వతంత్రుడు సౌభాగ్యవంతుడైన చిన్నరైతా అనే విచారణ, సమాజ ఆర్థికతకు అతడు మూలం అనే సత్యాన్ని మార్చలేవు.' (H.G.Wells) 18వ శతాబ్దంలో ఈ వాక్యం ఎంతనిజమో నేడూ అంతేనిజం. అప్పుడే

కాదు ఇప్పుడు కూడా "మానవప్రపంచం" స్థానికుడయిన చిన్నరైతు, పట్టణాలు, పరిశ్రమలు, ప్రార్ధనామందిరాలు న్యాయస్థానాలు, సైన్యాలతో, పలుగు, పాఱ, నాగలితో పరిసరాల్లో అలసటెరుగక శ్రమించే మానవుని శ్రమ అనే ఆఖరిమజిలీలో విశ్రాంతి తీసుకొంటున్నది. ప్రపంచంలో ఈ మనిషి బానిసగా అర్ధబానిసగా, అంటరానివానిగా, జీతగానిగా దిగజార్చ బడుతున్నాడు. వ్యవసాయం, రైతుల యొక్క ఆర్ధిక రాజకీయ వ్యక్తిత్వం, హోదా అణచివేయబడుతున్నవి.

వ్యవసాయమాంద్యం స్వాభావికమైనదికాదు. అస్వాభావికం. నిర్వహణా లోపం వలనకానీ, ఉత్పత్తికారకాల (Factore) వినియోగలోపంగానీ, వ్యవసాయ వనరుల దుబారావలన కానీ ఈ మాంద్యం సంభవించటం లేదు. రైతుల పుంజుకోలేని ఉత్సాహ శక్తిగాని, అవసరమయిన ఉత్పత్తులు మొత్తం పొందటానికి అవలంబించే ఉత్తమ అభివృద్ధి మార్గాలుకానీ ఈ మాంద్యానికి కారణం కాదు. శతాబ్దాల భయానక సామాజిక అన్యా యాల, అవమానాల, అణచివేతల వారసత్వం నేటికీ కొనసాగుతున్నది. 120 మిలియన్ల ఆఫ్రికన్లు దక్షిణ అమెరికాలో, U.S.A లో 12 మిలియన్ల నీగ్రోలు, ఇండియన్లు, 80 మిలియన్ల దళితులు, షెడ్యూలు కులాలు, తెగలవారు ఇండియాలో, మలయన్లు, బర్మీస్, ఫిలిప్పైన్సు ఇతర దిగువతరగతి ప్రజలు ఆసియా - పసిఫిక్ దేశాలలో నికృష్టస్థితిలో, చాలీచాలని బట్ట, తిండితో, గుడిశెల్లో, పంచల్లో, బతుకుతున్నారు. కేవలం బ్రతకటం కోసం రెక్కలు ముక్కలు చేసుకొంటున్నారు. భరించలేని క్షోభ, అవమానాల ఆర్ధికపునాదే రైతులను ప్రపంచ కాపిటలిజం పిడికిళ్ళనుండి విముక్తికి ఆటంకం కలిగిస్తూ, వారు సామాజిక న్యాయం కొరకు చేసే ప్రయత్నాలను విఫలం చేస్తున్నది.

ఈ మాంద్యం కృత్రిమసృష్టి. మాన్యుఫాక్చర్లకు మాంద్యం వచ్చినా, వ్యవ సాయంలో శాశ్వతమయిన, వాస్తవమైన మాంద్యం రాదు. సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో కొందరురాజకీయనాయకులు, ఆర్ధిక శాస్త్రవేత్తలు వ్యవసాయం - మాంద్యం పరిశ్రమ అని భయపెట్టున్నారని, ఆధునిక ప్రపంచపు పెరుగుతున్న వివిధ అవసరాలను తీర్చటానికి అభినందనార్హమయిన యత్నాలు చేస్తున్న ప్రపంచరైతులను నిష్పక్షపాతంగా పరిశీలించే వారెవరికయినా అర్ధంఅవుతుంది.

ఈ మాంద్యం రైతుల పాలుమాలికవలనకాదు. నిర్ణీత పనిగంటలున్న పారిశ్రామికకార్మికునిలాకాక, రైతులు అలసిపోయేవరకు శ్రమిస్తారు. నూతన వ్యవసాయ విధానాలకు, కొత్త పంటలకు వీరు విముఖులుకారు. సరఫరా అవసరాలకు స్పందిస్తారు.

పెద్ద వ్యవసాయక్షేత్రాలతో సమానంగా, - జపాను, హాలెండు, డెన్మార్కు దేశాలలో చిన్న భూకమతాల రైతులు, ప్రతి ఎకరంలో అధికంగా శ్రమించి తలసరి ఆదాయం సాధిస్తారు. ఎక్కడభారీ వ్యవసాయం లాభకరంగావుందో, అక్కడ సహకార సేద్యం ద్వారా ఉత్పత్తులు సాధించటానికి ఇష్టపడతారు. వ్యవసాయం మొదలయిన నాటి నుండీ, ఫ్యూడల్ వ్యవస్థలో నాడు, కాపిటలిజంలో నేడూ బందీయై, సంకెళ్ళు తెంచుకొని విముక్తి పొందటానికి అవకాశం లభించక పోవటం పూర్తిగా కాకపోయినా చాలా వరకు ప్రధాన కారణం.

ఫ్యూడల్ వ్యవస్థలో రైతులు వ్యవసాయ బానిసలుగా (Serfs) తిండికి లేక, అధమమయిన సామాజిక జీవితం, వాతావరణంతో సమాధానపడుతూ, ఆర్థిక ఇబ్బందులు, సామాజిక అవమానాలకు తలవొగ్గి, నిస్సహాయంగా బ్రతికే వారు. ఈ పరిస్థితులలో మార్కెట్లలో కొనాలనిఅనుకోవటం గానీ, కొనగలగటం కానీ చేయగలిగిన ఏకైక వ్యక్తి భూస్వామి లేక పట్టణ వర్తకుడు, లేక వృత్తి జీవులు లేక వర్తకుడు మాత్రమే.

రైతుల నుండి వసూలు చేసి నిలువ చేసిన ధాన్యం, వ్యవసాయ ఉత్పత్తులు ఫ్యూడల్ భూస్వాముల వద్ద నిరుపయోగంగా చేతి నిండా వుండేవి. వారికి కావలసిన సౌకర్యాలు, విలాసాలు, పట్టణవర్తకులనుండి "డబ్బు" (Cash) తో మాత్రమే కొనగలరు. రాజుల చక్రవర్తుల ఫ్యాషన్లబాటలో నడవటానికి, ఫ్యూడల్ప్రభువులు తమకుగల వ్యవసాయోత్పత్తులను డబ్బుకోసం చౌకగా అమ్మవలసివచ్చేది. వారి మార్కెటు లావాదేవీలు తగ్గించుకొనటానికి, క్రమంగా రైతులను "డబ్బు" రూపేణా చెల్లింపులకై నిర్బంధం చేసేవారు. వారి ఎస్టేట్ల విస్తీర్ణత, సెర్ఫ్‌ల సంఖ్య సెర్ఫ్‌ల శారీరక శ్రమ అధికం. అందువలన వారు ధాన్యం వగైరా అమ్మకాలలో గానీ, వారి కొనుగోళ్ళలో గానీ జాగ్రత్తగా వ్యవహరించే వారు కాదు. ధాన్యాన్ని కారుచౌకగా (Dead cheap Prices) అమ్మేవారు. కారుచౌక అనటం బదులు కర్టెసీ ధరలు (మర్యాదపూర్వక) అనిపిలవటం సమంజసం. తమ అవసరాలు, సరదాలు, విలాసాలకు దుబారా ధరలు చెల్లించటానికి సిద్ధపడేవారు. ఫ్యూడల్ ప్రభువులకు కావలసిన అన్ని రకాల సౌకర్యాలు అందిస్తూ పెట్టుబడిదారీవర్తకుడు అధికలాభం ఆర్జించేవాడు. "సెర్ఫ్‌లనుండి గుంజుకొన్న ఆదాయంలో కొంతభాగం ఈ విధంగా వర్తకుని జేబులోనికి ప్రవహిస్తుంది. (లియన్‌తోవ్) అధికవడ్డీలకు అప్పులిచ్చే వడ్డీ వ్యాపారికూడా ఇదే విధంగా లాభిస్తాడు. వాణిజ్యాభివృద్ధితో పాటు సెర్ఫ్‌లను దోపిడీ చేయటం కూడా పెరిగింది. అంతర్జాతీయ సరుకులపై, పట్టణ విలాసాలు, లక్జరీలపై మోజు పెరిగిన ఫలితంగా స్వతంత్ర రైతుల కౌలు భారం అధికమయింది. సెర్ఫ్‌ల శ్రమ

పెరిగింది. బానిసల జీవితం దుర్భరమయింది.'' కారుచౌకగా భూస్వామి ఉత్పత్తులను అమ్మకానికి పెట్టినప్పుడు, 'కౌలు'ను డబ్బుగా చెల్లించవలసి వచ్చిన రైతులు కూడా ఈ "కారుచౌక'' ధరలనంగీకరింపవలసివచ్చేది. వ్యవసాయ ఉత్పత్తులకు ధరలు చౌకగా, పారిశ్రామిక, వాణిజ్య ఉత్పత్తులకు, విలాసాలకు ధరలు అధికంగా వుండటం, ఈ కారణం వలన ప్రారంభమయింది. పెరుగుతున్న అవసరాలను తీర్చటానికి, పట్టణ మాన్యుఫాక్చరర్లు అంతర్జాతీయవాణిజ్యం పై ఆధారపడిన యూరోపు, దక్షిణ అమెరికా, ఓరియంటల్ ఫ్యూడల్‌దేశాలలో, వ్యవసాయ ధరల పతనం ఎక్కువగా వుండేది. ఇండియా, చైనాలలో సంస్కృతితో పాటు, గ్రామ కామన్వెల్తులు స్వయంసమృద్ధి సాధించటంవలన వ్యవసాయ ధరల పతనం తక్కువ. పట్టణమార్కెట్లకు ఎగబ్రాకే జాడ్యం గ్రామీణ కామన్వెల్తులకు సోకిన తరువాత ఇక్కడా ధరల పతనం పెరిగింది.

ఆఫ్రికా తెగలలో గుడిసె పన్ను - తల పన్ను (Hut and Poll tax) కట్టటానికి వారి భూములను, అటవీసంపదను కారుచౌకగా అమ్ముకొని, మిగిలిన కొద్ది పాటి డబ్బుతో బ్రతకటం, అలాకాకపోతే యూరోపియన్లప్లాంటేషన్లలో సెర్ఫ్‌లుగా పని చేయటంకానీ చేయాలి. వారి అవసరాలు చాలా తక్కువ. కనుక ఏదో విధంగా పన్నులు చెల్లిస్తే చాలనుకొని, వ్యవసాయ ఉత్పత్తులను, అటవీసంపదను, చర్మాలు, దంతాలు, ఎముకలు, ఫర్ (కోటులకు ఉపయోగపడే బొచ్చుచర్మాలు) కోకో, వంటివాటినీ కర్టెసీ ధరలకంటె చాలా తక్కువగా ధర అంటూవుంటే దానికే అమ్మేవారు. చాలా యురోపియన్ కంపెనీలు పనికిమాలిన గాజుపూసలు, రమ్ము (Rum) వారికిచ్చి, వారి అమూల్యమయిన సంపదను దోచుకొని పౌండ్లను సంపాదించినయ్.

చరిత్రకు తెలిసినప్పటినుండీ, యూరపులో ప్రభుత్వాలు చౌకగా ధాన్యాన్ని, ఆహారపదార్థాలను తమ పట్టణ ప్రజలకందించటం ఆనవాయితీ. ప్రాచీన, మధ్య యుగాల్లో ప్రభుత్వాలు, పట్టణ ప్రజల, వ్యాపారస్థుల దోపిడీ నుండి రైతులకు రక్షణ కల్పించటానికై పూనుకొన్న సందర్భాలు చాలా తక్కువ. రోమన్ చట్ట సభలు, చంద్రగుప్త మౌర్యుడు, కౌటిల్యుడు, మధ్యయుగంలో అల్లాఉద్దీన్ ఇండియాలో వ్యవసాయోత్పత్తులకు సరి అయిన గిట్టుబాటు ధరలనమలుపరచి, ఆహారాన్ని కొనుగోలు చేసి తమ ప్రజలకు చౌకగా అమ్మేవారు. వ్యవసాయ ధరలు కారుచౌకగా వుండటానికి ప్రాక్ట్యూరుమెంటు కారణం కాదు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో చాలా ప్రభుత్వాలు వ్యవసాయ ధరలను

అదుపులో వుంచి, పట్టణ పారిశ్రామిక వాణిజ్య వర్గాలకు ఆహార పదార్థాలను సబ్సిడీకి అందించి, వ్యవసాయధరలు పెరగకుండా నిరోధించినయ్.

ఫ్యూడలిజం అంతరించి, స్వతంత్రరైతాంగం ఆవిర్భవించిన తరువాత కర్టసీ ధరలు గుదిబండలాగా స్వతంత్ర రైతాంగానికి వారసత్వంగా సంక్రమించినయ్. శ్రేణుల (Guilds) చేతివృత్తుల వారి స్థానం పరిశ్రమలు - కార్మికులు ఆక్రమించారు. ఆడమ్ స్మిత్[2] కాలం నుండీ ప్రచారం చేయబడుతున్న స్వేచ్ఛావర్తక (Laissez - Faire) విధానంపై విశ్వాస ప్రకటన చేసిన 18-19 శతాబ్దాల ఎక్కువ యూరోపియన్ ప్రభుత్వాలు - యూరోపియన్ వర్తకులు - ఉద్యోగుల చేతులలో - స్థానికరైతులను, శ్రామికులను, దోచుకోబడటానికి, హింసించటానికి, బానిసలుగా మార్చబడటానికి పూర్తిబాధ్యత వహించాలి. యూరోపియన్ వర్తకులు వలస రైతులను నిర్బంధించి వారి ఉత్పత్తులను చౌకధరలకమ్మేటట్లు చేశేవారు. ఈ ధరలు యూరపులో వున్న కర్టసీ ధరలు (కారుచౌక ధరల) కన్నా తక్కువ వుండేవి.

తూర్పు దేశాల గ్రామ కామన్వెల్తులను, డచ్, ఫ్రెంచి, బ్రిటీషు సామ్రాజ్యవాదులు - భూమి పన్నును డబ్బుగా చెల్లించ వలసిందిగా నిర్బంధించి, అంతర్జాతీయ వర్తక వాణిజ్యాల దోపిడీ నిరాటంకంగా నేటివరకు సాగేటట్లు చేశారు. యూరపుదేశాల బట్టలను చౌకగా మార్కెట్లకు దిగుమతి చేసి, స్థానికఉత్పత్తులపై మగ్గాలపై, వ్యాపారంపై అధిక పన్నులు విధించి, దిగుమతి చేసిన సరుకును డబ్బుతో కొనిపించి, ఉత్పత్తుల ఎగుమతులు నిరోధించి - స్థానిక ఎగుమతిదారులను నామరూపాలు లేకుండా చేశారు. 19 వ శతాబ్దాంతానికి గ్రామ కామన్వెల్తు రైతులు, కర్టెసీ ధరలను అంగీకరించాల్సి వచ్చింది. 19 వ శతాబ్దాంతానికి వ్యవసాయ ధరలు, ప్రపంచ పారిటీ (సమన్వయ) ధరలకన్నా తక్కువగా, పారిశ్రామిక సరుకుల ధరల కన్నా మరింత తక్కువగా వుండటంలో ఆశ్చర్యంలేదు. మానవశ్రమ, నైపుణ్యాలతో కూడిన వ్యవసాయానికి, పారిశ్రామిక, వాణిజ్య శ్రమ కన్నా తక్కువ వెలకట్టబడుతున్నది.

భూమధ్య రేఖకు రెండు వైపులావున్న రైతులు భూములు లేక, అర్ధబానిసత్వంలో క్రుంగిపోతున్నారు. ప్రతిఒక్కడూ తన దుర్దశ నుండి బయటపడటానికి త్వరపడతాడు. మరలా ఆస్థితిలోనికి ఈడ్వబడటానికి ఇష్టపడడు. అందువలననే రైతులు ఫ్యూడలిజం నుండి విముక్తికై ఎల్లప్పుడూ పోరాటం చేస్తున్నారు. చట్టబద్ధమయిన కౌలుదారీ విధానం,

శాశ్వతకౌలు, కౌలు మొత్తం వంటివాటిని ముందు సాధించి, తరువాత భూములపై పూర్తి హక్కు కొరకు నిరంతరం ఘర్షణ పడుతున్నారు.

వారి ధాన్యానికి వారే యజమానులుగా మార్కెటులోనికి అడుగుబెట్టి నప్పుడు - కొత్తగా వచ్చిన స్వతంత్రత, ఆనందంతో వారు "కర్టసీ ధరలకు" తమ ధాన్యాన్ని అమ్మటానికి సిద్ధపడతారు, గతంలో కర్టసీ ధరలు కూడా వారికి అందలేదు. వర్తకులు ఇది అవకాశంగా తీసుకొని, కర్టసీ ధరలలో కూడా ఎన్నో కోతలు పెట్టి, సొమ్ము చేసు కొంటారు. ఫ్యూడల్ ప్రభువులనుండి, నిర్బంధపు శ్రమనుండి విముక్తిని సంపాదించు కోవటానికి, కౌలు చట్టాల అమలుకు, ఏకమొత్తం చెల్లింపులకు, రైతులు ఆతురతతో ఈ ధరలకుకూడా అమ్మటానికి ఇష్టపడతారు. స్వతంత్రతలో వున్న ఆనందం అటు వంటిది. ఈ ఆనందంలో రైతులు తమ అదనపువిలువనంతా వర్తకుని పరం చేస్తారు. వారి స్థితి పెనం నుండి పొయ్యిలోనికి బడిన చందం అవుతుంది. ఫ్యూడల్ ప్రభువులనుండి వర్తకుల చేతులలో పడి మోసగించబడతారు. ఈ మోసం మనకళ్ళ ముందు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతునే వుంది.

దక్షిణ, మధ్య అమెరికా, ఇండోనీసియా, సిలోన్, మలయా, అమెరికాబానిస రాష్ట్రాలలో కర్టసీ ధరలు అమలుచేశారు. కర్టసీ ధరలకు ఉత్పత్తులనమ్మికొన్నా, ప్లాంటర్లకు భారీలాభాలు మిగులుతయ్. వారి సెర్ఫ్‌లకు, బానిసలకు వారిచ్చే ప్రతిఫలం స్వల్పం. విస్తీర్ణాలు, బానిసలు అధికం. ధాన్యపు ఉత్పత్తి భారీగా వుంటుంది. పని వారి తలసరి ఆదాయం ఎంతస్వల్పమన్నది వారికి అనవసరం, తామెంత మూటకట్టుకుంటున్నామనేది ప్రధానం.

ఆఫ్రికా, అమెరికాలలో, ప్రాచీన భూస్వామ వ్యవస్థ, కాపిటలిస్టువ్యవస్థలు, రైతులపై బానిసత్వం, అర్ధబానిసత్వం రుద్దినయ్. ఇండియా, చైనా రైతుల ఆర్థికచరిత్రను ఈ విషయంలో పరిశోధించవలసివుంది. వారి భూములను జాతీయ సంపదను ఏ పద్ధతుల ద్వారా పాశ్చాత్యులు హస్తగతం చేసుకొన్నదీ వారి సాంఘిక ఆర్థిక పతనానికి ఏ ఏ మార్గాలు అవలంబించిందీ, ఎలా వారి స్వాతంత్ర్యాన్ని హరించి, బానిసలుగా జీత గాళ్ళుగా బజారునపడవేసి - వీరు పాశ్చాత్యులతో శారీరక సంబంధాలు ఏర్పరుచుకో గలిగితే, ఎలా జంతువులలాగా వేటాడి హింసించిందీ, నామమాత్రపు వేతనాలతో, చట్టం దృష్ట్యా స్వతంత్రులయినా, ఎలా దాస్యం చేయించుకొన్నదీ, కేటాయించబడిన

ప్రాంతాలలో వారి గుడిసెలలో వారుండటానికి ఏ పన్నులు విధించి పీడించిందీ పరిశోధించ వలసివుంది. మనకు తెలిసిన కొద్దిలో ఇండియాలో వందమిలియన్లకు పైబడిన దళితులు, తెగలు, సంచార జాతులు, అధిక సంఖ్యలో ఇటువంటివారు చైనాలో, విజేతల దౌష్ట్యం కారణంగా దుస్థితిలో వున్నారు.

వ్యవసాయసామర్ధ్యం, గ్రామీణ ఆర్థికత్వపుస్థాయి, అభివృద్ధి, పరిశ్రమలలో సమానత సాధించే శక్తి, రైతులనుభవించే రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలపై ఆధారపడి వుంటుంది. వలసరైతులు, బానిసలు తమ శరీర శ్రమతో మార్కెట్లను ఉత్పత్తులతో నింపుతున్నంతకాలం, తెల్లజాతిరైతులు రాజకీయ, ఆర్థిక అభివృద్ధి, విముక్తులను ఎలాపొందగలరు? రైతుల పునాది సగం మునిగిపోయి, మానవులుగా చూడబడక, ఆకలితో అలమటించే బానిసజీతగాళ్ళు, తెగలతో, ఇతరఅణచివేయబడిన వర్గాలతో నిర్మించబడినపుడు, వైట్, బ్రౌన్, యల్లో వర్గాల స్వతంత్ర రైతాంగం వర్తకవాణిజ్య వర్గాలతో సమానస్థాయి ఎలా అందుకోగలదు? రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా బందీలుగా వున్న రైతులు, కాపిటలిజం పతనానంతరం వచ్చే విప్లవాత్మకమైన సమాజంలో వారి వాటా అధికారాన్ని ఎలా పొందగలరు,. నిలుపుకోగలరు.?

**కరువు (Famine)** :- ఇతర పరిశ్రమలలో కన్నా, వ్యవసాయంలో మాంద్యం రావటానికొక ముఖ్యకారణం. అనూహ్యమయిన, మానవుని అదుపులో వుండని ఋతువుల క్రమం, వరదలు, తుఫానులు,వర్షాభావం, అనావృష్టి, హిమపాతాలకు వ్యవసాయం గురౌతున్నది. వాతావరణ వైపరీత్యం, వీటివలన నదులకువచ్చే వరదలు, కరువులు, అంటురోగాలు, నెలలు, సంవత్సరాల పర్యంతం పంటలు పండక, కోతలు జరుగక, వ్యవసాయపెట్టుబడులు, శ్రమ వృధా అయి, వారు, వారి పశువులు, పనులు లేక తిండికి, మేతకు, నీటికి కటకటపడి గ్రామీణ ఆర్థికత అంతా తారుమారవుతుంది. ఆకలి, అంటుజాడ్యాలమరణాలు ఇండియాలో అదుపుచేయబడుతున్నప్పటికీ బెంగాలు కరువు[3] 1.3 మిలియన్ల ప్రజలను కబళించింది. ఇండియా వంటి దేశాలలో సహాయ కార్యక్రమాలు చేపట్టినప్పటికీ, విత్తనాల, శ్రమలనష్టం, పశువుల, రైతుల, వారి వ్యవసాయ కూలీల పోషణావ్యయం మాత్రమేగాక నైతికంగా గ్రామీణులకు తగిలిన దెబ్బ,వారి శరీరధార్ఢ్య క్షీణత, గ్రామీణ ఆర్థికత్వానికి మోయలేని బరువు అయింది. ఈ భరించలేని వినాశనానికి రైతులు తల వంచటంలో అశ్చర్యంలేదు. ఈ మాత్రపు అరకొర సహాయ

కార్యక్రమాలు కూడా ఇరాన్, చైనా, ఆఫ్ఘనిస్థాన్‌లో లేవు. అందువలన ఒక ప్రకృతి వైపరీత్యానికి - వేరొక వైపరీత్యానికి మధ్య కాలంలో వచ్చిపడే అవాంతరాలను గట్టెక్కటానికి, వడ్డీ వ్యాపారులపైఆధారపడటం గ్రామీణఆర్థికవిధానపు శాశ్వత లక్షణమయింది.

కరువుతోడేలు అతి సమీపంగా ఎప్పుడూ పొంచివుంటుంది. "కరువు " ఒక సంవత్సరపు అనావృష్టివలన కలుగదు. అది రెండు లేక మూడు సంవత్సరాల అనావృష్టి ఫలితం ... కరువు ప్రజల రోగనిరోధక శక్తిని హరిస్తుంది. ఆ తరువాత వచ్చే మలేరియా వారిని తేలికగా కబళిస్తుంది. కలరాకూడా ఇంతే - మూడు సంవత్సరాల రాజపుటానా కరువులో వేలాది పశువులు మరణించాయి ". (Sir T.V. Vijaya Raghavachari - Land and its problems). ఆ ప్రాంతంలో నాలుగు కరువులు, రెండు సంవత్సరాల ఆహార కొరతలు 1934 - 43 మధ్యకాలంలో వస్తే, ప్రతి కరువు తరువాత రెండు సంవత్సరాలు అల్పదిగుబడులు లెక్కలోకి తీసుకుంటే, రైతులు 9 సంవత్సరాలకుగాను 3 సంవత్సరాలు మాత్రమే సాధారణ పంటలను కళ్ళ చూశారు. 5 మిలియన్లలో 4 మినియన్ల రైతులు 9 సంవత్సరాలలో 6 సంవత్సరాలు మాడిపోయారు. 1948-52 మధ్య కాలం అంతా కరువే. ప్రభుత్వ సహాయం కుదించటానికి గట్టి ప్రయత్నాలు జరిగినా, 5 లక్షలమందినిరుద్యోగులుగా సహాయ కార్యక్రమాలపైనే ఆధారపడ్డారు. అభిమానం అడ్డువచ్చి ప్రభుత్వ సహాయంపొందటానికి ముందుకురాని గ్రామీణుల సంఖ్య నెవరు లెక్క బెట్టగలరు? వారు చిన్న చిన్న తీర్చలేని అప్పులతో పడిన వేదన ఎలా అర్థం చేసుకోగలరు? 1943 లో బెంగాలులో మిడ్నాపూర్, ఒరిస్సా రాష్ట్రం, తమిళనాడులోని కొన్ని జిల్లాలు తుఫానుతాకిడితో, కలరాతో మలబార్, రాజపుటానా, బీజాపూర్ వరదలతో , బొంబాయి కరువుతో, మలబారు, తిరువాన్కూరు ఆహారకొరతతో, కలరాతో, మొత్తం బెంగాలు ఆహారపుకొరతతో తగ్గినరోగనిరోధక శక్తి, పోషణాలోపాలతో మలేరియా, కలరాలతో అల్లాడినవి. 1954 ఒక సంవత్సరంలోనే U.P. బీహార్, బెంగాలు, అస్సాం, ఒరిస్సాలు వరదలతో, రాజస్థాన్, తమిళనాడు అనావృష్టితో, ఆంధ్ర, ఒరిస్సాలు వరదలు, తుఫానులతో దెబ్బతిన్నవి. మిలియన్ల కొలదీ రైతులు పంటలు, పెట్టుబడులు నష్టపడి, వడ్డీ వ్యాపారులచేతులలో చిక్కుకొన్నారు. ఈ ప్రకృతి వైపరీత్యాల వలన, దీర్ఘ కాలిక ఋణబాధవలన, పోషణాలోపాలవలన, నిరాశా, నిస్పృహలతో కుంగటం, వారిసంపాదనాధారాలు వట్టిపోవటం మినహా ఏం ఫలితం వుంటుంది? విత్తనాలుకూడా తిండిగింజలుగా పూర్తిగా ఖర్చు అయిపోయినవ్. కొనటానికి వారి దగ్గర డబ్బులేదు.

ఇంతకంటే రైతుల నిస్సహాయతకు వేరే ఉదాహరణేముంటుంది ? భారీవ్యవసాయంగల అమెరికా, అర్జెంటీనా, ఆస్ట్రేలియాలలో కూడా ఋతువుల వైపరీత్యం రైతాంగానికి భారంగా వుంది.

పశువుల జాడ్యాలు, పంటల చీడపీడలు, మిడతల దండ్లు రైతుల ఆర్థికతకు లెక్కవేయలేనంతగా నష్టం కలిగించుతయ్. 1942 - 43లో వచ్చిన కరువులు, తుఫానులలో, (బెంగాలు విషాదంలో) 1/4 వంతు పశువులు నశించాయి, 34 లక్షల మంది రైతులు మరణించారు. 1954 తూర్పుకోస్తా (ఇండియా) తుఫానునష్టం 4 నుండి 6 కోట్ల వరకూ ఉంటుందని అంచనా వేయబడింది. యుద్ధానంతరం ఇండియాలో, కొన్ని రాష్ట్రాలలో వరదలు, కొన్నిటిలో అనావృష్టి తుఫానులు, మిడతల దండ్లు, కరువులు, వీటి పరిణామాలు రైతులను ఆర్థికంగా సాంఘికంగా వెనుకబడేటట్లు చేసినయ్. ఈ ప్రకృతి వైపరీత్యాలతో పోరాడటానికి, జాతీయ, అంతర్జాతీయ భీమా సౌకర్యాలు ఏకైకమార్గం - F.A.O. కూడా ఇన్సూరెన్సు ఆవశ్యకతను గుర్తించింది. ఈ కార్యక్రమం ఇంతవరకూ చేపట్టబడలేదు. ఈ భారీనష్టాలను భర్తీచేయటానికి సరియయిన కార్యక్రమాలు చేపట్టే వరకు, వినియోగదారులు అధికధరలు చెల్లించి, జాతీయ ప్రభుత్వాలు ఇన్సూరెన్సు స్కీములనమలు పరచి రైతుల నష్టాలలో భాగస్వాములు కావాలి. ఎవరూ సహాయపడకపోగా, అందరూ కుట్రపన్ని, వ్యవసాయాన్ని దీర్ఘకాలికమయిన అణచివేతకు (మాంద్యానికి) బలిచేస్తు ఈ భారీనష్టాన్నంతా రైతుల పైనే మోపుతున్నారు.

రైతులు తమపై రుద్దబడిన బలవంతపు వ్యవసాయమాంద్యంతో, నిత్య దారిద్రంలో కొట్టుమిట్టాడుతూ వారి భూములు వరదలకోతలతో, గండ్లతో, సారవంత మయిన భూమిపై పొరలు కొట్టుకొనిపోయి, సారహీనమై పోగా, పొలాలు బాగుచేసు కోవటానికి, కట్టలు వేయిటానికి, గండ్లుపూడ్చటానికి, ఎరువులతో భూసారం పెంచటానికి అశక్తులుగా వున్నారు. జాగ్రత్తగా సాకకపోతే, భూమికూడా గనులలాగానే ఎక్కువ కాలం వాడకంతో వట్టి పోతుంది. చైనా రైతులు ఈ సత్యాన్ని గుర్తించి సేంద్రియ ఎరువుల (పేడ-నైట్‌సాయిల్) తో తగు పోషణ చేసి, భూములను పరిపుష్టం చేస్తున్నారు. జపాను వారుకూడా చైనావారిబాటలోనడచి భూసార పరిరక్షణ చేసుకొంటున్నారు. వేలాది సంవత్సరాలుగా సాంద్రవ్యవసాయం చేసినా వారి భూములింకా సారవంతంగా వుండటానికిదే కారణం. హ్రస్వదృష్టితో అమెరికా, బ్రెజిల్ దేశాలు ఈ విధానం

అవలంబించటం లేదు. ఇండియాలోకూడా పేడను రైతులు సంప్రదాయేతర ఇంధనంగా వాడి, నైట్ సాయిల్‌ను పొలాలకు వాడక తప్పుచేస్తున్నారు. రాజపుటానా, గోబీ, సహారా ఎడారులు సారవంతమయిన భూములకు విస్తరించుతూ దిగుమతి వైఫల్యాలకు కారణమగుతున్నయ్. వరదలు, కోతలతో అతిపెద్ద విస్తీర్ణాలు నిరుపయోగమవుతున్నయ్. సారవంతపుపై పొర కొట్టుకొని పోతే, మనం తెలుసుకొనేలోగా, పైరు ఒక సంవత్సరం ఉపయోగించుకొనే సారం కన్నా ఆరురెట్లు సారక్షీణత కలుగుతుంది. సంవత్సరానికీ సంవత్సరానికీ శతాబ్దాలుగా దిగుబడులు తగ్గుతుంటే దీనికి కారణం గ్రహించ లేక పోయారు. గుడ్డితనంగా అడవులు నరకటం, పోడు వ్యవసాయం చేయటం, చెట్లునరకటం, పరిసరాలను పరిరక్షించకపోవటం వలన, భూసారం క్షీణిస్తూంది. మైదానాలను వర్షాల నుండి, ఎండలనుండి, చలిగాడ్పులనుండి రక్షించక పోవటం కూడా భూసారహీనతకు కారణం. ఈ నష్టం రైతుల ఖాతాలో జమవేయరాదు. ప్రభుత్వం సక్రమమైన చర్యలు తీసుకొనాలి. వ్యవసాయమాంద్యానికి, ప్రభుత్వాలు కూడా కారణమే. 1951 - 56 మధ్య కాలంలో పెరిగిన ఉత్పత్తుల నిల్వల ప్రభావంతో వచ్చిన వ్యవసాయమాంద్యంలో మాత్రమే U.S. ప్రభుత్వం సాయిల్ బాంకులు (Soil Banks)ను గురించి మాట్లాడు తున్నది. సాయిల్ బాంక్ అంటే - ఒక పంటపండిన తర్వాత - ఆ భూమిలో కొన్ని సంవత్సరాలు పంటలు వేయకుండా భూమికి విశ్రాంతి కల్పించటం తద్వారా భూసారంపెంచటం.

వ్యవసాయమాంద్యానికి దోహదపడే పై కారణాలు చాలవన్నట్లు గత వంద సంవత్సరాలలో వచ్చిన ఆర్థిక సంక్షోభాలు - వ్యవసాయ విచ్ఛిత్తికి కారణమయినయ్. ఆర్థిక సంక్షోభాలు పరిశ్రమలకు - వ్యవసాయానికీ సమానమయినప్పటికీ, పరిశ్రమలంత త్వరగా వ్యవసాయం కోలుకోలేక పోతున్నది. భాగ్యవంతులు, బలవంతులు అయిన కాపిటలిస్టులు, పారిశ్రామిక వేత్తల కన్నా వ్యవసాయదారులు తేలికగా అణచివేయ బడతారు. ఈ విషయం వేరొక సందర్భంలో చర్చించుదాం. కానీ మనం, ఆర్థిక సంక్షోభాలలో గ్రామీణ సంపద అపారంగాను, ఆర్థిక వెల్లువలలో (Boom) తగు మాత్రం గాను, పారిశ్రామిక, వాణిజ్యవర్గాలకు ప్రవహిస్తుంది అని తెలుసుకొంటే చాలు.

నిస్సహాయులయిన ఆఫ్రికానీగ్రోలపై ఆర్థికమాంద్యపు ప్రభావం, పరిణామాల ఉదాహరణలు కొన్ని పరిశీలిద్దాం.

టాంజనైకాలో సిసల్ (Sisal Hemp - పీచు, మత్తుపదార్ధాలపంటలు) ఎగుమతులు 36 వేల టన్నులకు పెరిగినా - విలువ 1,50,0000 పౌనుల నుండి 6,98,000 పౌన్లకు తగ్గింది. ప్రత్తి ఎగుమతి 72,000 నుండి 1,00,000 సింటాల్సు (1 సింటాల్ - వంద పౌనులు బరువు) కు పెరిగింది. విలువ 5 లక్షల పౌన్ల నుండి 1.8 లక్షలకు తగ్గింది. కెన్యాలో 11,32,000 c.wts మొక్కజొన్న 1931 లో 2,13,000 పౌన్లు సంపాదించగా, అయిదు సంవత్సరాల పూర్వం 8,92,000 c.wts కు 3,06,000 పౌండ్లు ఆదాయం వచ్చింది. సిసల్ 1,656 టన్నులు - 4,96,000 పౌన్లకు ఐదు సంవత్సరాల క్రితం అమ్మబడితే 1931 లో 19850 టన్నుల పై రాబడి 2,50,000 పౌండ్లు మాత్రమే.

"మోడరన్ ఆఫ్రికా ఎనిమిది ప్రాథమిక ఉత్పత్తులపై ఆధారపడటం వలన వారు ప్రపంచ విపణుల ధరల వైపరీత్యానికి లోనయ్యారు. ఆఫ్రికన్లు తమ 'మనుగడకోసం' (Subsistance) చేసే వ్యవసాయం వదలి, ఆకలి, నిరుద్యోగం అనే కొత్త జాడ్యం కొనితెచ్చుకొన్నారు."(Mr. Camp poell.)

పారిశ్రామిక వేత్తలు కార్టెల్స్, ( కుమ్మక్కై ధరలు పెంచిపోటీదార్లను అణచివేసే సంస్థలు) ట్రస్టులుతో, ధరలు దీర్ఘకాలికంగా మందంగావున్నా, నష్టాలు తక్కువగా వుండేటట్లు ఎక్కువకాలం కాపాడుకోగలరు. రైతులు అలాచేయలేరు. పతనమవుతున్న పారిశ్రామిక వ్యవస్థలపై నమ్మకం కలిగించటానికి, ప్రభుత్వాలు ద్రవ్యచలామణీని వారి కనుకూలంగా మలచాయి. రైతుల రక్షణకుమాత్రం చర్యలు తీసుకొలేదు. సంక్షోభాలు 5 లేక 6 సంవత్సరాలకొకసారి ప్రపంచంలో వస్తూనే వుంటయ్. ఈ కాలంలో (సంక్షోభ కాలం) ఎంత గ్రామీణ సంపద, వనరులు, అదృశ్యంగా పారిశ్రామిక వాణిజ్య వర్గాలకు బదిలీ అవుతుందో మనం ఊహించవచ్చు. కృత్రిమంగా, అన్యాయంగా, నిర్లక్ష్యంతో సృష్టించబడిన ఈ పరిస్థితులు వ్యవసాయాన్ని - మాంద్యంలో లోతుగా కూరుకొని పోయేటట్లు చేయటం ఆశ్చర్యం కలిగించదు.

వ్యవసాయపు మరొక అసమర్ధత - పంటలవైఫల్యాలు. అందువలన తిరిగి చేతికిరాని పెట్టుబడులు, తన, తన పశువుల పోషణా భారం వలన రైతులు, వ్యవసాయాభివృద్ధికి ఏ విధమయిన "పొదుపు" చేయలేక పోతున్నారు. నికర ప్రతిఫలాలు స్వల్పం కనుక ప్రైవేటు పెట్టుబడులు వ్యవసాయానికి అందవు. (F.A.O.సర్వే) కాపిటలిజం పెట్టుబడులను, వ్యాపార, వాణిజ్యాలకు అందుబాటులో వుంచి వ్యవసాయాన్ని నిర్లక్ష్యం

చేసింది. అవసరమయిన ఋణ సౌకర్యంలో, సహకారరంగంనుండి వ్యవసాయ రంగానికి అందిన ఋణం ఇండియాలో 3 % శాతం మాత్రమే. దీర్ఘకాలిక, మధ్యకాలిక ఋణాలు U.S.A; U.K. లలో కూడా అల్పాదాయ వర్గాల రైతులకు వారి అవసరాలమేరకు అందటంలేదు. వడ్డీరేటు 100 శాతం నుండి 150 శాతం వుండటంలో ఆశ్చర్యంలేదు. వడ్డీవ్యాపారి అయిన వర్తకుడు వ్యవసాయధరలనుదిగజార్చి, రైతులను మనుగడ వ్యవసాయస్థితిలో వుంచినా ఎవరూ రక్షించలేని స్థితి.

యుద్ధానంతరం మాత్రమే, అమెరికన్, యూరోపియన్, ఓసియానిక్ రైతులు, జాతీయ, అంతర్జాతీయ సంస్థలనుండి , తమ పొదుపు నిలువలనుండి చెప్పుకోదగిన మొత్తాల్లో వ్యవసాయాభివృద్ధికి పెట్టుబడి పెట్టగలిగారు. అభివృద్ధి తక్కువగా వున్న దేశాలలో, వివిధ అంతర్జాతీయ ఋణసంస్థలు, వ్యవసాయాభివృద్ధికి పెట్టుబడులు పెంచకపోవటంవలననే S.U.N.F.E.D[4] ఆవశ్యకత ఏర్పడింది.

ఋణ సౌకర్యలోపం వ్యవసాయమాంద్యానికి మరొక కారణమయింది.

## వర్తకుడు - పట్టణ నాగరికతకు ప్రతినిధి

వ్యవసాయ మాంద్యానికి, దోపిడీకి కారణాలయిన ప్రపంచ కాపిటలిజం శక్తికి, ప్రపంచ విపణులకు, పారిశ్రామిక వాణిజ్య వర్గాలకు ప్రత్యక్ష ప్రతినిధి - వర్తకుడు. ఇతడు కాపిటలిజం దోపిడీకి సహాయకారి. సప్లై - డిమాండుల మధ్య నిష్పక్షపాతంగా వ్యవహరించ వలసిన మధ్య వర్తి. వాస్తవంలో ఆతడు వ్యవసాయోత్పత్తుల వినియోగదార్ల స్వార్ధాలకు, తన సేవలందిస్తున్నాడు. తన బాధ్యతలను విస్మరించి అతడెందుకిలా ప్రవర్తిస్తున్నాడు? సమాధానం కొరకు చరిత్ర తిరగతోడాలి. పట్టణాలకు యుద్ధ శిబిరాలకు ఆహారాన్ని గ్రామీణ ప్రాంతాలనుండి దిగుమతి చేసుకోవలసివచ్చేది. గ్రామాలు స్వయం సమృద్ధి కలిగినవి. పట్టణాలపై ఆధారపడనవసరంలేదు. పట్టణ వర్తకుని సృష్టికి ఇది ఒక ప్రేరణ. ఆహారవస్తువులను, రైతులనుండి పొందటానికి పట్టణవాసులు కొన్ని ఉపయోగ కరమయిన, అభిరుచి కల్గించే, నిత్యావసరవస్తువులను తయారుచేసి సాంస్కృతిక సేవ లందించి, వీటికి మారుగా వ్యవసాయోత్పత్తులను పొందేవారు. స్వీయ రక్షణకై కళాకారులు, వర్తకులు, రైతులను, ఫ్యూడల్ ప్రభువులను, వారి ఆశ్రితులను తమ పారిశ్రామిక

ఉత్పత్తులతో, చాకచక్యం అంతా ప్రదర్శించి, మెప్పించి ధాన్యం వగైరాలు తిరిగి పొందే వారు. పట్టణాల అవసరాలు తీర్చటానికి వర్తకులు పుట్టుకొచ్చారు. ఏ శ్రమకూడా వ్యవ సాయ శ్రమ కన్నా ఎక్కువ ఉత్పత్తి దాయకం కాదనేది నేటి కంటే నాడు ఎక్కువ వాస్తవం. అతని సహచరపట్టణ వాసుల అదృష్టంలో అతడు భాగస్వామికాదా?

పట్టణ వర్తకుని పుట్టుక, వ్యవసాయ ప్రజలతో వర్తక సంబంధాలు ఏర్పరుచు కోవటంలో తరువాత కాలంలో అధిక ప్రాధాన్యత, ప్రాముఖ్యత సంతరించుకొన్నది. కొలంబస్, వాస్కో-డి-గామా, కార్టెజ్ తరువాతకాలంలో అమెరికన్ స్టాన్లీలు, ఇండియా, అమెరికా, ఆఫ్రికాలను కనుగొనటానికి, ఇండియా ఇండోనీసియా, చైనా, జపాన్‌లకు సముద్రమార్గాలు తెలుసుకోవటానికి, ఆఫ్రికాలో అన్వేషణ జరపటానికి, భూమధ్య రేఖకు రెండు వైపులా సామ్రాజ్యాలు నెలకొల్పటానికి - యూరప్‌దేశాలకు సాయపడ్డారు. ఈ అన్వేషణంతా ఇండియా వంటి ప్రాచీన దేశాల నుండి, ఆహార ధాన్యాలు, సిల్కు, సుగంధ ద్రవ్యాలు, ప్రత్తి వంటి పారిశ్రామిక ఉత్పత్తులను సంపాదించటానికై జరిగింది. అమెరికాను ప్రమాదవశాత్తు కనుగొన్నా వలస లేర్పరుచుకోవటానికి గల అవకాశాలను సద్వినియోగం చేసుకొన్నారు. ఇండియాలో వ్యాపారం చేయటం వారి మొదటి ఆలోచన.

"ఈ అన్వేషణలలో మొదట వున్న ఆసక్తి, అభిరుచి, సత్వర సంపాదన లేక పోవటం వలన చల్లారినయ్. అమెరికానుండి స్పెయిన్‌కు వెండి ప్రవహించటం మొదల యిన తరువాత ఇంగ్లాండుకు అన్వేషణాసక్తి కలిగింది." ( R.H. Tawney - Religion & Rise of Capitalism- P. 129).

ప్రాచ్యదేశాలకళలతో, చేతివృత్తులతో తులతూగే పరిశ్రమలు అప్పట్లో పాశ్చాత్య దేశాలలో లేవు. అందువలనవారు బంగారం, వెండి తూర్పుదేశాలకు ఎగుమతి చేసి వీరి నుండి కావలసిన ఉత్పత్తులను కొనుగోలు చేసేవారు. తరువాత అదృష్టం కలసివచ్చి సౌత్ అమెరికాలో (మయా-అజ్‌టి)[5] బంగారం దోపిడీ చేశారు. అమెరికాలో దక్షిణ ఆఫ్రికాలో బంగారపు గనులు పడ్డవి. ఇదే సమయంలో బ్రిటీషు ప్రత్తి పారిశ్రామిక వేత్తలు ఆదేశానికి ఉపయోగపడ్డారు.పాశ్చాత్య దేశాలు తమ బంగారం, వెండి, బట్టలు ఆర్థికవనరుల స్థోమతతో - తూర్పు దేశాలతో వ్యాపారం చేయగలిగారు. ఈస్ట్ ఇండియా కంపెనీ వర్తకులు, ఇంగ్లాండు, హాలెండు దేశ సాహసికులు, వారి దేశాల ఏజంట్లుగా సంపద, ఆహారం, వ్యవసాయోత్పత్తుల కొరకు, వ్యాపార సరుకుల కొరకు, వాటి

తయారీదార్లయిన రైతుల చేతిపనివారల కొరకు అన్వేషించారు. రైతులు వీరిని వెతుక లేదు.

మార్కెటింగు, వడ్డీవ్యాపారం వంటి కీలక సేవలు, రైతుల న్యాయార్జిత ప్రతిఫలాలను దోచుకొనేవిగా మధ్యయుగపు స్కూల్‌మెన్ (Medival School Men) గ్రహించారు. బోధనల ద్వారా, చర్చిలద్వారా ఈ దోపిడీ అరికట్టటానికి వారు చేసిన ప్రయత్నాలు విఫలమయినయ్. తరువాత ఆమ్స్ (Amm's) అతని శిష్యుడు కాల్విన్ - స్కూల్‌మెన్ బాటను విడిచి కొన్ని నియమనిబంధనలకు లోబడి వడ్డీ వ్యాపారం చేయటాన్ని సమర్ధించారు.

19వ శతాబ్దంలో పశ్చిమ యూరపులో వచ్చిన పారిశ్రామిక విప్లవం, ట్రాపికల్ దేశాలపై పట్టు, బానిస వ్యాపారపు లాభాలు కాపిటలిజానికి ఊపునిచ్చింది. నూతనపట్టణ నాగరికత విజృంభించింది. పెరుగుతున్న వారి జనాభాకు చౌకగా ఆహార దిగుమతులు చేసుకోవటానికి, యూరోప్ దేశాలు ఎగబడినయ్. ఆ దేశాలు వ్యవసాయోత్పత్తిలో వెనుక బడివున్నయ్. (అప్పట్లో).

లాంక్‌షైర్ బట్టల మిల్లులు, డుండీ జూటుమిల్లులూ, లాయిన్స్ హోసియరీ, సిల్కు కాటన్, జూటు, సిల్కుల దిగుమతులకు, వారి ఉత్పత్తులకు మార్కెట్ల నన్వేషించి నవి. ప్రభుత్వ మద్దతుతో, ఈ పారిశ్రామిక వేత్తల ఏజంట్లు ముడిసరుకులకు, వారి ఉత్పత్తుల మార్కెటుకు ప్రపంచమంతా గాలించారు. 1840 లో బ్రిటీషు గవర్నమెంటు "కాటన్ కమిటీ" నేర్పాటు చేసింది. భారతదేశపు ప్రత్తి ఉత్పత్తులు గణనీయంగా పెంచటం దీని ముఖ్యోద్దేశం. పారిశ్రామిక వర్గాలు చౌకగా దొరుకుతున్న అమెరికన్, కెనడా, ఐరిష్ గోధుమలకు ఎగబడటంవలన బ్రిటీషువారు తమ "కారన్ (మొక్కజొన్న ఇత్యాది) చట్టాలను గాలికొదిలేశారు. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండులలో గోధుమలు, బీఫ్ (ఎద్దు మాంసం)ల ఉత్పత్తి, ఎగుమతులను బ్రిటీషు గవర్నమెంటు పట్టుదలతో, విజయ వంతంగా సాధించింది. ఆఫ్రికాలో సామ్రాజ్యాల నేర్పరుచుకొని, ఆఫ్రికన్‌కోకా, ప్రత్తి, సిసల్, ప్లాంటేషన్లను బానిసలతోనూ, బలప్రయోగంతోనూ నెలకొల్పారు. నైలునదికి డాములు కట్టి నైలు ప్రత్తిలోయను అభివృద్ధిపరచారు. యూరోపియన్ ప్రజలకు, వ్యాపారు లకు ఆహారాన్ని, ముడిసరుకులను అందించటానికి, వారి ఉత్పత్తులకు మార్కెట్లు సంపా దించటానికి ఈ కార్యక్రమం చేపట్టారు. ఈ విధంగా ఆధునిక వర్తకులు, వర్తక

సాహసికులు, స్పెక్యులేటర్లు, బాంకర్లు, స్టాక్ బ్రోకర్లు - పట్టణ వాణిజ్య పారిశ్రామిక వర్గాల నుండే పుట్టుకవచ్చి, వారికి కావలసిన ఆహార సరుకులను చౌకగా సంపాదించటం - ఉత్పత్తులకు గిరాకీ కల్పించటం చేశారు.

ఈ పరుగులో ముందుగా పోర్చుగల్, స్పెయిన్ తరువాత హాలెండు, ఇంగ్లాండు, తదుపరి ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా, జపాను దేశాలు పాల్గొన్నవి. జపాను మొదట్లో పాశ్చాత్యదేశాలతో వాణిజ్యానికి అయిష్టంగా వుంది. 1854 లో అమెరికన్ కమొదోర్ పెర్రీ జపానును ఇందుకుబలవంతంగా అంగీకరింప చేశాడు. తుపాకీ చూపి ఇంగ్లాండు - చైనాను ప్రపంచ వర్తకంలోనికి లాగింది. 17వ శతాబ్దంలో మొగలు చక్రవర్తుల ముందు కుప్పిగంతులు వేసి, ప్రాధేయపడి బ్రిటీషు రాయబారులు వారిని ఇంగ్లాండుతో వర్తక సంబంధాలకు వొప్పించారు.

వ్యసాయేతర వర్గాల, వర్తక అనుకూలవర్గాలనేపధ్యం గల ఈ దళారీలు బూర్జువాల అవసరాలకే తమ శక్తియుక్తులను కేటాయించారు. రైతులు తమను ధనవంతులు చేయటానికే పుట్టారని వీరి ఉద్దేశ్యం. మార్పిడులను (Exchange)రైతులను మోసగించటానికి, మార్కెట్లను రైతులను ప్రపంచ మార్కెట్లకు బానిసలుగా చేయటానికి వీరుపయోగించుకొన్నారు. ప్రభుత్వాలను స్వాధీనపరచుకొని, లేక అదువులో వుంచుకొని, వివిధ రకాల ఉత్పత్తులను ప్రపంచ మార్కెట్లద్వారా పారిశ్రామిక వేత్తలకు స్వల్ప ధరలకు అందించారు. గ్రామాల్లో, గ్రామీణ, పట్టణ మార్కెట్లలో అసంఖ్యాకంగా ఏజంట్లను నియమించి, రైతులను తమ వలలో వేసుకొని, వారిని పీల్చి పిప్పి చేశారు. ఈ విధంగా వర్తకంలో వెనుకబడి వున్న ఇంగ్లాండు 2/3 వంతు ఆహారాన్ని, బట్టల మిల్లులకు కావలసిన ముడిసరుకులను, జూటును, దిగుమతి చేసుకొని ఆర్థికంగా అభివృద్ధిపొంది, సంపదను పోగుచేసుకొనగలిగింది. "స్వల్పమయిన ముడి సరుకులు, ఆహారోత్పత్తులు గల ఈ దేశం ప్రపంచ వాణిజ్యరంగంలో ప్రత్యేక హోదాను పొందింది." అని బ్రిటీషు దేశపు అభిమాని గొప్పలు చెప్పుకొన్నాడు. ప్రపంచ వర్తకానికై ఆదేశపు రేవులను తెరచి వుంచి, వర్తకం, పరిశ్రమలు, యాంత్రికతలపై వత్తిడి పెంచి, ఇంగ్లాండు అతిపెద్ద వాణిజ్య నిలువల కేంద్రమయింది. అమెరికా, రష్యాలు వారి రాజకీయం ద్వారా నూతన అంతర్జాతీయ పెట్టుబడి విధానం ద్వారా ప్రపంచాన్ని భయపెడుతున్నవి. వాణిజ్య వర్గాలు తమ ప్రతి నిధి అయిన ప్రపంచ విపణుల కుట్రతో వ్యవసాయోత్పత్తులను ఉచ్చులలో బిగించినయ్.

వాటి దయా దాక్షిణ్యాలపై ఆధారడేటట్లు చేసినయ్. గిట్టుబాటు లేని, లాభసాటికాని, అన్యాయపు ధరలను వ్యవసాయోత్పత్తులకు వాణిజ్యవర్గాలు, ప్రపంచ విపణులు కల్పించినయ్. వర్తకులు వారి ఆశ్రితులు ఈ విధానమే ఇండియా, చైనా ఇతర ఓరియంటల్ దేశాలలో అమలు చేస్తున్నారని చరిత్ర తెలిసినవారికి అవగతమగుతుంది.

ప్రస్తుత వ్యవసాయ మాంద్యాన్ని గత మాంద్యంతో (బ్రిటీషు మిల్లులు - పారిశ్రామిక వేత్తలు కల్పించిన) పోల్చకూడదు. అది కృత్రిమయినమాంద్యం. ఆహార ధాన్యాలను వారి అవసరాలకు ప్రతిదేశం కొద్దో గొప్పో పండించక తప్పదు. ప్రజల ఆహార అవసరాలు తీరిన తరువాతనే పారిశ్రామిక ఉత్పత్తులు చేపట్టటం జరుగుతుంది. కనుక స్వతస్సిద్ధమైన , స్వాభావికమైన వ్యవసాయమాంద్యం ఎల్లప్పుడూ వుండదు. అనవసర మయిన, అననుకూల ప్రాంతాలలో నెలకొల్పిన అతిగా విస్తరించిన, అవాంఛనీయ పరిశ్రమలు, కొన్ని ప్రాంతాలలో కొంత కాలం కానీ ఎల్లప్పుడూ కానీ "మాంద్యం"కు గురౌతవి. ఒక దేశపు సామాన్య సామాజిక ఆర్థికతను దృష్టిలో పెట్టుకొని, ఆదేశంలో వ్యవసాయమాంద్యం ఏర్పడిందని చెప్పటం తప్పు. అన్యాయం. అలాగే తగ్గిన వ్యవసాయోత్పత్తుల ధరలను చూపించి సమర్థించుకోవటం సరికాదు. ఉదా:- వ్యవసాయ ఉత్పత్తుల ధరలు హెచ్చుగా మొదలయినప్పుడు, కీలక సేవలు స్వార్థ శక్తులు, ఆ అధిక ధరలతో సర్దుబాటు చేసుకొంటాయ్. వినియోగదారులు హెచ్చు ధరలను తమ ఆహార పదార్థాలకుచెల్లించటంలోని ఆవశ్యకత గుర్తిస్తారు. Mr. C.J. హిచ్ పరిశీలనలో " అమెరికా శ్రామికుల వేతనాలు వారి ఎక్కువ పని సామర్థ్యంతో పాటు, సరిహద్దులకు అందుబాటులో వుండటం వలన కలిగిన వని భావించాడు. సరిహద్దు ప్రాంతం నుండి తప్పించుకొనివచ్చి, అమెరికాలో స్వతంత్ర వ్యవసాయ, వ్యాపారాలు సాగించేవారు ఆకర్షణీయ మయిన ఎక్కువ వేతనాలు చెల్లించటం దీనికి కారణం . ఇతర దేశస్తులు ఈ అవకాశాన్ని ఆసరా చేసుకొని తక్కువ వేతనాలు చెల్లిస్తున్నప్పటికీ - అలా హెచ్చు వేతనాలతో ప్రారంభమయిన వేతనాలు నిలకడగా, హెచ్చుగా వున్నయ్. అందువలన ఉత్పత్తులు కూడా పెరిగినయ్. వేతన స్థాయి - ధరల స్థాయిలవలెనే చారిత్రక కారణాలవలన, సామర్థ్యం వలన, వ్యవస్థీకృతమగుటవలన, బేర శక్తివలన ( వేతన స్థాయి) ప్రభావితమవుతుంది. వ్యవసాయం - కర్టెసీ ధరలు - కారుచౌక ధరల గుదిబండతో మొదలయింది కనుక మాంద్యం కొనసాగుతున్నది.

కేంబ్రిడ్జి స్కూలు మార్షెలియన్ శాస్త్రవేత్తలు - అన్యాయంగా, తప్పుడుగా, చారిత్రక విరోధంగా - వ్యవసాయం మాంద్య పరిశ్రమ అని నిర్ధారించారు. అందువలననే Mr. హారోడ్ " ఈ యజమానులను ఏమీ చేయపనిలేదు. వారిస్థితి - వారి ఉత్పత్తుల ను సరియైన పరిశ్రమలకు, వ్యక్తిగత సంస్థలకు బదిలీ చేయటంతో ముడిపడి వుంది" అని ధైర్యంగా చెప్పాడు, వైయక్తిక వ్యవస్థలను నిర్మూలించినతదుపరి పరిణామా లేమిటి ?

ఆతని అభిప్రాయం "బలవంతులయిన పారిశ్రామిక వర్గాన్ని వారి ఉద్యోగులను ప్రోత్సహించి, త్వరగా పెరుగుదల సాధించి బలహీనులను బయటకు నెట్టాలని". దీని వలన కలిగే మానవగ్లాని మాటేమిటి ? ఒక వర్గపు సరుకులు వేరొక వర్గపు సరుకులతో మార్పిడి జరగటం సహించగలిగినది. అందువలన వేతనాలలో వ్యత్యాసం సహజం. అని ఆయన భావన. వ్యవసాయక - పారిశ్రామిక ఆదాయ వ్యత్యాసాలను సమర్ధించ టానికి ఎంత అన్యాయమైన సమర్ధన?

" ప్రజలు భాగ్యవంతులయ్యే కొలది. వారు తమ ఆదాయం నుండి ఆహారం కొరకు తక్కువ దామాషాలో ఖర్చు చేస్తారు." ఎక్కువ దామాషాజనాభా వినియోగ వస్తువులు (Finished Products) తయారు చేయటానికి అవసరం" - మనకు దీనివలన ఏమర్ధమవుతుంది. వ్యవసాయానికి కొద్దిపాటి జనాభా చాలు - కనుక వైయక్తిక సమాజం వ్యవసాయానికి పరిశ్రమలకన్నా తక్కువ ప్రతిఫలాన్ని వేతనాలుగా యివ్వాలి అని. ఉత్పాదక సామర్ధ్యం మందకొడిగా పెరగటానికి - వ్యవసాయ వేతనాలు, పారిశ్రామిక వేతనాలలో పోలిస్తే శాశ్వతంగా దిగువనే వుంటున్నవని -- కనుక వ్యవసాయ ఉత్పత్తుల నుండి పారిశ్రామిక ఉత్పత్తులకు మార్పిడి అనివార్యమని చారిత్రక విరోధమూ, వంచనా పూరితమగు మార్షెలియన్ బోధలను వ్యవసాయ మాంద్యానికి హారోడ్ (Mr. Harrod) అన్వయించాడు.

ఈ అన్వయంతో చాలా ప్రశ్నలు ఉత్పన్నంకాగలవు. పారిశ్రామికంగా ఎదిగిన ప్రపంచ దేశాలలో నేడు కూడా చాలినంత ఆహారం లేక, బాధపడుతూ, సైన్యంలో, ఇతర రక్షణ వ్యవస్థల్లో చేరటానికి అశక్తులుగా వున్నవారు లేరా? పెరుగుతున్న పట్టణ జనాభాను పరిగణించి, వ్యాపారవాణిజ్యాల్లో వచ్చిన నిరుద్యోగాన్ని జ్ఞప్తిలో వుంచుకొని, ఆలోచిస్తే నేటి పరిస్థితులలో వ్యాపార వాణిజ్యాలు రైతులకు కూడా జీవనాధారం

కల్పించగలుగుతున్నవా? "ఏ వ్యాపకంలోనయినా, వెనుకబడటానికి తగిన కారణం వున్నట్లయితే - ఆకారణంగా వారికి అధిక ప్రతిఫలాలివ్వవచ్చు " అని ఈ మహాశయుడే చెప్తున్నాడు. పారిశ్రామిక, వాణిజ్య వ్యాపారాలలో ఏ కారణం, కారకం (Factor) కొరవడిందని -ఎక్కువ ప్రతిఫలాలు వారికి ముట్ట చెప్తున్నారు? ఒకటి రెండు సంఘటన లాధారంగా వ్యవసాయం నుండి పరిశ్రమలకు శాశ్వత మార్పిడి జరుగుతుందని అనుకోవటం పొరపాటు. కొందరు రైతులు ఎక్కువ వేతనాల కొరకు, కృత్రిమ వ్యవసాయ మాంద్యం నుండి బయటపడటానికి పట్టణాలకు వలస వెళ్లవచ్చు. అంతమాత్రంతో పట్టణాల అధిక ప్రతిఫలాలు వ్యవసాయమాంద్యానికి సంకేతాలు అని నిర్ణయించటం సరికాదు. ఈ వైరుధ్యం కృత్రిమత్వం వలన, బలవంతపు అణచివేత వలన వచ్చినది. వ్యవసాయం ఈ మాంద్య స్థితి నుండి విడివడి స్వతంత్రగానిలబడాలని మా కోరిక. సమాన పని సామర్థ్యానికి - అసమాన ప్రతిఫలాలందించే ఈ విధానాలు వ్యవసాయంలో, పరిశ్రమల్లో, వాణిజ్యంలో పోవాలి.

# సంపద అదృశ్య బదిలి

(INVISIBLE TRANSFERENCE OF WEALTH)

బ్రిటీషువారు చట్టవిరుద్ధమయిన జప్తులతో ఆఫ్రికన్ల భూములను స్వాధీనం చేసుకోవటం, ఇండియాలో రాజుల, నవాబుల బంగారాన్ని, 'లూటీ' చేయటం, యూరపుకు అజ్టీ (AZTEE) బంగారాన్ని మొత్తంగా తరలించటం, ఓడినవారిని, మోసంతో లొంగదీసుకొన్నవారిని, దుర్మార్గంగా బాధించటం యావత్ప్రపంచ ప్రజలు గ్రహించి, అసహ్యించుకొని, ఆచేతలను గర్హిస్తున్నారు. ప్రజలను బానిసలుగా మార్చి, వారి వ్యక్తిగత, రాజకీయ, స్వాతంత్ర్యాలనుహరించి, ఆర్థికంగా అణచివేయటం వంటి అనైతిక చర్యలను ప్రపంచం గుర్తించింది. జర్మను, జపాను వారివలన కలిగిన యుద్ధ నష్టాన్ని భర్తీ చేయమని డిమాండు చేయటం కూడా ఉదారవాదులు ఖండిస్తున్నారు.

ఆఫ్రికా, ఆసియా, సౌత్ అమెరికాలలో, బలప్రయోగంతో ప్రజల శ్రమను దోపిడీ చేయటం తెలుసుకున్నాము. ఈ విధమయిన శ్రమదోపిడీని 'సంపద అదృశ్యబదిలీ లేక తరలింపుగా గుర్తించాలి. సంపద కంటికి కనుపించకుండా వారి రాజకీయ, ఆర్థిక యజమానులకు ముట్టుతున్నది. వలస రైతుల సంపద అదృశ్య బదిలీ వలెనే, భారీ మొత్తంలో వలసదేశాలనుండి సామ్రాజ్యవాదశక్తులకు, సామాన్య ప్రజలనుండి వివిధ వర్గాలకు సంపదను బదిలీ చేయటానికై చాలా ఏజన్సీలు (ప్రాతినిధ్య సంస్థలు) వున్నాయి. సామాన్యునికీ మోసం అర్థం కాదు. బ్రిటనులో పనివానికి, ఇండియాలో కలకత్తా, బొంబాయి వంటి చోట్ల పనిచేసే కార్మికునకు, నాలుగు స్వాతంత్ర్యాలతో భరోసాగా (Freedom of speech, Freedom of worship, Freedom from want, Freedom from fear - వాక్ స్వాతంత్ర్యం, ఆరాధనా స్వేచ్ఛ, కోరికలనుండి విముక్తి,

భయంనుండి విముక్తి) వుండే అమెరికన్‌కు వారి వేతనాలలో, సంపాదనలలో కొంతభాగం, వలసల దోపిడీ కంపు కొట్టుతున్నదని చెప్తేవారుఆశ్చర్యపోతారు. నివ్వెరపోతారు. పట్టణవాసులకు, పారిశ్రామిక, వాణిజ్య వర్గాలకు, వృత్తి జీవులకు ఆదేశాల రైతాంగం నుండే గాక వలస దేశాల దోపిడీ నుండి కూడా, అదనంగా సంపాదించకుండా సంపాదన వచ్చి పడుతున్నది. ఈ విధమయిన సంపద, వ్యవసాయ ప్రజలనుండి, యూరపు అమెరికాల వాణిజ్య, వ్యాపార వర్గాలకు, ప్రపంచంలోని కాపిటలిస్టు దేశాలకు, వలస సామ్రాజ్యాలకు వివిధ మార్గాల ద్వారా పెద్ద మొత్తంలో జమ పడుతున్నది.

శ్రామికజీవులను నిరంతరం దుర్భరమయిన దరిద్రంలోనికి లాగుతున్న కాపిటలిస్టు, ఫ్యూడల్ ఏజన్సీలన్నింటిలోకి ప్రభుత్వమే అతిపెద్ద ఏజంటు, ప్రభుత్వ ప్రభావం వలసదేశాలలో, యూరపులోని వ్యవసాయదేశాలలో ఎక్కువ. సామాన్యులపై పన్నుల భారం అతిగా మోపి, భాగ్యవంతులపై బరువు పడకుండా జాగ్రత్త పడుతున్నది. ప్రభుత్వవ్యయం (Public Expenditure) కాపిటలిస్టులను మరింత భాగ్యవంతులుగా చేస్తూ, ఫ్యూడల్ వర్గాల, బుద్ధి జీవుల స్వార్ధాన్ని పరిరక్షిస్తూ, పట్టణ సామాజిక జీవితపు అభివృద్ధికి తోడ్పడుతూ, పట్టణ మధ్యతరగతి ప్రజల ఆర్ధిక స్థితిగతులను మెరుగు పరుస్తున్నది. సామాన్య ప్రజలనుండి వసూలు చేస్తున్న ప్రత్యక్ష, పరోక్షపన్నులలో అల్ప భాగాన్ని మాత్రమే వారిపై వ్యయం చేస్తూ, పట్టణ పారిశ్రామిక వాణిజ్య వర్గాలకు బుద్ధి జీవులకు అదనంగా ఖర్చు చేస్తున్నది. పట్టణ పారిశ్రామిక కార్మికులు, వలస దేశాల మధ్య తరగతి జనాభా ఈ లంచాలను (సంపాదించకుండా వచ్చే సంపద) స్వల్ప మొత్తాలలో అనుభవిస్తున్నారు.

దగ్గర కాలంలో ఏవిధమయిన ప్రతిఫలాలు రాని కొన్ని వలస పరిశ్రమలకిచ్చిన రాయితీలు (Tariffs & Bounties) అక్కడ ప్రజలకు భారం అయినయ్. పారిశ్రామిక ఉత్పత్తుల ధరల ఎక్కువగాపెంచి, కనుపించని వడ్డింపుల ద్వారా (Levi) రైతులను కార్మికులను బాధిస్తున్నారు.

**కరెన్సీ మానిప్యులేషన్లు:-** (కరెన్సీని తమ అవసరాలకు, లాభాలకు అనుగుణంగా మలచుకోవటం లేక ఆడుకోవటం, విలువ తగ్గించటం లేక పెంచటం దీని వలన ద్రవ్యోల్బణం లేక నోట్ల ముమ్మరం, (Deflation) - నోట్ల ముమ్మరం తగ్గింపు స్థానిక కరెన్సీ విలువ పెంపు కలుగుతుంది).

సామాన్యంగా ద్రవ్య చలామణీని కాపిటలిస్టుల లబ్ధికొరకు వారి ప్రోద్బలంతో మలచుకోవటం (Manipulation - మానిప్యులేషన్) జరుగుతుంది. ఒకవేళ ఈ మానిప్యులేషను కాపిటలిస్టుల ప్రోద్బలంతో జరుగకపోయినా ఫలితాలు మాత్రం కాపిటలిస్టులకు అనుకూలంగా, రైతులకు వ్యతిరేకంగా వుంటాయి. అందువలన వలస దేశాల ప్రజలు జాగ్రత్తగా వుండాలి. ఇన్ఫ్లేషను (ద్రవ్యోల్బణం) ఢిఫ్లేషన్ల ప్రభావం, అన్ని దేశాలలో, అన్ని వర్గాలలో ఒకే విధంగా వుండదు. వివిధ దేశాలలో వివిధ రకాలుగా వుంటుంది. ఇండియా వంటి దేశాలలో డిఫ్లేషన్ (Deflation) వలన (రూపాయి మారకపు విలువ పెంచటం వలన) దేశం అధిక మూల్యం చెల్లించింది. రూపాయి మారకపు విలువ పెరగటంతో, రైతుల నుండి బాంకులకు వడ్డీ వ్యాపారులకు, భూస్వాములకు, ప్రభుత్వానికి రైతుల ఆర్థిక సంబంధాలపై అధికభారం పడటం వలన ఎంతో సంపద బదిలీ అయింది.

ఇండియా, జపాను వంటి దేశాలలో ద్రవ్యోల్బణం వలన రైతులకు లాభం ఏ మాత్రం వుండదనీ, పారిశ్రామిక వాణిజ్య వర్గాలే లాభపడతాయని అనుభవంలో ఋజువయింది. గత ఆర్థిక మాంద్యంలో జపాను నోట్ల ముమ్మరం (Inflation) ఎక్కువ చేసింది. స్వదేశీ ఉత్పత్తుల ధరలు పెంచింది. ఎన్ (Yen - జపాను కరెన్సీ) విదేశీ మారకపు విలువను తగ్గించి, ఉత్పత్తులను గణనీయంగా ఎగుమతి చేయటం వలన ఆదేశపు ఎగుమతి దారులు ఎక్కువ లాభించారు. రైతులు ప్రపంచ విపణుల బారిన పడటంతో వ్యవసాయోత్పత్తులను, ప్రపంచ ధరలతో సమానంగా (World Parity Prices) అమ్మవలసి రావటంతో బారుకూ నష్టపోయారు. 'ప్రపంచ ఆర్థిక మాంద్యం, జపాను ఆర్థిక వ్యవస్థ సత్వరాభివృద్ధికి తోడ్పడింది.' (ప్రత్యేక విప్లవం ఏదీరాకుండానే) (వోయిటిన్స్కీ, P - 208) 1922-26 మధ్యకాలంలో అమెరికాలో వచ్చిన ఆర్థిక వెల్లువలు, (Booms) యుద్ధానంతరం ప్రపంచంలో వచ్చిన ద్రవ్యోల్బణాలతో, రైతులు, పారిశ్రామిక సరుకులకు ఎక్కువ ధరలు చెల్లించి, వ్యవసాయోత్పత్తులను తక్కువ కమ్ముకొని చాలా నష్టపోయారు. ద్రవ్యోల్బణపు ప్రభావపు అసమానతల వలన ఇలా జరిగింది. 'ద్రవ్యోల్బణం ప్రకృతి విరుద్ధమయిన, అభివృద్ధి నిరోధకరమయిన పన్నుల వడ్డింపు" గా ప్రొ॥ పి.జె. థామస్ నిర్వచించాడు. ద్రవ్యోల్బణం బీదవారికి అధిక ధరల బరువు నెత్తి, వ్యాపార వర్గాలకు లాభాల పంట పండించింది. (OXFORD Pamphlet No. 18) ద్రవ్యోల్బణం ఒకవైపు చూస్తే, పన్నుల, అప్పుల, కవుళ్ళ భారాన్ని తగ్గించి రైతుల ఆర్థిక శక్తిని పెంచుతుంది. కానీ రెండోవైపు విచారిస్తే, ప్రభుత్వాల విదేశీ ఋణభారం, పారిశ్రామిక

కార్మికుల అసంతృప్తి, వలసలకు చేసే దిగుమతులలో స్తంభనలు కారణంగా సామ్రాజ్య వాద శక్తులు, వ్యవసాయోత్పత్తులను అంతతేలికగా పెరుగనీయవు.

వ్యవసాయ ధరలు ఎక్కడయినా, ఎప్పుడయినా పెరిగినట్లయితే ఆదామాషాలో పారిశ్రామిక, వ్యావసాయక కార్మికుల కాష్ వేతనాలు (డబ్బు) పెరగకపోతే - (తగ్గితే) ఆ బరువును మధ్యతరగతివారు ఉన్నత వర్గాలవారు ఈ అభాగ్యుల మీదనే మోపేవారు. వ్యవసాయక వేతనాలు వస్తు రూపంలో వున్నచోట్ల పై వర్గాలు (మధ్య తరగతి - ఉన్నత వర్గాలు) రైతుల లాభాలలో, నష్టాలలో భాగస్వాములయినారు.

ఢిఫ్లేషను (స్థానిక కరెన్సీ మారకపు విలువ పెరుగుదల) వలస ప్రజల, వ్యవసాయ దారుల, కాపిటలిస్టు దేశాల కార్మికుల, అణచివేతకు కారణమవుతుంది. దిగుమతుల ప్రవాహం మొదలవుతుంది. ఎగుమతులు మందగిస్తాయి. బంగారం, వెండిని వలసదేశాలు ఎగుమతి చేయటంకాని, విదేశీ వాణిజ్యం పెంచుకోవటానికి ఎగుమతుల ధరలు తగ్గించుకోవటం గానీ చేయవలసి వస్తుంది. ఏవిధంగా చూసినా విదేశీయులే లాభా లార్జిస్తారు. తాత్కాలికంగా విదేశీ ఋణ భారం తగ్గినట్లు కనిపించినా, వలసదేశాలు తమ బాకీలు తీర్చలేక అతికష్టం మీద వడ్డీలు చెల్లించ గలిగేవి. అందువలన వారి లాభం స్వల్పంగా వుంటుంది. ద్రవ్యచలామణీలతో ఇండియాతో ఆటలాడుకోవటం బ్రిటీషువారికి పరిపాటయ్యింది. 1928-35 ఆర్థిక మాంద్యంలో, ఇండియన్ కరెన్సీ విలువను పెంచటం వలన ఇండియానుండి పెట్టుబడులు బ్రిటనుకు ప్రవహించినయ్. స్టెర్లింగు మారకపు విలువను నిలదొక్కటానికి భారత రైతుల బంగారాన్ని ఇంగ్లాండుకు తరలించారు. ప్రతిపారిశ్రామిక దేశం, వలసదేశాలలోని పారిశ్రామిక వర్గాలు ఈ లూటీలో వారి వారి భాగాలకు ఎగబడ్డారు. 1900 లోనే ఆర్.సి. దత్తు - కాపిటలిస్టు దేశాలకు, వ్యవసాయ వనరుల అదృశ్య బదిలీని తీవ్రంగా నిరసించాడు.

ఆర్థిక మాంద్యం యుద్ధమంత భయంకరమయినది. రైతుల, కార్మికుల సంపద కాపిటలిస్టులకు బదిలీ అయి, రైతుల ఆర్థికస్తోమత దిగజారి, సామాన్యజనం ఆర్థికంగా అవిటివారగుతున్నారు. ప్రతి ఆర్థిక మాంద్యంలో ప్రత్యేకించి గత ఆర్థిక మాంద్యంలో కీలక సేవల, వడ్డీ వ్యాపారుల, ప్రభుత్వ పన్ను చెల్లింపుల డిమాండ్లకై రైతులు అధికో త్పత్తులు చేశారు. ప్రతిఫలంగా వారేమిస్తే అదే తీసుకొన్నారు. పారిశ్రామిక వేత్తలు రైతుల కన్నా తక్కువగా నష్టపోయారని మార్షెలియన్ శాస్త్రవేత్తలు ఒప్పుకొన్నారు. పారిశ్రామిక దేశాలు, తమ పారిశ్రామికోత్పత్తుల గిరాకీ పడిపోయినా, వ్యవసాయోత్పత్తులను చౌకగా

సంపాదించటం వలన, ఆర్థిక మాంద్యపు దుష్ఫలితాలను అడ్డుకో గలిగాయని ఐ.యల్.ఓ (I.L.O. - International Labour Office) సర్వే పేర్కొన్నది. వాస్తవానికి ఇండియా, చైనా, అర్జెంటినాల నుండి ఇంగ్లాండు అధికమొత్తంగా అదృశ్య లాభాలను పొందింది.

జపాను, బల్గేరియా వంటి దేశాలలో మొత్తం అందుబాటులో వున్న జాతీయ ఆదాయాన్ని, వ్యవసాయ ఆదాయాల తరుగుదల కౌంటర్ బాలన్సు (Counter Balance) చేయటం వలన, వ్యవసాయేతర వర్గాల ఆదాయాల అల్పాధిక్యత నిలకడగా వుంది. ఆర్థికమాంద్యంలోని విపరీతాలలో ఇది ఒకటి. 'పారిశ్రామిక దేశాల ఆర్థిక మాంద్యం, వ్యవసాయ దేశాలు క్రుంగిపోవటానికి కారణమవుతున్నది. మొదట అక్కడ పరిశ్రమలకు అనూహ్యమయిన లాభాలు వస్తాయి''. జపానులో రైతుల ఆదాయంలో 43% తగ్గుదల కన్పిస్తే, ఇతర వర్గాల ఆదాయం 44% పెరిగింది. (వోయిటిన్స్కీ - P 238). ఇండియాలో ఆర్థిక మాంద్యం విజృంభించినపుడు వ్యవసాయ సంపద పట్టణాలకు తరలింది. వేతన, వృత్తి జీవులు, కార్మికులతో సహా వ్యవసాయోత్పత్తులను కారుచౌకగా పొంది, అందువలన మిగిలిన డబ్బుతో ఇతర అవసరాలను కొనగలిగారు. పట్టణాలలో గృహ నిర్మాణ పరిశ్రమ వెల్లువలాగా వచ్చి పడటానికిదే ముఖ్య కారణం. గ్రామీణ భారతదేశం ఆర్థిక తుఫానులో కొట్టుకొని పోయింది.

న్యూడీల్ [1](New Deal. F.D. roosevelt) అని పిలువబడే మద్దతు ధరల విధానం ద్వారా అమెరికా రైతులు, ఆర్థిక మాంద్యం నుండి కొంత రక్షణ పొందారు. వలస దేశాలకు ఎటువంటి సహాయాలు కల్పించబడలేదు. 1930-37 వరకు భారతరైతాంగ ఉద్యమపు కేకలు అరణ్యరోదన మయినయ్. 1937-39 లో నేషనల్ కాంగ్రెస్, 11 రాష్ట్రాలకు గాను 8 రాష్ట్రాలలో మంత్రివర్గ బాధ్యతలు స్వీకరించిన తరువాత మాత్రమే వ్యవసాయ ఋణాల వాయిదాలు, వడ్డీ తగ్గింపులు, కొన్ని రాష్ట్రాలలో అమలు పరచబడి కొంత ఓదార్పు నందించగలిగినయ్. ఇతర వలస దేశాలలో ఈ మాత్రం సహాయం కూడా అందలేదు.

పరిశ్రమలు తెప్పరిల్లుకొన్నట్లు, పతనమయిన వ్యవసాయరంగం త్వరగా, తేలికగా ఉద్ధరింపబడదు. బాంకులు, కరెన్సీ వ్యవస్థలు, ప్రభుత్వాలు పరిశ్రమలకు ఊపిరిపోస్తాయ్. పరిశ్రమల మూలధనం కూడా ఇందుకు సహాయపడుతుంది. వికల మయిన వ్యవసాయ రంగానికి ఈ విధమయిన సాయాలు, ప్రేరణలు లేవు. స్నేహితులు లేరు. వ్యవసాయ రంగం కోలుకోవటానికి ఎంతోకాలం పడుతుంది. ఈ దశను

కాపిటలిజం అవకాశంగా తీసుకొని, వ్యవసాయ ధరల పెరుగుదలను నిరోధిస్తుంది. ఎల్లప్పుడూ తక్కువగా వుండే వ్యవసాయోత్పత్తుల ధరలు, మాంద్యంతో మరీపతనమై, పారిశ్రామికోత్పత్తుల ధరలు మాంద్యపు పూర్వం ధరలనందుకొంటుంటే, సగం కూడా పెరగక, తెప్పరిల్లలేని స్థితిలో వుంటాయి. ఈ వెనుకబాటు అలా కొనసాగుతునే ఉంటుంది.

కాపిటలిస్టు యంత్రాంగ విస్తరణకు అవసరమయిన ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ (Infra structure) అనగా ఆధునిక సమాచార వ్యవస్థలు, ప్రక్రియాత్మక పరిశ్రమలు, (Processing Industries) హార్బర్లు, అదనపు వర్కుషాపులను సామ్రాజ్యవాద ఆర్థికత వృద్ధి చేస్తుంది. ఈ సౌకర్యాల ఖర్చులన్నీ వలసదేశాలే భరించాలి. వీటి వలన ప్రత్యక్ష లాభమేమీ ఉండదు. ఈ సౌకర్యాల వలన సంపద పరోక్షంగా కాపిటలిజంకు ప్రవహిస్తుంది.

వలసల భవిష్యద్లాభాలకు గండికొడుతూ, వారి ఖనిజసంపదను, వ్యవసాయ వనరులను, మైనింగు (గనులత్రవ్వకం) ప్లాంటేషన్ల ద్వారా కెన్యాలో వలె ప్రత్యక్షంగా, పరోక్షంగా గోల్డుకోస్ట్, నైజీరియాలలో చిన్న రైతుల ద్వారా, మార్కెటింగు, ప్రాసెసింగులపై గల గుత్తాధిపత్యంతో సామ్రాజ్యవాదం దోపిడీ జరుపుతున్నది. పారిశ్రామిక, వ్యవసాయక లాభాలలో స్వల్పంగా వలస ప్రజలకు, అత్యధికంగా సామ్రాజ్యవాదులకూ దక్కుతుంది. ఈ కారణంగా వలస దేశాల భవిష్యత్తు దెబ్బ తింటుంది. వారి వనరులు వట్టిపోయి, ఎగమతుల పాలై, స్థానిక పరిశ్రమల స్థాపన, అభివృద్ధి మృగ్యమౌతవి. ఎగుమతుల ప్రవాహానికంతం వుండదు.

ఇండియా, చైనా, ఈజిప్టు వంటి దేశాలలో బలమయిన బూర్జువా వర్గాలు, స్థానిక పరిశ్రమలను, తయారీలను అభివృద్ధి పరుస్తున్న సమయంలో, సామ్రాజ్య వాదులు ఈ ప్రయత్నాలకు తీవ్ర విఘాతాలు కల్పించసాగారు. వీలైనంత వరకు స్వేచ్ఛా వర్తకం ప్రవేశ పెట్టి, వారి దేశాలనుండి అధిక ధరలతో దిగుమతులను, స్వల్పమయిన లేక అసలు సుంకాలు లేకుండా వలస దేశాలకు దిగుమతి చేసి, వలసల ముడి సరుకులను అతిచౌకగా ఖరీదు చేసి, ఈ సరుకులు స్థానిక వినయోగాని కందకుండా చేశారు. వలసలతో ఆర్థిక సబంధాలలో సామ్రాజ్యవాదులు కంటికి కనుపించని లాభా లార్జించారు.

బలమయిన జాతీయ వాదం, భవిష్యదభ్యుద్ధికై పట్టుదలతో కృషి చేస్తున్న బూర్జువా వర్గంగలదేశాల్లో, పరిశ్రమలస్థాపనకు సమాచారవ్యవస్థ ఆధునీకరణ అధికంగా పెట్టుబడు

లందించి, అభివృద్ధి జరిగేలా చూస్తూ వారి స్వంత పరిశ్రమలను కూడా అదే సమయంలో నెలకొల్పి, అభివృద్ధి పరచి, తమ పెట్టుబడులకు అధిక వడ్డీలు, తమ పరిశ్రమలనుండి అధిక లాభాలు ఆర్జిస్తూ, జాతీయ వాదాన్ని సమర్ధిస్తున్నట్లు నాటకం ఆడారు. ముఖ్యంగా రైతుల నుండి స్థానిక సంపదను పరోక్షంగా గుంజుకొని, సామ్రాజ్య వాదులకు ఎగుమతుల ద్వారా అదృశ్యంగా పంపిణీ చేశారు.

ఉత్పత్తులను అమ్ముకోవటానికి త్వరపడే ప్రజల సంపదలో పెద్దవాటాను ఉల్బాయలుగా[2] (ఉల్బాగా) పారిశ్రామిక, వాణిజ్య వర్గాలకు సమర్పించటానికి ప్రపంచ విపణులు కంకణం కట్టుకొన్నయ్. యాంత్రికోత్పత్తుల పరిశ్రమలు ప్రపంచ విపణుల గుప్పిటలో ఇముడవు. వాటి ఉత్పత్తుల ధరల నిర్ణయం పారిశ్రామికవేత్తలే చేసి మార్కెట్లకు విడుదల చేస్తారు. అందువలన యాంత్రిక పారిశ్రామిక ఉత్పత్తులు అధిక లాభాలార్జించితే, ప్రపంచ విపణుల దయాదాక్షిణ్యాల పై ఆధారపడ్డ వ్యవసాయోత్పత్తులకు ఉత్పత్తి వ్యయాలు కూడా గిట్టుబాటుకావు. మార్కెట్లో యాంత్రికోత్పత్తిదారులు, వ్యవసాయోత్పత్తి దారులు చెరి ఒక వైపున నిలబడితే మొదటి వర్గం వారు తమ ఆర్ధికస్తోమత కారణంగా కంటికి కనుపించని లాభాలను 'ఉల్బాగా' సంపాదిస్తారు. మారకాలలో నిలదొక్కుకొనే స్థోమత లేని కారణంగా రెండవ వర్గం (రైతులు) నష్టపోతారు.

వ్యవసాయపెట్టుబడులందించే వారి వడ్డింపులు చూద్దాం. బాంకర్లు, వడ్డీ వ్యాపారులు, భూస్వాములు పరిశ్రమల వడ్డీ రేటుకే వ్యవసాయదారునకు కూడా అప్పిస్తే, ఆదాయపు అదృశ్య బదిలీ జరుగనట్లు భావించాలి. వాస్తవానికి వడ్డీరేటు 30% నుండి 150% వరకు రైతులు చెల్లిస్తున్నారు. అందువలన రైతుల ఆదాయంలో మేలు భాగాన్ని ఋణదాతలు దోచుకుంటున్నారు.

రైతులు, కార్మికులు, వినియోగదారులుగా కూడా పీల్చి పిప్పి చేయబడు తున్నారు. వారినిత్యావసరాలయిన వ్యవసాయ పనిముట్లు, ఆహార పదార్ధాలు బట్టలపై అవసరమయిన దాని కన్నా ఎక్కువ రవాణాఛార్జీలు, పాకింగు ఛార్జీలు కలుపబడు తున్నయ్. ఆధునిక చిల్లరవ్యాపారం గుత్త వ్యాపారమై ప్రధానమయిన కీలక సేవలలో ఒకటయింది. ఈ గుత్త చిల్లర వ్యాపారాన్ని అరికట్టటానికి చాలా దేశాలలో వినియోగ దారుల సహకార సంఘాలను, కార్మికులు మధ్యతరగతి ప్రజలు స్థాపించారు. దైనందిన అవసరాలకు - ధాన్యపు చెల్లింపులను నిషేధించే, బ్రిటీషు ట్రక్కు చట్టం వంటి వాటి నుండి రక్షణకు స్టోర్లు ఏర్పాటు చేసి వాటి నుండి కార్మికుల కొనుగోళ్ళను ప్రోత్సహించారు.

రక్షణ ఐక్యత లేని బీదపనివారికి, కాపిటలిజం ప్రతినిధియయిన చిల్లర వ్యాపారం నుండి కొంత రక్షణ కల్పించారు. నవంబరు 1955లో కూడా అమెరికాలో వినియోగదారుడు ఒక డాలరుకు సరుకు కొంటే అందులో 39 సెంట్లు మాత్రమే రైతుకు అందుతున్నవి. (AKL-CIO-New Year News - 1956) 1940 తర్వాత అందిన అతి తక్కువ ధర ఇది.

సామాన్య ప్రజలనుండి కాపిటలిస్టులకు అందే సంపద, సంపద అదృశ్య బదిలీగా సూత్రీకరించబడింది. ఇది కాపిటలిస్టు విధానపు ముఖ్య లక్షణం. ఈ ఇరువర్గాల బేర శక్తి సమానంగా వుండదు. కాపిటలిస్టు దిన దినానికీ బలపడుతుంటే, రైతు రోజు రోజుకూ దిగజారుతున్నాడు. సంపద అదృశ్య బదిలీ సూత్రమే దీనికి కారణం. వలస ప్రజలు తమ ప్రతి ఘటనా శక్తితో, ఐక్యతతో రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాలు పొంది, స్వంత యాంత్రిక ఉత్పత్తులు చేయగలిగితే సంపద అదృశ్యబదిలీ అదృశ్యమవుతుంది. స్వయం సమృద్ధి సాధిస్తారు. యుద్ధానంతరం ఈ వాతావరణం ప్రపంచంలో కన్పిస్తున్నది. ఈ ప్రయత్నాలెప్పటికి సఫలమయ్యేది చెప్పటం కష్టం, సామ్రాజ్యవాదం నామరూపాలు లేకుండా పోయి, కాపిటలిజం బదులు సహకార సామ్యవాదం వచ్చినప్పుడు సాధ్య పడుతుంది.

వలస దేశమయినా, స్వతంత్ర దేశమయినా, కాపిటలిస్టు దేశమయినా, కమ్యూనిస్టు దేశం అయినా-ఏదైనప్పటికీ వ్యవసాయేతర వర్గ ప్రభుత్వాలున్న దేశాలలో రైతులు ఈ విధంగానే దోపిడీ చేయబడుతున్నారు. సోవియట్ దేశాల రైతులు, పట్టణ ప్రజల కొరకు, ముఖ్యంగా కార్మికుల, వృత్తిజీవుల లబ్ధికొరకు, ధరల నియంత్రణ చట్టాలతో దరిద్రంలోకి ఈడ్వబడుతున్నారు. ఇంగ్లాండు తన యుద్ధావసరాలకొరకు రైతులకు గిట్టుబాటు ధరలందించింది. ఆ విధానమిప్పటికీ అమలులో వుంది. యుద్ధకాలంలో రైతులపై పాశ్చాత్యదేశాలాధరపడటం రైతులకు వరమయింది. యుద్ధానంతర దశకంలో వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటు ధరలను, వాటికి పారిశ్రామికోత్పత్తులతో పాటు ప్రపంచ పారిటీధరలను (World Parity Prices) సోవియట్ ప్రభుత్వాలు, ప్రపంచ కాపిటలిస్టు స్వార్థశక్తులేగాక, ఇండియా ప్రభుత్వం వారి ప్రణాళికా సభ్యులు కూడా అంగీకరించటం లేదు.

ఆదాయంలో - సంపదలో గ్రామీణ, పట్టణవాసుల మధ్య ఏర్పడిన అగాధానికి సంపద అదృశ్యబదిలీ సూత్రం ముఖ్య కారణం. ఈ విధానాన్ని అంతం చేసి, ప్రపంచ విపణుల పారిశ్రామిక, వాణిజ్య పక్షపాతాన్ని అణగదొక్కి, వ్యవసాయానికి అవసరమయిన కీలక సేవలను జాతీయం చేసి, అంతర్జాతీయ సమాచార వ్యవస్థలను సామ్రాజ్య

వాదులనుండి ఊడ బెరికి, వలసలలో ఆర్థికాభివృద్ధి, సమానతలు సాధించి కరెన్సీ మానిప్యులేషన్లను ఆదేశాభివృద్ధికి మాత్రమే పరిమితం చేసి, ప్రభుత్వటారీఫ్‌లను వర్తక విధానాలను పునర్విమర్శ చేసినప్పుడు మాత్రమే, నిజమయిన విముక్తి, ప్రగతి సామాన్యజనం సాధిస్తారు.

సోవియట్ ఆర్థిక విధానానికి కూడా ఇదే అన్వయిస్తుంది. ట్రాక్టర్లు, సేవలు, ఫెర్టిలైజర్ల ధరలు, రవాణా ఛార్జీలు, యాంత్రిక ప్రక్రియలు (Processing) చిల్లర వ్యాపార ధరలు, పారిశ్రామిక, దైనందిన సరుకుల ధరలు ఆకాశాన్నంటుతూ, వ్యవసాయో త్పత్తుల ధరలు నామమాత్రమై, కొనుగోలు పన్నులు, టర్నోవరుటాక్సులు, రైతులపై అతిగా విధించటం వలన, మీగడ, వెన్న సోవియట్ నేతలకు - వెన్నదీసిన పాలు వ్యవసాయదారులకు మిగులుతున్నవి. సోవియట్ రైతుల అణచివేతకు ఇదే ముఖ్యకారణం.

సంపద అదృశ్యబదిలీ సూత్రం కార్మికులకు కూడా వర్తిస్తుంది. వారు ప్రతి సంవత్సరం ఉత్పత్తి చేసే సంపద, కాపిటలిస్టులతో వ్యాపారంలో పోగొట్టుకుంటున్నారు. ఈ విషయాన్ని పాశ్చాత్య సోషలిస్టులు చాల సందర్భాలలో ఉద్ఘాటించారు. సోవియట్ దేశంలో, చట్టాన్ని తమ చేతుల్లో పెట్టుకోగలిగిన కార్మిక వర్గం, రైతులను కాపిటలిస్టులకంటే ఎక్కువగా దోపిడీ చేస్తున్నది.

ఐక్యరాజ్య సమితి, దాని అనుబంధ సంస్థలు ముఖ్యంగా F.A.O. (Food and Agriculture Organisation - ఆహార వ్యవసాయ సంస్థ) ఏర్పడిన తరువాత, యుద్ధం నేర్పిన గుణ పాఠంతో, ప్రపంచపు ఆలోచనా విధానాలు రైతులకు అనుకూలంగా వున్నయ్. చాలా దేశాలలో చట్టాలద్వారా సహకార ప్రాసెసింగు పరిశ్రమలు, మార్కెటింగు సొసైటీలు, వేర్‌హౌస్‌లు, వ్యవస్థీకృతమయిన విపణులు, నిర్మాణాత్మక కార్యక్రమం రూపందుకొన్నది. వడ్డీవ్యాపారాన్ని, వడ్డీరేట్లను, వడ్డీవ్యాపారుల మోసాలను అరికట్టటం జరుగుతున్నది. కానీ రైతులింతవరకూ కీలక సేవలపై యాజమాన్యం పొందలేదు.

# వలస ప్రజలు - సామ్రాజ్యవాద దోపిడీ

లెనిన్ తన అసమాన ఆర్థికాభివృద్ధి నియమం (Uneven Economic Development) ద్వారా, సామ్రాజ్యవాదపు పెరుగుదలకు కారణమయిన కొన్ని ప్రాథమిక ఆర్థిక సమస్యలను అర్థం చేసుకోవటానికి అవకాశం కల్పించాడు. సామ్రాజ్యవాదంలో కలిగే దీర్ఘకాలిక ఫలితాలన్నీ ఆర్థిక పరమయినవని తెలుసుకోగలిగాం. తక్కువ ఆర్థికాభివృద్ధి అవకాశంగా తీసుకొని వలసదేశాలను, అక్కడ ప్రజలను సామ్రాజ్యవాద దేశం తన రాజకీయాధికారంతో లోబరుచుకొంటుంది.

కృత్రిమంగా కల్పించబడిన వ్యవసాయమాంద్యాన్ని, ఆదాయము - సంపదలలో వ్యవసాయ వర్గాలకు పారిశ్రామిక, వాణిజ్య వర్గాలకు, వ్యవసాయాధారిత దేశాలకు, - పారిశ్రామిక వాణిజ్య దేశాలకు మధ్య నెలకొన్న అసమానతలను, వాస్తవ కారణాలను అర్థం చేసుకోటానికి, లోతుగా పరిశీలించాలి.

'నిర్బంధశ్రమతో' (Forced Labour) సామ్రాజ్య వాద ప్రభుత్వాలు, వలసలను వేగిరంగా అభివృద్ధి పరచి, వారి ఆర్థిక వనరులను వెలికితీసి, వారి తలసరి 'అదనపు విలువ' పెంచి, ఈ అదనపు విలువదోపిడీ ద్వారా తామూ, తమ ప్రజలు ఎలా భాగ్యవంతులవుతున్నదీ అధ్యయనం చేయటం జరిగింది. సామ్రాజ్యవాదం కొన్ని స్పష్టమయిన మార్గాల ద్వారా రూపుదిద్దుకొంటుంది. వలస ప్రజలపై పడే ప్రభావాల ఆధారంగా ఈ మార్గాలను ప్రత్యేకంగా గుర్తించవచ్చు.

సామ్రాజ్య వాదం ఎందుకు ఆవిర్భవించిందనేది పెద్ద కథ. చరిత్రమొదలయిన నాటినుండి దురాక్రమణలు జరుగుతునే వున్నాయి. ఒక తెగ - వేరొక తెగ, ఒక జాతి

- వేరొక జాతి, ఆ తరువాత ప్రపంచ దేశాలలో కొన్ని ఒకవైపు - మరికొన్ని వేరొక వైపు విస్తృత పరిధిలో ఆక్రమణలకు పాల్పడటం వలన ప్రపంచ యుద్ధాలను మనం చూస్తున్నాం. ఈ యుద్ధాలకు కారణాలనేకం, వ్యామోహం, ఆర్థికావసరాలు, దురాశలు ప్రేరణలు. జాతి విద్వేషం, అకారణ ద్వేషాలు, అప్పుడప్పుడు మానవనైజంలో పెచ్చరిల్లే పశుప్రవృత్తి మరికొన్ని కారణాలు, ఒకరు ఓడటం, ఓడిన వారిని గెల్చినవారు దోపిడీ చేయటంతో దాదాపు అన్ని యుద్ధాలు అంతమవుతయ్. ఓడిన వారిని గుడ్డిగా చంపటం, వారి ఆస్తులను స్వాధీనం చేసుకొని పాశవికంగా, అర్ధబానిసత్వంలోకి ఈడ్చి సెర్ఫ్‌లుగా మార్చటం, అమలులో వున్న ఆర్థిక హక్కులను గుర్తిస్తూ, సమర్ధవంతంగా, లాభసాటిగా వుండే కనుపించీ, కనుపించని మార్గాలలో మెల్లమెల్లగా 'పోతును మేపి కోసుకు తిన్నట్లు' గా వారిని తమ ఉచ్చులలో విజేతలు బిగించుతారు. ఆధునిక విజేతలు మానవత్వంతో ఓడిన వారిని చూస్తారనుకోవటం తప్పు. ఎవరు, ఏ కాలంలో, ఏ మార్గాలవలంబించినా, ఓడిన అభాగ్యులను దోపిడీ చేయటమే వారి అంతిమ లక్ష్యం. దోపిడీ రకరకాలు - మత, జాతి ఆధిక్యతలను సంపాదించటం, రాజకీయ ఆర్థిక దోపిడీలను కలగలపి చేయటం.

సామ్రాజ్యవాదశక్తులు, రాజ్యాలను ఏ విధంగా రాజకీయంగా ఆర్థికంగా దోపిడీ చేసేది పరిశీలిద్దాం. 'ఒక సామ్రాజ్యవాద శక్తి (దేశం) కేవలం స్వలాభాపేక్షతో చేసేది ఏకపక్షమయిన దోపిడీ. ఆర్థికంగా పటిష్టంగా వున్న బ్రిటను, తన దోపిడీలో ఇతరులకు భాగం పంచాల్సిన అవసరం లేదు. హాలెండు, పోర్చుగలు వంటి తగినంత ఆర్థికాభివృద్ధిలేని దేశాలు, బ్రిటను, ఫ్రాన్సు, U.S.A. వంటి మిత్రదేశాలతో చేతులుగలిపి దోపిడీలో వారికి వాటా ఇస్తూ చేసేది బహు పక్షాలు చేసే దోపిడి.

దోపిడీ సులువుగా, లాభసాటిగా వుండటానికి, సామ్రాజ్య వాద దేశాలు, ఈ దురదృష్ట వలసల లోపల, వెలుపల మిత్రులను వాటాదారులను సంపాదించుకొంటాయి. ఉదా: గ్రేట్ బ్రిటను ఇండియన్ కాపిటలిస్టులను (తనకులోబడి వుండే వారిని) తన భాగస్వాములుగా చేసుకున్నది. తన ఆర్థిక ప్రాబల్యం దీర్ఘకాలికంగా వుండగలందులకు ఇండియా బట్టల మిల్లులు, షిప్పింగు పరిశ్రమలతో ఒప్పందాలు కుదుర్చుకున్నది. అలానే సామ్రాజ్య వాద శక్తులుగా ఎదుగుతున్న లేక ఎదిగిన సామ్రాజ్యవాద దేశాల భాగస్వామ్యాన్ని ఆహ్వానిస్తారు.

స్వదేశంలోని కార్మికులకు, పారిశ్రామిక వేత్తలకు, ఇంగ్లాండు, హాలెండు, బెల్జియం వంటి దేశాలు, వాటాలనందిస్తున్నవి.

సామ్రాజ్యవాదం అంతర్జాతీయ మద్దతుకు, తన మాయోపాయాలు అవిచ్ఛిన్నంగా కొనసాగటానికి, రాజకీయ అవసరాలకు, విచక్షణతో విదేశీ పెట్టుబడి దారులకు, రాజకీయనాయకులకు, పత్రికారంగానికి ఆహ్వానం పలుకుతుంది. వలసల్లోని వారు, స్వదేశీయులు, విదేశీయులు - ఈ మూడు వర్గాలవారు సామ్రాజ్యవాద భాగస్వాములు.

సామ్రాజ్యవాదానికి వీరు సంపాదించిపెట్టే వాటా ఎప్పటికప్పుడు మారే అవకాశం వుంది. స్థానిక పరిశ్రమల రాజకీయ జోక్యం అధికంగా వున్నంతకాలం వారి వాటా ఎక్కువగా వుంటుంది. పోర్చుగీస్, డచ్ దేశాలు నావికా రక్షణకై గ్రేట్ బ్రిటను పై ఆధారపడినంతకాలం, గ్రేట్ బ్రిటన్ వాటా పెరగింది. బ్రిటను - ఫ్రాన్సు - రక్షణావసరాలకు U.S.A. సాయం కోరినప్పుడు U.S.A. (దోపిడీ) వాటా పెరిగింది. స్వదేశంలో ఘర్షణలు పెరిగి, పరిస్థితి నిరాశాజనకంగా వున్నప్పుడు, కార్మికులకు దోపిడీలో అధిక వాటా లభిస్తుంది. ఇంగ్లండులో పై పరిస్థితులేర్పడినప్పుడు - ఫామిలీ అలవెన్సులు, సామాజిక సేవలకు 80 మిలియన్ పౌండ్లు ఖర్చు చేయబడినయ్. ఈ మొత్తం యుద్ధ పూర్వపు ఇంగ్లాండు బడ్జెట్‌కు సమానం.

U.S.S.R. రెడ్ ఆర్మీ, కోమింటరన్‌ల నూతన ఆవిర్భావంతో ఆగ్నేయా ఐరోపా దేశంలో నూతన తరహా సిద్ధాంతావిష్కరణ, ఆర్థిక సాంఘిక పెత్తందారీ తనంతో, రాజకీయం రూపు దిద్దుకొన్నది. కోమింటాంగ్ పై చైనా కమ్యూనిష్టుల విజయం, పీపుల్స్ చైనా ఆవిర్భావం, సోవియట్ ఆర్థిక శక్తిని, ప్రాధాన్యతను పెంచింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతర దశకం సోవియట్ దేశాలు అభివృద్ధి పటిష్టత సాధించి ప్రపంచ శక్తిగా ఎదిగిన కాలం. సోవియట్ నూతన ప్రపంచ శక్తిగా ఎదగటానికి యుద్ధపూర్వపు బ్రిటను, ఫ్రెంచి జర్మను సామ్రాజ్య వాద దేశాలకు దగ్గర పోలికలున్నాయి. చాలా మంది మేధావులు దీనిని సోవియట్ తరహా సామ్రాజ్య వాదంగా వర్ణించారు. రెండవప్రపంచయుద్ధానంతరం ఆగ్నేయఐరోపాలో సోవియట్ రాజకీయ ప్రభావ విస్తరణ ఈ భావనకు కారణం. సాంప్రదాయక సామ్రాజ్య వలసల కంటే, సోవియట్ ఉప గ్రహాలయిన జెకోస్లేవేకియా, రుమేనియా వంటి దేశాలలో అధికంగా పారిశ్రామికీ కరణ జరిగింది. సోవియట్ శాటిలైటు దేశాలు బాహ్యదృష్టికి స్వతంత్ర రాజ్యాలుగా కన్పించేది వాస్తవం. అదే సమయంలో యుగోస్లేవియా U.S.S.R. సైద్ధాంతిక నియంతృత్వాన్ని నిరాకరించటంతో వచ్చిన ఘర్షణలో, సోవియట్ శాటిలైట్లు యుగో స్లోవియాను ఆర్థిక

నిర్బంధానికి గురిచేసినయ్. ఈ కొత్త తరహా సిద్ధాంత నియంతృత్వానికి పవిత్ర రోమన్ సామ్రాజ్యం కాథలిక్ చర్చిల నియంతృత్వానికి దగ్గర పోలికలు గలవని గుర్తించి ప్రపంచం కళ్లు తెరచింది. ఈ నూతన సామ్రాజ్య పీఠాధిపతి ఆవాసం మాస్కో (U.S.S.R. కమ్యూనిస్టు పార్టీ కోమినిఫాం[3]ల అధికార పీఠం) యుద్ధానంతర ప్రపంచపు సాంఘికాభి వృద్ధిని అధ్యయనం చేసే వారందరూ సోవియట్ దేశాల అంతర్జాతీయ వర్తకాన్ని, వాటి పరస్పర ఆర్థిక సంబంధాలనూ జాగ్రత్తగా అధ్యయనం చేయాలి.

'సోవియట్ నియంతృత్వ దేశాల కమ్యూనిస్టులు "రైతులు (అతి శక్తివంత మయిన కమ్యూనిస్టులకు) శత్రువులు - వారిని రూపుమాపాలి" అనే నిర్ణయంతో వున్నారు. (That the Communists.... who must be liquidated). రాజకీయాధికారం సంపాదించగానే కమ్యూనిస్టులు రైతుల పార్టీలను నాశనం చేశారు. రైతు నాయకులను హత్యలు చేసారు. జైళ్ళలో పెట్టారు. ప్రవాసంలోకి పంపారు. రైతులను బీద, మధ్యతరగతి, ధనిక వర్గాలుగా వర్గీకరించి, ధనవంతులను, ధనవంతులు - మధ్యతరగతి వారిని నాశనం చేశారు. బీద రైతులను బలాత్కారంగా సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు నెట్టారు. కాపిటలిస్టు బాటలో నడచి వ్యవసాయ ధరలు - పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు, వృత్తి సేవలు, సరుకుల ధరల వ్యత్యాసాలను తారుమారు చేశారు. దీనివలన కలిగిన దుష్పరిణామానికి కాపిటలిజంలోని చెడుకూ తేడా ఏమీ లేదు. సోవియట్ పాలకులు, రైతులను మోసం చేయటానికి, హీన పరచటానికి, ధరల కత్తిరింపులు[4], ధరల నియంత్రణలను అమలు పరచారు. ఈ ధరల కత్తిరింపులు, నియంత్రణలు ప్రపంచ కాపిటలిజం మానస పుత్రికలు, రైతుల శ్రమను పిండి పట్టణాలకు పందేరం చేశారు. అతి తక్కువ వ్యవసాయ ధరలు - ఎక్కువ పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు, పన్నుల భారంతో ప్రపంచ కాపిటలిజం వలెనే రైతులను క్రుంగ గొట్టారు. సాంప్రదాయక సామ్రాజ్యవాదపు వలస దోపిడీని అర్థం చేసుకొంటే ఐరన్ కర్టెన్ (Iron Curtain)[5] బాంబూ కర్టెన్ (Bambo Curtain)[6] చాటున భారీగా జరుగుతున్న రైతుల దోపిడీని సులువుగా అర్థం చేసుకొనవచ్చును.

వలస ప్రజలలోని వివిధ వర్గాలపై, పారిశ్రామిక, వాణిజ్య, వృత్తి జీవుల, కార్మికుల రైతులపై ప్రభావం ఏ విధంగా ఎంత మేరకు వుంటుందో మనం విడివిడిగా తెలుసుకోవాలి. ఈ వర్గాలన్నిటిపై సామ్రాజ్య వాద ప్రభావం ఒకే రకంగా వుండదు. రైతులు ఎక్కువ నష్టపడుతున్నారు. తక్కువగా లాభిస్తున్నారు (లాభించటం లేదు). ఉన్నత వర్గాలు

సుఖపడుతున్నవి. ఉన్నత వర్గాలు సామ్రాజ్యవాద శక్తితో - తాత్కాలికంగా గానీ దీర్ఘ కాలికంగా గానీ, పూర్తిగా గానీ, పాక్షికంగానీ పొత్తు పెట్టుకొంటాయి. వాటి అభివృద్ధికి ఆటంకం కలిగించే నియమ నిబంధనలను అడ్డంకులను ఈ పొత్తుతో నిర్మూలించు కొంటాయి. వాస్తవానికి వారికి దక్కేది అత్యల్పం (ఉన్నత వర్గాలకు).

కార్మికులకీ పాపంలో భాగం లేదా? వారు పరిశ్రమలకు అందుతున్న దోపిడీ వాటాలో స్వల్పమాత్రంగా లాభిస్తారు. దీనికై వారు కష్టపడవలసి యుంటుంది. అయితే వారికి సాయంగా I.L.O. ఇంటర్నేషనల్ ట్రేడ్ యూనియన్ మూమెంట్లున్నాయ్. పరిశ్రమలలో వారికి గల కీలకపాత్ర సామ్రాజ్యవాద దోపిడీముల్లె నుండి భాగం పంచుకోవటానికి ఉపయోగపడుతుంది.

బీదరికం, బానిసత్వాలలో మగ్గుతున్న ఐరిష్ వర్కరు పట్ల బ్రిటీషు వర్కరు ధోరణి ఎలా వుంటుందో మార్క్సు వ్రాశాడు. 'ఐరిష్ వర్కరు తమతో పోటీ పడుతున్నాడనీ, ఈ పోటీ వలన తమ జీవన ప్రమాణాలు తగ్గుతున్నవనీ వారిని ద్వేషిస్తాడు" పాలక వర్గ సభ్యునిగా, రాజరిక, కాపిటలిస్టు వర్గాల చేతులలో కీలుబొమ్మై తనపై - వారి (కాపిట లిస్టుల) ఆధిపత్యం బలపడటానికి ఉపయోగపడతాడు. బీద తెల్లవాడు - నల్లజాతి వాడ్ని ఎలా హీనంగా చూస్తాడో బ్రిటీషు వర్కరు - ఐరిష్ వర్కరును అలాగే చూస్తాడు' (Marx and Engels on India - P.115 - 116).

'పరిశ్రమలు, వాటి అనుబంధ ఆర్థిక వ్యవస్థలూ నిరంతరం వ్యవసాయ దోపిడీ చేస్తున్నయ్. పారిశ్రామిక కార్మికుడు, వ్యవసాయ కూలీ కన్నా అధిక వేతనమూ, ఎక్కువ విశ్రాంతి పొందుతున్నాడు. వారి వారి పని నైపుణ్యం, శ్రమతో సంబంధం లేకుండా. వారి రెండు రకాల వేతన స్థాయిలు రెండు రకాల ధరల స్థాయిలు, వాటికి వుండవలసిన నిష్పత్తిని పోగొట్టుకుంటున్నయ్. ఇంగ్లాండు అమెరికాల వరకు ఈ తరతమ భేదాలు వాస్తవం. నడుములిరిగే చాకిరి, నైపుణ్యాంకల కెన్యా, జావా దేశాల వ్యవసాయ కూలీల స్థితిని, బర్మింగ్ హామ్, పిట్స్‌బర్గ్ కార్మికునితో పోల్చి చూస్తే ఈ బాధాకరమయిన వాస్తవం మరింత ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.' అని నిజాయితీ పరుడు, మేధావి అయిన బ్రిటీషు సోషలిస్టు H.N. బ్రెయిల్స్ ఫోర్డ్ వ్రాశాడు. (Why Capitalism means war).

'అమెరికాలో వ్యవసాయ కూలీ 5,561, 2,063, 2,200 డాలర్లు సంవత్సరానికి 1940, 1950, 1954 సంవత్సరాలలో పొందగా 1,517, 3,639, 4,508 డాలర్లు ఆ సంవత్సరాలలో కార్మికుడు పొందాడు". (Prof. Black U.S.A.).

సోవియట్ దేశాలలో కార్మికులే పాలక వర్గం. కనుక రైతుల అణచివేతనుండి దోపిడీ నుండి వారు లాభిస్తారు. చిన్న పెద్ద దేశాలు, పారిశ్రామిక అభివృద్ధి కలిగిన దేశాలు, ప్రాథమికంగా వ్యవసాయదేశాల మధ్య నెలకొన్న ఆర్థిక తార తమ్యాలను (సోవియట్ దేశాలలో) బేరీజు వేయటానికి కొంత వ్యవధి అవసరం. రష్యా - యుగో స్లేవియా దేశాల తగాదాలను పరిశీలిస్తే, సామ్రాజ్య వాదం, నాజీ యిజం సోవియట్ల బుర్రలను తొలుస్తున్నదనేది కన్పించే వాస్తవం.

రక్షణ కలిగిన వలస వర్గాల వలన, రైతులు రాజకీయ ఆర్థిక స్వాతంత్రాలు కోల్పోయి అణచి వేయబడి, రక్తమాంసాలు పీల్చి వేయబడుతున్నారు. ప్రభుత్వాదరం వలన రష్యాలో కార్మికులు సుఖజీవనం గడుపుతున్నారు. భూములున్న, భూములు లేని రైతుల, నైపుణ్యం కల, నైపుణ్యం లేని కార్మికుల వేతనాల, ఆదాయాల వ్యత్యాసాలకు ఇదే కారణం, వృత్తి జీవుల, వలస వ్యాపార వాణిజ్య వర్గాల అధిక సంపాదనలు - రక్షణలను గురించే వేరే చెప్పనవసరం లేదు.

సామ్రాజ్యవాదంపై తిరుగుబాటు చేయటం ఏ వర్గాల వారికి అవసరమో తెలుసుకోవటానికి ముందు ముందు ఈ విశ్లేషణ అవసరమవుతుంది.

సామ్రాజ్యవాదం - ఫ్యూడలిజంతో పొత్తు కొంతవదులుకొని, రైతుల 'శాశ్వత కౌలు' హక్కును గుర్తించటం, 'కులక్' వ్యవస్థనేర్పాటు చేయటమే అనే వలస కమ్యూనిష్టుల సిద్ధాంతం తప్పు. 'కులక్' అంటే జారిష్ట్ రష్యా కాలంలోని భాగ్యవంతులయిన, సోమరి పోతు రైతులు. భూములు కల నిరుపేద రైతులు ఇండియా - చైనాల్లో వందల మిలియన్ల సంఖ్యలో వున్నారు. వారిచట్ట పరమైన హక్కులను సాధించుకోవటం, హోదాను పెంచుకోవటం అభివృద్ధికరమైన, ఆహ్వానించదగిన పరిణామం. ఈపరిణామం వారిని వెనుకంజవేయనీయక మరిన్ని విప్లవ విజయాలకై ముందుకు నడిపిస్తుంది.

వలస ప్రజల ఆదృశ్య దోపిడీలో స్వల్పంగా పెద్దరైతులకు లభిస్తుందనేది వాస్తవం. భూమి లేని వ్యవసాయ కూలీల అదనపు విలువ ద్వారా వారు లాభిస్తారు.

సామ్రాజ్య వాద 'కొల్ల' (Booty) ను గురించి తెలుసుకోవటం అవసరం. కొంతగానీ, మొత్తంగాని, ఒక తరానికి గానీ, భవిష్యత్తరాల వరకుగానీ, ఓడిన వారి సంపదను గెల్చినవారికి ధారాదత్తం చేయాలని శాసించటం జరుగుతుంది. నార్మెండీ విజయాలలో బ్రిటను ఇలానే చేసింది. చాలా ఆఫ్రికా దేశాలలో ఇదే విధంగా జరిగింది.

'కొల్ల'ను మిలటరీ అధికారులు, రాజ బంధువులు - ఇతర లబ్దిదారులు - బ్రిటను, ఫ్రెంచి, బెల్జియం సామ్రాజ్య వాద దేశాలు పంచుకోవచ్చు. ఓడిపోయిన దేశపు విదేశీ స్వదేశీ వర్తక, వ్యాపారాలను, గెలిచిన దేశం గుత్త వ్యాపారాలుగా ప్రకటించి, వీటి లైసెన్సులను తన దేశీయులకు లేక తన మిత్ర దేశాల వారికి, ఆశ్రితులకు ఇవ్వవచ్చు. ఉదా: బ్రిటీషు దేశం - ఆఫ్రికా వలసల్లో ఇండియా వర్తకులతో, కొన్నిటిలో అరబ్బులతో, మరికొన్నిటిలో వీరిరువురితో చైనా వారు మలయాలో ఇండియన్లతో గుత్త వ్యాపారాలను పంచుకొన్నవి. స్వాధీనం చేసుకొన్న భూములను అమ్మిగానీ గుత్తకుగానీ ఇచ్చి వలస సంపదను వూడ్చవచ్చు. తలపన్నులు - గుడిసెపన్నులు. వృత్తి పన్నులు వలస వారిపై వలసేతరులపైనా విధించి, వేధించి లాభాలార్జించవచ్చు. నౌకా వాణిజ్యం, బాంకింగు, వర్తకం, కరెన్సీ మారకం తనగుత్తాధిపత్యంలో వుంచుకొని ప్రత్యక్ష, పరోక్ష లాభాలు పొందవచ్చు. విజేతలు - కళాకారులను, చేతివృత్తుల వారిని వారి పారిశ్రామిక యంత్రా లను తమ దేశాలకు తరలిస్తారు. కుంటి తైమూరు (Timur-the Lame)[7] మహమ్మద్ గజని[8], గోరీలు[9] భారతదేశపు చేతివృత్తుల వారిని ఇలానే తరలించారు. సోవియట్ రాజకీయ విజ్ఞులు - జర్మన్, చెకోస్లోవేకియన్, రుమేనియన్ చేతివృత్తుల వారిని మిలియన్ల సంఖ్యలో, జర్మనీ వారు సోవియట్ సరిహద్దులపై దాడిచేసినందుకు తరలించారు.

లాభాలు పన్నుల రాబడి వంటి కొన్ని మార్గాలను మాత్రమే లెక్కలోనికి తీసుకొని లార్డ్ హెయిలీ (Lord Hailey) వంటివారు వలసలలో వచ్చే లాభాల కన్నా ఆదేశాల లోటు బడ్జెటుకు పెట్టే పెట్టుబడులు చాలా ఎక్కువని అందువలన వలసలు లాభసాటి కాదని వాదించి తృప్తి చెందారు. కానీ వారు వలసల నుండి సామ్రాజ్యవాద దేశాలకు అదృశ్యంగా ప్రవహించి, ఆదాయానికి, పుష్టికి కారణమైన నాలుగు ముఖ్యమయిన విషయాలను (Sources) తెలియనట్లు వదలివేశారు. అవి 1. వలసల వ్యవసాయోత్ప త్తులను చౌకగా కొని, యాంత్రిక ఉత్పత్తులను వలస ప్రజలకు ప్రియంగా అమ్మటం, 2. యుద్ధ సంసిద్ధతకు భీమాగా వ్యవసాయాభివృద్ధి, జనశక్తి, 3. దీర్ఘకాలిక ప్రయోజనాలకై వనరుల అభివృద్ధి ముందుగా జరపటం, 4. మైనింగు ఇతర పరిశ్రమల నుండి బ్రిటీషు ట్రెజరీకి, బ్రిటీషు పెట్టుబడిదారుల ద్వారా జమపడే పన్నుల రాబడి రైతుల 'అదనపు విలువ', కీలక సేవల ప్రాధాన్యతలను పరిశీలించాం. రాజకీయాధిపత్యం అండతో పారిశ్రామిక వాణిజ్య దేశాలు కొల్లగొట్టటం కూడా విశ్లేషించుకొన్నాం. రాజకీయ ఆర్థిక సామ్రాజ్య వాదం రైతుల అదనపు విలువ దోపిడీలో ప్రత్యర్థులకు చోటివ్వదు. సామ్రాజ్య

వాద కొల్ల (Booty)లో వలస వాణిజ్యం, పరిశ్రమలు ఎక్కువ వాటా పొందుతవి. తాము దోపిడీ నుండి చాలా వరకు తప్పించుకుంటయ్. స్వతంత్రదేశమయిన U.S.A. లోనే రైతులు అణగారి వున్నారు. నవీన సామ్రాజ్యవాద దేశమయిన బ్రిటను, ఇతర వలస దేశాలలో రైతులు పతన దశలో వున్నారు. వలస రైతులు, సామ్రాజ్యవాద శక్తుల వారి కాపిటలిస్టుల చేతుల్లో చిక్కుకున్నారు. సామ్రాజ్యవాద శక్తులు వలసల నేర్పాటు చేసుకోవ టానికి ఇదే ముఖ్య కారణం.

రెండు ప్రపంచ యుద్ధాలతో వలస వ్యవసాయ ప్రాముఖ్యత వెలుగులోకి వచ్చింది. యుద్ధ వ్యూహంలో భాగంగా ఆహారం, ముడిసరుకుల సరఫరా ఆవశ్యకతను ఇంగ్లాండు, జర్మనీలు గుర్తించినవి. 1917లో జర్మనీ సబ్ మెరైన్ల (జలాంతర్గాములు) ధాటికి ఇంగ్లాండు ఆహార కొరతతో అల్లాడింది. ఆహార కొరత కారణంగానే జర్మనీ ఓడిపోయింది. 20వ శతాబ్దపు వలసలకై, జీవించే ప్రదేశాలకై జపాను, జర్మనీలు పట్టుదలగా డిమాండు చేయటం (Libensharm) లైబెన్ షామ్ అని పిలువబడేది అంతే పట్టుదలతో ఇంగ్లాండు, ఫ్రాన్సులు ఆ కోరికను ప్రతిఘటించటం జరిగింది.

అన్ని సామ్రాజ్య వాద విరోధాలు, అంతర్జాతీయ వ్యూహాలు, ప్రతి వ్యూహాలలో ఒక ప్రత్యేకత సర్వసాధారణంగా కన్పిస్తుంది. వ్యవసాయభూములను, వ్యవసాయ ఖనిజ సంపదల సరఫరాను, సహజ వనరుల సత్వరాభివృద్ధిని, ఉత్పత్తి సామర్థ్యాలను, వాటి రవాణాను ఎవరికి వారే తమ ఆధీనంలో వుంచుకోవటం, విరోధులకు అందకుండా జేయటం ఈ ప్రత్యేకత.

సామ్రాజ్యవాద, సామ్యవాదశక్తులు శాంతి కాలమంతా వ్యవసాయ వనరులను చేజిక్కించుకోవటానికే యత్నాలు సాగిస్తారు. ఈ పోటీల వలన వారి మధ్య ఆవేశ కావేశాలు పెరుగుతాయి. ఈ పోటీ వలన వలస దేశాల పారిశ్రామికాభివృద్ధి కుంటు బడుతుంది. వారి వాణిజ్య, సామ్రాజ్య వాద విరోధాల అజ్ఞత వలన, యుద్ధం అనివార్యమని తోచినప్పుడు ఈ దేశాలు వలస దేశాల ప్రజల కీలక పాత్ర గుర్తించి, ఎంత మూల్యానికైనా వెనుకాడక వాటిని స్వాధీనం చేసుకొనేవారు. రెండో ప్రపంచ యుద్ధ ప్రారంభం వరకు ఈ ధోరణులు కొనసాగినయ్. యుక్రేన్, పోలెండ్లపై హిట్లరు[10] ధ్యాస, ఆఫ్రికాలో వ్యవసాయ, ఖనిజ అభివృద్ధులకై బ్రిటను, లాటిన్ అమెరికా, పశ్చిమ, ఉత్తర ఆఫ్రికాలలో అమెరికా, తూర్పు ఆసియా స్వాధీనం కొరకు జపాను పన్నాగాలు బాల్టిక్ రాష్ట్రాలు, బల్గేరియా, ఆస్ట్రియా, హంగరీ, పోలాండు, రుమేనియా, సింకియాంగ్, టిబెటు, ఇన్నర్

మంగో లియాలపై రష్యా దృష్టి కేంద్రీకరించటం ఇవన్నీ యుద్ధ వ్యూహంలో భాగంగా, వ్యవసాయ భూముల, వనరుల సంపాదన కొరకే.

ఫాసిస్టు[11] శక్తుల లక్ష్యాలలో రాజ్యవిస్తరణ ప్రధానమయినది. 'మార్కెట్లు ఆర్థిక పెట్టుబడులకై కాకుండా ముడిసరుకులపైనే దృష్టి నిలపటం, విస్తరణ కాంక్షలోని వైపరీత్యం.' (Brails Ford).

హిట్లరైటు జర్మనీని, ఫాసిస్టు ఇటలీని యూరోపియన్ సామ్రాజ్యవాద శక్తులను, విజయవంతంగా ఎదుర్కొనటానికి రష్యా సైబీరియాను అభివృద్ధి పరచింది. తన రైతులను నూతన వ్యవసాయధోరణులతో ప్రోత్సహించి ఆర్థిక స్వయం సమృద్ధి సాధనకై పాటుబడింది. ఇంతా చేసి యుక్రేన్, వైట్ రష్యాలను పోగొట్టుకున్న తరువాత తనూ ఆహార కొరతలో పడింది. ఇంగ్లాండు వలెనే స్వదేశంలో వ్యవసాయ ఉత్పత్తిలేని జపాను కూడా, చైనా, ఇండోనేషియా, మలయా, ఫిలిప్పైన్సు, ఇండోచైనా, బర్మా, ఆస్ట్రేలియాలపై తన దృష్టిని సారించి ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులపై యుద్ధానికి సిద్ధపడింది. 'ఎక్కువ సామ్రాజ్య విస్తీర్ణం కల దేశాలు, ఉదారంగా తమ దేశ భాగాలను చిన్న దేశాల కివ్వాలి' అని జపాను డిమాండు చేసింది. (Yasaburo - Shimonoka) ఆస్ట్రేలియా, న్యూజిలాండు, కెనడా బ్రెజిల్ దేశాల విశాలమయిన పచ్చిక బీళ్ళను అందరకూ అందుబాటులో వుంచితే ప్రపంచ జనాభా సమస్య కొంత వరకు పరిష్కరింపబడుతుందని Prof. చంద్రశేఖర్ అభిప్రాయ పడ్డాడు. స్థానిక తెల్లజాతివారు ఆసియా ప్రజలను అక్కడ కాలుబెట్టనిస్తారా? ఫ్రెంచి సామ్రాజ్యవాదం, ఆఫ్రికా ప్రజలచే ఛాలెంజి చేయబడుతున్న సమయంలో ట్రూమన్ - ఐసెన్ హోవర్‌లు ఫ్రెంచి వారి పట్ల మెతక వైఖరితో వున్నారు. ఆంగ్లో - అమెరికన్ ఘర్షణలకు ఆఫ్రికాలోనే అంకురార్పణ జరగబోతున్నది. (ఇజ్రాయల్ - బాగ్దాదు ఒప్పందాలతో) ఆ దేశాలలో వెలికి తీయబడని, దోపిడీ చేయబడని వ్యవసాయ ఖనిజ వనరులే ఈ విరోధాలకు దారితీస్తున్నయ్. అరేబియా ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఆఫ్రికా, తూర్పు ఆసియా దేశాలపై ఇంతవరకు తన దేశ ప్రజల ఆహారం కొరకు, పారిశ్రామిక, వాణిజ్య అభివృద్ధి కొరకు ఆధారపడిన ఇంగ్లాండు వీటిని వదులు కోవటానికి అయిష్టంగా వుంది. జాతి ప్రయోజనాలు, సిద్ధాంత ప్రయోజనాల కన్నా వ్యవసాయ దేశాలు, వాటి మార్కెట్ల కొరకే రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. యుద్ధం తరువాత అమెరికా రష్యాల మధ్య జరుగుతున్న కోల్డ్ వార్ (ప్రచ్ఛన్న యుద్ధం) కు కూడా ఇదే కారణం.

ధైర్యంగా, ఆత్మ విశ్వాసంతో ఒకరిపై ఒకరు యుద్ధాలు చేయటానికి ప్రత్యర్థి శక్తులను వ్యవసాయ దేశాలను తమ ఉపగ్రహదేశాలుగా చేసుకోవటం అవసరం. భవిష్యత్తు యుద్ధభయంతో, వ్యవసాయభూములఆక్రమణలకై ఘర్షణాలు పడటానికి సాహసిస్తున్నారు. వ్యవసాయ దేశాలలో, ప్రజలలో ఏదో ప్రత్యేకత ఉంది. అందుకే రక్తం చిందించటానికి ఎవరూ వెనకాడటం లేదు. ఆ ప్రత్యేకత ఏమిటి? వ్యవసాయ దేశాల ప్రజల నుండి పొందేదానికి సరైన ప్రతిఫలాలు చెల్లిస్తే ఘర్షణలు ఇంత వినాశకరంగా వుండవు. వారి పారిశ్రామిక ఉత్పత్తులకు, వాణిజ్య సేవలకు అధిక ప్రతిఫలాలు కోరకుండా వ్యవసాయ దేశాలకు వ్యవసాయోత్పత్తులకు ఖనిజ సంపదకు, సంపూర్ణమయిన ధరలు ఇవ్వగలిగితే యుద్ధాలు ఇంత తరచుగా విస్తృతంగా వుండవు.

వ్యవసాయ ప్రజలు పోగుచేసే అదనపువిలువను, సామ్రాజ్యవాద యజమానులు, ప్రపంచ విపణులపై ఆధిపత్యం ద్వారా, ద్రవ్య మారకం, చలామణీల ద్వారా, ఆదేశ వ్యవసాయానికి ఆవశ్యకమయిన కీలక సేవల ద్వారా, స్థానిక ప్రభుత్వాల సార్వభౌమాధి కారంతో సంగ్రహిస్తున్నారు. పారిశ్రామిక దేశాలు వారు కొనే వ్యవసాయ సరుకులకు తిరిగి వారందించే సేవలకు సరికి సరిమూల్యాలు చెల్లించటం లేదు. రైతులు తమ ఏటికేడాది సంపాదనను, వాణిజ్య సేవలకు, పారిశ్రామిక ఉత్పత్తులకు బదులుగా ఇస్తున్నామనే అపోహలో పడి, నష్టపోతున్నారు. వారికందే పారిశ్రామిక ఉత్పత్తులకు అధిక ధరలు చెల్లించి అధికంగా నష్టపడుతున్నారు. వ్యవసాయ సరుకులకు ధరలు చాలా తక్కువ.

వ్యవసాయ దారులు నుండి కొల్లగొట్టే ముల్లెను వ్యవసాయం, రైతులూ, అందిస్తున్నారు. ఈ 'కొల్లమూట' కొరకే బలవంతులు యుద్ధాలకు కాలు దువ్వుతున్నారు. సామ్రాజ్యవాద దోపిడీలోని రహస్యం ఇదే.

బ్రిటీషువారు ఇండియా షిప్పింగుపై గుత్తాధిపత్యం, విదేశ వాణిజ్యంపై ఇంగ్లాండు బాంకుల అదుపు, వ్యవసాయ ఉత్పత్తులపై ఎగుమతి - దిగుమతి సంస్థల ఆధిపత్యం, ఇండియన్ కరెన్సీ కంట్రోలు చేయటం, ఇండియా, వెండి బంగారాలను బాంక్ ఆఫ్ ఇండియాలో వుంచి, పౌండుతో రూపాయిని అనుసంధానం చేయటం, లండను మనీ మార్కెట్లు, ప్రభుత్వం లావా దేవీలను ఇండియన్ల డాలరు సెక్యూరిటీలను స్వాధీనం చేసుకొని, ఇండియన్ల స్టెర్లింగు సెక్యూరిటీలకు అవరోధం కలిగించి, యుద్ధం వలన వచ్చిన ద్రవ్యోల్బణం భారతీయులపై రుద్ది, భారతదేశపు, ప్రధానంగా గ్రామీణ ఆర్థిక వ్యవస్థపై సంపూర్ణ ఆధిపత్యం సంపాదించారు.

టారిఫ్‌లను అనుకూలంగా మలచుకోవటం ద్వారా, సామ్రాజ్యవాద ప్రాధాన్యతా ప్రణాళిక ద్వారా, భారత పారిశ్రామిక వేత్తలను ఆకట్టుకొని, దేశాన్ని దోచుకుంటున్నారు. శ్రమజీవులు, తెలివి కలిగినవారూ అయిన 200 మిలియన్ల భారత రైతుల శ్రమలో మేలు భాగాన్ని పిండుకొని, తాను తన భారతీయ, ఇతర సామ్రాజ్య వాద మిత్రులతో కలిసి పంచుకుంటున్నారు. యుద్ధకాలంలో ఆస్ట్రేలియా, అమెరికా వారుకూడా బ్రిటీషు వారి పంపకాలలో వాటాదార్లయ్యారు.

ఆఫ్రికా నీగ్రోలు తమ భూములన్నీ తెల్లజాతి ప్లాంటర్ల చేతుల్లో పెట్టి, బీద రిజర్వుడు భూముల్లో గిట్టుబాటు కాని వ్యవసాయం చేస్తూ, పన్నులు చెల్లించటానికి జీవితావసరాలకు కూడా చాలని వేతనాలతో, ప్లాంటేషన్లలో కూలీలుగా మారారు. వారి హోల్‌సేల్, రిటైలు వర్తకాలు, స్వదేశీ విదేశీ మార్కెట్లలో, సామ్రాజ్య వాదుల కంట్రోలులోకి వెళ్ళినయ్.

భారత - ఆఫ్రికా దేశాల మధ్య ఒక పెద్ద తేడా వుంది. భారతదేశంలోని పారి శ్రామిక వేత్తలు, వాణిజ్య వేత్తలు సంఘటితంగా వుండి, తెలివి తేటలు కలిగి బ్రిటీషు వారి కొల్లలో అధిక శాతం వాటా తీసుకోగలిగారు. ఆఫ్రికాలో వర్తకం తెల్లవారి చేతుల్లో కాని, భారతీయుల చేతుల్లోగాని లేదు. ఇతర దేశాల వర్తకుల చేతుల్లో వుంది. అందువలన నీగ్రోలు, భారతీయుల మాత్రం కూడా లాభించలేకపోయారు. బ్రిటీషు వారి 'కొల్లముల్లె' లో వీసం ఎత్తు కూడా నీగ్రోలకు దక్కలేదు.

భారతదేశంలో భూములు స్వదేశీయుల అధీనంలో వున్నయ్. ఆఫ్రికా వారు భూములు పోగొట్టుకున్నారు. అందువలన ఆఫ్రికా భూముల సంపదంతా విదేశీయుల చేతుల్లోకి వెళ్ళింది.

మలయా : సామ్రాజ్యవాదం మలయాలోని స్థానిక సమస్యలను జటిలం చేసి, వారి జాతీయ సంపదను దోచుకొని, ప్రజల నెంత దుర్భర దారిద్ర్యంలోనికి నెట్టిందో పరిశీలిద్దాం. 'మలయన్లు ప్రత్యేక వ్యక్తిత్వం కలవారు. సామాన్య అవసరాల మేరకే వారు శ్రమిస్తారు. వారెవరికీ తలవంచరు' అని అందరూ ఒప్పుకొంటారు. ఈ నైజం వలన వారు బ్రిటీషు ప్లాంటర్ల వత్తిళ్లకు, చట్టాలకు, నిర్బంధ శ్రమకు లొంగలేదు. అందువలన సామ్రాజ్యవాదులు ఇండియన్లను, చైనా వారిని వ్యవసాయ పనులకు, మైనింగుకు ఈ 'చిన్న ద్వీపపు వనరులను ప్రపంచానికందించటానికి దిగుమతి చేసుకొన్నారు. వారి

సంపదను ప్రపంచానికి అందించినందుకు ప్రతిఫలంగా వారికే మిచ్చారు?' కామన్వెల్తు దేశాలు, ముఖ్యంగా బ్రిటను వారిలాభాలకు ఆటంకం కలిగినప్పుడు మలయన్ల సంకుచిత స్వార్థాన్ని బలిదీసుకొన్నారని' హేళనగా రాలింగ్సు వ్యాఖ్యానించాడు.

1880 నుండీ మేమెంత నేర్పినా వారిని వారు పాలించుకోవటం (స్వపరిపాలన) తెలుసుకోలేక పోయారని 'బ్రిటను ఫిర్యాదు చేస్తున్నది. పది సంవత్సరాల కమ్యూనిష్టు పోరాటం, జాతీయ విప్లవం తరువాత 1957కు మలయన్ల జాతీయ స్వాతంత్ర్యానికి వాగ్దానం చేశారు.

ఫ్రెంచి మొరాకో 7 మిలియన్ల జనాభాలో 5 మిలియన్ల మంది అరబ్బులు, 2 లక్షల యూరోపియన్‌లు, 1 లక్ష యూదులు, అధిక సంఖ్యలో ప్రాచీన బెర్‌బెర్ తెగలవారు అట్లాస్ పర్వతాల వద్ద నివశించేవారు. స్పానిష్ మొరాకో సరిహద్దులో 'సారవంతమయిన తీర ప్రాంతం రైల్వేలైనుకు రెండు వైపులా కనుచూపు మేర విస్తరించి వుంది. నల్లభూములలో ఒకటి రెండు ట్రాక్టర్లు వ్యవసాయం చేస్తూ కన్పిస్తాయి. చక్కని గృహ సముదాయాలతో ఆప్రాంతం కను విందుగా వుంటుంది. కానీ అరబ్బులు ఈ నేలలో ఒక్క అంగుళానికి కూడా యజమానులు కారు. ఇది ఫ్రెంచి సిండికేట్ల చేతుల్లో వుంది. అరబ్బులు బీడుపొలాల్లో బార్లీ - కూరగాయలు - పండ్లూ పండించుకొంటూ, బార్లీతో, దిక్కుమాలిన మేకల పాలతో బతుకుతారు. దరిద్రం తాండవిస్తుంటుంది. ఎక్కడచూచినా రైఫిళ్ళు - బిచ్చగాళ్ళే. మొరాకో పాటరీ (Pottery) పై మాత్రం విదేశీయుల చేయి పడలేదు.

ఫ్రెంచి - ఆఫ్రికన్ ప్రజల నిస్సహాయత యూరోపియన్ ప్లాంటేషన్లలో కూలీలుగా వున్న ఈ తలిదండ్రుల టెలిగ్రాముద్వారా తెలుసుకోవచ్చు. '30 ఫ్రాంకులు పన్నులు చెల్లించటానికి అర్జంటుగా పంపండి. వాళ్ళు (టాక్సుకలక్టర్స్) పశువులు, ధాన్యం అంతా వూడ్చుకపోయారు. తిండికి లేక మాడుతున్నాం' అని పిల్లలకు టెలిగ్రాము పంపారు. మొరాకో, టునీషియా, ఆల్జీరియా వారు ఎన్నో త్యాగాలు చేసి స్వతంత్రం సంపాదించు కున్నారు.

'సామ్రాజ్యవాదులకు - స్వతంత్రమైన ఆయుధ సంపత్తి కలిగిన దేశాలలో కన్నా, వలస వర్తకం ద్వారా పెద్ద మొత్తంగా దీర్ఘకాలిక లాభాలు వచ్చే అవకాశముంది.' (Mr. Leonard Barnes - Soviet light on-colonies P. 51.1944) విన్సెంట్ హోరో తన ఆక్కుఫర్డ్ కరపత్రంలో - 'బలహీన జాతులలో ప్రైవేటు వాణిజ్య దోపిడీ

చాలా అపకారి. 'నీగ్రోలు, ఇతర స్థానికులు తమ పెళ్ళాం బిడ్డలను వదలిపెట్టి దూర ప్రాంతాల గనుల్లో ప్లాంటేషన్లలో పని చేయాలి. వాణిజ్య కంపెనీల ప్రభావం తమ వద్ద పనిచేసేవారిపై, వాణిజ్య పంటలను కొనేవారిపై ఎక్కువగా వుంటుంది.' అందువలన అభివృద్ధి తక్కువగా కల వలసలలో దోపిడీ ఎక్కువగానూ, త్వరగానూ జరుగుతుంది.

సామ్రాజ్యవాదులు, వలస ప్రజల కుటీర పరిశ్రమలను, వారి ఆర్థిక స్వయం సమృద్ధిని నాశనం చేస్తారు. భారతదేశంలోని చేతి వృత్తులను ముఖ్యంగా చేనేతను ఈ విధంగానే బ్రిటీషువారు నాశనం చేశారు. అలా చేయటంవలన వారి యాంత్రిక ఉత్పత్తులకు గిరాకీ పెరుగుతుంది. టర్కీ, చైనా, ఆఫ్రికాలలో సామ్రాజ్యవాద దోపిడీ ఇలానే జరిగింది.

ఇక డొమినియన్లు (స్వతంత్ర ప్రతిపత్తిగల వలసరాజ్యాలు) వున్నాయి. ఆస్ట్రేలియా కెనడా, న్యూజిలాండు, బ్రిటనుకు, ఆల్జీరియా ఫ్రాన్సుకు, ఫిలిప్పైన్సు U.S.A. కు డొమినియన్లు. ఇవి కూడా సామ్రాజ్య వాదానికి దాసోహం అనవలసిందే. బ్రిటీషు, ఫ్రెంచి, అమెరికా దేశాల నుండి తమ దేశాలలోని రవాణా, షిప్పింగు, అంతర్జాతీయ వ్యాపారం ద్రవ్య చలామణీలకు, ముఖ్యంగా తమ వ్యవసాయోత్పత్తులకు, ఖనిజాలకు డిమాండు కల్పించే సామ్రాజ్యవాద దేశాలపై ఆధారపడటం వలన రాజకీయంగా కొంత స్వతంత్రం కలిగిన ఈ దేశాలు కూడా దుర్మార్గాలను భరించవలసి వస్తున్నది.

వారీ సామ్రాజ్యవాద పిడికిలి నుండి బయటపడటానికి, వారికున్న అధికారాలతో సామ్రాజ్య వాద దేశాలను పరస్పరం పోటీలో వుంచే యత్నాలు చేస్తున్నారు. కెనడా తన పరిశ్రమలను, రవాణాను, వాణిజ్యాన్ని అభివృద్ధి పరచటానికి గ్రేట్ బ్రిటను, U.S.A. ల పెట్టుబడుల నాహ్వానించింది. యాంత్రిక ఉత్పత్తులను ఎంపిక చేసుకొని కొనుగోలు చేసే అధికారం వారికి వుంది. వారి ఎగుమతులకు గాలం వేసి, మార్కెట్లు వెతుకుకొని, నచ్చిన మార్కెట్లను ఎన్నుకొనే స్వతంత్రం వుంది. అందువలన సామ్రాజ్యవాద 'కొల్ల' డొమోనియన్ల నుండి క్రమేపీ తక్కువగా సామ్రాజ్యవాద దేశాల కందుతుంది. యుద్ధ పూర్వం బాల్కన్ రాష్ట్రాలలో ఇదే పరిస్థితి వుంది.

కామన్వెల్తులోని రాజకీయ స్వతంత్రం కలిగిన లాటిన్ అమెరికా రాష్ట్రాలు, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, టర్కీ, వంటి దేశాలు తమ స్వంత కరెన్సీ స్టాండర్డును, దానితో ప్రపంచ అంతర్జాతీయ మనీస్టాండర్డును నిర్ణయించుకొనే స్వతంత్రం కలిగి వున్నయ్.

ఈ స్వతంత్రం పేరుకు మాత్రమే. బ్రిటను అమెరికాలలో ఏదోఒక దేశానికి అధికంగా అప్పుబడి వుండడంతో పౌండు డాలర్లతో మాత్రమే వారి కరెన్సీ మదింపు జరుగుతుంది. యుద్ధపూర్వపు చైనాలో రవాణా, సమాచార వ్యవస్థలు, అధిక భాగం ఖనిజ సంపద విదేశీ ఋణ దాతలకు తాకట్టు పెట్టబడినవి. రైల్వేలు వేరు వేరు పోటీదార్ల చేతుల్లో వున్నయ్. విదేశీ ఋణాల వడ్డీ చెల్లింపులకు చైనాలోని ప్రభుత్వ ధనాదాయ మార్గాలన్నీ తాకట్టులోకి వెళ్ళాయి. ఈ బహిరంగ దోపిడీ సామ్రాజ్యవాదుల బాయినెట్లు, నౌకా దళాల మోహరింపులతో జరుగుతున్నదని, జపాను 20వ శతాబ్దారంభం నుండీ సామ్రాజ్య వాదశక్తులతో చేతులు కలిపినదని చైనా ప్రజలు గ్రహించారు. (Imperial Economics - Leonard Wolf P. 94) 'బాక్సరు విప్లవం' కు గాను చైనావారు అమెరికాకు, ఇతర సామ్రాజ్యవాదులకు 67 మిలియన్ డాలర్లు నష్ట పరిహారం చెల్లించారు. దీనితో తృప్తిపడక వారి సరిహద్దుల హక్కుల నతిక్రమించి, వారి రాజకీయ స్వేచ్ఛకు స్వాతంత్ర్యానికి ముప్పుతెచ్చి వారి కస్టమ్స్ శాఖలపై కూడా హక్కులు పొంది ఎగుమతి - దిగుమతి పన్నుల నిర్ణయాధికారులై తమ వడ్డీ చెల్లింపులు భద్రంగా జరిగేటట్లు చర్యలు తీసుకొన్నారు.

'బ్రిటీషు వర్తకానికి చైనా స్వంత ఇల్లయింది. బ్రిటీషు పౌరుడు తన సామ్రాజ్యాన్ని తన చెప్పుల్లో తీసుకొని వెళ్తాడు. అతనే దేశం వెళ్ళినా, అక్కడ ప్రత్యక్ష పన్నులు తనపై తన ఆస్తిపై వ్యాపారంపై చెల్లించే వాడుకాదు. ఆ సామ్రాజ్యం అంతగా విస్తరించి వుంది. 'ఆయుధాలతో ప్రభుత్వ భద్రత ఆసరాతో నడచే ప్రైవేటు కాపిటలిష్టు వర్తకానికి ఇదే ముఖ్య కారణం' (Brails ford). ఇరు దేశాల మధ్య జరిగిన అసమాన ఒప్పందాలు బల ప్రదర్శనతో ఆచరణలో పెట్టబడేవి. బ్రిటీషువారి గన్‌బోట్లు (Gun Boats) తీరాన్నే కాక, నదులలో కూడా పహరా కాచేవి. ' ఈ పద్ధతే టర్కీ, ఈజిప్టు, సియాం, కొంతకాలం జపానులో కూడా కొనసాగింది.

Dr. సన్‌యట్‌సేన్ (SUN YAT SEN) ప్రపంచ కాపిటలిజంకు చైనా చెల్లించిన మూల్యాన్ని ఇలా చెప్పాడు.

'కాజేయబడిన హక్కులు, రాయితీలతో, విదేశీ సరుకుల దిగుమతులతో 500 మిలియన్ డాలర్లు, కాగితపు డబ్బు (Paper Money) విదేశీ మారకం, విదేశీ బాంకుల డిస్కౌంటు వడ్డీలలో 100 మిలియన్లు, ఎగుమతి దిగుమతి రవాణా ఛార్జీలలో 100 మిలియన్లు, సెటిల్‌మెంటులు, సీడెడ్ ఏరియాల (దత్త మండలాలు) పన్నులు,

అద్దెలు, భూమి అమ్మకాలు దాదాపు 400 నుండి 500 మిలియన్లు, విదేశీయుల ప్రత్యేక రాయితీలు స్వంత వర్తకాలలో 100 మిలియన్లు, స్పెక్యులేషను వ్యాపారాలలో వందలాది మిలియన్లు ఈ ఆరు విధాలుగా దాదాపు 1200 మిలియన్ డాలర్లు చైనా నుండి సామ్రాజ్య వాదం కాజేసింది.'

దేశంలో అంతర్యుద్ధాలకు కారణమయింది. యుద్ధోన్మాదులకు పెట్టుబడు లందించింది. సన్‌యట్‌సేన్, వాన్‌ఛియాంగ్, చాంకైషేక్, జాతీయ సమైక్యతను సాధించే సమయానికి దేశం చాలా బలహీన పడింది. జపాను ఇది ఆసరాచేసుకొని, ఇతర సామ్రాజ్య వాద శక్తులను పారద్రోలి, తన కాపిటలిజం చైనాలో ప్రయోగించాలని అభిప్రాయపడింది.

కమ్యూనిష్టులు చైనాలో అధికారాన్ని హస్తగతం చేసుకొని, ఈ సామ్రాజ్య వాదాన్ని రూపుమాపారు. అయినా, ఇప్పటికీ హాంకాంగుపై ఆధిపత్యం వదలుకోవటం బ్రిటనుకు అయిష్టంగా వుంది.

లాటిన్‌అమెరికాదేశాలు రాజకీయస్వాతంత్ర్యం తమకుందని గొప్పలు చెప్పుకొన్నా U.S.A. దాని ఎక్సపోర్ట్ మరియు ఇంపోర్టు బాంకు, యునైటెడ్ కంపెనీ, స్టీలు, పెట్రోలు, రైల్వేలు ఇతర కంపెనీలు ఈ దేశంపై ఆర్థిక ఆధిపత్యం కలిగి వున్నయ్. అర్జెంటినా మరికొన్న చిన్న దేశాలు బ్రిటీషు వారి క్రింద వున్నయ్. యుద్ధపూర్వం జర్మనీ, ఇటలీలు కూడా చాలా చిన్న దేశాలకు పెట్టుబడులు పెట్టినయ్. లాటిన్ అమెరికా తన ప్రాధమిక ఉత్పత్తులలో 1/3 వంతు విదేశాలకు అమ్మింది. ఈ అమ్మకంలో 3/4 వంతు కాఫీ, బనానాలు, 3/4 వంతు మొక్కజొన్న తన పంచదార ఉత్పత్తిలో సగం, గోధుమలు, కోకో, చిరుధాన్యాలు 1/4 వంతులు ఎగుమతులు చేసింది. (Oxford Pamphlet).

అర్జెంటినాలో బ్రిటనుపెట్టుబడులు 100 మిలియన్ పౌండ్లు, రైల్వేలు, షిప్పింగు, రిఫ్రిజిరేటర్లు, బ్రిటీషు కంట్రోలులో వున్నాయి. బ్రిటీసువారు తినే మాంసంలో 50% అర్జెంటినా నుండే వస్తుంది. అర్జెంటినా మాంసం ఉత్పత్తి ఎగుమతులలో అగ్రగామి, మొక్కజొన్న ఎగుమతిలో ప్రథమస్థానం, గోధుమలు, ఉన్ని, మాంసం ఎగుమతులలో రెండవ స్థానం. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అర్జెంటినా U.S.A. చేతులలోకి వచ్చింది. తక్కిన దక్షిణ అమెరికా రాష్ట్రాలలాగానే అర్జెంటినా U.S.A. ఎక్స్‌పోర్టు, ఇంపోర్టు బాంకు సహాయం కోరవలసి వచ్చింది.

బ్రెజిల్ కాఫీకి ప్రధానమయిన ఎగుమతి దారు. 9 మిలియన్ డాలర్లకు 9 మిలియన్ బస్తాల కాఫీ గింజలను హామీగా వుంచి, అప్పు తీసుకోవటం, 15% ఉత్పత్తిని 2 లక్షల డాలర్లకు గాను నాశనం చేయటం వలన ఆదేశం తన దేశపు రైతులకు, ప్లాంటర్లకు కేవలం బతుకు తెరువు మాత్రమే చూపించగల్గింది.

మెక్సికో నియంత విదేశాల్లో తన స్వార్థానికి ఆదేశాన్ని విదేశాలకు 'ధర్మం' చేశాడు. బ్రిటను, అమెరికా దేశాలు ఒక్క పైసా రాయితీ ఇవ్వకుండా, పన్నులు కట్టకుండా ఆయిల్ కంపెనీలు, స్వంత పట్టణాలు, సైన్యాలను నిర్మించుకొన్నయ్. చమురును ఉచితంగా కాజేశారు.

లాటిన్ అమెరికా దేశాలు తమ అదనపు ఆహార నిల్వలను అమ్ముకోవటంలో యూరపు, అమెరికా దేశాలపై ఆధారపడటం మానివేశాయి. వారి ఆలోచనాధోరణిలో మార్పు వచ్చింది. మూడు శతాబ్దాల మైనింగు, ఒక శతాబ్దపు దోపిడీ తరువాత తమ మైనింగు పరిశ్రమలను తామే చేపట్టదలచారు.

రెండవ ప్రపంచ యుద్ధం, తమ వ్యవసాయ ఖనిజసంపదల ఎగుమతి మార్కెట్లకై సామ్రాజ్య వాద దేశాలపై ఆధారపడటంలోని నిస్సహాయతను వెలికి తెచ్చింది. లాటిన్ అమెరికా దేశాలు తమ వ్యవసాయ ఉత్పత్తుల విడుదలకై అమెరికాపై అమెరికా ఋణాలపై ఆధారపడింది. స్వరాజ్యం రాకముందు భారతదేశ స్థితి కూడా ఇంతే.

సామ్రాజ్యవాద పారిశ్రామిక వేత్తలు పెరుగుతున్న డిమాండ్లకై వలసలలో అధిక వ్యవసాయోత్పత్తి ఎలా సాధించిందీ, ప్రపంచ మార్కెట్లకు వలస ప్రజలు వాణిజ్య పంటలను పండించటానికి ఏ విధమైన జోక్యం చేసుకొన్నదీ చూశాము. తమ దేశపు కాపిటలిస్టు పరిశ్రమల అవసరాలకై భూములు జప్తు చేసి, చౌకగా కొని, అక్కడి ప్రజల శ్రమను, రవాణాలను ఎన్ని అడ్డదారులు తొక్కి స్వాధీనం చేసుకొన్నదీ తెలుసుకున్నాము. కాపిటలిస్టులకు చౌకగా ఋణసౌకర్యం కలిగించటం, స్థానిక ప్రభుత్వాల రాజీకాయాధి కారాన్ని వారి ముందు మోకరిల్ల చేసుకోవటం జరిగింది. వలస ప్రభుత్వాలు సామ్రాజ్య వాద దేశ ప్రతినిధులుగా కాక సామ్రాజ్యవాద కాపిటలిస్టుల పరిపాలనా వ్యవస్థలయినవి.

1900 సంవత్సరంలోనే ఇండియాను రెండు విధాల ఉపయోగించుకోవటం గమనించాం. ఒకటి బ్రిటీషు ఫాక్టరీల ముడిసరుకుల అధికోత్పత్తి, రెండు వారి యాంత్రిక తయారీల వినియోగం.

'బ్రిటీషు మాన్యుఫాక్చరర్ ప్రత్యర్థితో లావాదేవీలలో నెగ్గలేనపుడు రాజకీయ అన్యాయాలకు కూడా వెనుకాడలేదు. ఇండియా ఒక విశాలమయిన ఇంగ్లీషు ఎస్టేటుగా, ప్లాంటేషన్‌గా మార్చబడింది. 60% ఇండియా ప్రజలు దరిద్రం, ఆహార లోపాలతో అలమటించారు. (Economic History of india - Victorian Age P. 11)

'భారతదేశం, ప్రతి సంవత్సరం ఇంగ్లాండుకు దాదాపు ఉచితంగా చేసే సరుకుల ఎగుమతుల విలువ - 60 మిలియన్ల వ్యవసాయిక, పారిశ్రామిక కార్మికుల శ్రమ విలువ కంటే ఎక్కువగా ఉంటుంది.' (Marx - Engels on India P. 93)

సామ్రాజ్య వాదులు తాము ప్రాచ్య దేశాలకు శాంతి సౌభాగ్యాలను అందించామని చెప్పే బడాయి కబుర్ల బండారం జనవరి 5వ తేదీ 1853 లో చైనా చక్రవర్తి జారీ చేసిన ఉత్తర్వులు చదివితే బయటపడుతుంది. సామ్రాజ్య వాదులకంటే ముందుగా పాలన చేసిన ఓరియంటల్ చక్రవర్తుల కన్నా వీరు హృదయం లేని వారని, ప్రజల బాగోగులు పట్టించుకోరని అర్థమవుతుంది.

జనవరి 5వ తేదీ 1853లో చైనా చక్రవర్తి ఈ క్రింది ఉత్తరువు జారీ చేశాడు. 'రద్దు చేయండి. పన్నుల వసూళ్ళను వాయిదా వేయండి. ఏ పరిస్థితులలోనూ మామూలు పన్నులకు మించి వసూలు చేయరాదు. అలా చేస్తే బీదలు పన్నుల భారాన్ని ఎలా భరిస్తారు? ఈ కష్టకాలంలో నా ప్రజలు పన్నుల వసూళ్ళ వేధింపుల నుండి విముక్తులౌతారు'. (Marx and Engels-on India P - 101) ఈ ఔదార్యం బ్రిటీషు వారిలో ఎప్పుడయినా చూశామా?

వలసదేశాలలోని సామ్రాజ్యవాద ప్రభుత్వాలను, 6వ ప్రపంచ కమ్యూనిష్టు మహాసభ 'సామ్రాజ్యవాద తలారీలు' గా సిద్ధాంతీకరించింది, పరిశ్రమలు, వాణిజ్యంపై సామ్రాజ్యవాదపు కంట్రోలు, వలసల జాతీయసంపద రక్తస్రావానికి కారణమని భావించింది. వలస దేశాలలోని బానిసల అదనపు విలువ పట్టణాలకు తరలించటంతో వలసల ఆర్థికాభివృద్ధి ఘోరంగా పతనమవుతుంది.

కానీ వారు (6వ కమ్యూనిష్టు మహాసభ) సామ్రాజ్యవాదం, ప్రత్యక్షంగా వలస రైతుల అదనపు విలువను దోపిడీ చేస్తుందని విస్మరించారు. సామ్రాజ్యవాదపు ప్రాథమిక ప్రయత్నమంతా తన రాజకీయ ఆర్థిక ప్రాబల్యాలు కల ప్రతిచోటా అచ్చటి ప్రజల అదనపు విలువను దొంగిలించటం తాను భాగ్యవంతుడు కావటం. ఈ దోపిడీ మార్కెటింగు

లో రవాణాలో తక్కువ ధరలతో వివిధ రూపాలలో జరుగుతుంది. కాంగోలో నీగ్రోలను వినూత్న మార్గాలలో దోపిడీ చేస్తున్నారు. తెల్లవారి ఉత్పత్తులకు నీగ్రోల ఉత్పత్తులకు వేరువేరు ధరలు కల్పించారు. కెన్యాలో తెల్లవారు మూడు వంతులు, నల్లవారు ఒక వంతు మాత్రమే మొక్కజొన్న పండించాలని నిర్ణయించారు. యూరోపియన్ల మొక్క జొన్నకు అధిక ధర, తక్కువ ఉత్పత్తి దారులయిన నీగ్రోలు, అధిక ధరలు చెల్లించి యూరోపియన్ల నుండి మొక్కజొన్నలు కొనుక్కోవాలి. ఇదీ పరిస్థితి.

**వినియోగ దారుల వాటా** :- అదనపు సేవలందించే వర్కర్లు, వృత్తిజీవులు, టెక్నీషియన్లు, మేధావులు మాత్రమే కాదు వినియోగదారులు కూడా వలస రైతుల అదనపు విలువ దోపిడీని పంచుకొంటున్నారు. వివిధ సామ్రాజ్యవాద - పారిశ్రామిక దేశాల మధ్య మార్కెట్లకై పోటీ వుంటుంది. వారి వారి దేశాలలోని ప్రజలను సామ్రాజ్య వాదులు తమ లాభాలతో 'జో' కొట్టవలసి వుంటుంది. అందువలన సామ్రాజ్యవాదులు కాపిటలిస్టులు వలస రైతుల అదనపువిలువ కొల్లలో మేలుభాగాన్ని, తక్కువ ధరల రూపంలో వారి ప్రజలకు (వినియోగదార్లకు) అందిస్తారు. పారిశ్రామిక వేత్తలు, కార్మికులు రెండు విధాల లాభిస్తారు. వలస దేశాల ముడి సరుకుల వలన వీరికి ఉద్యోగావకాశాలు పెరగటం, వినియోగ సరుకులను తక్కువ ధరకు కొనగలగటం.

సామ్రాజ్యవాద దేశాలలో ఉన్నత వర్గాల వారికి కార్మికులకు ఘర్షణ లుండటం సహజం. ఈ వర్గ పోరాటం వారి జాతీయ సంపదలో, పరోక్షంగా వలస దోపిడీ ఆదాయల్లో వాటాల పంపకం గురించి మాత్రమే. వలసప్రజల వరకు ఈ ఇరువర్గాలు దోపిడీ దారులే. 'ఉన్నత వర్గాల వారికి అన్ని అధికారాలుంటాయి. ఈ లూటీలో అధికభాగం వారి సొత్తు అవుతుంది.'

అదేవిధంగా వలస దేశాలలోని పారిశ్రామిక - వాణిజ్య - స్వార్థశక్తుల - పాలకుల ఘర్షణ కూడా, రైతుల అదనపువిలువకై కుమ్ములాటే. ఈ ఘర్షణలే స్వతంత్ర్యోద్యమాలకు పునాదులు. ఈ ఉద్యమాలు కూడా సామ్రాజ్యవాద కార్మికుల లాగానే దోపిడీలో వాటాదార్లు అవుతాయి.

ప్రపంచ వ్యాప్తంగా పారిశ్రామిక, వాణిజ్య, కార్మిక వర్గాలు సామ్రాజ్యవాదులు వలసదేశాల సంపదలో వాటాలు పొందుతారు. సామ్రాజ్యవాద శక్తులు పెద్ద వాటాదార్లు. వీరిలో కూడా ప్రత్యక్ష ఆధిపత్యం కలవారు ఎక్కువగాను, పరోక్ష ఆధిపత్యం కలవారు

నామమాత్రపు లూటీతోను తృప్తిపడతారు. వివిధ పారిశ్రామిక, వాణిజ్య, రవాణాల అదనపు సామాగ్రిపై కొద్దో గొప్పో ఆధిపత్యం సంపాదించటంవలన పరోక్ష ఆధిపత్యం కలవారు దోపిడీ భాగస్వాములు కాగలుగుతున్నారు.

ఇక్కడా ఘర్షణలు తప్పవు. ఉదాహరణకు బ్రిటీషు సామ్రాజ్యం పటిష్టమయినది. వలసల కవసరమయిన అదనపు సామ్రాజ్య సరఫరాను గుత్తకు తీసుకొంటుంది. వలసల ముడి సరుకులను వినియోగ వస్తువులుగా మార్చి - వినియోగదారుల కందిస్తుంది. కనుక ఇతర పారిశ్రామిక సామ్రాజ్య వాద ప్రజలు వినియోగదారులుగా మాత్రమే ఈ దోపడీలో కొంత నంజుకుంటారు. వడ్డీలు, దళారీ కమీషన్లు, ఎరువుల అమ్మకం, ముడి సరుకుల కొనుగోలు, షిప్పింగు, రైల్వేలు, బాంకింగ్, పారిశ్రామికోత్పత్తులలో వచ్చే లాభం (దోపిడీ) వీరి చేతికందదు. అందువలన సామ్రాజ్యవాద దేశాలు ఇతర పారిశ్రామిక దేశాల మధ్య ఈర్ష్యలు, ఘర్షణలు, విరోధాలు రాజుకొంటున్నయ్. ఈ వైరుధ్యం వలననే - 'దోపిడీలో ఐక్యత - వాటాలకై కొట్లాట'. వారి మధ్య చాప క్రింద నీరులాగా కనుపించని అవగాహన కలిగి, వలస ప్రజలను అణచి వేస్తే, అందరకూ వలసలు తలుపులు తెరవాలనీ, స్వేచ్ఛా వర్తక వాణిజ్యాల పేరుతో జాతీయ వనరులన్నీ అందరికీ చెందాలని సోవియట్లు - ఫాసిస్టులు - బ్రిటీషు, అమెరికా ప్రజాస్వామ్య వాదులు - అందరూ కలసి 'పొరుగువాడి మేలుకై' అట్లాంటిక్ ఛార్టర్ ప్రతిపాదించారు.

## రెండు ప్రపంచాల ఆవిర్భావం

"బూర్జువా నాగరికత - హిపోక్రసీ, పాశవికతల ముసుగును తొలగించుకుని వలసదేశాల్లో నగ్నంగా దర్శనమిస్తుంది. స్వదేశాల్లో మాత్రం గౌరవపు ముసుగు ధరిస్తుంది. ' అని 1853లో మార్క్సు వ్రాశాడు. 'ఆస్తి' కి కాపలాదారులు వారు (బూర్జువాలు) బెంగాలు, మద్రాసు, బొంబాయి పట్టణాలలో వచ్చిన వ్యవసాయ విప్లవాలు ఏ విప్లవ నాయకత్వమయినా తలపెట్టిందా? లార్డ్ క్లైవ్[15] (తనే ఒక పెద్దదొంగ) మాటల్లో - బూర్జువా వర్గం సాధారణ అవినీతితో వారి స్వార్థాన్ని సాధించలేనప్పుడు - దారుణమయిన దోపిడీకి పాల్పడుతుంది.' జాతీయ ఋణాల పవిత్రతను గూర్చి స్వదేశంలో (ఇంగ్లాండు) బడాయి కబుర్లు చెబుతూ భారతదేశపు రాజాలు ఈస్టిండియా కంపెనీలలో పెట్టిన ప్రైవేటు పెట్టుబడులను ప్రభుత్వం జప్తు చేయలేదా? వారెన్ హేస్టింగ్సు[16] అయోధ్య బేగం మహాళ్ళను

దోచుకోలేదా? (Marx and Engels on India P. 64) 'అంతర్జాతీయంగా ఒక నూతన శ్రమ విభజన జరుగుతున్నది. ప్రపంచంలో కొన్ని ప్రాంతాలు యాంత్రికోత్పత్తికి కొన్ని ప్రాంతాలు వ్యవసాయోత్పత్తికి శ్రద్ధ చూపెట్టుతున్నయ్. ఈ మార్పు వ్యవసాయంలో విప్లవాత్మకమయిన మార్పులకు కారణమయింది. (Marx Cap. Vol. 1-P-184).

'సామ్రాజ్యవాదం అంటే వందలాది మిలియన్ వలస దేశాల ప్రజలను తనపై ఆధారపడిన జనాభాను సిగ్గు లేకుండా చేసే అమానుషమయిన దోపిడీ, అణచివేత అని స్టాలిన్ అన్నాడు. (quoted by Leontove - P. 134) అమ్మకాల, ముడిసరుకుల, పెట్టుబడుల మార్కెట్లకై పడే పోటీతో ప్రపంచం కొందరు దొంగల మధ్య విభజించబడింది. 1750 మిలియన్ల ప్రపంచ జనాభాలో 600 మిలియన్ల ప్రజలు అణచివేయబడుతున్న వలసలలోను, 400 మిలియన్లు ఉపవలసల్లోనూ నివశిస్తున్నారు. ఈ విధంగా మానవ జాతి దోపిడీ దేశాల చేతులలో చిక్కుకున్నది. (Leontove - Practical Economy - P 316). అమానుష విధానాలు, మిలటరీల ద్వారా ఈ దుర్మార్గపు జాతులు ప్రపంచంలో 1250 మిలియన్ల ప్రజలను దాసులుగా చేసుకోవాలను కొంటున్నారు. ఈ మొదటి మైనారిటీ వర్గం, ప్రపంచంలో అతిశక్తివంతమయిన స్థానాలను ఆక్రమించుతున్నది. ఈ వర్గపు రాజకీయ ఆర్థిక శక్తి చాలా ఎక్కువ'. (సన్యట్‌సేన్)

**హాబ్సన్** (HOBSON):- తక్కువ తరగతి వారిని, వెనుకబడిన వారిని, తెల్లవారు ఆర్థికంగా, రాజకీయంగా, మానసికంగా దోపిడీ చేయటానికి, నాగరిక పాశ్చాత్య దేశాలు ఆచరణ పథకాలు, సిద్ధాంతాలు రూపొందిస్తున్నవి. ఈ సాంఘిక విభజనకు వర్గ ఔన్న త్యాన్ని ప్రక్కన బెట్టి, నైతిక, మేధోపరమయిన మార్గాలను సామ్రాజ్యవాదం అన్వేషిస్తోంది. బీద దేశాల శ్రమపై పాశ్చాత్య దేశాలు ఆధారపడేటట్లు చేయటానికి సామ్రాజ్యవాదం నడుం కట్టుకొన్నది'. పాశ్చాత్య దేశాల దిగువ తరగతి ప్రజానీకం ఎంత విలాసవంతంగా జీవిస్తున్నదీ, వలస ప్రజలపై ఎంతగా వర్ణ, జాతి వివక్షత ప్రదర్శిస్తున్నదీ దగ్గరగా పరిశీలిస్తే తెల్లవాడ్ని గురించి హాబ్సన్ వర్ణన అర్ధమవుతుంది.

యుద్ధాల మధ్యకాలంలో జపాను, సామ్రాజ్యవాదుల సరసన జేరింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం సోవియట్ రష్యా, చైనాలు తమ ఉపగ్రహ దేశాల నేర్పాటు చేసుకొన్నయ్. ఉపగ్రహ దేశాల పట్ల రష్యా, చైనాల తీరు సామ్రాజ్యవాదుల ధోరణి వలనే వుంది. సామ్రాజ్యవాద శక్తుల ఆధునిక విస్తరణ కాంక్షకు వ్యవసాయదేశాలనుతమ కంట్రోలులో ఉంచుకోవాలనే దురాశే ప్రాథమిక కారణం. హాబ్సన్ లాగానే లియన్ త్యోవ్

కూడా - పెట్టుబడి, పారిశ్రామిక సరుకుల మార్కెట్ల వెతుకులాట వంటి అప్రధాన కారణాలే సామ్రాజ్యవాద కాంక్షకు కారణాలుగా వ్రాశాడు. అన్నిటికన్నా అతి ప్రధానమయిన కారణం - ముడి సరుకులు, వాటి ఉత్పత్తి దారుల కొరకు వేట -దీనికి తోడు పారిశ్రామిక తయారీలకు, పెట్టుబడులకు, నిరుద్యోగులయిన వృత్తి జీవుల మార్కెట్లకై వెంపర్లాడటం, హాబ్సన్ చెప్పినట్లు వీటన్నిటి సారాంశంగా - ప్రపంచ జనాభాలో సగంమంది, క్రుంగి అణగారిపోయిన మిగతా సగం జనాభాపై బడితిని కొన్వెక్కుతున్నారు.

**బ్రెయిల్స్ ఫోర్డ్** (Brails Ford):- సామ్రాజ్యవాదం ఏమంత లాభసాటి కాదు అనే ఛాతమ్‌హౌస్ పెద్దల అభిప్రాయం గురించి బ్రెయిల్స్‌ఫోర్డు అభిప్రాయం చూద్దాం.

పెద్ద దేశాల కలవారి లేనివారి మధ్యవున్న అసమానత్వం ఆధునిక జీవితంలో ప్రధానమయిన అంశం. ఈ వ్యత్యాసం ఎందువలన ప్రధానమయినదో పరిశీలిద్దాం. ఒకటి - వారి దౌత్యంలో సామ్రాజ్యవాదం కలవారికి ఆధిక్యతా ప్రాధాన్యతలను కల్పిస్తుంది. రెండు - సామ్రాజ్యవాదంలో వివిధ మార్గాలలో వచ్చిపడే ఆదాయాలుగాక తరగిపోని సంపద వనరుల ఏర్పాటు ఉంటుంది. మూడు - ప్రాధాన్యత కలిగిన, పరిమితమయిన పట్టణ పారిశ్రామిక మార్కెట్లనుండి, ముడిసరుకుల పెట్టుబడుల ద్వారా కాక వచ్చే ఇతర ఆదాయాలు, నాలుగు - వారి సమాజంలోని ఉన్నత వర్గాలకు వలసలలో ఉద్యోగాలు కల్పించటం.

'ఆధునిక ఆర్థిక విధానం వలన కలిగిన అవసరాలు దృష్ట్యా ప్రకృతి వనరులను పూర్తిగా వినియోగంలోనికి తేవాలి. అనాగరిక ప్రాంతాల సంస్కృతి, సహజ వనరులపై దాడి చేయక తప్పదు'. ఆఫ్రికా నీగ్రోల దోపిడీని సమర్థిస్తూ లార్డ్లుగార్డు చేసిన వ్యాఖ్య యిది.

**బెట్రాండ్ రస్సెల్** (Bertrand Russel) :- 'జాగరూకులుగా వుండనట్లయితే తెల్లసమాజం బానిస యజమానులుగా మారుతారు. నీగ్రోలను అణచివేసి వారి దేశాల ఉత్పత్తులను తమ కమ్యూనిష్టు సమాజపు సౌఖ్యానికి గొప్పదనానికి పంచి పెడతారు.'

**జవహర్‌లాల్ నెహ్రూ** (Nehru):- ఆసియాలో వలస సమస్యలకు పరిష్కారం వలసవాదాన్ని, సామ్రాజ్యాన్ని అంతం చేస్తే గాని దొరకదు. యుద్ధ నివారణకు ఇది ఒకటే ప్రత్యామ్నాయం. సామ్రాజ్యవాద యంత్రాంగాన్ని పూర్తిగా దగ్ధం చేసే వరకు ఆసియాలో వెలిగించబడిన స్వేచ్ఛా జ్యోతి జ్వలిస్తూనే ఉంటుంది.

**రంగుజాతుల వారికి స్వాతంత్ర్యం ప్రకటించండి:-** వలస, రంగు జాతుల ఫ్రీడం ఫ్రంటు వలస ప్రజలందరకూ స్వేచ్ఛ, అణచివేతనుండి విముక్తి కావాలని డిమాండు చేస్తోంది. వీరిలో చాలామంది వెంటనే ప్రభుత్వాలు ఏర్పాటు చేసుకోలేక పోవచ్చును సమర్ధవంతంగా ప్రభుత్వాలు నడపలేక పోవచ్చు. అది సాకుగా వీరి ప్రభుత్వాలపై అజమాయిషీ ప్రభుత్వాలను ఏర్పాటు చేయటం సమంజసం కాదు. వారి జాతీయ స్వాతంత్ర్యాన్ని గుర్తించిన తరువాత వారికి ఏవిధమయిన ప్రభుత్వం అవసరమో అది ఐక్యరాజ్యసమితి ద్వారా పరిష్కరించవచ్చు. ఇటువంటి అంతర్జాతీయ మార్గదర్శకత్వంతో ఏర్పాటు చేయబడిన ప్రభుత్వాలు, ప్రస్తుత వలస ప్రభుత్వాలకు భిన్నంగా వుంటవి.'

**ఆర్థిక ప్రక్షాళన :-** ఈ విధమయిన అంతర్జాతీయ ప్రభుత్వంలో వలస ప్రజలు వారి కాళ్ళపై వారు నిలబడాలంటే, గతంలో వారి నుండి జప్తు చేసిన, దీర్ఘకాలిక కవుళ్ళకు తీసుకొన్న భూములను ముందుగా వలస ప్రజలకు స్వాధీనం చేయాలి. ప్రజలకు, దేశాలలోగల సహజ వనరులకు రక్షణ కల్పించాలి. అవసరమయితే కంపెనీలపై పన్నులు రద్దు చేయాలి. గనులు మూసి వేయాలి.

వారి (వలసల - ఆఫ్రికన్ల - తెగల) సాంప్రదాయాలతో సహజీవనం చేయ గలిగిన ప్రణాళికాబద్ధమయిన అభివృద్ధిని, వారి శక్తి సామర్ధ్యాలు గుర్తించి వారికి అందించాలి. ఐక్యరాజ్య సమితి వీరిశ్రమను సమర్ధవంతమయిన యాజమాన్యాల్ని అభివృద్ధిపరచటానికి - సంపూర్ణాభివృద్ధికి ఆర్థిక, సాంకేతిక సహాయాలందించాలి. విద్యాభివృద్ధి సత్వరం సాధించాలి.

రవాణా సౌకర్యాలకు, ప్రక్రియా పరిశ్రమలకు (Processing) ఇతర పరిశ్రమలకు నీటి పారుదలకు, వరద నివారణకు, జల విద్యుత్ కేంద్రాలకు, ప్రజా రోగ్యానికి, పారిశుద్ధ్యానికి కావలసిన పెట్టుబడిని ఒకటి రెండు దేశాల నుండి కాక 'అంతర్జాతీయ అభివృద్ధినిధి అంటే సన్‌ఫెడ్ నుండి ఋణంగా పొందాలి.

ప్రతి వలసా విముక్తి చెందాలి. విముక్తి చెందిన వలసలకన్నింటికీ ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం వెంటనే కల్పించాలి. సూడాను విముక్తి పొందిన వెంటనే ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం ఇవ్వటం ఆరోగ్యకరమయిన సాంప్రదాయం.

**సామాజిక సేవాదళాల ఏర్పాటు** (Constitute Social Services Corps) : - ప్రాథమిక దశలో ప్రభుత్వాన్ని సమర్ధవంతంగా నడిపించటానికి, ప్రభుత్వోద్యోగులను,

ఇంజనీర్లను, శాస్త్రజ్ఞులను, సామాజిక సంస్థల నుండి ఎంపిక చేసుకోవాలి. వీటిని (ఐ.రా.స.) U.N.O. ఏర్పాటు చేయాలి. వారి పదవీకాలం పది సంవత్సరాలు. అవసరమయితే మరొక ఐదునుండి పది సంవత్సరాల వరకూ పొడిగించటం మాత్రమే చేయాలి. ఈ విదేశీ శాస్త్రజ్ఞులు పదవీ విరమణ చేసేలోగా స్థానికులకు తర్ఫీదు నిచ్చి, ఖాళీలలో నియమించాలి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాదశక్తుల బలహీనత, కోల్డ్‌వార్ (Cold War) ల పుణ్యమాని చాలా వలస దేశాలు, స్వపరిపాలనగానీ, స్వతంత్ర్యంగానీ సంపాదించుకున్నయ్. ఫ్రెంచి కాలనీలు, బ్రిటీషు కాలనీలు (ఇండియా మొ॥) స్వాతంత్ర్యం సంపాదించుకొన్నయ్. ఆఫ్రికా వారికి ఈ దేశాలు మార్గదర్శకం కావాలి. ఆసియా ఖండంలో చాలా వలసలు స్వాతంత్ర్యాన్నార్జించినయ్. చైనాదేశం అమెరికాకు దీటుగా బలమయిన కమ్యూనిష్టు శక్తిగా ఎదిగింది. ఆఫ్రో ఆసియన్ - బాండుంగు కాన్ఫరెన్సు - సామ్రాజ్యవాదానికి చావుగంట మోగించింది. కాబట్టి పారతంత్ర్యంలో వున్న ఇతర వలసదేశాల స్వరాజ్య సంపాదన వారి చేతుల్లోనే వుంది. సామ్రాజ్యవాద భృత్యులనుండీ, యజమానులనుండీ ఏ సహాయం ఆశించలేము. ఏకపక్ష, బహుపక్ష పాలనా విధానాలు, ఒప్పందాలు ఆయాదేశాల స్వతంత్ర సంపాదనను వాయిదా వేస్తాయి. దరిద్రాన్ని త్వరగా పెంచుతయ్. వారు రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాలను సంపాదించుకోనట్లయితే, ఆదేశాల వ్యవసాయ జనాభాను కాపిటలిస్టులు అన్యాయం చేస్తారు.

ఇదే సమయంలో వ్యవసాయ ప్రాధాన్య దేశాలు సోవియట్ సామ్రాజ్యవాదంలో చిక్కుపడకూడదు. సాంప్రదాయక సామ్రాజ్యవాదులు వారికన్నా ఎక్కువగా సోవియట్ సామ్రాజ్యవాదులు - వ్యవసాయదారుల అణచివేతకు కంకణం కట్టుకొన్నారు. స్వతంత్ర రైతులను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులను దయారహితంగా దోపిడీ చేయటానికి వారి అంతరాత్మ అడ్డుచెప్పదు. అందువలననే వీరి గురించి 1955 బాండుంగ్ సమావేశం హెచ్చరించ వలసి వచ్చింది. సాంప్రదాయిక సామ్రాజ్యవాదం బీటలువారిపోయింది. నూతన సోవియట్ సామ్రాజ్యవాదాన్ని కాలూననీయరాదు.

కాపిటలిస్టు - కమ్యూనిష్టు సామ్రాజ్యవాదాలకు ప్రపంచంలో నిలువనీడ కల్పించకూడదనే చారిత్రక సత్యం మనముందుంది.

# ప్రపంచ విపణులు

(World Markets)

పెట్టుబడి దారీ వ్యవస్థ పుట్టుక, అభివృద్ధి తద్వారా వచ్చిన పారిశ్రామికీకరణ, ఆధునికవాణిజ్యం వ్యవసాయరంగాన్ని ఆధిక్యతాపీఠం నుండి పరాధీనతకు దిగజార్చింది. 'వ్యవసాయ రంగం అధఃపాతాళం వైపు పయనిస్తున్నది. కనుక "వ్యవసాయ దారులను పట్టణాలకు పారిశ్రామికులుగా వలస వచ్చేటట్లు ప్రోత్సహించాలి" అని కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు రాతలు రాశారు. (Prof. Harrod - Cambridge), (Prof. Black - U.S.A. - International Economics) వివిధ పరిశ్రమలు, వాణిజ్యాలు లాభసాటి వ్యవసాయంపై ఆధారపడి స్థాపించబడి అభివృద్ధి చెంది లాభాలనార్జించినవే.

పారిశ్రామికీకరణకు పూర్వరంగంలో, గ్రామీణ కామన్వెల్తులు ఉచ్ఛదశలో నున్నప్పుడు, వ్యవసాయరంగంపై ఆధారపడి స్థాపించబడి అభివృద్ధిచెంది లాభాలనార్జించిన పరిశ్రమలు, వాణిజ్యం నేడు వ్యవసాయరంగాన్ని నియంత్రిస్తున్నయ్. ఏయే పంటలు పండించాలి. ఎంత మేరకు పండించాలి, అనుసరించవలసిన వ్యవసాయ పద్ధతులేవి, ఒకే పంటా, వివిధ పంటలా, మిశ్రమ వ్యవసాయమా అనే ప్రణాళికలను తయారు చేసి, పెద్ద భూకమతాల, చిన్న వ్యవసాయక్షేత్రాల శ్రామిక శక్తి ఎంత, ఎటువంటిదై వుండాలి, ఉద్యోగవసతి ఏయే సీజన్లలో కల్పించాలి, ఎప్పుడు అవసరం లేదు, ఏ విధమయిన ఋణ సౌకర్యం అందించాలి, అమ్మకాలు ఏ మార్కెట్లలో జరపాలి. రవాణా సౌకర్యాలేమిటి - వీటినన్నిటినీ నిర్దేశించే స్థాయికి ఎదిగినయ్. పరిశ్రమలు వ్యవసాయంపై పెత్తందారీ తనం సాగిస్తూ స్వయం సంపూర్ణత సాధించిన గ్రామీణ ప్రజల జీవన విధానాన్ని ఛిన్నా భిన్నం చేశాయి.

అభివృద్ధి చెందిన నేటి రవాణా సౌకర్యాలు, రైళ్ళు, మోటార్లు, స్టీమర్లు, విమానాలు మొదలయిన యంత్రాలు - టెలిగ్రాఫ్, కేబుల్, టెలిఫోను, ట్రంక్ టెలిఫోన్లు - వ్యవ సాయరంగంపై పెట్టబడిదారీ వ్యవస్థ చేసే దాడికి నూతనంగా లభ్యమయిన ఉప కరణాలయ్యాయ్. ఈ ఆధునిక రవాణాలు పెట్టుబడిదారుల మానస పుత్రికలు. ఇవి పెట్టుబడి దారులకు దాస్యం చేస్తూ వారికి వ్యవసాయ రంగం. ఇతర వ్యవసాయాధారిత రంగాలపై గుత్తాధిపత్యం కట్టబెట్టినయ్. ఆధునిక బాంకింక్ విధానం - సాంప్రదాయక గ్రామీణ ఆర్థిక రంగాలపై దాని ఆధిపత్యం, ఆధునిక ఉత్పత్తులు వాణిజ్యం అన్ని కలసి, వ్యవసాయరంగాన్ని దిగజార్చి, వ్యవసాయఆర్థికత్వాన్ని అప్పుడప్పుడు చావుదెబ్బ తీయ టానికి, బలహీనపడిన వ్యవసాయరంగం నుండి బలిసిన వ్యాపార సంస్థలకు కొత్త నెత్తురు (ఆర్థిక పుష్టి) ను ఎక్కించటానికి, కరెన్సీ చలామణిని తమకు అనుకూలంగా మలుచు కొంటున్నయ్.

ప్రాథమికంగా ముడి పదార్థాల కొరకు ప్రపంచ విపణులు ఏర్పాటు జరిగి వుండకపోయినట్లయితే, పైన చెప్పిన పెట్టుబడిదారీ ఉపకరణాలన్నీ నిరర్థకమయ్యేవి. ఈ ప్రపంచ మార్కెట్ల ద్వారానే, ప్రతి దేశపు రైతు ఇష్టంగానో, అయిష్టంగానో వత్తిడులకు లోనయ్యో, అన్ని వస్తువులతో పాటు తన వ్యవసాయ ఉత్పత్తులను పెట్టుబడి దారీ రాజ్యాలకు సరఫరా చేస్తున్నాడు. ఉష్ణ దేశాలలో లభ్యమయ్యే ధాన్యం, గోధుమలు, మొక్క జొన్న, ప్రత్తి, సిల్కు, రేయాను, ఉన్ని, జూటు, కాఫీ, కోకో, టీ, రబ్బరు, తగరం, నూనెలు, చెరుకు, బీట్‌రూట్, నూనె గింజలను అతి చౌకగా వేగంగా నిక్కచ్చిగా లక్ష్యం జేర్చే రవాణా సాధనాలను నమ్ముకొనే, ఆధారపడే, యూరప్ దేశాలు, అమెరికా, జపాన్లు విదేశాలలో లభ్యమయ్యే ముడి సరుకులతో పరిశ్రమలు స్థాపించి, ప్రపంచ వాణిజ్య రంగంలో లాభాలు కొల్లగొట్టున్నయ్. వ్యవసాయ ఉత్పత్తి ఈ విధంగా నిరాటంకంగా ప్రపంచ పరిశ్రమలకు అందటానికి ప్రపంచ మార్కెట్లు, వాటి లావాదేవీలే ముఖ్య కారణం.

రైతులు ఎప్పుడయితే ఈ విధంగా బలవంతంగా కాపిటలిజంలోకి నెట్టబడ్డారో, వారి ఆర్థిక విధానం, అవకాశాలు కాపిటలిజానికి అనుకూలంగా మలచబడినవో, సహజంగా తమకు కావలసిన సౌకర్యాలు, సేవలను అందించే యంత్రాంగంపై వ్యవసాయ దారులు తమ దృష్టిని మరల్చవలసి వస్తుంది. కనుక వారు - తమకు వడ్డీ వ్యాపారులు, బాంకులు తగినంత ఆర్థిక సాయం సహేతుకమయిన స్వల్ప వడ్డీకి అందజేయటం లేదని, రైళ్ళపై, రోడ్లపై కాలువలపై జరిగే రవాణా సౌకర్యాలు సక్రమంగా లేవని, రవాణా

ఖర్చులు చాలా ఎక్కువగా వున్నాయని, ఉత్పత్తులు అమ్ముకోవటానికి తగిన సంఖ్యలో మార్కెట్లు లేవని, వున్నవి కూడా మూతపడినాయని, అమ్మకాలలో, తూనికలలో కొలతలలో ఎన్నో అవకతవకలు కల్తీలు జరుగుతున్నాయని, దిగుమతి సాధనాలు తగు సంఖ్యలోలేవని, అవసరమైన చిన్న చిన్న గోడవునులు లేవని, ఉత్పత్తుల గ్రేడింగుకు, ఆరబెట్టుకోవటానికి వసతులు కరువని, కోల్డ్‌స్టోరేజీలు (శీతల గిడ్డంగుల) లేవని - వీటి అద్దెలు, ఎగుమతి దిగుమతి సుంకాలు తమకు అందుబాటులో వుండాలని ప్రశ్నించటం (రైతులు) తమ హక్కుగా భావిస్తున్నారు. కాపిటలిజం వ్యవసాయాని కవసరమయిన కీలక సేవల నన్నింటినీ తన గుప్పెట్లో పెట్టుకొని, జలగలాగా రైతుల రక్తాన్ని నెప్పినే మాత్రము తెలియనీయకుండా పీలుస్తున్నది. వ్యవసాయం ఈ విధంగా పెట్టుబడిదారీ వ్యవస్థకు పాదాక్రాంతం కావటానికి మాధ్యమికంగా, బ్రోకరుగా ఈ ప్రపంచ విపణులుప యోగ పడ్తున్నయ్.

అన్ని వర్గాలకు సమానంగా సేవలందించాల్సిన (సైద్ధాంతికంగా) ఈ మార్కెట్లు రైతులకు నష్టదాయకంగా రూపు దిద్దుకొన్నయ్. మార్కెట్లలో లావాదేవీలు జరిపే వ్యాపారులకు వినియోగదారులకు ఏజెంట్లుగా వ్యవహరిస్తున్నయ్. (అనగా వస్తువుల తయారీదారుల నుండి గృహిణుల వరకు) ఉత్పత్తులు, (ముడి సరుకుల ఉత్పత్తి) ఉత్పత్తిదారులందరిపై మార్కెట్ల, వ్యాపారుల ప్రభావం ఒకే విధంగా వుండదు. అధిక లాభంతీసి, ఆ లాభం తమకు వాణిజ్య వర్గాలకు, వినియోగదారులకు అందించటం మార్కెట్లలో లభ్యమయ్యే సరుకుల వర్గీకరణను బట్టి వుంటుంది.

మార్షెలియన్ ఆర్థిక శాస్త్రవేత్తలు మార్కెట్లలోనికి వచ్చే సరుకులను, సర్వీసులను మూడు వర్గాలుగా - ఎ. క్లాసు, బి. క్లాసు, సి. క్లాసులుగా విభజించారు.

A క్లాసు గూడ్సు :- ఒకే రకపు సరుకులు (ఉదా: ధాన్యం వగైరాలు) విదేశీ వాణిజ్యానికి అనువయినవి, అవసరమయినవి, ముఖ్యంగా ముడిసరుకులు ఆహార పంటలు వగైరాలు.

B క్లాసు గూడ్సు :- ముడి పదార్థాల ఉత్పత్తిలో ఎక్కువ శ్రమ వినియోగించ బడేవి. అంటే కొన్ని రకాల వర్తక వాణిజ్యాలలో మాత్రమే డిమాండు కలిగినవి.

C క్లాసు గూడ్సు :- ఇళ్ళు, కదిలించటానికి (బదలాయించటానికి) వీలుపడని పారిశ్రామిక సంస్థలు, రైళ్ళు ఇతర ప్రజోపకర ఉపకరణాలు ఇవి అంతర్జాతీయ వ్యాపారాల్లో కాలుబెట్టలేనివి.

రెండో పక్షాన విచారిస్తే - ఉత్పత్తులకు అవసరమయ్యే వివిధ విభాగాలు - లేక వ్యవసాయ పెట్టుబడులు, వ్యావసాయిక పరికరాలు, పశువుల దాణాలు, పారిశ్రామిక వాణిజ్య ఉత్పత్తులయిన కిరోసిన్ వంటివాటికి - ఒకే విధమయిన ధర ప్రపంచ వ్యాప్తంగా లేదు. (World Price) (International Economics - P - 80) ఈ వరల్డ్ ప్రైస్ లేకపోవటానికి కారణం కీలక సేవలు.

'శ్రామికులు ఐక్యంగా వారి శ్రమకు తగిన ప్రతిఫలాన్ని తగిన సమయంలో డిమాండు చేయనట్లయితే (వ్యవసాయ దారులు - కీలక సేవలు) కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఆయా దేశాల ఉత్పాదక శక్తితో పోల్చి చూస్తే శ్రామికుల (Prolitariat) ప్రతిఫలం అత్యల్పంగా వుంటుంది. ఈ ప్రత్యేక పరిస్థితులలో (అనగా వ్యవసాయానికి కీలక సేవలకు ఉన్న వైరుధ్యం వలన) యాజమాన్యం దోపిడీకి శ్రామికులు గురౌతారు. ఈ కీలక సేవల గుత్తాధిపత్యానికి లోబడతారు. ముఖ్యంగా అరక్షిత వ్యవసాయ రంగం - రక్షిత ప్రపంచ విపణులలో ప్రవేశించవలసి రావటం వలన - తమకు అత్యావశ్యకమయిన కీలక సేవా విభాగాల చెప్పుచేతల్లో వుండవలసి వస్తున్నది. ఇది సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల ఆలోచనకు అనుగుణంగానే వుంది.

A క్లాసు గూడ్సుపై ప్రపంచ విపణుల అధికారం నిరంకుశమయినది. ఈ సరుకులన్నీ ప్రపంచ విపణులలో అమ్మబడవలసినవే. రవాణా ఖర్చులు, ఇతర ఖర్చులు తీసివేస్తే వీటి ధర ప్రపంచ విపణులన్నింటిలో ఒకే రకంగా వుంటుంది. కనుక ఈ గూడ్సు అంతా ఒకే ఒక్క మార్కెటులో అమ్మబడినట్లు భావించాలి.

**ఉదాహరణకు** :- రబ్బరు, టీ తదితర ఆహార పదార్థాల ధరలు ఒక మార్కెటు నుండి వేరొక మార్కెటుకు టెలిఫోను ద్వారా (కీలక సర్వీసులు) క్షణాల మీద తెలియచేయ బడతాయి. లండను మార్కెటులో ఒక ఔన్సు వెండి ధరకు - న్యూయార్కు మార్కెటుకు స్వల్ప వ్యత్యాసముంటే - ఈ విషయం టెలిఫోను ద్వారా వెంటనే న్యూయార్కుకు తెలుస్తుంది. వెండి ధరేకాక ఆ విలువకు సమానమయిన బంగారపు ధరకూడా సవరించ బడుతుంది. ఈ రకపు సరుకులు కీలక విభాగాల సౌకర్యాల వలన అంతర్జాతీయ లేక ప్రపంచ విపణుల గుత్తాధిపత్యానికి లోబడి వుంటాయి.

B క్లాస్ గూడ్సులపై :- ఈ విధమైన సంపూర్ణాధిపత్యం ప్రపంచ విపణులకు కష్టం. ఈ సరుకులు వాటి నైజంలో, తయారీ నేర్పరితనంలో, నాణ్యతలో విభేదిస్తాయి. అవి తయారయ్యే ప్రదేశాలకు అనుగుణంగా వుంటాయి. కనుక వీటికి ప్రపంచ వ్యాప్తంగా

గిరాకీ వుండదు. కొన్ని మార్కెట్లలో మాత్రమే ప్రత్యేకంగా బేరసారాలు జరుగుతాయి. ఒకే విధమైన అంతర్జాతీయ ధరలను ఈ సరుకులకు నిర్ణయించే ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ - బి క్లాస్ గూడ్సుకు వివిధ దేశాల్లో వివిధ ధరలు నిర్ణయించబడక తప్పటంలేదు.

C క్లాస్ గూడ్సుకు :- అంతర్జాతీయ సామాన్య విలువ వుండదు. వీటి ధరలు ఆయా దేశాల్లోని ఎ. క్లాస్ - బి. క్లాస్, గూడ్సు ధరలకు సంబంధితాలు.

అందువలన 'ఎ' క్లాస్ గూడ్సు అంతర్జాతీయ పోటీకి లోబడి వుంటాయి. బి క్లాస్ గూడ్సుపై పాక్షిక ఆధిపత్యం వుంటుంది. సి క్లాస్ గూడ్సు ప్రపంచ విపణులలోనికి రావు కనుక ప్రపంచ విపణుల ఆధిపత్యం వీటిపై వుండదు. ఉత్పత్తి దారుల అనైక్యతవలన, (Unorganised Sector) అమ్మకాలు ఆర్గనైజ్డ్ మార్కెట్‌లో అవటంవలన ప్రపంచ విపణుల్లో గిరాకీ వున్నప్పటికీ ప్రపంచ విపణుల కుమ్మక్కువలన ఎ క్లాస్ గూడ్సు ధరలు ఎప్పుడూ తగ్గుముఖంగానే పయనిస్తాయి. Mr. Harrod (హారోడ్) వంటి పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలు ఈ విషయం గమనించకపోవటం దురదృష్టకరం. రైతుల నిస్సహాయత, అనైక్యతల వలన పెట్టుబడిదార్ల ఐక్యతా బలంతోనే కాక డిమాండుతో పోటీపడి, వ్యవసాయ ఉత్పత్తులు పెరగజాలవనే సత్యాన్ని వారు విస్మరించారు.

మార్షెలియన్ ఆర్థిక శాస్త్రవేత్తలు, బి. క్లాస్ గూడ్సు మార్కెటు ధరలు వాటి ఉత్పత్తి ధరలకన్నా అధికంగా వుంటున్నవని భావించారు. ఉత్పత్తిదార్ల మధ్య పోటీ లేనందువలన, అవసరానికనుగుణంగా వస్తువుల తయారీని ఉత్పత్తిదార్లు మలుచు కోగలరు కనుక ఇది సాధ్యమౌతుంది. 'సి' క్లాస్ గూడ్సు ప్రపంచ విపణుల్లోకి ప్రవేశించవు. దేశంలోని ఈ వస్తువుల వినియోగదార్ల అనైక్యత వలన సి క్లాస్ గూడ్సు ఉత్పత్తిదారులు ఎప్పుడూ పై చేయిగానే వుంటారు.

వ్యవసాయిక దేశాలు ఆదాయం కొరకు తమ ఉత్పత్తులను (ఎ క్లాసు గూడ్సు) ప్రపంచ విపణుల్లో అమ్మవలసి రావటం వలన పారిశ్రామిక దేశాలతో పోటీలో వెనుక బడుతున్నయ్. పారిశ్రామిక దేశాలు అంతర్జాతీయ మార్కెట్ల ద్వారా వ్యవసాయ ఉత్పత్తుల ధరలను దెబ్బతీసి, లాభం పొంది, స్వల్ప ధరకు తాము ఆహార పదార్థాలను సంపాదించుకో గలుగుతున్నయ్. వ్యవసాయదారులు తమకు అవసరమయిన పాక్షిక రక్షణ కలిగిన (బి క్లాస్), సంపూర్ణ రక్షణ గలిగిన (సి క్లాస్) వాటికి అధిక ధరలు చెల్లించవలసి వస్తున్నది.

డిమాండు యొక్క సాపేక్ష ఆవశ్యకత, అనావశ్యకతలను, బేరసారాల్లో పాల్గొనే విభిన్న వర్గాల శక్తి, వారి ఆర్థిక బలాలను మరలా పరిశీలిద్దాం.

వ్యవసాయదారుల అధిక సంఖ్య, వారి అనైక్యత వారిపై ప్రభుత్వాల చిన్న చూపు, కీలక సేవల దాడి, పారిశ్రామిక దేశాలకు వాణిజ్యానికి, తయారీదారులకు దాసోహం చేసే స్వార్థ శక్తులు ప్రపంచ వ్యాప్తంగా మనకు కన్పిస్తాయి. వ్యవసాయదారులు తమ అవసరాల వత్తిడివలన, తమకు సరియైన ధర వస్తుందన్న ఆశతో ప్రపంచ విపణులకు పరుగెత్తటం, ప్రపంచ వ్యాప్తంగా కాకపోయినా, తమ దేశంలో తమ రాష్ట్రాల్లోకూడా వారు సంఘటితంగా లేకపోవటం కారణంగా బలమైన పెట్టుబడిదారీ వర్గాలతో జాతీయ, అంతర్జాతీయ మార్కెట్లలో బేరసారాల్లో పోటీపడలేకపోతున్నారు. పెట్టుబడిదార్లు మార్కెట్లో వ్యవసాయదారులను చేసే దోపిడీ వారికేగాక బజారులోని సామాన్య వినియోగదారులకు కూడా లాభసాటి అవుతున్నది. వత్తిళ్ళకు లోనై చేసే వ్యవసాయం వలన (Agriculture under duress) వీరు తమలో తాము ఆత్మహత్యా సదృశ్యమయిన పోటీపడి ఉత్పత్తులు చేస్తారు. "ఉత్పత్తిదారులు తమకు ఏది నిజమయిన లాభమో గుర్తించలేరు", అనే నిజాన్ని వ్యవసాయదారులు ఇతర ఉత్పత్తిదారులకన్నా ఎక్కువగా 'నిజం' అని నిరూపిస్తారు. అందువలన పెద్దగా పెట్టుబడిదారుల ప్రభావంలేని పరిస్థితులలో కూడా ఈ అసంఘటిత రైతాంగపు వ్యవసాయ ఉత్పత్తుల ధరలు వాటంతటవే తగ్గు ముఖం పడ్తాయి. ఈ పరిణామాలకు కీలకసేవలు (Key services) స్వార్థపరశక్తులు తోడ్పడతాయి.

'ఉత్పత్తిదారుల విశృంఖలమైన పోటీ వినియోగదారుల పాలిట వరమౌతుంది' అని సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల ఉవాచలను వ్యవసాయం ఋజువుచేసి, వారి కష్టనష్టాలకు, అణచివేతకు కారణమవుతున్నది.

పారిశ్రామిక ఉత్పత్తులకిది అన్వయించదు. ఆ ఉత్పత్తులు వత్తిళ్ళకులోనై చేసేవి కావు. (Production not under duress) పరిశ్రమల యాజమాన్యానికి బాధాకర మయిన ఆదాయపు పన్నుకూడా వారి నికర లాభాలమీదే విధించటం జరుగుతున్నది. బాంకులు వీరి భాగస్వాములు, కీలక సేవలు (Key Services) ఇతర స్వార్థపర శక్తులు పారిశ్రామిక వేత్తలకు దాస్యం చేస్తూ, పెట్టుబడి దారుల శక్తియుక్తులకు, నిస్సహాయులయిన వారిపై వారు విసిరే పంజా గోళ్ళకు పదును పెడుతున్నయ్. వీరి సన్నిహిత కలయిక వలన - తయారీదారుల (Manufactures) మధ్యపోటీ నివారించబడుతున్నది. ధరలు నియంత్రించ బడుతున్నయ్. ఉత్పత్తులను కనుమరుగుచేయటం జరుగుతున్నది.

మార్కెట్లలోనికి మాన్యుఫాక్చరయిన వస్తువుల సరఫరాను తమ కనుకూలంగా క్రమబద్ధీకరించటం, తద్వారా మాన్యుఫాక్చర్డ్ గూడ్సుకు ఎల్లప్పుడూ డిమాండు కల్పించటం - సమర్థవంతంగా జరుగుతున్నది. సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తలు కాపిటలిజాన్ని ఒకవైపు నిరసిస్తున్నట్లు మాట్లాడుతూ - నిజమైన ఏ విధమైన లొసుగులు లేని గుత్తాధిపత్యం అసాధ్యమని మరొకవైపు ప్రవచిస్తున్నప్పటికీ (No Fool Proof Monopoly) ఆచరణలో బలమయిన కొన్ని శక్తులు తమ తమ దేశాలలో ఈ వ్యాపారుల గుత్తాధిపత్యానికి కొమ్ముకాస్తున్నవనేది సత్యం.

వ్యవసాయ ఉత్పత్తులను ప్రప్రథమంగా కొనుగోలు చేసేది మాన్యుఫాక్చరర్లు. ఈ మాన్యుఫాక్చరర్ల వీరి ఏజంట్ల బేరసారాల శక్తి చాలా అధికం. యాంత్రికంగా తయారయిన వస్తువులను డిమాండు చేసేది అసంఘటితమయిన వినియోగదార్లు. రక్షణ లేని, ఐక్యతలేని బీదరైతులు. ప్రభుత్వాలు మాన్యుఫాక్చరర్లకు అండగా వుండి, వినియోగ దార్లకు, రైతులకు ఏ విధమయిన రక్షణ కల్పించటం లేదు. ధాన్యం, ఇతర ఆహార పంటలు పండించే రైతులకు మార్కెట్లలలో (అమ్మకాలలో) వారి వారి మధ్యే విపరీత మయిన పోటీ వుంది. మాన్యుఫాక్చరయిన సరుకుల మధ్య పోటీ నివారింప బడుతున్నది. కొన్ని సందర్భాలలో అసలు పోటీయే వుండదు. వ్యవసాయ ఉత్పత్తులకు ఒకే విధమయిన, నిర్దిష్టమయిన జాతీయ ధరలేదు. (దేశ వ్యాప్తంగా ఒకే ఉత్పత్తికి వేరు వేరు ధరలుంటున్నవి). అంతర్జాతీయ ధరలే జాతీయ స్థాయిలో కూడా ధరలను నిర్ణయిస్తాయి. మాన్యుఫాక్చర్డ్ గూడ్సుకు అన్నింటికి కాకపోయినా చాలా ఎక్కువ రకాలకు, వాటి తయారీలోని వైవిధ్యం వలన, ప్రత్యేకత వలన, పేటెంటు హక్కులవలన జాతీయ ధర (దేశస్థాయి) లే మార్కెట్లను పరిపాలిస్తాయి. వ్యవసాయ ఉత్పత్తులకు స్థిరమైన ధరలను ప్రభుత్వాలు కల్పించవు. వ్యవసాయ ఉత్పత్తుల కొనుగోళ్ళలో మాన్యుఫ్యాక్చరయిన వస్తువుల విక్రయాలలో మార్కెట్లు మాన్యుఫాక్చరర్స్‌కు పూర్తిగా సహకరిస్తాయి. అందువలన వ్యవసాయ రంగం ప్రపంచ విపణుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి దోపిడీ చేయబడుతున్నది. వలస దేశాలు ఎక్కువగా వ్యవసాయాధారితాలు. సామ్రాజ్య వాదుల అధీనంలో వున్న ఈ వలస దేశాల్లో వ్యవసాయిక ధరలు మరీ తక్కువగా వుంటున్నయ్. తాత్కాలికమయిన పెరుగుదల ధరల్లో కనిపిస్తే, సామ్రాజ్యవాద శక్తులు, వారి తాబేదార్లయిన వ్యాపారులు పెరిగిన ధరల లాభాన్ని పాక్షికంగా గానీ, పూర్తిగా గానీ రైతుల నోటికందనివ్వటంలేదు.

వలస దేశాల్లో సామ్రాజ్యవాదులు వర్తక వాణిజ్యాలపై. సంపూర్ణాధిపత్యం

చలాయిస్తున్నారు. సామ్రాజ్యవాదుల వాణిజ్య సహకార సమితులలోనూ (Zollvereins), వారి కరెన్సీలోనూ బలవంతపు భాగస్వామ్యం వలన అక్కడి వ్యవసాయదారులు వారి ఉత్పత్తుల అమ్మకాలు, కొనుగోళ్ళలో రెండు విధాలుగా నష్టపోతున్నారు. తమ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు పొందలేక పోతున్నారు. వారికి కావలసిన మాన్యుఫాక్చర్డ్ గూడ్సును అతిచౌక మార్కెట్లలో కూడా కొనలేకపోతున్నారు. బ్రిటీష్ డొమినియన్‌లతో పోల్చి చూస్తే (Dominion - స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన వలస దేశం) బ్రిటీష్ వలస దేశాలు - భారత దేశం అన్ని విధాలా బలహీనపడివున్నయ్. 'అభివృద్ధికర ప్రతిఫలాలు' (Law of increasing returns) అనే ఆర్థిక సూత్రం ఇక్కడ విఫలమవుతున్నది. (పెరిగిన ఉత్పత్తికి తగిన దామాషాలో లాభాలు పెరగటం - అభివృద్ధికర ప్రతిఫలాలు) స్థానిక పరిశ్రమలు ఉత్పత్తులు ఎంత పెరిగినప్పటికీ, ఆయా దేశాల కందవలసిన ప్రతిఫలం వారికి అందటం లేదు. (Dr. Marshall - Industry and Trade P. 563 - 672) ఆర్.సి. దత్తు కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు.

1930 నుండి కొత్త పరిణామాలు వచ్చాయి. వ్యవసాయ దేశాల పరిస్థితి మరీ దుర్భరంగా వున్నది. పాశ్చాత్య దేశాలు వ్యవసాయంలో స్వయం పరిపూర్ణత సాధించు కొనసాగినయ్. ఇది వారి యుద్ధ తంత్రంలో ఒక భాగం. విదేశీ నిలువలు పెంచుకోవటం కొరకు ఈ పాలసీ అవలంబించాయి. రేయాను, జూటువంటి సింథటిక్ ఉత్పత్తులు వ్యవసాయ ఉత్పత్తులతో పోటీపడ్తున్నయ్. ఈ సింథటిక్ ఉత్పత్తుల వలన వలస దేశాల వ్యవసాయ ఉత్పత్తులకు గిరాకీ తగ్గటం, దీనికి తోడు అప్పటికే ఆదేశాలలోని ఆర్థిక మాంద్యం వలన వ్యవసాయ ఉత్పత్తుల ధరలకు శాశ్వత మాంద్యం కలిగింది. ఈ కారణాలు వ్యవసాయ ఉత్పత్తుల ధరలపై ప్రపంచ విపణుల వినాశకర ప్రభావాన్ని బలోపేతం చేసినయ్.

అనూహ్యంగా పెరిగిన టారిఫ్‌ల వలన బి క్లాస్ గూడ్సు రక్షిత మార్కెట్లు సంపాదించుకోగలిగినయ్. మాన్యుఫాక్చర్డ్ గూడ్సు కొనుగోళ్ళలో వలస దేశాలు రెండవ ప్రపంచ యుద్ధంలో ఎంతో నష్టపోయినప్పటికీ కొన్ని అనుకోని పరిణామాల వలన వారికి కొంత మేలు జరిగింది. ప్రపంచ విపణులలో గతంలో దోపిడీకి గురియగుతున్న 'ఎ క్లాస్ గూడ్సు (యుద్ధావసరాల దృష్ట్యా) 'బి క్లాస్ గూడ్సు' గా మార్కెట్లలో చలామణి అయికొంత రక్షణ సంపాదించుకొన్నయ్. ఇండియా వంటి వ్యవసాయ దేశాలలో రైల్వే ట్రాఫిక్ వలన, వ్యాగన్ల కొరత వలన ఇతర రవాణా సౌకర్యాల లోపం వలన వ్యవసాయ

ఉత్పత్తులు కొన్ని కొన్ని ప్రదేశాలలో రక్షిత 'సి క్లాస్ గూడ్సు' గా అమ్మబడినయ్. ముఖ్యంగా ఆహార పదార్థాలకిది అన్వయిస్తుంది. యుద్ధం వలన ఈ అవకాశాలు వచ్చినా, వ్యాపార వాణిజ్యవర్గాలే లాభాల్లో ముందున్నాయి. భారతదేశపు రైతులకే కాదు ఈ దుర్గతి అమెరికా రైతాంగానికి కూడా పట్టింది.

బడుగు దేశాలు మాన్యుఫాక్చరర్లకు కావలసిన కొన్ని రకాల ముడి సరుకుల ఉత్పత్తిని పెంపొందించటంలో ప్రత్యేకత సంపాదించాయి. అయినప్పటికీ వీరి ఆదాయాలు లాభాదాయకం కాజాలవు. కనుక ఈ ప్రత్యేక ముడిసరుకుల ఉత్పత్తులను వదలిపెట్టి వీరు వివిధ వ్యవసాయాధారిత ఉత్పత్తులను ఆశ్రయించితే వారి ఆదాయాలు వృద్ధి చెందవచ్చు. (Diversification) ఉదా:- వ్యవసాయదారుడు ధాన్యం మాత్రమే కాక, పాడి పరిశ్రమ గొఱ్ఱెల పెంపకం, కూరగాయలు ఇతర వ్యవసాయ ప్రక్రియలు మిశ్రమ పంటలు వగైరా).

రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం వ్యవసాయం ఎదుర్కొన్న అనైతికమయిన, బలాత్కారపు దయారహిత పక్షపాతపూరిత అంతర్జాతీయ పోటీని, దాని దుష్పరిణామాలను మానవత్వం వున్న వాడెవడు కోరడు. వివక్షతతో కూడిన రవాణా ఛార్జీలు, కస్టమ్స్ డ్యూటీలు, జాతీయ ద్రవ్య చలామణీ విధానాలున్న నేటి పరిస్థితులలో అంతర్జాతీయ విపణులను గురించి మాట్లాడటం చాలా అసంబద్ధం. ఈ మూడు వర్గాల (ఎ.బి.సి. క్లాస్ గూడ్సు) సరుకుల ధరల స్థిరీకరణను నియంత్రించే పరిస్థితుల పోటీలో సమతౌల్యం సాధించగలిగినపుడు, ఉత్పత్తి ఖర్చులకు - అమ్మకపు ధరలకు మధ్యనున్న అసమాన వ్యత్యాసాలు సామాన్య స్థాయికి చేరనప్పుడు, వీటి పరస్పర మారక సంబంధాలు రక్షిత, అరక్షిత నైజాలు, వివిధోత్పత్తుల ఉత్పత్తి ఖర్చుల అసమానత్వాలు సవరించ బడనప్పుడు - న్యాయబద్ధమయిన అంతర్జాతీయ ద్రవ్య చలామణీ విధానం, విశ్వాస పాత్రమయిన మనీ మార్కెట్లు లేనంత వరకు, వ్యవసాయిక, వ్యాపార వాణిజ్యాల స్వేచ్ఛా ప్రపంచ విపణుల పునరాగమనం - రైతులకు శ్రామికులకు నష్టదాయకం. (యుద్ధ కారణంగా ప్రపంచ విపణుల తమ ఆధిపత్యం పోగొట్టుకొన్నయ్).

మనరైతులు మోసం అణచివేతల బారినపడనప్పుడు, వారి లాభాలకు మెరుగులు దిద్దగలిగినప్పుడు వారి శ్రమకు, వృత్తి సాఫల్యతకు - యాంత్రిక తయారీల - భారీ ఉత్పత్తులలో వాటా దక్కినప్పుడు మాత్రమే మనం ప్రపంచ విపణులను ఆమోదించగలం.

కమ్యూనిస్టు సవాళ్ళ వత్తిడి నెదుర్కోవటానికి పాశ్చాత్యదేశాలు, అమెరికా నాయకత్వాన ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక విధానంతో, సామాజిక భద్రతలను అంతర్జాతీయంగా, విస్తృతంగా, విరివిగా కొన్ని కొన్ని పాశ్చాత్య దేశాలకు, బడుగుదేశాలకు సాంప్రదాయక ధరలు, బదులుకు బదులు తీసుకొనే ఆర్థిక విధానంకు లోబడక సహాయం అందిస్తున్నయ్. ఈ 'రాజకీయ ఆర్థిక సంవిధానాన్ని' (Politico Economic Policy) సంక్షేమ ఆర్థిక విధానాలుగా కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు పేర్కొన్నారు. ఈ విధమైన ఆర్థిక పునరాలోచన (రాజకీయాల ప్రమేయంతో అందించే ఆర్థిక సహాయం) కొంత వరకు ప్రపంచ రైతుల డిమాండయిన - 'ఆదాయవృద్ధి తద్వారా జీవన ప్రమాణాల పెరుగుదల'' డిమాండ్లకు అనుగుణమయనదిగా భావించవచ్చు.

పరిశ్రమలు, వాణిజ్యం ప్రభుత్వాల నుండి ప్రత్యక్షంగా పరోక్షంగా పొందుతున్న భద్రతలను (వాటి రాజకీయ ప్రాబల్యం వారి ఆర్థిక శక్తి, జాతీయ భద్రత - వ్యాపార శైశవావస్థలనే వాదనల ద్వారా) పొందనప్పుడు అవి ఎక్కువ అపకారులు కాజాలవు. రైతుల కెంతో అవసరమయిన ప్రభుత్వ రక్షణ, భద్రతలకు పారిశ్రామిక వేత్తలు అడ్డు తగులుతున్నారు. వ్యవసాయ దారులకు - పెట్టుబడి దారులకు మధ్య సాపేక్షమయిన కొనుగోలు శక్తి, బేరసారాల నియంత్రణల సారూప్యమయిన ఆవిర్భావానికి ఆటంకమవుతున్నారు.

యు.ఎన్.ఓ. దాని అనుబంధ సంస్థల ఆశయాలయిన సాంఘిక న్యాయం వ్యవసాయ దారులకు మృగ్యమయింది.

'కొలంబో ప్లాను, యు.ఎన్.ఓ. సాంకేతిక సహాయము, ఇతర మార్గాల ద్వారా ఆర్థిక సహకారం - ఇవన్నీ ఈ సమస్యయొక్క ఉపరితలాన్ని కూడా స్పర్శించలేదు. అంతర్జాతీయనిధి ద్వారా అన్ని దేశాలు ఆర్థిక సహాయం అందించటం వంటి సమగ్ర ఆర్థిక ప్రణాళికా రచన జరగనట్లయితే వ్యవసాయదేశాలు సోదర దేశాల సరసన నిలువలేవు". (The Parlimentary group for world Govt. July 1955).

వ్యవసాయాభివృద్ధికి విదేశీ పెట్టుబడులు స్వల్పమనీ, ప్రైవేటు రంగానికి అత్యల్పమనీ ఎఫ్.ఏ.ఓ. రివ్యూ అభిప్రాయపడింది.

ప్రపంచ విపణుల పునరాగమనం, కోట్లాది వ్యవసాయదారుల ఆదాయాన్ని గుంజుకోవటం కొరకు పెట్టుబడి దారీ వ్యవస్థచే సృష్టించబడిన వివిధ సాధనాలకూ,

మార్గాలకూ అండదండలు అందిస్తుంది. వ్యవసాయదారుల నుండి దోపిడీ చేసిన సంపదను వ్యాపార వాణిజ్యాల వారికి, వృత్తి జీవులకు (Professionals) వారిపై ఆధారపడిన వారికి పంచటానికి తోడ్పడుతుంది.

రైతులు, శ్రామిక వర్గం రాజకీయ అధికార భాగస్వామ్యం పొందగలిగినప్పుడు ప్రపంచం ఈ సామాజిక దురాగతాల నుండి విముక్తి పొందగలదు. రాజకీయ, ఆర్థిక సార్వభౌమాధికారాలను త్రోసిరాజనినప్పుడు పెట్టుబడి దారీ వ్యవస్థ అంతమయి సామ్య వాద సహకార కామన్‌వెల్తు ఆవిర్భవించగలదు.

ప్రత్యేక పారిశ్రామిక ఆర్థిక విధానం, వ్యవసాయానుబంధంగా వివిధ ఆదాయ మార్గాల అన్వేషణ, వ్యవసాయ ఉత్పత్తుల ధరల స్థిరీకరణ, వ్యవసాయ ఆదాయ నికర వృద్ధి, సహకార రంగంలో వ్యవసాయ ఉత్పత్తుల ప్రాసెసింగ్ పరిశ్రమలు, ప్రభుత్వ అజమాయిషీలో మార్కెట్లు, అభివృద్ధి ఋణాలు, వ్యవసాయదారులకు, చేతి వృత్తుల వారికి వారి సహకార సంఘాలకు ఋణ సౌకర్యం, ప్రకృతి వైపరీత్యాల నష్టాల నుండి ప్రభుత్వాలు ఆదుకోవటం - వంటివి సాధించగలిగినప్పుడు జాతీయ, అంతర్జాతీయ విపణుల మోసం అరికట్టబడుతుంది.

## II

రైతుల స్వేదం నుండి నిరంతరం జాలువారే 'అదనపు విలువ (Surplus Value) ను ఏరంగాలు ఏయే మార్గాల ద్వారా పొందుతున్నవో, రైతులు ఏ విధంగా బీదరికంలోనికి నానాటికి దిగజారుతున్నారో అర్థం చేసుకోగలిగాం. పెట్టుబడిదారీ వ్యవస్థ తన బారిన పడిన వారిని దోచుకోవటానికి ఎప్పుడూ ఒకటి రెండు మార్గాలను సిద్ధం చేసుకొనే వుంటుంది. ఈ కూట మార్గాలను బలహీనులు అర్థం చేసుకొనలేరు. పసికట్ట లేరు. కార్మికుల విషయంలో పారిశ్రామిక వేత్త (Enter prenuer - వ్యవస్థాపకుడు - ఉద్యమదారుడు) లేక ఉత్పత్తిదారుడు, పరిశ్రమకూ వాణిజ్య సంస్థలకూ కాపిటలిస్టు వ్యవస్థకు ప్రతినిధిగా (తలారీగా) కార్మికుల నుండి లభించే అదనపు విలువను దోపిడీ చేస్తాడు. అదనపు విలువను పెట్టుబడి దారీ వ్యవస్థలోని భాగస్తులందరికీ మరలా పంచుతాడు. ఈ తలారీ పాత్రను రైతుల విషయంలో వ్యాపారి మార్కెట్లు పోషిస్తున్నయ్. వినియోగదారులకు, వాణిజ్య వర్గాలకు, వృత్తిజీవులకు ఏవిధంగా కార్మికులతో

(Prolitariat) ప్రత్యక్ష సంబంధం లేదో అదే విధంగా రైతులకు వ్యవస్థాపకునితో (పారిశ్రామికవేత్త) వాణిజ్య సంస్థలతో వృత్తిజీవులలతో, పట్టణ వాసులతో ప్రత్యక్ష సంబంధాలు లేవు. ఈ వర్గాలకు ప్రత్యక్ష సంబంధాలు లేనప్పటికీ రైతులు ఉత్పత్తి చేసే అదనపు విలువలో ఈ వర్గాలు అధికభాగాన్ని పంచుకొంటున్నాయి. కార్మికుల విషయంలో వ్యవస్థాపకుడు లేక ఉద్యమదారుడు వలెనే రైతుల దోపిడీకి వ్యాపారస్తుడు మధ్యవర్తిగా వ్యవహరిస్తున్నాడు. కానీ వ్యాపారినొక్కడినే ఈ దోపిడీకి బాధ్యుడ్ని చేయలేము. కాపిటలిజం ఈ అదనపు విలువను తనలోనికి పీల్చుకోవాలంటే వ్యాపారస్థుడు పారిశ్రామిక వేత్త (Enterprenuer) లనే జలగలు అనివార్యమైనవి.

ఆధునిక పరిశ్రమలు, వాణిజ్యం లాగానే ప్రపంచ విపణులు ఆవిర్భవించి, ఆర్థిక గతిని, అభివృద్ధిని పెట్టుబడి వ్యవస్థ అవసరాలకు అనుగుణంగా రూపొందిస్తున్నయ్. ఇవి ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో పరస్పరం సహకరించుకొంటున్నయ్. నేటి పెట్టుబడిదారీ వర్గాల అభ్యున్నతికి ఈ శక్తులన్నీ కలసి నిర్వహిస్తున్న పాత్రే ప్రధాన కారణం. ఈ అద్భుతమైన కలయికకు ప్రతిఫలమే నేటి కూటికిలేని రైతాంగం, గతిలేని కార్మికులు, బానిసత్వం అనుభవిస్తున్న వలసలు, అణచివేయబడ్డ రంగు జాతులు, 'కార్మికులు వారి కుటుంబాలు. ఊడిగం చేయటానికి, పెట్టబడిదారుకు పెట్టుబడిని పోగుచేయటానికి - వైఫల్యం లేని మార్గం వారి కుదించబడిన శ్రమకాలం (పనిగంటలు) యాంత్రిక ఉత్పత్తి' అని మార్క్సు మహాశయుడు చెప్పినది అక్షర సత్యం. (Capital Vol. 1. P. 434) ప్రపంచ రైతాంగపు ఉత్పత్తి అంతటికీ డిమాండ్ కల్పించటానికి ఉద్దేశించబడిన ప్రపంచ విపణులు (world markets) రైతుల సాధన సంపత్తినంతా కాపటలిస్టుల అధీనం చేస్తున్నయ్. యజమాని, అతని సంస్థ - వర్కరుతో మార్కెటు, వ్యాపారి - రైతులతో ఒకే స్థాయిలో వ్యవహరిస్తున్నట్లు బాహ్య దృష్టికి కన్పిస్తుంది. కాని అది నిజం కాదు.

"కార్మికుడు తన శ్రమ శక్తికి యజమానిగా, ఇతర సరుకుల యజమానుల సరసన బేరసారాలకు వెళ్తాడు. మార్కెటులో బేరం కుదిరిన కాల వ్యవధిలో తాను తన శ్రమకు స్వతంత్ర ప్రతినిధిని కాననీ తన రక్తాన్ని పీలుస్తున్న ప్రాణి, నరాలు, మాంసం, ఎముకలు వాటిలోని మూలిగను ఒక్కబొట్టుకూడా విడవకుండా పీల్చి పిప్పిచేసికాని వదలదని తెలుసుకొంటాడు". ఈ విషయాన్నే ఈ గ్రంథంలోని ఇతర అధ్యాయాల్లో మనం తెలుసుకొన్నాం. రైతులు ఏవిధంగా ప్రపంచ విపణులలో తమ ఇష్టానుసారం అమ్మకాలు చేసే అవకాశాన్ని కోల్పోతున్నారో, లాభదాయకమయిన ధరవచ్చే వరకు

వేచి వుండే అవకాశ మివ్వకుండా పెట్టుబడి దారీ శక్తులు, వాటి సహచరులు - ఫ్యూడల్ మరియు ప్రభుత్వ ప్రాతినిధ్య సంస్థలు వారినెలా దోపిడీ చేస్తున్నవో ఆయా అధ్యాయాల్లో తెలుసుకొన్నాం. రైతుల ఫార్వర్డ్ కంట్రాక్టులలో (ముందుగా ఒప్పందాలు) సమానత్వం లేదనీ, అవి అసమంజసమయినవనీ గుర్తించి ఫార్వర్డ్ కంట్రాక్టులను అదుపు చేయటానికి లేక పూర్తిగా బహిష్కరించటానికి తగు చర్యలు చేపట్టాలనే నిర్ణయాలకు రావటం ఆధునిక కాపిటలిస్టు దేశాలకు తప్పటం లేదు. ఇప్పుడు మన దేశంలోని వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు - రైతుల నిస్సహాయత - వడ్డీ వ్యాపారుల దోపిడీలను గుర్తించి ప్రత్యేకమయిన చట్టాలు చేసి వడ్డీ వ్యాపారాన్ని క్రమబద్ధం చేసి వడ్డీశాతంను కూడా నిర్ణయిస్తున్నాయి. రైతు, కార్మికుడు - వ్యాపారితో, పారిశ్రామిక వేత్తతో తమ ఆర్థిక సంబంధాలను సమానహోదాలో నిర్వహించలేకపోతున్నాడు. ఈ సంబంధాల నిర్వహణలో ప్రతిసారీ రైతు, కార్మికుడు తీవ్రంగా గాయపరచబడి అవిటివాడుగా మారుతున్నాడు. (యజమాని, వ్యాపారి లబ్దిపొందుతున్నాడు. రైతు, కార్మికుడు నష్టపోతున్నాడు).

మార్కెట్లలో బేరసారాల్లో పాల్గొనే వారి ఆర్థిక అసమానతలను రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ అగ్రికల్చర్ (1928) మరియు లేబర్ కమీషను (1930) రిజర్వు బాంక్ ఆఫ్ ఇండియా (1954) గుర్తించినవి. "సంవత్సరాలు గడుస్తున్న కొలదీ రైతుల ఉత్పత్తులను వినియోగించుకొంటూ, సంఘటిత పడుతూ బలపడుతున్న పంపిణీ దారులతో, వినియోగదారులతో పోల్చితే వ్యవసాయదారుడు అత్యంత బలహీనుడని", ఈ రిపోర్టుల సారాంశం, అతనికందే ఋణ సహాయం స్వల్పం. అయిష్టంగా ఇవ్వబడేది. వడ్డీ ప్రాణాలుతోడేది. వ్యాపారికందే ఋణసహాయం, అతని అవసరాలకు సరిపోయినంత, తక్కువ వడ్డీలకు, త్వరితగతిని ఇష్టపూర్వకంగా ఇవ్వబడేది. రైతులు తమ ఉత్పత్తులు నిలువ చేసుకొనే గిడ్డంగి వసతులు తక్కువ. వ్యాపారులకా కొరత లేదు. వ్యవసాయ ఉత్పత్తుల ప్రపంచ ధరలు రైతులకు తెలియనివ్వబడవు. అవగాహన లేదు. అవగాహన వున్నా అది సరి అయినది కాదు. వ్యాపారికీవిషయంలో సంపూర్ణ పరిజ్ఞానం వుంది. ఆధునిక మార్కెటింగ్ విధానాలు, అమ్మకాల చాకచక్యం రైతుల కొనుగోలు శక్తిని కోల్పోయేటట్లు చేస్తున్నయ్. రైతుకు అండగా వుండే సంఘటిత శక్తులు లేవు. (Organised forces) వ్యాపారి ప్రపంచ వ్యాపార వర్గాల సంఘటితంలో ఒక భాగం. రైతు తన ఉత్పత్తులను నిల్వచేసుకోలేడు. తన ఉత్పత్తులను వత్తిళ్ళకులోనై అమ్ముకో వలసిన స్థితిలో రైతున్నాడు. వ్యాపారి సరుకులను సంవత్సరాల పాటు నిలువ చేయగలడు.

బహిరంగ మార్కెటులోనికి సరుకు రానివ్వకుండా చేయగలడు. వినియోగదారులకు ఒకటి, రెండు సంవత్సరాలు సరిపడే ఆహార నిల్వలను స్టోర్లు, రిఫ్రిజిరేటర్ల ద్వారా అందజేయగలడు. రైతుల బహిరంగ విక్రయాలకు అడ్డుకట్ట వేయగలడు.

రైతుకు ప్రభుత్వ సహాయ సహకార, సానుభూతులు లేవు. వ్యాపారుల చెప్పు చేతల్లో ప్రభుత్వాలు నడుస్తున్నయ్. రైతుకు, తన వర్గం నుండిగానీ, వ్యాపారుల నుండి గానీ సానుభూతిలేదు. వ్యాపారులకు భూస్వాముల అండ వుంది. భూస్వాముల ద్వారా నిర్బంధంగా కవులు వసూళ్ళు, వడ్డీ వ్యాపారుల ద్వారా వత్తిళ్ళు రైతుపై వ్యాపారి తేగలడు. ఇంకా ముందుకు పోతే ప్రభుత్వాలచే కూడా వత్తిళ్ళు చేయించగలడు. రైతుకు తన ఉత్పత్తులను ఒకటి కంటే ఎక్కువ మార్కెట్లలో అమ్మే అవకాశాలు స్వల్పం. వ్యాపారికి మార్కెట్లు బహుళం. 'నీగ్రో తనకు కావలసిన సరుకులను తను కోరుకున్న మార్కెట్లో కొనలేడు' (Africandances) రైతు పంట మార్పిడి త్వరితగతిన చేయలేడు. వ్యాపారి తన వ్యాపారాన్ని ఇష్టానుసారంగా ఒక సరుకు నుండి వేరే సరుకుకు మార్చుకోగలడు. రైతును కుంగదీసే పంటల వైఫల్యాలు, పశువుల జాడ్యాలు దళారీలకు నష్టం కలిగించలేవు. వాస్తవానికి వ్యవసాయదారుడు కష్టాల్లో వున్నప్పుడే పంపిణీ దారుడెక్కువగా లాభిస్తున్నాడు. పంపిణీ దారుని లాభం భద్రంగానే వుంటుంది. వ్యాపారులు ధరలు సవరించి, పెరిగిన సరుకుల ధరలను వినియోగదారులపై రుద్ది నష్టాలు తప్పించుకొంటున్నారు. కమీషన్ దారుడు ఎక్కువ టర్నోవర్‌కు వెంపర్లాడతాడు.

'వ్యాపారస్థుడ్ని, కీలక సేవల వినియోగదారుల ప్రభావాల దృష్ట్యా కాపిటలిజంకు ప్రతినిధిగా మనం గమనించి ఆలోచిస్తే అతని స్థానం పదిలమైనది' గ్రామ నాయకులు, పెత్తందార్లుగా వడ్డీ వ్యాపారులుగా, వ్యాపారస్తులుగా, గ్రామాధికారులుగా, అధికారానికి, ధనానికీ ప్రతినిధులుగానే గాక ఈ వ్యవస్థలో పై మెట్టునున్న వారి ద్వారా నిరంతరం అధికారం, ఆర్థిక స్తోమత పెంచుకొంటున్నారు' అని రిజర్వుబాంక్ సర్వే పేర్కొన్నది. చాలాసార్లు గ్రామస్థాయిలో వివిధ పాత్రలను ఒక వ్యక్తే పోషిస్తున్నాడు. పట్టణాల డిమాండులకనుగుణంగా ఈ ఆర్థిక వ్యాపార యంత్రాంగం పనిచేస్తున్నది.

ఈ ఆధునిక పెట్టుబడిదారీ ఏజంట్లతో వ్యవహరించటం అనైక్య రైతాంగానికి మించిన పని. ప్రతి మెట్టులో రైతే ఓడిపోవటం సహజం.

చాలా మంది శాస్త్రవేత్తలు, ప్రభుత్వాలు, వ్యాపారస్తుడ్ని రైతుతో పోటీపడే ఏకైక వ్యక్తిగా భావిస్తున్నారు. అది యధార్థం కాదు. వ్యాపారి, పెట్టుబడి దారీ వ్యవస్థకు

తనకు అవగాహన లేకుండానే చాలా సమర్థుడయిన ప్రతినిధిగా పనిచేస్తున్నాడు. ఈ ప్రాథమిక అవగాహనాలోపం వలన తప్పిదం వలన రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ అగ్రికల్చర్ (Royal commission on Indian Agriculture) భావించినట్లు ప్రస్తుత మార్కెటింగ్ విధానాలలోని అవకతవకలు - దళారీల అధిక సంఖ్య, ఛిద్రమైన రవాణా సౌకర్యాలు, తప్పుడు తూకాలు, కొలతలు, గ్రేడింగు, ప్యాకింగ్, స్టోరేజీల వసతులలోపం వున్నప్పటికీ, మార్కెట్లలోని పోటీవలన పంపిణీదారుని సంపాదన ఏమంత ఎక్కువగా లేదు, అని చాలా మంది శాస్త్రవేత్తలు ఊహించి అమాయకులయిన రైతుల ఆకలి కేకలను పట్టించుకోవటం లేదు. వారి అభిప్రాయం స్థూలంగా చెప్పాలంటే - పారిశ్రామిక వేత్తలు కార్మికులను చేసే దోపిడీతో పోలిస్తే, రైతులంతగా దోపిడీకి గురికావటం లేదని. వ్యాపారులకు, వినియోగదారులకు, బాంకులకు, పన్నుల వసూల దార్లకు వడ్డీ వ్యాపారులకు వున్న సంబంధాలు పరస్పరాధారితాలు. వీరందరూ కలసి వ్యవసాయదారునిపై తెచ్చే వత్తిడి వల్లనే అతను మార్కెటుకు పరుగెత్తుతున్నాడు. కాపిటలిజం దాని ప్రతినిధులు వ్యవసాయదారుని నుండి లాభాలు పిండుకోగలుగుతున్నారు. అందువలన రైతు ప్రపంచ విపణులపై వ్యాపారస్తులపై చేసే ఆరోపణ సత్యమయినది. పంపిణీదారుల వ్యాపారుల లాభాలు ఏమంత ఎక్కువకావని, వ్యవసాయ ఉత్పత్తుల ప్రాసెసింగు, మార్కెటింగు, రవాణా సౌకర్యాలు వ్యవసాయ ఋణ సౌకర్యం సమర్థవంతంగా మెరుగు పరచటం ద్వారా రైతుల ఆర్థిక పరిస్థితిని బాగుచేయవచ్చునని ఈ శాస్త్రవేత్తలు చెప్పే సమాధానం సరిఅయినది కాదు. ఈ సమస్య కుంగటివేరు (మౌలికతత్వం) వ్యాపారస్తునితో ఆగదు. చాలా నిగూఢమయినది. విస్తృత పరిధి కలిగినది. కీలక సేవలు, వ్యాపారులు వీరి వత్తిళ్లకు లోనై చేసే వ్యవసాయం ( నిర్బంధపు వ్యవసాయం - Agriculture under duress) రైతును మార్కెటులో వచ్చిన దానితోనే తృప్తిపడేలా చేస్తున్నవి.

విదేశాల నుండి కొనే సరుకులలో రైతుకు న్యాయం జరుగుతుందనే నమ్మకం లేదు. రకరకాల అడ్డులు, ఆటంకాలు, వీటి నధిగమించే అలవాటు నేర్పు వ్యవసాయ దారులకు లేవు. రైతులు సాధారణంగా ఋణ భారంతో క్రుంగిపోతుంటారు. దీనికి కారణం - ద్రవ్యపరమయిన ఆర్థిక విధానం (వస్తు పరమయినది కాకపోవటం) ఆ భారాన్ని మరింత పెంచుతుంది. ధరలు పడిపోతుండంతో వాణిజ్యపంటలు పండించటం జూదంగా మారుతున్నది. కాల క్రమేణా ఫాక్టరీలకు ముడి సరుకులు మోసే బానిసలుగా వీరు స్థానభ్రంశం పొందుతారు. రెండువేల సంవత్సరాలుగా మరీ మూడు శతాబ్దాలుగా

తమ వ్యవసాయ ఉత్పత్తుల ద్వారా తమ స్వంత చాకిరీ ద్వారా రైతులు పోగు చేసిన 'అదనపు విలువ' వారి నుండి ఏవిధంగా కొల్లగొట్టబడింది అనే చిక్కుముడిని విప్పటంలో అర్థం చేసుకోవటంలో మార్క్సు మహాశయుడు విఫలమవటం దురదృష్టకరం. 'వ్యవసాయ సంపద ఉత్పత్తిపై ఆర్థిక శక్తుల ప్రభావాన్ని అధ్యయనం చేయటం మార్క్సు నిర్లక్ష్యం చేశాడు. మార్క్సు వ్యవసాయ ఉత్పత్తుల మాన్యుఫాక్చరింగు, ప్రాసెసింగు దశలపై మాత్రమే తన ఆలోచనను కేంద్రీకరించాడు' అని అసుబరోసిహనౌక్ (Japnese leader) చేసిన వ్యాఖ్య సమంజసమయినది. (World land planning).

కాలం గడిచే కొలదీ (దీర్ఘకాలంలో) సరుకుల విలువకు, ధరలకు అసమానతలు ఎక్కువకాగలవని, ఎక్కువగా వున్నవనీ మార్క్సు గమనించలేదు. మార్కెట్లలో జరిగే సరుకుల మారకాలలో ఈనాడు సర్వసాధారణమయిన విలువల - ధరల వ్యత్యాసాలపై ముందు చూపు ఆయనకు లేకపోయింది.

బాహ్యదృష్టికి వస్తుమారకంలో, మారకపు సమానతలు, మొత్తం ధరలో సమానత కన్పించినప్పటికీ, మాన్యుఫాక్చరర్ తన ఉత్పత్తులను శాశ్వతంగా వ్యవసాయ ఉత్పత్తులకన్నా ఎక్కువ ధరలకు అమ్మజాలడనీ, అందువలన కాలక్రమంలో వ్యవసాయ దారుడు తన ఉత్పత్తులకు అధిక విలుక సంపాదించగలడనీ ఆయన చేసిన భావన సరిఅయినది కాదు. ఈ విషయం 'ఆర్థిక మాంద్యం - యుద్ధాలు'' అనే అధ్యాయంలో - వ్యవసాయ వర్గంపై వ్యాపార వాణిజ్యాల వర్గాలు ఏవిధంగా పైచేయిగా వున్నదీ చర్చించుకొన్నాము.

'అదనపు విలువను' కాపిటలిజం కార్మికుని నుండి చివరి బొట్టు వరకు పీల్చి ఆధునిక ఆర్థిక సమాజం అనే పెంటకుప్పపై అతనిని పారవేస్తుంది' అని మార్క్సు చెప్పినది, మార్కెట్ల విషవలయాల్లో చిత్ర హింసలకు గురైబయటపడిన రైతుకు ఇంకా ఎక్కువగా అన్వయిస్తుంది.

' ఈ నాటకంలోని వ్యక్తుల ఆకార వికారాలు మార్పు మనం గమనించగలం, మార్కెటులోనికి ధనస్వామిగా కాలుపెట్టినవాడు మార్కెటు నుండి పెట్టుబడిదారునిగా వెలుపలికి నడుస్తాడు. శ్రమశక్తి యజమానిగా మార్కెటులోనికి వచ్చినవాడు అతని వెనుక కార్మికుడుగా బయటకు వస్తాడు. (శ్రమశక్తి - వ్యవసాయ ఉత్పత్తి - కార్మికుడు - వ్యవసాయదారునిగా చదువవచ్చు.) ఒకడు తనపై, ఇతరులపై కూడా పూర్తి నిర్ణయాధి కారం, వ్యాపార దక్షత గలవానిగా వస్తే, రెండవ వ్యక్తి భయం భయంగా సంశయాత్మునిగా,

అయిష్టంగా తన చర్మాన్నే అమ్ముకోవటానికి వచ్చే వానిగా కన్పిస్తాడు. వ్యాపారి, మార్కెటు, ఇతర పెట్టుబడిదారీ ఏజంట్ల చేతుల్లో అంతకన్నా ఎక్కువ దౌర్భాగ్య స్థితిలో వున్నామని మన రైతాంగం గుర్తించలేదా?

వ్యవసాయ దారులు కీలక సేవల అవసరాలు తగ్గించుకోగలిగి, వడ్డీలు పన్నులు, అద్దెలు, కవుళ్లు, ధనరూపేణా చెల్లింపులు చేయకుండా, గ్రామీణ చేతి వృత్తులవారిపై ఆధారపడి కావలసిన బట్ట, వ్యవసాయ పనిముట్లు, గృహోపకరణాలు సమకూర్చుకోగలిగితే (గతంలోవలే) మార్కెట్లకు ఎప్పుడో తప్ప మాటి మాటికి వెళ్ళే అవసరం రాదు. అప్పుడు వారు పోగుచేసిన 'అదనపు విలువ' వారికే దక్కుతుంది.

(ఆఫ్రికా తెగలను ఏవిధమయిన కుటిల పద్ధతుల ద్వారా యూరోపియన్లు దోపిడీ చేసింది. త్రాగుడు అలవాటు చేసి, బలప్రయోగంచేసి, మిషనరీల ద్వారా బట్టలు దానాలు చేయించిందీ రంగాజీ వివరించారు. చైనా మార్కెటులోనికి ప్రవేశించటానికై జరిగిన Boxer - opium wars వారిని నల్ల మందుకు బానిసలు చేయటం, దోపిడీ చేయటం రంగాజీ ప్రస్తావించారు).

# అంతర్జాతీయ వర్తకం - జాతీయ ధరలు

(International Trade - National Price Levels)

ప్రపంచ విపణులు రైతులనెంత నాశనం చేసిందీ, కాపిటలిస్టు దుర్మార్గాలకు ఎలా కొమ్ముకాసిందీ తెలుసుకున్నాం. ప్రపంచ ప్రభుత్వ ఏర్పాటు కనుచూపు మేరలో లేదు. న్యూడీలు (NEW - DEAL) ను ఆదర్శంగా అంగీకరించితే ప్రపంచ విపణులు రైతులకు చాలా ఉపయోగపడవచ్చు. ప్రపంచ రాజ్య ఆవిర్భావం, న్యూడీలు ఆదర్శం వచ్చే అవకాశాలు మృగ్యం. ప్రపంచ యుద్ధం, ఆర్థిక మాంద్యంలతో ప్రపంచ విపణి పట్టాలు తప్పిన బండి అయింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత చాలా దేశాలు తమ ఉత్పత్తుల అమ్మకాలకు మార్కెట్లను వెతుకుతున్నయ్. వ్యవస్థీకృతమయిన ప్రపంచ విపణుల ద్వారా కాక, ద్వైపాక్షిక ఒప్పందాలు, బార్టర్ ఒప్పందాలు, విదేశీ వర్తకపు లైసెన్సుల ద్వారా ఈ దేశాలు తమ ఉత్పత్తులనమ్మ చూపినయ్. అంటే బ్రిటను - ప్రతిదేశంతోనూ, వారి ఉత్పత్తులను నిర్దిష్టమయిన మొత్తాలుగా కొనటానికి, తన ఉత్పత్తులను అదే పద్ధతిలో అమ్మటానికి వేరు వేరుగా ఒప్పందాలు చేసుకోవలసి వుంటుంది. ఈ ఒప్పందాల కనుగుణంగా నడవ వలసి వుంటుంది.

ఈ పరిస్థితులలో వ్యవసాయ దేశాల గతేమిటి? అంతర్జాతీయ వర్తకం, పారిశ్రామిక దేశాల మధ్య ద్వైపాక్షిక ఒప్పందాల వలన క్రమబద్ధీకరించ బడుతుంది. ఆర్థికబలం, సరుకుల ఆవశ్యకత, అధిక బేరశక్తిగల దేశాలవైపే త్రాసు మొగ్గుతుంది.

వ్యవసాయ దేశాలు ఇరకాటంలో పడతాయి. రాజకీయ స్వాతంత్ర్యంకల వ్యవసాయ దేశాలను రాజకీయ స్వాతంత్ర్యంలేని దేశాలతో పోల్చి చూస్తే, స్వతంత్ర

దేశాలకు వెసులుబాటు ఎక్కువగా వుంటుంది. రాజకీయ స్వాతంత్ర్యం కల దేశాలను ముందు పరిశీలిద్దాం. విదేశీవిపణులు యుద్ధోన్మాదుల చేతులలో పడటంతో మొదట్లో ఈ దేశాలు చాలా నష్టపడినయ్. ఈ దెబ్బ నుండి మెల్లగా తేరుకొని వ్యవసాయ విధానాన్ని కాలానుగుణంగా మార్చుకొని, యుద్ధభాగస్వాములయిన (ఇరువర్గాల) మిత్ర దేశాలతో తమ లావాదేవీలు మెరుగుపరుచుకొన్నయ్. అర్జెంటినా, టర్కీ వంటి తటస్థదేశాలు యుద్ధ భాగస్వామ్య దేశాలయిన ఆస్ట్రేలియా, కెనడా, డెన్మార్క్ వంటి దేశాల కన్నా ఎక్కువ లాభించినయ్. ఈ రెండు దేశాలు తమ వ్యవసాయోత్పత్తులకు సరి అయిన ధరలను డిమాండు చేసి పొందగలిగినయ్. యుద్ధానంతరం అమ్మకపు దారుల మార్కెట్ బదులు కొనుగోలు దారుల మార్కెటు రావటంతో, ప్రపంచ వ్యవసాయోత్పత్తిదారులందరూ పోటీలో వుండటంతో మారిన పరిస్థితులతో సర్దుబాటు చేసుకోవటం ఈ దేశాలకు (తటస్థ దేశాలకు) సమస్య అయింది. ఎక్స్‌పోర్టు గుత్తాధిపత్యం ద్వారా, సబ్సిడీల ద్వారా, సమానత్వ నిధుల ద్వారా (Equalisation funds) ప్రభుత్వాలు వ్యవసాయోత్పత్తులు విదేశీ వాణిజ్యంలో జొరబడటం వలన సమస్యలధికమయినయ్. ఈ సమస్యలు వ్యవ సాయ ప్రజలందరూ ఎదుర్కొనవలసినవే. అయితే రాజకీయస్వాతంత్ర్యం కల దేశాలు తమ సరుకులకు బేరమాడి అధిక ధరలు పొంద గలిగిన స్థితిలో వున్నాయి. పారిశ్రామిక దేశాలు యుద్ధకాలంలో ఆహార కొరత ననుభవించినవే. అందువలన ఈ దేశాలు 1953 వరకు అధికంగా ఆహారం, బట్టలు, నూనె గింజలను దిగుమతి చేసుకొని, వారి పారిశ్రామికోత్పత్తులను ఎగుమతి చేసినయ్. ఈ లావాదేవీలలో వ్యవసాయదేశాలు బాగా లాభించినయ్. సామ్రాజ్యవాదశక్తులయిన నాజీలు - జపాను, బ్రిటను, అమెరికాపై ఆధారపడిన దేశాలు పెద్దగా అభివృద్ధి చెందలేదు. యుద్ధకాలంలో, బ్రిటీషువారు ఇండియానుండి గోధుమలు, బియ్యం, ప్రత్తి, జూటు వారికి తోచిన ధరలిచ్చి దిగుమతి చేసుకొన్నారు. వారి పారిశ్రామిక సరుకులను, దిగుమతులకు సమానంగా ఎగుమతి చేయకపోగా ఎక్కువ ధరలు డిమాండు చేశారు. యుద్ధావసరాల కొరకు ఎంతో ఆహారాన్ని అతి తక్కువ ధరలకు ఎత్తుకపోయారు. ఇక్కడ ప్రజలు ఆహారపు కొరతతో అలమ టించారు. బ్లాక్ మార్కెట్లో కూడా కొనలేకపోయారు.

యుద్ధం ముగిసిన వెంటనే వారి పెరిగిన ఆహారోత్పత్తులు ప్రత్తి, నూనె గింజలు, ఫైబరు (FIBRE) తో ప్రపంచ మార్కెటును నింపి వేశారు. అందువలన ధరలు పతన మయినయ్. కొన్ని దేశాలు, వారి ఉత్పత్తులను నిల్వచేసి, ధరలు నిలకడగా వుంచుకో

గలిగినయ్. ఈ దేశాలు, పారిశ్రామిక దేశాలతో, ద్వైపాక్షిక ఒప్పందాలు చేసుకొని, తమ వ్యవసాయోత్పత్తులకు లాభసాటి ధరలు పొంది, అత్యవసరమయిన పారిశ్రామిక ఉత్పత్తులను తగుమాత్రంగా మాత్రమే దిగుమతి చేసుకొనటం సాధ్యమా? వారి ఉత్పత్తులకు న్యాయమయిన ధరలు పొందగలవా? ఆహారాన్ని అధికంగా దిగుమతి చేసుకొనే బ్రిటను, వ్యవసాయ దేశాలకు సహకరించటంలేదు. అంతర్జాతీయ గోధుమల ఒప్పందంలో (Wheat Agreement) బ్రిటను భాగస్వామి కాదు. బ్రిటను U.S.A. లు ప్రపంచ ఆహార బోర్డు ఏర్పాటుకు ముందుకు రాలేదు.

యుద్ధానంతరం ఆహార కొరత ఏర్పడుతుందని 1943లోనే హాట్‌స్ప్రింగ్స్‌ఫుడ్ కాన్ఫరెన్సు (HOT SPRINGS FOOD CONFERENCE) అభిప్రాయ పడింది. ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ ఆహారపదార్థాలసరఫరా పుష్కలంగా వుండేటందుకు ప్రయత్నాలు చేసింది. ఆహారోత్పత్తిదేశాల మధ్య, యుద్ధానంతరం ఏర్పడే కొరత కారణంగా, ధరలు ఆకాశాన్నంటకుండా చూడటానికి ఒక ఒప్పందం కుదర్చటానికి ఆదుర్దాపడింది. 'మార్కెట్లో ఆహారపదార్థాల సరఫరా ఎక్కువగా వుంది. ధరలు పతనమయ్యాయి.

'వ్యవసాయదేశాలయిన చైనా, ఇండియా, మెక్సికో, బ్రెజిలు దేశాలు పారిశ్రామికీకరణ వైపు మొగ్గుచూపుతున్నయ్. యుద్ధానంతరం ఈ దేశాలలో పారిశ్రామికీకరణ త్వరితగతిన జరుగుతోంది.'

చాలా వ్యవసాయ దేశాల అంతర్జాతీయ ఆర్థికస్థితి యుద్ధానంతరం మెరుగ్గా వుంది. ఇండియా, బ్రెజిలు, అర్జెంటినా, మెక్సికో, టర్కీ, ఈజిప్టు, బర్మా, సిలోను వంటి దేశాలు ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాద దేశాలకు తమ బాకీలు చెల్లించినయ్. ఇండియా, అర్జెంటినా, బ్రెజిలు దేశాలు ఇతరులకు అప్పులిచ్చే స్థితికి చేరుకొన్నయ్. వారి బేరశక్తి పెరిగింది. కెనడా, ఆస్ట్రేలియా వంటి దేశాలు వివిధ పారిశ్రామిక సంస్థల ద్వారా, పారిశ్రామిక ఉత్పత్తులను పెంచి వాటి బేరశక్తిని పెంచుకొన్నవి. యుద్ధానంతర దశకంలో ఈ దేశాలు పారిశ్రామికోత్పత్తుల దిగుమతులపై ఆధారపడటం తగ్గింది.

వ్యవసాయోత్పత్తులలో ఈ దేశాలు నష్టపడినయ్. యుద్ధకాలంలో ఆహార కొరత నివారణ కొరకు యుద్ధోన్మాద దేశాలు తమ ఆహార అవసరాలను నియంత్రించుకొన్నయ్. యుద్ధానంతరం వచ్చిన అధిక ఆహారోత్పత్తి ప్రపంచానికి సమస్య అయింది. రైతులు మరలా ఒకసారి దివాలా తీసినా ఆశ్చర్యపడనవసరం లేదు. ఈ పరిణామం

ఇంకొక ఆర్థిక మాంద్యానికి కారణం కావచ్చు. అందువలననే 'ఆర్థిక విస్తరణ మందంగా వుండేటట్లు చేయటం సాధ్యం' అని I.F.A. హెచ్చరించింది. (1955 నవంబరు) 'పెరుగుతున్న పరిశ్రమల సామర్థ్యాన్ని బట్టి (సింథటిక్ ఉత్పత్తులు పెరిగినా) ముడి సరుకుల అవసరం ఇంకా పెరుగుతుంది. సింథటిక్ ఉత్పత్తుల కొరకు ముడిసరుకులు అవసరం అన్న విషయాన్ని విస్మరిస్తున్నారు.' అని Mr. లియోచెర్నోవ్ అభిప్రాయపడ్డాడు. యుద్ధంలో ఎంత నాశనం జరిగినా పారిశ్రామిక సామర్థ్యం ప్రపంచ వ్యాప్తంగా అద్భుతంగా పెరిగింది. యుద్ధకాలంలో పెరిగిన విమాన రవాణా కారణంగా రవాణా టారిఫ్‌లు తగ్గవచ్చు. కాని యుద్ధానంతర సంవత్సరాలలో రైతుల గతి ఏమిటో లియోచెర్నోవ్ చెప్పలేదు. 1952-53 నుండి జనాభాతో పోటీపడి వ్యవసాయోత్పత్తులు పెరుగుతున్నయ్. ఆ కారణంగా వ్యవసాయ ధరలు వెనుకబడతవని F.A.O. రికార్డు చేసింది. 'రైతుల ఉత్పత్తులు-వారి వ్యవసాయక, కుటుంబ అవసర సరుకుల మధ్య ధరల నిష్పత్తి నిర్నిరోధంగా తగ్గుతున్నది.'

ఈ క్లిష్టస్థితి నుండి గట్టెక్కే మార్గాలను రైతులు అన్వేషించాలి. సహజంగా ప్రపంచ కాపిటలిజం రైతులను ప్రపంచ విపణుల ఆధిపత్యం కిందకు తెచ్చే ప్రయత్నాలు చేస్తుంది. రైతులీ పరిస్థితులలో ఏం చేస్తారు! ఏం చెయ్యగలరు?

రైతులు ప్రపంచ విపణుల ఆధిపత్యం తిరస్కరించగలగాలి. వ్యవసాయోత్పత్తుల అవసరం కల దేశాలతో ద్విపాక్షిక, పరస్పర సహకార ఒప్పందాలు చేసుకొని పారిశ్రామికోత్పత్తులను సాధించాలి. పారిశ్రామిక దేశాలలో కొన్ని ఎక్కువ భాగ్యవంతంగా గానీ ఎక్కువ జులుం చెలాయించే స్థితిలో గానీ లేవు. ఇటువంటి దేశాలతో 'అగ్రిమెంట'వ్వాలి. చాలా దేశాల పరిస్థితి ఆశాజనకంగా లేదు. యుద్ధకాలంలో పంటల ప్రణాళికలు, పారిశ్రామికోత్పత్తుల ప్రణాళికల ద్వారా, ఆహారపు ఎగుమతులు నియంత్రించి, వ్యవసాయ విస్తీర్ణాన్ని తగ్గించుకొని, ఈ భూముల ఉత్పత్తులను తమ స్థానిక వినియోగాలకు పయోగించుకొని, వారి విదేశీ విధానాన్ని సవరించుకొని, వారి వ్యసాయోత్పత్తుల ఎగుమతులకు సమాన మొత్తాలలో దిగుమతులు చేయని దేశాలనుండి, దిగుమతులు తగ్గించుకొని, యుద్ధ పరిణామాల నుండి తప్పించుకొన్నయ్. ఇటువంటి దేశాల సంఖ్య తక్కువ. అదృష్టవశాత్తూ చాలా దేశాలు రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలు సంపాదించుకొన్నయ్. ఈ కారణంగా ఈ దేశాలు తమ జాతీయఆర్థికతను నిలకడగా వుంచుకొని అభివృద్ధి అవకాశాలు సంపాదించుకొన్నయ్.

సప్లై - డిమాండ్లు మరియు సరుకుల ధరలపై ప్రభావం చూపేవాటిని మనం ప్రపంచ విపణులుగా అర్ధం చేసుకోవాలి. ద్వైపాక్షిక ఒప్పందాలు, చర్చలు ద్వారా బేరమాడి చేసే వర్తకం వలన రెండు లేక అంతకన్నా ఎక్కువ దేశాల మధ్య సరుకుల మార్పిడి జరుగుతుంది. ఈ వర్తకంలో ఇతర దేశాలలో ఇవే సరుకులకు ప్రపంచ విపణులలో వుండే ధరలతో నిమిత్తముండదు. ద్వైపాక్షిక ఒప్పందాలు, చర్చలు, బేరాలతో జరిగే వర్తకాన్ని కూడా ప్రపంచ విపణులు తమ కబంధహస్తాలలోకి తీసుకోగలవు. కానీ ఈ ఒప్పందాల వర్తకానికి ప్రపంచ విపణులపై ఆధారపడే అవసరముండదు.

ప్రపంచ విపణుల నుండి, ప్రపంచ వర్తకం నుండి విముక్తి పొందటం అంటే రక్షణాత్మక విధానాల అనుసరణనీ, అభివృద్ధిని కాలతన్నుకోవటమని అనుకోవటం తప్పు. అట్లాంటా, హవనా ఛార్టులు, ఇంటర్నేషనల్ ట్రేడ్ ఆర్గనైజేషన్లు, కాన్ఫరెన్సులు (యుద్ధానంతరం) ఈ అభిప్రాయం కలిగించినయ్. లావాదేవీలలో సంబంధం వున్న సమవుజ్జీలందరికీ సమాన న్యాయం, సమాన ప్రతిఫలాలు కలిగితే ప్రపంచ విపణులు, వర్తకం లాభదాయకాలే. కానీ మన అనుభవం రైతుల కార్మికుల అధోగతి కాపిటలిస్టులకు ఏకపక్షంగా లాభసాటిగా వుండటం.

ప్రపంచ విపణులు - వర్తకం శ్రమజీవులను చీల్చే రెండుకత్తెర బ్లేడ్లవంటివి.

# జాతీయ స్వయం సమృద్ధి ఆర్థికత

## (NATIONAL SELF SUFFICIANT ECONOMY)

ప్రపంచ విపణులలో సమఉజ్జీల మధ్యలావాదేవీలు - ఉత్పాదక చర్యలు, ప్రజలందరి సంపూర్ణ ఆర్థికాభివృద్ధి సాధనకు అనువయిన పరిస్థితుల సృష్టి, నేటి కర్తవ్యం.

**ఆ పరిస్థితులేమిటి? అవి ఎలా సృష్టించబడతాయి?**

మార్షెలియన్ ఆర్థిక శాస్త్ర అధ్యయన పరులకు వెంటనే మనసుకు తట్టేది - రక్షణాత్మకమయిన డ్యూటీలు (సుంకాలు) టారిఫ్ వాల్స్ (టారీఫ్ గోడలు) లేక అధిక ప్రోత్సాహకాలు (Bounties). ఈ ఆర్థిక వెసులు బాట్లన్నీ Mr. ఫ్రెడరిక్ లిస్ట్ సిద్ధాంతానికి అనుగుణ్యమయినవి. ఈ వెసులుబాట్లు శైశవదశలో వున్న పరిశ్రమలకు కల్పించవలసినవి. ముడి సరుకులు, ఉత్పత్తికారకాలు, మార్కెట్లు వుండి, పరిశ్రమలోనికి కొత్తగా అడుగుబెట్టి, ఒకటో, రెండో వసతులు కరువయిన శైశవ దశలో వున్న పరిశ్రమలకు మాత్రమే కల్పించేవి. ఈ పరిశ్రమలు తమకాళ్ళమీద తాము నిలబడగానే, ఈ ప్రోత్సాహకాలన్నీ ఉపసంహరింపబడాలి. ఈ సిద్ధాంత ప్రాతిపదికనే - ఉత్పత్తిదారులకు రక్షణలు తద్వారా దేశ వ్యాప్తంగా వినియోగాదారులకు మేలూ జరుగ గలందులకు - భారతదేశం విచక్షణాత్మక ఆర్థిక రక్షణల విధానాన్ని అమలు చేస్తున్నది.

అలగ్జాండర్ హామిల్టన్ - ఫ్రెడరిక్ లిస్టుల ఆర్థిక విధానం - స్థానిక ముడి సరుకుల ప్రాసెసింగుకు (ప్రక్రియలకు) వినియోగ వస్తువులను దేశీయమార్కెట్లకు, అలానే ఎగుమతులకవసరమయిన నూతన పరిశ్రమల స్థాపనకు - అభివృద్ధి కొరత కలిగిన దేశాలలో సమంజసమయినది.

ఒకసారి కల్పించబడిన పారిశ్రామిక రక్షణలను ఎత్తివేయటం తేలిక కాదు.

ప్రపంచమార్కెట్లు, ప్రపంచ వర్తకపు, ప్రపంచ వ్యవసాయోత్పత్తులగతి పరిశీలన సమగ్రంగా వుండాలి. రక్షణలు కలిగిన ఒకటో, రెండో బ్రిటను పరిశ్రమల చర్చ అనవసరం. వ్యవసాయోత్పత్తుల అభివృద్ధి, రైతుల బేరశక్తిపెంపుదల ఈ ప్రాధమికమయిన, వ్యూహాత్మకమయిన సమస్యలను పరిష్కరించగలగాలి. పారిశ్రామికోత్పత్తులతోపాటు వ్యవసాయోత్పత్తులను పెంచగలగాలి. అతి ప్రధానమయిన ఈ ప్రాధమిక సమస్య పరిష్కారానికి నూతన ఆర్థిక - సూత్రాలను నిర్వచించగలగాలి. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత మాత్రమే ఆర్థికశాస్త్రవేత్తలు, వ్యవసాయదేశాలను గురించి పట్టించుకొంటున్నారు.

కరన్సీ పండితులు 'యుద్ధపూర్వపు గోల్డు స్టాండర్డును అంతర్జాతీయ కరెన్సీలతో ముడి పెట్టాలని పాకులాడారు. అలానే ఆర్థిక శాస్త్రవేత్తలు యుద్ధకాలపు జాతీయ స్వయం సమృద్ధి ఒక తాత్కాలిక దశగా భావించి, ప్రపంచ విపణుల - వర్తకపు సమస్యలు మాత్రమే ప్రపంచ ఆర్థిక విధానపు లక్షణాలనుకొని తమ పరిశీలనకివే అర్థమనుకొన్నారు. 1929-35 ల ఆర్థిక మాంద్యంలో గోల్డు స్టాండర్డును ప్రపంచం తిరస్కరించటం - అలానే ప్రపంచం ప్రపంచ విపణులకు - వర్తకానికి దూరం కావటం ఆర్థిక శాస్త్రవేత్తలకు షాక్ నిచ్చింది. ఇది వారికి మింగుడు పడని పరిణామం.

జర్మనీ తన 1914-18 సంవత్సరాల స్వయం సమృద్ధి అనుభవంతో ముందుకు నడచి 1933-39 మధ్యకాలంలో మొత్తం జాతీయ ఆర్థిక విధానాన్ని పునర్వ్యవస్థీకరించుకొని 1939లో యుద్ధంలో కాలు బెట్టింది. బ్రిటను ఆర్థిక నిర్బంధాలను ఎదుర్కోనలేని తన నిస్సహాయతను, ఆర్థిక నిర్బంధాలకు లొంగని జర్మనీ పరిస్థితిని ఆలస్యంగా తెలుసు కోగలిగింది. ఆర్థిక సంవిధానంగా కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నా, భారతీయ శాస్త్రవేత్తలు యుద్ధాల తరువాత కూడా ఈ విధానాన్ని అధ్యయనం చేయలేదు.

మహాత్మాగాంధీ ఈ సమస్యను 1919 నుండీ ఇంకాముందు 1908 నుండీ అధ్యయనం చేయటం మొదలు పెట్టారు. ఈ అధ్యయనం జర్మనీ వారి లాగా యుద్ధ సంసిద్ధత కొరకు కాదు. బాంకర్లు, రాజకీయ నాయకుల సలహా సంప్రదింపులతో కాక, వలస ప్రజలను కాపిటలిజంనుండీ-రైతులను పారిశ్రామిక దేశాలనుండీ- సామ్రాజ్య వాదులనుండీ రక్షించటానికి చేశారు.

రైతులు తమ సరుకులకు తక్కువ ప్రతిఫలాలు పొందుతున్నారు. పారిశ్రామిక వాణిజ్య సేవలు, సరుకులు - రైతులనుండీ, కార్మికులనుండీ తమకు చెందవలసిన

ప్రతిఫలం కన్నా అధికంగా గుంజుకొంటున్నవనే వాస్తవాన్ని 'న్యాడీలు' A.I.V.I.A. (ఇండియా) ఉద్యమాలు రెండూ గ్రహించినవి. ఈ రెండు ఉద్యమాలూ ఈ సమస్య మూలకారణాన్ని వెతికి వెలికి తీయలేకపోయినవనేది నా ఈ అధ్యయనంలో కనిపించే వాస్తవం. వర్తక సంబంధాలలో రైతులు మొదటినుండీ కాపిటలిస్టుల చేతుల్లో దోపిడీ చేయబడుతున్నారు. వారి సరుకులకు మర్యాదకోసం ఇచ్చే ధరలు (నామమాత్రం) పొందుతున్నారు.

వ్యవసాయ ఉత్పత్తుల తక్కువ ధరలకు కారణాలు చాలా లోతయినవి. రాజకీయ పాలన, లేక అణచివేత, ఆర్థిక నిస్సహాయత, జాతీయ ఆర్థిక పారిశ్రామిక వ్యవస్థల బలహీనత మొదలయినవి ముఖ్యకారణాలు. న్యాడీల్ మరియు మహాత్మాగాంధీ ఆశయాలకనుగుణమయిన జాతీయ స్వయం సమృద్ధి, నూతనంగా మెరుగయిన స్థితీ అందుకోవాలంటే ముందుగా రైతుల వికలత్వాలను తొలగించాలి.

స్వయం సమృద్ధి ఆర్థికత ముందు ముందు రావటం తథ్యం. ఈ వాస్తవాన్ని యుద్ధకాలంలోనూ, ఆర్థిక మాంద్యంలోనూ, చాలా దేశాలు గుర్తించినయ్. వారి జాతీయ వాద, లేక సామ్రాజ్య వాద ఆర్థిక విధానాల రక్షణ కొరకు, వ్యవసాయ - పారిశ్రామికాభి వృద్ధుల సమతూకం కొరకు, యుద్ధకాలంలో వ్యవసాయపు కీలక పాత్ర తెలుసుకొన్నందు వలన - స్వయం సమృద్ధి ఆవశ్యకత - ఉపయోగం ఈ దేశాలు గ్రహించినయ్. బ్రిటీషు కామన్వెల్తు, దాని సహచరులు, U.S.A. జాతీయ స్వయం సమృద్ధి ప్రాధాన్యతను గురించి చర్చించసాగాయ్. యుద్ధ సమయంలో అమెరికా అర్ధగోళంలో ఆర్థికస్వయం సమృద్ధి మార్గాలనన్వేషించినయ్. రక్షణ బలాల ఆధిక్యతను నిల్పుకోవటానికి, 1948-55 మధ్య ప్రచ్ఛన్న యుద్ధం (Cold War) లో తన ఆధిపత్యంలోని భూగోళార్ధంలో వాణిజ్య సమాఖ్యల ఏర్పాట్లతో, ఆర్థిక స్వయం సమృద్ధి సాధనకు మరింత పట్టుదలగా వుంది. తన సహసౌభాగ్యం (Co - Prosperity) స్కీముతో తూర్పు ఆసియాదేశాలలో తను (జపాను) వాణిజ్య కేంద్రంగా - కాంటినెంటల్ చైనా ధాన్యాగారంగా, మలేసియా, బర్మా, ఫసిఫిక్ ద్వీపాలు సరఫరా కేంద్రాలుగా యుద్ధకాలంలో జపాను స్వయం సమృద్ధికి కృషిచేసింది. ప్రచ్ఛన్నయుద్ధం (Coldwar) ప్రారంభంనుండీ రష్యా ఇదే ప్రయత్నంలో వుంది. యూరపు లోని సోవియట్ దేశాలు వ్యవసాయ - పారిశ్రామికతలలో గణనీయ మయిన స్వయం సమృద్ధి సాధించినయ్. 'వాణిజ్య వినియోగాల అవకాశాలు స్థానికంగా (Domestic) చాలా ఎక్కువగా వున్నవని I.F.A.P. ప్రపంచ సర్వే అభిప్రాయ పడింది.

'మన ఆర్థిక వ్యవస్థ నిర్మాణం స్వతంత్రంగా వుండాలి. అది కాపిటలిజానికి అనుబంధంగా వుండకూడదు. స్వదేశీ మార్కెట్లపై ఆధారపడి పరిశ్రమలు -రైతుల వ్యవసాయానుబంధంతో ఎదగాలి. పారిశ్రామికీకరణ మన దేశంలోని ఆర్థిక విధానంలో పరిశ్రమల ప్రాముఖ్యతను పెంచటానికి మాత్రమే కాక, అభివృద్ధి క్రమంలో మన చుట్టూ వున్న కాపిటలిస్టు దేశాలకు 'పిలకలు' గా మారటాన్ని నిరోధించటానికి' అని స్టాలిన్ ప్రకటించాడు. (Stalin - By kalanin - P. 110-113)

రెండవ ప్రపంచ యుద్ధ పరిణామంగా ప్రపంచ విపణుల విచ్ఛిత్తిని గురించి స్టాలిన్ ఇలా వ్రాశాడు. 'కమ్యూనిస్టు దేశాలు ఆర్థికంగా ఏకమయినవి. ఆర్థిక సహకారము, పరస్పర సహాయమూ అందించుకొంటున్నవి. అనతి కాలంలో ఈ దేశాలు దిగుమతులకై కాపిటలిస్టు దేశాలపై ఆధారపడనవసరం లేదు.' (Quoted by Eastern Economist - Dec 1955).

స్వయం సమృద్ధి సాధనకై అధికారికంగా, అనధికారికంగా కొన్ని దేశాలు వాణిజ్య సమాఖ్యలు (Zollverins) ను ఏర్పాటు చేసుకోవటానికి ప్రయత్నాలు చేస్తున్నవి. ఈ నేపథ్యంలో వలస, పూర్వ వలస దేశాల రైతాంగం, తమ ప్రయోజనాల పరిరక్షణకు మార్గాలనన్వేషించి, తమలోపాలనధిగమించి, పారిశ్రామిక, వాణిజ్య దేశాలకన్నా అధిక మయిన బేరశక్తి (Bargaining Power) సాధించాలి.

ఆర్థిక శాస్త్రవేత్తలు అంతర్జాతీయ వర్తక ప్రవాహాలకు సుంకాల అడ్డుకట్టలు (Tariff walls and Barages) వేయటానికి ప్రయత్నించారు. దీని వలన అంతర్జాతీయ వ్యాపారం తగ్గుతుంది. కానీ ఇది చాలా ప్రయాసతో కూడిన పని.

యుద్ధాల మధ్య విరామకాలంలో జర్మన్లు ఇంతకంటే మేలయిన విధానా న్ననుసరించారు. రెండు లేక అంతకంటే ఎక్కువ దేశాలతో బార్టర్ విధానంతో (Barter System) కోటాకేటాయింపులతో ఎగుమతులకు - దిగుమతులకు లైసెన్సులిచ్చారు. యుద్ధకాలంలో యుద్ధ భాగస్వామ్యదేశాలన్నీ, పై విధంగానే తమ విదేశీమారక నిల్వలను - అప్పులను క్రమబద్ధీకరించుకొనటానికి, తమ షిప్పింగు, ఫారెన్ ఎక్ఛేంజి నిల్వలను, అత్యావశ్యకమయిన విదేశీ సరుకులను, విదేశీ వర్తకం ద్వారా పొందటానికి మాత్రమే ఉపయోగించుకొన్నయ్.

విదేశీ వర్తకం: విదేశీ మారకాల నియంత్రణ చాలా అనువయినది, పొదు పయినది, ఉపయోగకరమయినదిగా భావించబడింది. అందువలన లార్డ్‌కేన్స్, మార్గన్‌థో

(Morgantheau) తమ ఆర్థిక ప్రణాళికలను విదేశీమారకాల, విదేశీ వర్తకపు నియంత్రణల ఆధారంగా రచించారు.

జర్మనీ విధానం 1920కు ముందుగల టారిఫ్ విధానం కంటే మేలయినది. మార్చుకోవటానికి అనువయినది. జాతీయ, అంతర్జాతీయ రాజకీయ ఆర్థిక పరిస్థితుల కనుగుణంగా సరుకుల మొత్తాలను, నెలసరిగా గానీ, సీజనలుగా గానీ, సంవత్సరానికి గానీ మార్చుకోవచ్చు. సంవత్సర ప్రారంభ బడ్జెటులో విధించిన టారిఫ్‌లను, ప్రభుత్వాలు తమ విచక్షణఉపయోగించి పరిస్థితులకు అనుకూలంగా మార్చవచ్చు. దిగుమతులు చేసుకొనే ప్రభుత్వాలననుసరించి టారిఫ్‌లు సవరించవచ్చు. బ్రిటీషువారు జర్మనీ వారిననుసరించి తమ విదేశీ వర్తకాన్ని సీజనల్‌గా కంట్రోలు చేసుకొన్నారు.

టారిఫ్ అడ్డుగోడలుగానీ, జర్మనీ లైసెన్సు విధానంగానీ రైతుల కవసరమయిన మేరకు సహాయకారిగాలేవు. ఈ విధానాలు పారిశ్రామిక ఆధిపత్యాన్ని నిలుపుకోవటానికి, పారిశ్రామిక ఉత్పత్తులకు మార్కెట్లు కల్పించటానికి ఉద్దేశించబడినవి. జర్మనీ పారిశ్రామికంగా పటిష్టంగా వున్నంత కాలం బ్రిటను పారిశ్రామికోత్పత్తి అధికంగా చేసి, ఎగుమతులు చేసినంత కాలం వారు విదేశీ దిగుమతులపై, ముఖ్యంగా వ్యవసాయ ఉత్పత్తులపై ఏక పక్షంగా నిర్ణయాలు తీసుకోగలిగిన స్థాయిలో వున్నారు. అందువలన రాజకీయ స్వాతంత్రం కలిగిన, స్వాతంత్ర్యం లేని వలస దేశాలు, తమ ఋణాలు తీర్చటానికి యాంత్రిక ఉత్పత్తుల వినియోగ సరుకుల దిగుమతికి, తమ వ్యవసాయో త్పత్తులపై ఆధారపడటం, పారిశ్రామిక దేశాలకు లాభకరమయింది. ఈ దేశాలు పారిశ్రామిక దేశాలు విధించే షరతులకు - ధరలకు లోబడి వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతి - యాంత్రిక తయారీల దిగుమతులకు తలవొంచటం మినహా గత్యంతరం లేదు.

రెండవ ప్రపంచ యుద్ధం, ఆ తరువాత వివిధ దేశాల స్వాతంత్ర్యం పై పరిస్థితులను తారుమారుచేసినయ్. U.S.A. మినహా చాలా పారిశ్రామిక దేశాలు, పూర్వం లాగా ఋణదాతలు కావు. అలానే చాలా దేశాలు ఋణగ్రహీతలుగా లేవు. 'విదేశీ పెట్టుబడుల పట్టు ఈ దేశాలలో సడలింది. చాలా దేశాలు (వ్యవసాయ) ఆర్థిక స్వాతంత్ర్యం వైపు పరుగులు తీస్తున్నవి.' (వోయిటిన్‌స్కీ) పారిశ్రామికదేశాలు యుద్ధానంతరం తమ ఉత్పత్తులను అమ్మి వ్యవసాయోత్పత్తులను కొనటానికి ఆతృత పడుతున్నవి. గతంలో లాగా వ్యవసాయోత్పత్తుల కొనుగోళ్ళు చేయటానికి ఈ దేశాలకు వడ్డీ రాబడులు లేవు. వ్యవసాయ దేశాలు యుద్ధపూర్వం అనుభవించిన విలాసాలకు

స్వస్తి చెప్పి, తమ తమ దేశాలలో, వినియోగసరుకులను స్వదేశీ యాంత్రికత కుటీర పరిశ్రమల ద్వారా ఉత్పత్తి చేసుకొంటున్నవి. ఈ వ్యూహం చక్కగా ఆచరణలో పెట్టినట్లయితే వ్యవసాయ దేశాలు పారిశ్రామిక దేశాలకు దీటుకాగలవు.

వ్యవసాయ - పారిశ్రామిక దేశాల మధ్య అంతర్జాతీయ వర్తకపు క్రమబద్ధీకరణకు వివిధ మార్గాలనన్వేషించాలి. 'ఎగుమతి దార్ల మధ్య స్వేచ్ఛాయుత మయిన పోటీకి 'మార్కెటు అందుబాటులో లేదు. అలానే ప్రధానమయిన సరుకులకు స్వేచ్ఛా విపణి కూడా అందుబాటులో లేదు అని F.A.O. మరియు I.F.A.P. లు అభిప్రాయపడినవి.

అమెరికాలో వ్యవసాయవ్యయం, ఆస్ట్రేలియా కంటే ఎక్కువ. (ఎకరమునకు) ఆస్ట్రేలియాలో తలసరి వ్యవసాయాదాయం అమెరికా కంటే ఎక్కువ. ఈ రెండు దేశాలలోను వ్యవసాయ దారులను 'ఫార్మర్' (Farmer) అనే పిలుస్తారు. ఆస్ట్రేలియాలో పెద్ద రైతులు ఎక్కువ. యాంత్రిక వ్యవసాయం కూడా ఎక్కువ. అందువలన వారి గోధుమలు, పండ్లు, మాంసం ధరలు తక్కువగా వున్నప్పటికీ తలసరి ఆదాయం అమెరికా కంటే ఎక్కువగా వుంది. ఈ రెండు దేశాల వ్యవసాయ తలసరి ఆదాయం ఇండియా, చైనా, ఈజిప్టు రైతులకన్నా చాలా చాలా అధికం. భూకమతాలు చిన్నవి కావటం, రైతుల సంఖ్య అధికంగా వుండటం (ఇండియావంటి దేశాల్లో) దీనికి కారణం.

పారిశ్రామిక దేశాలకు వ్యవసాయోత్పత్తులను ఒకే ప్రపంచ ధరకు అమ్మటానికి చాలా దేశాలు ఇష్టపడుతున్నయ్. విచక్షణారహితమయిన ఈ పోటీ వలన కొన్ని దేశాల రైతులు నష్టపడుతున్నారు. పారిశ్రామిక వేత్తలు రాజీపడుతున్నారు. (మారిన పరిస్థితులలో).

ఈ దుస్థితి నుండి బయటపడేది ఎలా? అమెరికా 'న్యూడీలు' కొంత మార్గం చూపింది. ప్రపంచ ధరలతో సంబంధం లేకుండా, రూజ్‌వెల్టు గవర్నమెంటు (అమెరికా) అన్ని స్వదేశీ వ్యవసాయ తయారీలపై ప్రాసెసింగు టాక్సు (Processingtax - ప్రక్రియల పన్ను) ను, కొన్ని సరుకులపై 100% వరకు విధించింది. ఈ పన్ను చెల్లించి మాత్రమే ప్రాసెసింగు, మార్కెంటింగు ఏజన్సీలు తమ సరుకులను మార్కెట్లో విడుదల చేయవలసి వుంటుంది. ప్రాసెసింగు టాక్సు, మార్కెటింగుప్రాసెసింగు ఏజన్సీలు, మాన్యుఫాక్చరర్ వినియోగదార్ల మధ్య విభజించబడుతుంది. చాలాసార్లు వినియోగదార్లపై భారం అధికంగా వుంటుంది. స్వదేశీ వినియోగాలకు ఎక్కువ ధర కల్పించబడటం, రైతులకు ఎక్కువ ధర గిట్టుబాటు కావటం జరిగింది.

పై పద్ధతి ద్వారా విదేశాల ధరల స్థాయికి, స్వదేశీ ధరలను పెంచవచ్చును ఈ ప్రయత్నాలు భారీ ఎత్తున జరిగితే, అధిక సంఖ్యాకులయిన రైతులకు ప్రయోజనం కలుగుతుంది. పారిశ్రామిక ప్రజలకు, వ్యవసాయజనానికి మధ్యనున్న అసమానతలు కుదించబడతాయి. భారీపారిశ్రామిక దేశాలయిన U.S.A. జర్మనీ, జపాను వంటి దేశాల ప్రజలు అధిక ఆహార ధరలను భరించగలరు కనుక ఈ దేశాలలో మాత్రమే 'న్యూడీలు' ఉపయోగకరంగా వుంటుంది.

వ్యవసాయదేశాలయిన ఇండియా, చైనా, అర్జెంటినా, ఈజిప్టు, బ్రెజిలు, మెక్సికో, ఆస్ట్రేలియా వంటి దేశాలలో ఈ విధానం ఆచరణ యోగ్యం కాదు. ఈ దేశాలలో వ్యవసాయ ధరల స్థాయిని పెంచటానికి ఏం చేయాలి? ఈ దేశాలలో కాపిటలిస్టు పారిశ్రామిక వేత్తల సంఖ్య తక్కువ. వీరు ఆర్థికంగా అంతసుఖంగా లేరు. పెంచిన వ్యవసాయధరలను వీరు భరించలేరు. అధిక సంఖ్యగా వున్నరైతుల జీవన ప్రమాణాలను, అధిక ధరల బరువును మోయటం ద్వారా వీరు పెంచలేరు. ఈ దేశాల ప్రజలకు రెండే మార్గాలున్నవి. స్వయం సమృద్ధినాశ్రయించటం. దిగుమతుల అవసరాలను తగ్గించుకొని తద్వారా పారిశ్రామిక దేశాలతో తమ బేరశక్తిని పెంచుకోగలగటం. తమ ఆహార పదార్ధాలను, నూనెగింజలు వగైరాలను ప్రపంచ ధరలతో సర్దుబాటు చేసుకొని, తగిన ధరలకు ఎగుమతి చేయటం. కొన్ని దేశాలతో బార్టర్, ద్వైపాక్షిక ఒప్పందాలు వ్యవసాయ, పారిశ్రామిక సరుకులకు కుదుర్చుకోవటం. 'చాలా దేశాలు ఎగుమతుల ధరలు తృప్తికరంగా లేవని భావించినప్పుడు - ఆ సరుకుల ఎగుమతులను నిలిపివేస్తున్నయ్. ఊలు, లిన్‌సీడ్‌లను అర్జెంటినా, ఉరుగవే దేశాలు అమ్మటానికి విముఖంగా వున్నయ్. జాతీయ స్వయంసమృద్ధి సాధించిన తరువాత, ఒకటి గాని, అంతకు ఎక్కువగా గానీ, లేక ప్రపంచ వ్యవసాయదేశాలన్నిటిలో వివిధ వ్యవసాయ సరుకులకు నిర్ణయించిన మొత్తాలకు 'కోటా' పద్ధతిలో ప్రపంచ మార్కెట్లుకు సరఫరా చేయటానికి అంతర్జాతీయ ఒప్పందాలు కుదుర్చుకోవాలి. ఇంటర్నేషనల్ సుగర్ అగ్రిమెంటు, టీ అగ్రిమెంటు ఇందుకుదాహరణలు.

ప్రతిదేశం తన జాతీయ ధరలను అవసరాన్ని బట్టి మాటి మాటికి మార్చుకొని రైతులకు రక్షణ కల్పించవచ్చు. 'న్యూడీలు' వచ్చే వరకూ, జాతీయ ధరల స్థాయిని కృత్రిమంగా అందరకు లాభకరంగా పెంచవచ్చునని శాస్త్రవేత్తలంగీకరించేవారుకారు. ఇప్పటి లావాదేవీలన్నీ, ఒకే వర్గపు (రైతుల) కాపిటలిష్టు దోపిడీ విస్తరణకు ఇస్తున్న సంజాయిషీ లేననే సత్యాన్ని ఈ శాస్త్రవేత్తలు ఇప్పుడంగీకరించక తప్పదు. 'ఇంగ్లాండు

ఆహారపు సరుకులను స్వేచ్ఛగా దిగుమతి చేసుకోవటం అంటే - రైతులు తమ నికరాదాయాన్ని కోల్పోవటమే' అని ప్రొఫెసర్ కోలిన్‌క్లార్క్ అంగీకరించాడు. 'వ్యవసాయా దాయాలు యుద్ధానంతరం పెరిగినా, ఇతర వృత్తుల వారి ఆదాయాలకన్నా ఇప్పటికీ తక్కువేనని' I.F.A.P. అభిప్రాయపడింది. ప్రభుత్వజోక్యంతో వ్యవసాయ పారిశ్రామిక ధరల వ్యత్యాసాన్ని నిర్మూలించ వచ్చని నేటికి మనకర్ధమయింది. కాపిటలిజపు దోపిడీని బయటపెట్టటమే గాక, 'న్యూడీల్' మార్గాంతరాన్ని కూడా సూచించింది. చాలా దేశాలు నేడు వివిధస్థాయిల వ్యవసాయమద్దతులు - వివిధ మార్గాలలో దిగుమతి కోటాలు, ఎగుమతి సబ్సిడీలు, ప్రభుత్వాధిపత్యంతో ప్రవేశపెట్టినయ్.

ప్రతిదేశం తన సరుకుల ధరలను తానే నిర్ణయించుకోవాలనీ, నిర్ణయించు కోగలరని మనం తెలుసుకొన్నాం. ఈ ధరలు స్థానికులకు భారం కాకూడదు. అలానే రైతులు కార్మికులు గౌరవ ప్రదమయిన, అభివృద్ధిదాయకమయిన జీవితం గడపటానికి సరిపడే విధంగా వుండాలి. పోటీలో వున్నదేశాలలో ధరల నిర్ణయంలో ఎక్కువగా వ్యత్యాసాలుండకూడదు.

'ఒకేదేశంలోని ధరల స్వరూపం - ఖరీదు స్వరూపానికి (Price - Cost) అనుగుణంగా వుండి అవసరమయిన 'మొత్తం' సరుకును మాత్రమే, విదేశీ వర్తకంలోనికి ప్రపంచ ధరల స్వరూపానికి అనుగుణంగా ప్రవేశపెట్టగలదు.'అని హారోడ్ తన ఇంటర్నేషనల్ ఎకనామిక్సులో చెప్పారు. ఈ విధానం పెద్ద పారిశ్రామిక దేశాలకు, వ్యవసాయ దేశాలకన్నా ఎక్కువ లాభకరంగా వుంటుంది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఈ తేడాలు కొంతవరకు తగ్గించబడుతున్నవి.

ఈనాడు చాలా దేశాలు తమ అదనపు ఉత్పత్తులను 'మార్కెట్ల'లో క్రుమ్మరించి వర్తకాన్ని పాడుచేస్తున్నాయ్. అంతర్జాతీయ ఒప్పందాలలో, తగిన ధరలకు క్రమక్రమంగా సరుకును మార్కెటులోనికి అవసరాల మేరకే విడుదల చేయాలి.

అమెరికా తన దేశంలో ప్రత్తికి అధిక ధరకల్పించి మిగులు ప్రత్తిని ప్రపంచ ధరతో పాటు తక్కువకు అమ్మినట్లయితే - వెనుకబడిన ఇతర దేశాల రైతులు - అమెరికా ఎగుమతుల వలన నష్టపడే అవకాశం తగ్గుతుంది. అంతర్జాతీయ ధరలకు స్థానిక ధరలకు సమన్వయం వుండాలి. ఎక్కువ వ్యత్యాసం వుండకూడదు. స్థానికంగా ధరలు ఆకాశాన్నంటితే, స్వదేశీ వినియోగదారులు, ధరల నిర్ణయాన్ని వ్యతిరేకించి, దిగుమతులు పెంచమని ఆందోళన చేసి, ఈ విధానాన్నే రద్దు చేయించగలరు.

అంతర్జాతీయంగా వర్తకపు క్రమబద్ధీకరణ జరిగితే, ఇండియాలో రైతులు తమ వ్యవసాయ ఉత్పత్తులను తక్కువధరలకు, విదేశాల్లో ఎక్కువ ధరలకు అమ్ముకో గలరు. విదేశీ ఋణాలపై వడ్డీల చెల్లింపులకు, వ్యవసాయ ఉత్పత్తులను విదేశీ మార్కెట్లలో అల్పమయిన ధరల కమ్ముకొనే దుర్గతి తప్పుతుంది.

ఈ ద్వంద విధానం వలన అనగా సంపన్న దేశాలు మిగులు సరుకులను మార్కెట్లలో క్రుమ్మరించటాన్ని క్రమబద్ధం చేయటం, బీదదేశాలు అల్పధరలకు అమ్ముకొని ధరల మాంద్యం కల్పించకుండా వుంటే ప్రపంచ రైతులు ఒకరికొకరు సహాయపడివారి వివిధ ఆర్థిక స్థితిగతులకనుకూలంగా జీవించగలరు.

మొత్తం ప్రపంచ సరఫరాలు, వివిధ సరుకులు వాటి ప్రత్యామ్నాయాలను నిగ్గుదేల్చి వివిధ పంటలను కాటన్, సిల్కు, రేయాను వగైరాల విస్తీర్ణాలను విభజించి, నిర్ణయించి ప్రతి ఒక్క సరుకును ప్రపంచ సరఫరాను క్రమబద్ధీకరించ వచ్చును. అదనపు నిలువకు స్టోరేజీ సౌకర్యాలు, స్వదేశంలో బీదవారికి ఆ సరుకులపై సబ్సిడీలివ్వటం, స్టోరేజీలనుండి వినియోగదారుల వరకు సరుకు చేరే దాకా వివిధ దశలలో భద్రపరచటం వంటి చర్యలు - చట్టాల ద్వారా, పాలనా యంత్రాంగం ద్వారా చేపట్టవచ్చు. ప్రభుత్వ సాయంతో, పంట విస్తీర్ణాన్ని కఠినంగా నియంత్రించవచ్చు. సంపన్న దేశాలు పంటల విస్తీర్ణం తగ్గించుకుంటున్నప్పటికీ, బీద దేశాలు, పాక్షికంగా అభివృద్ధి చెందిన దేశాలలో నిబంధనలు సడలించి, పంటలు విస్తీర్ణాన్ని పెంచవచ్చు. బీద, బడుగుదేశాలకు ప్రాసెసింగు యంత్రాల కొనుగోళ్ళకవసరమయ్యే ఆర్థిక సాయం అందించాలి.

భారీ ఎత్తున అంతర్జాతీయంగా ఉత్పత్తుల అమ్మకాల ఒప్పందాలు కుదుర్చుకో లేక పోయినా, కొన్ని చిన్న చిన్న బలహీన దేశాలు ప్రపంచ వ్యాప్త వాణిజ్య సమాఖ్య (వాణిజ్య సముదాయం Zollverein)ల నేర్పాటు చేసుకొనవచ్చును. ఈ సమాఖ్య లేక సముదాయాలు తమ సంయుక్త ఆర్థిక శక్తితో ఆర్థిక సామర్థ్యం కలిగిన ఇతర ఉత్పత్తి దారులతో ఒప్పందాలుకుదుర్చుకొనే స్థాయి గలిగి, వినియోగదారులనుండి న్యాయ మయిన ధరలు రాబట్టగలవు.

సత్వరమయిన సంయుక్త చర్య అవసరాన్ని నొక్కిచెపుతూ - 'పరిమితమయిన మార్కెట్ల (Limited Markets) వంటి అడ్డంకులను - ఒకటీ అరా దేశాలు విడివిడిగా చేసే కృషి తొలగించలేదు' అని ఎకనామికల్ కమిషన్ ఫర్ లాటిన్ అమెరికా పేర్కొంది.

తమ రైతులు - ఉత్పత్తిదారులు, ప్రపంచ మార్కెట్లలో ఎదుర్కొంటున్న 'అనిశ్చిత ధరల' దుష్ప్రభావాల నుండి రక్షణకు 'ప్రాంతీయ వర్తక స్వయం సమృద్ధి ఆర్థిక పథకాలను ఆసియన్, ఫార్ ఈస్ట్ బాండుంగ్ ఆఫ్రో ఆసియన్ దేశాలు, కొలంబో కాన్ఫరెన్సు దేశాలు సిద్ధం చేసుకొంటున్నవి. B.E.E.C. దేశాలు అంతర్జాతీయ వర్తకంలో ముందడుగు వేసినయ్. ఫ్రాన్సు, బ్రిటీషు కామన్వెల్తు, సోవియట్ దేశాలు కూడా స్వయం సమృద్ధికి పాటుబడుతున్నయ్. ఈ కొత్త గ్రూపుల దుష్ప్రభావం - వెనుకటి గ్రూపులు కంటే తక్కువ అని F.A.O. అభిప్రాయపడింది. (1955). వాణిజ్య సమాఖ్యలు బలహీన దేశాల అదనపు విలువను అభివృద్ధి చెందిన దేశాలు దోపిడీ చేయకుండా జాగ్రత్తపడాలి. ఉదాహరణకు అమెరికా వ్యవసాయరాష్ట్రాలను పారిశ్రామికరాష్ట్రాలు దోపిడీ చేస్తున్నయ్. జర్మనీ వ్యాపారస్తులు, రైతులు కలసి నాజీ ఆధిపత్యంలోని యూరపును ఇతరదేశాల రైతులను దోపిడీ చేశారు. రష్యా ఆగ్నేయాసియా దేశాలను దోపిడీ చేసింది.

ప్ర∴వ్యవసాయదేశం, తమ ప్రధాన వ్యవసాయపంటలకు, ప్రత్యామ్నాయ పంటలకు, కనీస జాతీయధరలు స్థిరీకరించాలి. ఉత్పత్తుల - ఎగుమతుల మొత్తానికి అనుసంధానం, కోటాలు, వివిధ విపణులలో షేర్లు కలిగి వుండటం వలన దేశాల మధ్య న్యాయమయిన, సమతూకపు ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుంది. జాతీయ స్వయం సమృద్ధి, పంటల నియంత్రణ (అంతర్జాతీయంగా) లేనట్లయితే - జాతీయ ధరల విధానం విఫలమవుతుంది.

ప్రధాన వ్యవసాయ ఉత్పత్తుల జాతీయధరల స్థిరీకరణ - జాతీయ ఆదాయాల (ధరల) స్థాయిని బట్టి నిర్ణయించటం శాస్త్రవిరుద్ధంగా, ఆచరణకు అసాధ్యంగా కన్పించవచ్చు. వివిధ దేశాలలో ఆర్థిక కార్యక్రమాల అనిశ్చితత్వం పెరుగుతున్న దశలో, ప్రజాస్వామ్యయుతమయిన. సరళీకృతమయిన (Flexible) అభివృద్ధికరమయిన ప్రపంచ ఆర్థిక విధానం (ప్రపంచ ద్రవ్య నిధివున్నప్పటికీ) రూపుదాల్చే అవకాశాలున్నాయి. ఈ స్థితిలో ప్రతిదేశం, తన వివిధ వర్గాల ప్రజల జీవన ప్రమాణాల పట్టీ తయారుచేసుకొని ఆ వర్గాల ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతికాభివృద్ధులకు ప్రణాళికలలో తగిన మొత్తం కేటాయించి, వ్యయపట్టీని (Cost Shedule) స్థానిక ఉత్పత్తుల - మార్కెటింగుల కను గుణంగా సర్దుబాటు చేసుకొని మొత్తం ద్రవ్యచలామణీని ఈ పట్టీల ద్వారా నియంత్రణ చేసుకొనటం వలన అందుబాటులో వున్న ధనం తన దేశ ఆర్థిక జీవితానికి - అంటే వివిధ ఉత్పత్తుల - పంపిణీలకు వినియోగించుకోవచ్చును. (Robertson - Money and

Brussels conference). జాతీయ ఆదాయంను ధరల స్థాయిని జాగ్రత్తగా నిర్ణయించు కోగలిగితే కొనుగోలుశక్తిలో సమానత సాధించవచ్చు. ఇందువలన ప్రతిదేశం తన మొత్తం ద్రవ్యచలామణీని శ్రమజీవులకు నిరుద్యోగులకు అధిక ఆదాయం మెరుగయిన జీవన ప్రమాణాలకు అనువుగా మలచుకోవచ్చు.

మొత్తం ఉత్పత్తి వ్యాపకాలు - శ్రమజీవుల (శ్రామికుల - మేధావుల) జీవన ప్రమాణాలు, మొత్తం ద్రవ్య చలామణీల మధ్య ఆరోగ్యకరమయిన సమతౌల్యం రావాలంటే, బాంకింగు, విదేశీవర్తకం, పారిశ్రామికరంగం, ఆర్థిక సహాయత, వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగులపై ఆదేశం కంట్రోలు సంపాదించాలి. ప్రభుత్వ కంట్రోలు - ప్రైవేటురంగంతో సమాధాన పడాలి (అంటే ప్రైవేటు రంగంలోని బాంకు డిపాజిట్లు, ఇన్సూరెన్సు స్కీములు, రిటైలు వర్తకం, ఆంతరంగిక వర్తకం, పారిశ్రామిక రంగంలో తక్కువ ఉత్పత్తి సామర్థ్యం కల కీలక సేవలు) ఈ విధమయిన ప్రభుత్వ కంట్రోలును న్యూడీలు మరియు ఆక్స్‌ఫర్డ్ ఆర్థిక శాస్త్ర వేత్తలు సిఫారసు చేశారు.

ఈ ప్రణాళిక వలన 'మొత్తం' ప్రపంచ వర్తకంలో మొదట తగ్గుదల కనిపించవచ్చు. నేడు జరుగుతున్న అంతర్జాతీయ వర్తకంలో అధికభాగం అనవసరం - దుర్వ్యయం అని మా ఉద్దేశ్యం. వలస దేశాలు తమ 'A క్లాస్ గూడ్సు'ను ' B క్లాసు గూడ్సు'గా అంటే వ్యవసాయ ఉత్పత్తులను ముడి సరుకులను పాక్షికంగా గానీ సంపూర్ణంగా గానీ యాంత్రిక ఉత్పత్తులకు మార్చుకొని (పాక్షిక రక్షణ గలవి B క్లాసు గూడ్సు) వారి స్థానిక అవసరాలకు పోను మిగిలిన వాటిని మాత్రమే ఎగుమతి చేయాలి. ఉత్పత్తి - వినియోగం అధిక ఎగుమతులు నియంత్రణలకు, సాధ్యమయినంతవరకు అంతర్జాతీయ ఒడంబడికలను చేసుకొనటానికి మేము శ్రద్ధ చూపిస్తున్నాము. ఈ ఒడంబడికల వలన అనియంత్రిత అంతర్జాతీయ వర్తకం ప్రపంచ వర్తకంతో నియంత్రించబడిన వర్తకంగా జేయబడుతుంది. ఉత్పత్తిదారులు - వారిదేశాలతో ఏర్పాటు చేయబడిన ఈ విధమయిన కంట్రోలు - వినియోగదారుల న్యాయబద్ధమయిన కోర్కెలకు అనుకూలంగా వుండాలి.

విలాసవస్తువులకు, అప్రధానమయిన సరుకులకు అంతర్జాతీయ వర్తకంలో, భవిష్యత్తులో చోటుండకూడదు. ప్రతిదేశం అందరి లాభం కోసం, స్థానికుల వినియోగ వస్తువులను, కుటీర పరిశ్రమలు ఎలక్ట్రిసిటీ, చిన్నతరహా యంత్రాల సహాయంతో తయారు చేయటానికి ప్రయత్నిస్తుంది. ప్రాథమిక ఉత్పత్తి పనిముట్ల తయారీకి అవసరమయ్యే

యంత్రాలు, స్థానికంగా లభ్యం కాని ఖనిజాలు - ఇనుము - ఉక్కు, తగరం, రాగి వంటిలోహాలు, రబ్బరు ఆయిలు సాంకేతిక పరిజ్ఞానం (శాస్త్రజ్ఞులతో సహా) ను వలసలు దిగుమతిచేసుకోవలసి వుంటుంది. భారత శాస్త్రవేత్తలు విలాస వస్తువుల, వినియోగ దారుల సరుకుల దిగుమతులను ఏకగ్రీవంగా వ్యతిరేకిస్తున్నారు. వలసదేశాల నుండి పాక్షికంగా గానీ, సంపూర్ణంగా గానీ ప్రాసెస్ చేయబడిన, లేక యాంత్రికంగా తయారు చేయబడిన వ్యవసాయ సరుకులను పారిశ్రామిక దేశాలు దిగుమతి చేసుకొనక తప్పదు.

పెరిగిన అంతర్జాతీయ వర్తకపరిమాణం, ప్రపంచ ఆర్థికాభివృద్ధికి ముఖ్యమయిన సూచిక అని రాజకీయ వేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు భావించటం మానుకోవాలి. ప్రపంచ వర్తక వెల్లువలు (Booms) సంభవించిన కాలంలో ప్రపంచ ప్రజలు రైతులు, కార్మికులు, వలస ప్రజలు, దరిద్రాన్ని ఆకలిని దుర్భరమైన బాధలను అనుభవించారు. కనుక అంతర్జాతీయ వర్తక పరిమాణపు పెరుగుదల శ్రామిక జీవులకు సౌఖ్యవంతంకాదు. వాయటెన్స్కీ తన వరల్డ్ కామర్స్ అండ్ గవర్నమెంటు (1955) లో ఈ విధంగా ప్రమాణీకరించాడు. 'ప్రపంచ జనాభాలో 7% వున్న 160 మిలియన్ల వలస జనాభా యొక్క ప్రపంచ ఎగుమతులు 10%. వీరి తలసరి ఎగుమతులు మిగతా ప్రపంచం కన్నా అధికం. వలసలలో 48 డాలర్ల తలసరి ఎగుమతులయితే స్వతంత్ర దేశాలలో ఈ ఎగుమతులు 30 డాలర్లు మాత్రమే. తలసరి ఎగుమతులలో కల ఈ సంబంధం తలసరి ఆదాయాలకు విరుద్ధంగా వుంది. వలస ప్రజల తలసరి ఎగుమతుల ఆదాయం ఇతర స్వతంత్రప్రజల తలసరి ఆదాయంలో 1/5 వంతు మాత్రమే వుంది.' దాదాపు అన్ని దేశాలు ఏదో ఒక అంతర్జాతీయ ప్రాంతంలో వుండి, ఉత్పత్తులలో, పరిశ్రమలలో స్వయం సమృద్ధికలిగి వుండటం వలన సామాన్య ప్రజలు - ఆనందంగా - సంపన్నంగా కనీసం ఆకలి దరిద్రాలకు దూరంగా వుండగలరు. సామ్రాజ్య వాద ప్రపంచ వర్తకంపై మహాత్మా గాంధీ తిరుగుబాటుకు ఈ స్పృహే ముఖ్య కారణం. బ్రిటను అంతర్జాతీయ కాపిటలిజానికి, యుద్ధానికి ముందు జర్మనీ జపాను దేశాల జాతీయ స్వయం సమృద్ధి కార్యక్రమాలకు 'న్యూడీలు' ఇందువలననే సవాలుగా మారింది. ప్రపంచ వర్తకపు (యుద్ధానికి ముందు) దుష్ఫలితాలకు ఇది (New Deal) ఒక ప్రతీకార చర్య.

పై ఆలోచనాధోరణి, బ్రిటీషు శాస్త్రవేత్తలు ఆర్థిక సిద్ధాంతాలతో భావసారూప్యం కలిగివుంది. 'యుద్ధపూర్వం వలసలలో ధరల స్థిరీకరణ వలసదేశాలకు చాలా సహాయ కారిగా వుండేది. కానీ వారి సామ్రాజ్యవాద యజమానులు ధరల స్థిరీకరణ నడ్డుకున్నారు.

(Mr. G.F.M. DURBIN - Purchasing Power and Trade Depression) తగినంత మొత్తం ధనాన్ని నిలకడగా వుంచే విధానంలో వచ్చే కంట్రాక్ట్సు రాపిడీల వలన నిరుద్యోగం పెరుగుతుంది. వలసలలో ఈ విధానం అవలంబించటం వలన విదేశీ దిగుమతులు చౌకగానూ, స్వదేశీ ఎగుమతుల ధరలు అధికంగాను వుండి, వర్తకంలో అసమానతలు సంభవించి - ఋణభారం పెరగటమే కాక గతిలేక బంగారం ఎగమతులు కూడా చేయవలసి వస్తుంది. 'అందువలన ఋణసౌకర్యం ముఖ్యోద్దేశం ఆదాయాల స్థిరీకరణగా మిగులుతుంది.' స్వయం పరిపూర్ణ ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక సమతూకం వస్తుంది. ఇండియన్ ప్లానింగు కమీషను - కరెన్సీ విస్తరణ-లోటు బడ్జటుల క్రమబద్ధీకరణ విధానం సత్వర ఆర్థికాభివృద్ధికై చేపట్టింది. ఈ విధానం 1951 నుండి ద్రవ్యోల్బణాన్నరి కట్టింది.

ఈ(నా) ప్రతిపాదన కార్యరూపం దాల్చటానికి ప్రపంచ ఆర్థిక విధానం వేరువేరు ఆదాయవ్యవస్థలుగా విభజించబడటం అవసరం. ఈ వ్యవస్థల పరస్పర మారకాల సంబంధాలలో వచ్చే ఒడుదొడుకులు కూడా నిర్ణయింపబడాలి.

ప్రపంచంలో అనేక ప్రాంతాలలో మారకపు వాణిజ్య సమాఖ్యలు (సముదాయాలు Exchange ) ఏర్పాటు చేయబడతవి. ( ఈ ప్రతిపాదన అంతర్జాతీయ వర్తకపు నియంత్రణకు వర్తకపు తగ్గుదలకు దారితీస్తుంది. అనువాదకుడు). అంటే దరిద్రంలో ఆర్థికాభివృద్ధి ఆవశ్యకతలో ఒకే స్థితిలో వున్న ఇండియా - చైనా, సౌత్ ఆఫ్రికా మినహా ఆఫ్రికాల మధ్య ఒక ప్రాంతీయ సమాఖ్య, అన్ని ఇండో - అమెరికన్ రాష్ట్రాలలో ఒక సమాఖ్య. ఇంకొకటి ఇంగ్లాండు, U.S.A. కెనడాలతో ఇలా ఎన్నైనా సమాఖ్యల ఏర్పాటుకు అవకాశం వుంది. 'ఇందువలన ప్రపంచ వర్తక పరిమాణం తగ్గుతుంది. ఈ తరుగుదలను కాదనటం అవివేకమౌతుంది.' అని డర్బిన్ హెచ్చరించాడు. దీనికి పోటీగా అంతర్గత ఆర్థిక సంక్షోభనివారణ వలన ప్రపంచ ఉత్పత్తులు జీవన ప్రమాణాలు పెరుగుతవి అని కూడా డర్బిన్ హెచ్చరించాడు. 1933లో డర్బిన్ చెప్పింది నేడు కూడా యదార్థం. అంతర్జాతీయ వర్తకాభివృద్ధిపై ఆసక్తి కలిగిన పశ్చిమయూరపు దేశాలు కూడా ప్రపంచ ధరలు ఎలా వున్నా వ్యవసాయదారులకు తగిన ఆదాయం కల్పించటానికే ప్రాధాన్యత నిచ్చాయి. (F.A.O.) బెంగుళూరులో ఫిబ్రవరి 1956లో సమావేశమయిన ఆసియాదేశాలు (E.C.A.F.E) పరస్పర వర్తకాభివృద్ధి షిప్పింగు సౌకర్యాలు, రవాణా రాయితీల కొన సాగింపుతో అంతర్జాతీయ స్వయం సమృద్ధి, వర్తక ప్రాంతీయ మండలుల అభివృద్ధి దిశగా పయనించటానికి తీర్మానించారు.

నేను చేసిన 'జాతీయధర - ఆదాయస్థాయిల' ప్రతిపాదనను గురించి Mr. డర్బిన్ Mr. కోల్ (Mr. Cole, Editor to Durbin) లు ఆలోచించలేదు. కానీవారు వలసదేశాలలో మాజీవలసదేశాలలో నిలకడ ఆదాయాలను స్వతంత్ర చర్యల ఆవశ్యకతను ప్రత్యేకించి వ్యవసాయ ఉత్పత్తులను గురించి ఆలోచించారు. ఎదుగు బొదుగు లేని ఆదాయాలు ధరల స్థాయి అని నా ఉద్దేశ్యం కాదు. వ్యవసాయ ధరలను ఆదాయాలలో ప్రణాళికా బద్ధంగా పారిశ్రామిక వాణిజ్య ధరలతో సమాన స్థాయికి క్రమంగా తీసుకొని రావటం అని నా వుద్దేశ్యం. పారిశ్రామిక - వాణిజ్య ధరలు ఆదాయాలు కూడా స్థిరంగా చట్రంలో బిగించబడవు. పారిశ్రామికాభివృద్ధి పరిధిలో ఉత్పత్తి విభాగాలలో సాంకేతిక పరిజ్ఞానం శ్రామికుల సాంకేతిక శక్తి మొత్తం ఉత్పత్తి పెరుగుదల సామర్థ్యాల ద్వారా శ్రమజీవులందరి ఆదాయాలకు, అదనపు ఆదాయం వచ్చి కలిసే అవకాశముంది. అమెరికాలో వేతనాల స్థాయి ఎక్కువగా వున్నప్పటికీ A.P.L.C.I.O. ఇంకా ఎక్కువ వేతన స్థాయిలకై డిమాండు చేస్తున్నది.

జాతీయ ఆదాయం - ధరల స్థాయిల ఆవిష్కరణ జరిగినా తమ ఆదాయాన్ని నిలకడగా వుంచటానికి, అందులో తరుగులు పూరించటానికి ప్రయత్నాలు చేయవలసి వస్తున్నది. ఉదా:- 1954-55 లో ప్రపంచ గోధుమల ఉత్పత్తి - మార్కెటింగులకు 96% మద్దతు ధరల పాలసీనవలంబించటం జరిగింది. ఆయాదేశాలలో ఏఏ పంటలు అధికంగా పండించ వచ్చునో - వాటినే పండించాలన్న ఆలోచన మూలబడింది. దీనికి కారణాలనేకం - రక్షణావసరాలు, వ్యవసాయ ప్రజల పెరుగుతున్న రాజకీయ ఆర్థికశక్తి, పెరిగిన సాంకేతిక సామర్థ్యం. ఆధునిక రవాణా సౌకర్యాలు - కొన్ని ముఖ్య కారణాలు. 'అభివృద్ధి కొరత దేశాల' లో ఉత్పత్తి ప్రత్యేకతలు సాధించబడినప్పటికీ, వారి ఆదాయాలలో పెరుగుదల గానీ, నిలకడగానీ లేదు.' (Mr. Krause. U.S.A.)

వ్యవసాయ దేశాలలో శైశవ దశలో వున్న పరిశ్రమలకు రక్షణలు కల్పించబడాలి. వారి వేతన స్థాయిలను వ్యవసాయ ధరలను నిలకడగా వుంచగలగాలి. అందుకు అవసర మయితే - ప్రపంచ ధరలతో సమానత సాధించటానికి అధికంగా (ధరలకు వేతనాలను) వుండేటట్లు చూడాలి. విదేశీ - స్వదేశీ ధరల మధ్య సమానత్వ సాధనకు 'టారిఫ్'ల విధింపు అవసరమవుతుంది. అందువలననే 'అభివృద్ధి కొరత దేశాల' ప్రజలు - తమ ఉత్పత్తి ప్రత్యేకతల సాధనకు తగిన ప్రతిఫలాలేవి' అని ప్రశిస్తున్నారు. (Mr. Krause).

సోవియట్ రష్యా దీర్ఘకాలిక ప్రణాళికలను పరిచయం చేసింది. (అయిదు అంతకన్నా ఎక్కువ సంవత్సరాలు). భారీ అభివృద్ధి కార్యక్రమాలకు, అవసరమయిన నిధులను వివిధ దేశాలు అంతర్జాతీయ లావాదేవీలనుండి సమకూర్చుకొనవలసి వుంటుంది.

ఏదయినా ఒక దేశం పరస్పర సహకార, లేక ద్వైపాక్షిక ఒప్పందాలను, లేక బహుళ పక్ష ఒప్పందాలను, రెండు లేక మూడు దేశాల గ్రూపులతో కుదుర్చుకోగలిగితే, తన నిలువలను (Balances - అప్పులు - మిగుళ్ళు) ఆ దేశాలకు విస్తరింపచేసి, ఆయా దేశాలలో కూడ బెట్టబడిన లోటు - మిగుళ్ళను ఆదేశాల అభివృద్ధి కార్యక్రమాల ద్వారా అంగీకరించిన కాల పరిమితిలో చెల్లు వేయవచ్చును.

ఈ పాలసీ సోవియట్లు తమ పరస్పర అంతర్జాతీయ వర్తక సంబంధాలలో అనుసరిస్తున్నదే. పోలెండుకు మెషినరీ ఇతర సామాగ్రికి 550 మిలియన్ రూబుళ్ళు 10 సంత్సరాల గడువులో తీర్చటానికి ఇవ్వబడింది. స్వల్ప కాలిక ఋణంగా, ఆహార పదార్థాలు ముడి సరుకుల దిగుమతులకు, తూర్పు జర్మనీకి 121.5 మిలియన్ రూబుళ్ళు రెండు సంవత్సరాలకు, చైనాకు 1950లో 300 మిలియన్ రూబుళ్ళు 1954 లో మొదలై 10 సంవత్సరాలకు తిరిగి చెల్లించటానికి ఇవ్వబడింది. ఇటువంటి విధానాలతో U.S.S.R. కమ్యూనిస్టు బ్లాకులో తన వర్తక సంబంధాలను సమతూకంతో వుంచు కొనగలిగింది. సోవియట్ వర్తకం, మొత్తం ప్రపంచ వర్తకంలో 7% వుంది. ఈ విధానాల వలన సోవియట్ దాని మిత్ర దేశాల ఆర్థికాభివృద్ధి కుంటుపడలేదు. ఈ వాణిజ్య సమాఖ్యల వలన దేశాలు ఒక దాని పై ఒకటి ఆధారపడటం పెరిగింది. ముందు కాలంలో ఇతర దేశాలతో చేసే వర్తకం వీరికి అదనపు అవకాశమవుతుంది. వారి లాభాలకు వ్యతిరేకమయినది కాదు, ద్వైపాక్షిక ఒప్పందాల వలన అంతర్జాతీయ వర్తకం వారి వారి ఇష్టాలకు అనుగుణ్యంగా పెరుగుతుంది.

"అంతర్జాతీయ ఆర్థిక సమైక్యతకు - ముడి సరుకుల ధరల స్థిరీకరణ విధానం బలమయిన పునాది."

'ముడి సరుకుల ధరలు స్థిరంగా వుండటానికి - సరుకులకు వేరు వేరు ఒప్పందాలు చేసుకోవటం ఒక మార్గం. (ప్రతి సరకు ఉత్పత్తి - నిలువలపై ఒప్పందాలుతో వర్తక నియంత్రతణ షెడ్యూలు చేపట్టటం). (Prof. J. Timberson - 1955).

III

యుద్ధానంతరం జరిగిన వందల కొలది ద్వైపాక్షిక వర్తక ఒప్పందాలు వీటి వలన వచ్చిన ఇబ్బందులు నేను గ్రహించాను. 'ఏ దేశమూ తన ఆస్తులనూ, ఖర్చు పెట్టబడని అదనపు విదేశీ నిలువను - పేరబెట్టడం సరైన విధానం కాదని - ఆదేశం తన అంతర్జాతీయ వర్తకాన్ని, ఇతర దేశాలతో బాలెన్సు (Balance) చేసుకొని అమ్మకం ఎంత జరిగిందో అంత ఖర్చు చేయాలి. అని Prof. ఘూమేకర్ ప్రబోధించాడు. 'సంపాదించినదంతా ఖర్చు పెట్టు' అనేది ఆయన నినాదం. లార్డ్ కెయన్స్[1] కూడా ఈ నినాదమే ఇచ్చాడు. కానీ అభివృద్ధిలేని వ్యవసాయ దేశాలు, భారీ మొత్తాలలో ఇతర దేశాలనుండి యాంత్రికాభివృద్ధికి, నిర్మాణాలకు, భవిష్యత్‌లో అదనపు ఉత్పత్తుల కోసం, అప్పులు తీర్చటానికి మరలా ఋణాలు చేయాలి. లేకపోతే తమ విదేశీ మారకపు విలువలను ఐదేళ్ళ వరకు కూడ బెట్టి ఆ తరువాత అభివృద్ధి కార్యక్రమాలకు ఉపయోగించుకోవాలి. 'వలస దేశాలలో క్రమ క్రమంగా పెరుగుతున్న అదనపు ఉత్పత్తులను, వారి ఎగుమతులను, పారిశ్రామికాభివృద్ధి సాధించిన దేశాలు 'జీర్ణించుకొని' (Absorb) వలసలను ఋణ విముక్తులను చేయటానికి ముందుకు రావటం లేదు. హామీల నివ్వటం లేదు. ఈ హామీలు లేనప్పుడు వలసదేశాలు తమ అభివృద్ధికి అంతర్జాతీయ అదనపు వర్తకపు బాలెన్సులకై పోటీ పడటం, భారీ మొత్తాలలో U.S.A., U.K. లలో అప్పులు చేయటం, లేక T.C.A, 04 - గ్రాంటు ఇన్ ఎయిడ్‌లకై ప్రాకులాడటం తప్పదు.

'అంతర్జాతీయ వర్తక నిర్వహణకు ఆవశ్యకమయిన సిద్ధాంతాల పై ఏకాభిప్రాయం కనబడటం లేదు.' బహుపక్షస్వేచ్ఛావర్తకం విలువయిన లక్ష్యంగా చాలా మంది విశ్వసించటం లేదు.' అందువలననే సమన్వయం లేని జాతీయ విధానాలు ప్రపంచ వ్యాప్తి చెందుతున్నవి. అంతర్జాతీయ విధానాలు - ఆచరణల పునాదిపై అంతర్జాతీయ ఒప్పందాలు సంపాదించటం కష్టతరంగా వుంది.' అని Mr. క్రూజ్ అభిప్రాయ పడ్డాడు.

జనరల్ - అగ్రిమెంటు ఆన్ ట్రేడ్ అండ్ టారిఫ్స్ (General Agreeement on Trade and Tariff's) (G.A.T.T.)[2] ఒప్పందానికి ఏడు సంవత్సరాలు పట్టింది. ప్రస్తుతావసరాల పరిమితులను (యుద్ధపూర్వపు బహుళ పక్ష వర్తక సిద్ధాంతాల పునశ్చరణ

కంటే) G.A.T.T. ఎక్కువనొక్కి చెప్పింది. సబ్సిడీ లివ్వబడిన వ్యవసాయోత్పత్తులకు కూడా, వ్యవసాయ మద్దతు ధరల విధానాన్ని కల్పిస్తూ G.A.T.T. ఒక సంప్రదాయం నెలకొల్పింది. అయితే ఈ మద్దతు ఒక ప్రత్యేక ఉత్పత్తి. ప్రపంచ వర్తకంలో న్యాయమయిన లేక సమానమయిన వాటాను మించకుండా చూసింది (Equitable Share).

వ్యవసాయదేశాలు, పాక్షిక వ్యవసాయాధారిత దేశాలు యంత్రాలను, కాపిటల్ గూడ్సును (Capital Goods - ఉత్పత్తులకు అవసరమయ్యే సరుకులు) అధికంగా యుద్ధానంతర దశాబ్దంలో దిగుమతి చేసుకొన్నయ్. ఈ దిగుమతులకు తమ ఎగుమతుల ద్వారా చెల్లింపులు, (తమ ఉత్పత్తులు కుంచించుక పోవటం వలన, పారిశ్రామిక దేశాలు వీరి ఎగుమతులను నిరాకరించటం వలన) - సాధ్యపడటం లేదు. అందువలన ఈ దేశాలు తమ యుద్ధకాలపు డాలరు, స్టెర్లింగుల విలువను పోగొట్టుకొని U.S, U.K. ల వద్ద భారీగా అప్పుచేయవలసి వచ్చింది.

బహుళపక్ష వర్తకపు (MultilateralTtrade) లాభాలను చాలా ఎక్కువగా ప్రచారం చేయటం జరిగింది. ఈ వర్తకానికి లార్డ్‌కెయిన్స్ పేరు అతికించబడింది. ఈ వర్తకం కొత్తగా కనిపెట్టబడలేదు. లండను మనీ మార్కెటు ఆధిపత్యం కొనసాగినంత కాలం - ఈ విధానం ద్వారానే ఇంగ్లాండు ప్రపంచాన్ని శాసించింది. బలమైన శక్తిగా ఎదగటం, యుద్ధాల మధ్యకాలంలోని ద్రవ్యోల్బణం, యుద్ధ నష్ట పరిహారాల చెల్లింపులు - కొత్తగా వచ్చిన జాతీయ స్వయం సమృద్ధి ఆర్థికత, పరస్పర సహకారం, ద్వైపాక్షిక ఒప్పందాలు బహు పక్ష ఒప్పందాలు ప్రపంచ ఆర్థిక రంగంలో మరలా కాలూనినయ్.

వలసల ఆర్థికతపై ఈ విధానపు దుష్ప్రభావాలను లార్డ్‌కెయిన్స్ గమనించలేదు. పారిశ్రామికంగా అగ్రరాజ్యలయిన యూరపు, లండన్, అమెరికాల విదేశీపెట్టుబడులు, రాజకీయ సామ్రాజ్యవాదం, అమెరికా ఎక్స్‌పోర్టు, ఇంపోర్టు బాంక్ పెట్టుబడులు, ఇండో అమెరికన్ రాష్ట్రాలలో ప్రచ్ఛన్నంగా వలసలను లొంగదీసుకోగలిగినంత కాలం, ఈ బహుళపక్ష వర్తకం అగ్రరాజ్యాలకే పరిమిత మవుతుంది. ప్రపంచ ఆధిపత్యంలో, వలసల 'కొల్లముల్లె' లలో వాటాలు కుదిరితే వారి మధ్య బహుళ పక్షవర్తకం సాధ్యమవుతుంది.

యుద్ధానంతరం చైనా, ఇండియా, ఈజిప్టు, ఆస్ట్రేలియా వంటి దేశాలు అగ్రరాజ్యాలకు కొన్ని సమస్యలు తెచ్చిపడ్తున్నయ్. ఈ దేశాలు ఋణగ్రస్తంగా లేవు. పిల్లల ఆట బొమ్మల నుండి, మందుల వరకు గతంలో వలె ఇతరులపై ఆధారపడటం

లేదు. యుద్ధకాలపు సాంకేతిక శిక్షణతో వీరి కార్మికుల పనిసామర్థ్యం పెరిగింది. పాశ్చాత్య దేశాల కాపిటలిజపు దౌష్ట్యాన్ని వారు తిరస్కరిస్తున్నారు.

'ముడి సరుకుల ఉత్పత్తి నుండి లభించే ఆదాయం యాంత్రిక ఉత్పత్తులలో పోలిస్తే అల్పమనీ, ఈ విధమయిన ఆదాయం విదేశీ వర్తకంలో చౌకగా అమ్మి ప్రియంగా కొనటానికి త్రోవ తీస్తుందని అభివృద్ధి కొరత దేశాలు అభిప్రాయపడుతున్నయ్. మౌలిక విధానాలు - ఆచరణలపై అంతర్జాతీయ ఏకాభిప్రాయం సాధ్యపడటం లేదు.' (Mr. క్రూజ్) 'జాతీయ వాదానికి (వ్యవసాయ ఆర్థికతలో) నిజమయిన తనిఖీ లేదు.' అని మైకేల్ హాఫ్‌మాన్ 1955 ఆగస్టులో అంగీకరించాడు. అంతర్జాతీయ వర్తకంలో వ్యవసాయ ఉత్పత్తులపై నిబంధనలను విధించటం ఆనవాయితీ అయింది. ఆంగ్లో, అమెరికన్ ప్రభుత్వాలు విముక్తి పొందిన వలస దేశాల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బలహీన పరచే యత్నాలు చేస్తున్నయ్. పరస్పర సహకార వర్తక ఒప్పందాలు నష్టమని ప్రపంచాన్ని నమ్మించటానికి ఈ అగ్రరాజ్యాలు చాలా శ్రమిస్తున్నాయి.

'బహుళ పక్ష ఒప్పందాలు ద్వారా గతంలో వలె, రెండవ ప్రపంచ యుద్ధం తరువాత - సరుకుల నిరంతర ప్రవాహం మరలా జరగటం లేదు. భవిష్యత్తులో ఇప్పుడిప్పుడే జరిగే ఆశకనిపించటం లేదు. ఎందుకని? అప్పట్లో బహుళ పక్ష ఒప్పందాలలో అభివృద్ధికొరత దేశాలు కీలక పాత్ర కలిగి వున్నాయి. యుద్ధం తరువాత స్వయం సమృద్ధి సాధనకు కృషిచేస్తున్నయ్. ప్రత్యేక ఉత్పత్తుల కన్నా ఉత్పత్తుల్లో వైవిధ్యాన్ని (Diversification) పాటించి, స్వయం పోషకత్వం సాధించి, ప్రపంచ ఆర్థిక ఒత్తిడులనెదుర్కొన గలమనిఈ దేశాలు విశ్వసిస్తున్నాయి. కానీ Mr. వీలర్ (I.F.A.P.) తన సాంప్రదాయ పాశ్చాత్య కాపిటలిస్టు ధోరణితో 'వస్తువులు ఎక్కడ ఉత్పత్తి చేస్తే అధిక ప్రయోజనాలున్నవో అక్కడనే ఉత్పత్తి చేయాలి అనే సారూప్యలాభాల సూత్రపు పని తీరుకు విరుద్ధమయినదని చెప్తున్నారు (I.F.A.P. 1956).

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత పాశ్చాత్య ఆర్థికరాజనీతి నేతలు ఇంటర్నేషనల్ ట్రేడ్ - మనీ ఎకానమీ (Money Economy) ప్రపంచ విపణుల పునరుద్ధరణ తద్వారా లండను న్యూయార్కుల ఆర్థిక పెత్తనానికి కృషి చేశారు. ఈ కృషి ఇంతవరకూ సఫలం కాలేదు. హవానా చార్టర్ (Hawana Charter) G.A.T.T. వీరి విజయాలే. పరస్పర సౌహార్ద్రత, వివక్షతా రాహిత్యం పరుల ప్రయోజనాలపై సానుభూతి, వీటిలో పొందు

పరిచారు. ఈ నిబంధనలన్నీ 'అయితే - కానీ' లతో నిండి వుండి ఆచరణలో నిరుపయోగమయినయ్.

యుద్ధానంతర ప్రపంచం ప్రజాస్వామ్య -ఏకపక్ష నియంతృత్వాలుగా చీలింది. ఈ పరిస్థితిలో (సోవియట్ దేశాలలో) అంతర్జాతీయ వర్తకం ఐరన్ కర్టెన్- బాంబూ కర్టెన్‌లలో ఎలా జరుగుతుందీ, సరైన సమాచారం మన కందుబాటులో లేదు.

మనకు తెలిసిన ప్రజాస్వామ్య విభాగంలో వర్తక నియమాలు వ్యవసాయ సరుకులకు వ్యతిరేకంగా వున్నయ్. యుద్ధానంతర దశాబ్దిలో చాలా దేశాలలో వ్యవసాయా దాయాలు ఇతర వృత్తుల వారి ఆదాయాల్లో సగం కన్నా తక్కువగా వున్నాయి. సమాజంలోని ఇతరుల కన్నా వ్యవసాయదారుల స్థితి హీనంగా వుంది. (FAO - 1955). F.A.O. 1955 రివ్యూ ప్రకారం వ్యవసాయ దారుల, వ్యవసాయ కూలీల ఆదాయం, పారిశ్రామిక కార్మికుని సగటు ఆదాయంలో 37% మాత్రమే వుంది. అధికోత్పత్తులు, పెరిగిన వ్యవసాయ ఉత్పత్తుల ధరల వలన 1947లో తలసరి వ్యవసాయాదాయం, పారిశ్రామిక కార్మికుని ఆదాయంలో 80% పెరిగింది. కానీ 1953 నాటికి 50% పడిపోయింది. వ్యవసాయప్రజల పట్టణవలస పెరగటంలో ఆశ్చర్యంలేదు.

సమర్ధవంతమయిన వ్యవసాయ పద్ధతులు - జపాను వరి సాగు ఆచరణ, రసాయనాలు, రసాయనిక ఎరువుల వాడకం వంటి వాటి వలన - ఇండియాలో 1954కు పంటలు - పశుగణాభివృద్ధి చరిత్రకు తెలిసినంతలో అత్యధికంగా పెరిగినయ్. ఫలితంగా ఇండియన్ మార్కెట్లు వీటి అమ్మకాలకు చాలలేదు. రైతులకు గిట్టుబాటు ధరలు లేవు. 1954 పూర్వభాగంలో ధరలు పతనమయినయ్ మరలా 1954 చివరలో 1955లో టోకు ధరలు పూర్తిగా పడిపోయినయ్. ఆహార ధాన్యాలకు 20% పప్పు దినుసులకు 40% నూనె గింజలకు 50% తగ్గినవి. వ్యాపారస్తుల దగ్గర, గిడ్డంగులలో సరుకులు పేరుకొని పోయినయ్. మార్కెట్లు సరుకులతో నిండిపోవటంతో ధరలు అధికంగా పతనమయినయ్. వ్యవసాయేతర ఉత్పత్తుల ధరల మాత్రం నిలకడగా వున్నయ్. రైతుల నికరాదాయం, కొనుగోలు శక్తి తీవ్రంగా, స్వల్ప కాలంలోనే తగ్గింది. వ్యవసాయ కూలీల వేతనాలు తగ్గినయ్. పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వ వ్యయాన్ని, అభివృద్ధి కార్యక్రమాలకు, ఉద్యోగావకాశాలకు పెంచుకొంటూ పోతున్నప్పటికీ, గ్రామీణుల కొనుగోలు శక్తి, ఉద్యోగావకాశాలు నానాటికీ సన్నగిల్లుతుండటంతో, మొత్తం ఆర్థికత నిరాశాజనకంగా వుంది. దేశభక్తి అభివృద్ధి ఆసక్తులతో భారత రైతులు ఉత్పత్తులు పెంచటం - వర్తక

వ్యవసాయాల మధ్య సమతూకం తేవటంలో ప్రభుత్వం వైఫల్యం చెందటం కారణంగా రైతులెంతో నష్టపోయారు. మనదేశంలో అభివృద్ధి చెందిన - అభివృద్ధి చెందని గ్రామీణ - పట్టణ ప్రాంతాల వర్తక అసమానతలను గురించి Prof. గంగూలి హెచ్చరించాడు.

అమెరికా వారి లెక్కలు ఈ విషయాన్ని ఇంకా చక్కగా విశదీకరిస్తున్నయ్. 'వ్యాపార చక్రపు వివిధ దశలలో యుద్ధ - శాంతి సమయాలలో అమెరికా వ్యవసాయ దారుడు అతి తక్కువ, అన్యాయమయిన వాటాను మాత్రమే పొందాడు. ఈ అన్యాయం అధికోత్పత్తి వలన కానీ అసమర్ధత వలన కానీ కాదు. వ్యవసాయేతర ఉత్పత్తులు 28% వ్యవసాయేతరుల తలసరి ఆదాయం 15% పెరిగింది. వ్యవసాయోత్పత్తి 40% పెరిగితే, అన్ని వనరుల నుండి లభించే తలసరి ఆదాయం 9% తగ్గింది. వ్యవసాయాదాయాన్నుండి వచ్చే తలసరి ఆదాయం 19% తగ్గింది.' (U.N. Conference on Economic Progress P. 580)

టర్మ్స్ ఆఫ్ ట్రేడ్ (Terms ofTtrade) వర్తక నిబంధనలను సమానత్వ పునాదులపై నిలుపటం వివిధ వర్గాల ప్రజలు, రకరకాల వృత్తులు, వర్తకాలతో అందిస్తున్న సేవలతో ముడి బెట్టబడిన సమస్య. గతంలో రైతులకు, చేతి వృత్తుల వారికీ టర్మ్స్ ఆఫ్ ట్రేడ్ వ్యతిరేకంగా వున్నయ్. సామ్రాజ్యవాదం ఒకవైపు, ఫ్యూడలిజం వేరొక వైపు - ప్రపంచ వ్యాప్త గ్రామీణ - పట్టణ ప్రాంతాల అభివృద్ధి అసమానతలకు కారణం. ఈ అసమానతలను అధిగమించటానికి, పరిశ్రమలలో అభివృద్ధికి గత శతాబ్దంలో వివిధ దేశాల మధ్య 'టారిఫ్'లు ప్రవేశ పెట్టబడినయ్. ఆర్థిక మాంద్యంలో వ్యవసాయాన్ని ఆదుకోవటం కోసం అమెరికా మద్దతు ధరల విధానం తెచ్చింది. ఈ ధరల మద్దతు విధానం ఒక దేశం తరువాత వేరొక దేశం అమలు పరచటం జరిగింది. 'సమన్వయ ధరలు (Parity Prices) మద్దతు ధరలనేవి ఆ సంవత్సరపు మర్యాద పూర్వక ధరల (Courtesy Prices) నాధారంగా నిర్ణయించటం వలన రైతులకు పూర్తి న్యాయం జరుగలేదు. అందువలన వ్యవసాయ వ్యయాలు, రైతుల, రైతుకూలీల వారి కుటుంబాల జీవన ప్రమాణాలను ఆధారం చేసుకొని, మరలా కొత్తగా పారిటీ ధరలు గానీ, మద్దతు ధరలు గానీ నిర్ణయింపబడాలని మేము కోరటం జరిగింది. ధరల ఉరితీత నుండి రైతులను రక్షించటానికి ఏ రాజకీయ పార్టీ, రాజనీతి వేత్త చేయలేని పనిని రెండవ ప్రపంచ యుద్ధం చేసింది. రైతుల డిమాండ్లకు యుద్ధకాలంలో ప్రభుత్వాలు తలవొగ్గినయ్. యూరపు దేశాలు - సమర్ధవంతమయిన వ్యవసాయం, న్యాయమయిన వ్యవసాయ వ్యయం

ఆధారంగా, రైతు సంఘాలు, సహకార సంఘాలతో చర్చల ద్వారా మద్దతు ధరల రూపొందించారు. 'ఉత్పత్తిదారుల ఆదాయాల, ఉత్పత్తుల ధరల రక్షణ - దిగుమతులు చేసుకొనే దేశాలకే పరిమితం కాలేదు. ఎగుమతి దేశాలకూ విస్తరించింది. వివిధ దేశాలలో వివిధ మార్గాల ద్వారా ఆచరణలో వుండి, అంతర్జాతీయ వర్తకంలో పోటీని పెంచింది. (F.A.O.) కొరతలు నివారించబడిన తరువాత అంతర్జాతీయ, స్థానిక మార్కెట్ల అంతరాలు - గతంలో కన్నా ఎక్కువ సమర్థవంతమయిన రక్షణలను కల్పించినవి.

దీని పరిణామంగా కొన్ని దేశాల ధరలు, ప్రపంచ విపణులకై పోటీపడేస్థాయిలో సంబంధం లేకుండా వున్నయ్. 'యునైటెడ్ కింగ్‌డమ్ (బ్రిటీషు సామ్రాజ్యం) తో సహా చాలా దేశాలలో ఇదే పరిస్థితి వుంది.' ఈనాడూ అదే పరిస్థితిని కోలిన్ క్లార్క్, నాష్‌లు ఫిర్యాదు చేశారు. ప్రపంచంలో ధరల మద్దతు విధానం - అంతర్జాతీయంగా వర్తకాన్ని ఎదుగూ బొదుగూ లేకుండా యుద్ధ పూర్వపు స్థితిలో వుంచింది. కాని ప్రపంచ వర్తకం మాత్రం ముందుకు దూసుకొని పోతున్నది.' బియ్యం దిగుమతి చేసుకొనే దేశాలు, బియ్యం ఉత్పత్తిలో స్వయం సమృద్ధి సాధన లక్ష్యంగా పెట్టుకొన్నయ్. ఆ కారణంగా అంతర్జాతీయ వర్తక పరిమాణం కుంచించుకొని పోతున్నది. గోధుమ ఉత్పత్తి కూడా ఇదే విధంగా వుంది. అయితే ఈ విధానం అంత కల్తీలేని దుర్మార్గమా? ఈ ఆహార ధాన్యాల స్వయం సమృద్ధి విధానం, U.S.A., కెనడా, న్యూజిలాండు, ఆస్ట్రేలియా వంటి వ్యవసాయోత్పత్తుల ఎగుమతులపై ఆధారపడిన దేశాలకు బాధాకరంగా వుంది. స్వదేశీ ధరల విధానం అమలు ప్రపంచ మార్కెట్లకు, స్వదేశీ మార్కెట్లను దూరంగా, స్వతంత్రంగా, నిలకడగా వుంచటానికి చేసే ప్రయత్నాలు వారికి ఇబ్బందిగా వున్నాయి. 96% గోధుమ పంట, మార్కెటింగు, ధరల మద్దతు విధానం ఆధారం చేసుకొని పండించబడింది అని U.S. అగ్రికల్చరల్ డిపార్టుమెంటు జులై 1955లో పేర్కొంది. C.E.E. తో నిలువచేయబడిన అమెరికా గోధుమల వలన ప్రపంచ గోధుమ ధర నిలకడగా వుంది. కెనడా, ఆస్ట్రేలియా దేశాలలో అమలులో వున్న 'తరుగుదల ధరలను ప్రపంచ మార్కెటులో' సర్దుబాటు చేయటానికి బదులు, అవలంబించిన విధానం అమలు చేస్తే రైతుల - వినియోగదారుల అభివృద్ధి, రక్షణ, సౌభాగ్యం భద్రంగా వుంటుంది. F.A.O. C.C.E. - 55 - 61 - 1955 ఏప్రిల్).

అనవసరమయిన 'అదనపు ఉత్పత్తులను' తగ్గించుకోవటం, భూములను ఇతర స్వదేశీ వినియోగాలకు ఉపయోగపెట్టడం, అదనపు ఉత్పత్తులను ఇతర ప్రయోజనాలకు

మళ్ళించటం, లేక ఇతర దేశాలకు 'ధర్మ సహాయం' (Grant in Aid) చేయటం, సహాయ కార్యక్రమాలకు ఉపయోగ పెట్టటం అవసరం. U.S.A. కెనడా, న్యూజిలాండు వంటి దేశాలు, పశుగణాభివృద్ధి చేస్తూ, తమ గోధుమ నిలువలను కొన్ని సంవత్సరాల వరకు తమ దేశంలోనే ఖర్చు చేస్తున్నవి. 17 నుండి 45 మిలియన్లను చేరుకొన్న వారి అదనపు నిలువలను పశువుల దాణాగా ఖర్చు చేయటం కంటే వేరే మార్గం వారికేముంది?

పెద్ద దేశాల అదనపు నిలువలను - అభివృద్ధి కొరత గలిగిన దేశాలలో పార బోయటం (Disposal) వేరొక మార్గం. అయితే ఈ ఎగుమతులు (Disposal) (ధాన్యం పాలపొడి, పాలు వగైరాలు) అభివృద్ధి కొరత కలిగిన దేశాలలో, చాలీ చాలని తిండితో గడుపుతున్న నిరుద్యోగులకు, చిరుద్యోగులకు, ఉద్యోగ కల్పనకు, పునరావాసానికి వుద్దేశించబడాలి. ఇండియాలో అదనపు వ్యవసాయ నిలువలనుపయోగించుకొనే పద్ధతులపై చేయబడిన 'మార్గదర్శక అధ్యయనం' (Pilot Study) - మూడు విధాల ఉపయోగాలపై జరిగింది. ఒకటి అదనపు ఆర్థికాభివృద్ధికై చేసే సహాయం, రెండు - బడుగు, బలహీన వర్గాల వారికి ఆహారం అందివ్వటం, కరువు కాటకాల నివారణకు, మూడు - అదనపు అభివృద్ధి కార్యక్రమాల ద్వారా వచ్చిన అదనపు పెట్టుబడుల ద్వారా కల్పించబడిన ఉపాధి, ఆహార సరఫరాలు - స్థానిక మార్కెటు సరఫరాలపై దుష్ప్రభావం చూపకుండా వినియోగించటం. ఇది (మూడవది) మేలైన విధానంగా గ్రహించటం జరిగింది. ప్రజాస్వామ్య దేశాల ఆర్థిక విధానం వింతగా వుంది. ఈ దేశాలలో రైతులు అవసరాల కనుగుణంగా అధికోత్పత్తులతో మార్కెట్లు నింపటానికి సిద్ధంగా వున్నారు. వందల, వేల మిలియన్ల ప్రజలు అర్ధాకలితో పోషణా లోపాలతో కుంగి పోతున్నారు. ప్రభుత్వాల వద్ద వీటిని సరిచేసే ఆర్థిక విధానాలు, సాంఘిక ప్రణాళికలు, వీటి ద్వారా రైతుల, అన్నార్తుల జీవన ప్రమాణాలు పెంచి, అందరికీ ఆహారం అందించే విధానాలు, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో కొరబడినయ్. 'వారికందు బాటులో వున్న స్వల్పపోషణా పదార్థాలలోనైనా 15 నుండి 50% వరకు ఉత్పత్తులు పెరగవలసి ఉంది (U.S. Conference on Economic Progress).

యుద్ధ పూర్వపు అంతర్జాతీయ స్వేచ్ఛావర్తక విధానం విఫలమయింది. F.A.O. సూచించిన అదనపు నిలువను పారబోయటం (Disposal of Surpluses) శాంతియుత మయిన అభివృద్ధికరమయిన పరిష్కారంగా కనపడుతున్నది. అంతర్గత ఆర్థికత్వానికి

భంగం కలుగకుండా - ఈ ప్రణాళిక అమలు చేయగలిగితే రైతుల ఆర్థికస్థితి, ప్రజల పోషణ త్వరితంగా మెరుగుబడుతుంది.

రెండవ ప్రపంచ యుద్ధం, యుద్ధ సంసిద్ధతకు గాను పెంచుకొన్న ఆహార నిలువలు, యుద్ధానంతరం వచ్చిన ఆహార కొరత - ప్రపంచ విపణుల మోసాన్నుండి ప్రపంచాన్ని బయట పడేటట్లు చేశాయి. చాలా దేశాలు తమ వ్యవసాయ ధరల స్థాయిలను, ప్రపంచ ధరలకు దూరంగా వుంచినయ్. అర్జెంటినా, టర్కీ, స్థానిక ధరలకు రక్షణ కల్పించి - ఎగుమతులకు సబ్సిడీలిచ్చినయ్. అమెరికా స్థానికంగా తన గోధుమ ధరను, ఎగుమతి మార్కెటు కన్నా హెచ్చుగా వుంచవలసి వచ్చింది. పశ్చిమ యూరపు దేశాలు స్వదేశీ మార్కెట్లపై విదేశీ మార్కెట్ల ప్రభావం పడకుండా జాగ్రత్త (Insulate) పడినయ్.

'వచ్చే 10 లేక 20 సంవత్సరాలలో ప్రపంచ వర్తకం అనూహ్యంగా పెరుగుతుంది. వ్యవసాయోత్పత్తులలో మాత్రం ప్రపంచ వర్తకం, రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వెనుకబడుతున్నది. ఈ వెనుకబాటు తనం ముందు ముందు ఇంకా ఎక్కువ కాగలదు' అని Mr. M.A. వీలర్, శెక్రటరీ I.F.A.P. హెచ్చరించాడు. స్వేచ్ఛా ప్రపంచంలో ప్రతిదేశం తన దేశపు రైతులకు సమర్థవంతమయిన నూతన ఉత్పత్తి విధానాల ఆసరాతో - తగిన ప్రతిఫలాలు రాబట్టటానికి కృషి చేస్తున్నది. (Wheeler).

ఆధునిక వ్యవసాయ దారునికిది ఒక గొప్ప విజయం. వారి గొంతులను నిర్లక్ష్యం చేయటం, నొక్కి వేయటం ఇక ముందు సాగదు. స్వదేశీ మార్కెట్లను విదేశీ మార్కెట్లకు దూరంగా వుంచటం కొందరు నార్త్ అమెరికా రైతు నాయకులకు మింగుడు పడటం లేదు. మార్కెటింగు - ఉత్పత్తులలో ప్రభుత్వ జోక్యాన్ని వారు నిరసిస్తున్నారు. కానీ వారిది వ్యవసాయ దారుల రక్షణ, అధికవ్యవసాయాదాయాలను అందించే బాట కాదు. వారి సలహా వింటే, గత శతాబ్దపు పూర్వార్ధంలో బ్రిటనులో లాగా - కాపిటలిస్టు నాయకత్వానికి దారివేయిబడుతుంది. 'పారిశ్రామిక కార్మికునికి ఆహారం అతి ఖరీదు అయింది. పారిశ్రామిక విస్తరణ కోసం వ్యవసాయాన్ని బలి చేశారు' అని లార్డ్‌బాయిడ్ వోర్ బాధతో చెప్పవలసి వచ్చింది'. భూమి దున్నేవాడిని దోపిడీ చేసి, అతని కొనుగోలు శక్తి బలహీనపరచి, ప్రపంచం చౌకగా ఆహారం సంపాదించటం వలన యాంత్రిక ఉత్పత్తులకు మార్కెట్లు లేకపోవటం వలన ఆర్థికమాంద్యం వచ్చిందని అది ఎక్కువ కాలం కొనసాగిందని మరచిపోగూడదు'. ప్రధాన వ్యవసాయోత్పత్తుల కన్నింటికీ బ్రిటీషు ప్రభుత్వం గిట్టుబాటు ధరలు కల్పించింది. బ్రిటీషు వారి వ్యవసాయ సామర్థ్యం అతి

త్వరగా పెరిగింది. అతిబీద కుటుంబం కూడా తన ఆహారావసరాలను తీర్చుకోగలిగిందని' బాయిడ్ వోర్ వ్యాఖ్యానించాడు. కన్సర్వేటివ్ - లేబర్- ఈ రెండు రాజకీయపార్టీలు ఈ ఘనత తమదంటే తమదని చెప్పుకొన్నయ్. కానీ నేషనల్ ఫార్మర్స్ యూనియన్ ఈ ఆహార విధానాన్ని నిర్మించటంలో, కొనసాగించటంలో ప్రధాన పాత్ర వహించింది. (Farming Around the World - P - 107) వ్యవసాయ ధరల మద్దతు విధానం వ్యవసాయ ప్రజలకే కాక, సమాజమంతటికీ విలువయినదని ప్రపంచ దేశాలు గుర్తించినయ్. (World Agriculture. Nov. 1952).

ప్రపంచ రైతు నాయకులు - 19 వ శతాబ్దపు ఉత్తరార్ధంలో కాపిటలిస్టులు మాన్యుఫాక్చరర్లు, శాస్త్రవేత్తలు అవలంభించిన విధానాన్ని నేడవలంబించటం శ్రేయో దాయకం కాదు. నార్త్ అమెరికా రైతులు తమకు తెలియకుండానే స్టాలినిస్టు లేక సోవియట్ - 'క్షేత్రం నుండి కర్మాగారం' (Farm - Factory Economy) ఆర్థిక విధానాన్ని బల పరుస్తున్నారు. యాంత్రిక వ్యవసాయం 'రైతులను నడ్డి విరిగే చాకిరి' నుండి రక్షించిందని సంబరపడుతున్నారు. (1955 క్యూబెక్ - మానిటర్టైమ్స్ వ్రాతలిందుకు కారణం కావచ్చు) 'చిన్నరైతులను తోసివేసి, వైయక్తికంగాని పెద్ద వ్యవసాయ సంస్థలు చోటుచేసుకొంటవి' అని క్యూబెకు మానిటరీ టైమ్సులో వ్రాసిన వ్రాతల కనుగుణంగా వీరు అభిప్రాయ పడుతున్నారు. రష్యాలో రైతులు తమ భూములను ప్రభుత్వ సంస్థలపరం చేశారు. అగ్రికల్చరల్ ట్రేడ్ డెవలప్మెంటు అండ్ అసిస్టెన్స్ ఆక్టు చేయటానికి బాధ్యులు వీరే (North America leaders). 50 మిలియన్ డాలర్ల విలువయిన వ్యవసాయోత్పత్తులను ఈ చట్టం ద్వారా 1955 జూనుకు U.S.A. ఎగుమతి చేసినందుకు వారు గర్వపడు తున్నారు. నార్త్ అమెరికా (North America, U.S.A.,) ప్రేరణ స్ఫూర్తితో ఆవిర్భవించిన G.A.T.T. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన వెంటనే, అదే స్ఫూర్తితో ప్రపంచ విపణులతో, నిరాటంకంగా అంతర్జాతీయ వర్తకం కొనసాగటానికి తనకున్న ద్వైపాక్షిక బహుళ ఒప్పం దాల అధికారాలతో, ఇతర దేశాలలో టారిఫ్‌లు పెంచకుండా, ఆ దేశాల అంతర్గత ఆర్థికతను నిలద్రొక్కుకోనీయకుండా ప్రయత్నాలు చేసింది. U.S.A. కు మరికొన్ని దేశాలకు మాత్రం కొన్ని మినహాయింపుల నిచ్చింది. ఆ దేశాలలో స్థానిక ధరలు, ప్రభుత్వ మద్దతుతో ప్రపంచ ధరలకంటే ఎక్కువగా వున్నప్పుడు దిగుమతులను 'టారిఫ్‌లతో' అడ్డుకొన్నది. అంతేగాక గోధుమ, ప్రత్తి, పాల ఉత్పత్తుల వంటి వాటిని, స్థానిక ధరలకంటే కొంత పరిమితికి లోబడి, తక్కువ ధరలకే ఎగుమతి చేయటానికి వీలు కల్పించింది.

ఈ పరిస్థితులలో వెనుక బడిన, రక్షణ, ఐక్యత కరువయిన, అభివృద్ధి చెందని దేశాల రైతులు ఉత్పత్తి - మార్కెటింగులలో ప్రభుత్వ జోక్యం వుండరాదని అమెరికన్ రైతు నాయకులు, వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు కోరటం అర్థరహితంకాదా? నార్త్ అమెరికానుండి వచ్చిన, పాశ్చాత్య శాస్త్ర ప్రభావానికి లోనైన చాలా మంది నిపుణులు (F.A.C. - G.A.T.T. - I.F.A.P. etc) నేడుకూడా ఆర్థిక మాంద్యానికి ముందున్న 'స్వేచ్ఛావర్తకం' కొరకు తపిస్తున్నారు. వారు అభివృద్ధిదాయకమయిన స్వదేశీ మార్కెట్ల స్థిరత్వాన్నంగీకరించ లేకపోతున్నారు. ఈ నూతన విధానాన్ని దుయ్యబడుతున్నారు. హిందుస్తాన్ టైమ్స్ పత్రిక (న్యూఢిల్లీ) - 'గోధుమ ఎగుమతి ప్రభుత్వ గుత్తవ్యాపార మయింది. భారీ ఎగుమతి దారులకు దాసోహం చేస్తున్నది' అని వ్రాసింది. U.S.A. లో సాంకేతికాభివృద్ధి వలన వ్యవసాయ రంగంలో అధిక ఉత్పత్తి భూవిస్తీర్ణంతో ఏమీ సంబంధం లేకుండానే పెరగటానికి కారణమయింది. శతాబ్దం పాటు స్వయం సమృద్ధి విధానం వ్యవసాయ రక్షణ విధానం అనుసరించిన U.S.A. తాను యాంత్రిక వ్యవసాయ ఉత్పత్తుల రెండింటిలో భారీ ఎగుమతి దారుగా మారటంతో బహుళ పక్ష ఒప్పందాలు, సాపేక్ష వ్యవసాయవ్యయాల సూత్రం (Law of Relative Costs of Production) సామాన్య సారూప్య (Comparitive) లాభాల సూత్రాలకు ముఖ్య ప్రచారకుడు కావటం వెనుకబడిన దేశాలకు భయం కలిగిస్తున్నది. గతంలో పారిశ్రామిక వేత్తలు, నేడు U.S. వ్యవసాయ దారులు, ఈ బహుళ పక్ష ఒప్పందాల ప్రచారకులు కావటం ఒక ముఖ్యమయిన మలుపు. అదనపు నిలువల వత్తిడి పెరగటం జాతీయ విధానాలలో అవసరమయిన సర్దుబాట్లలో భేదాలు పెరగటానికి కారణమవుతుంది. మార్కెట్ల స్వతస్సిద్ధమయిన పనితీరు వలన ఇలా జరుగదు.' అని F.A.O. హెచ్చరించింది.

'ఆచరణాత్మకము, అనుకూలమయిన అంతర్జాతీయ సహకార విధానం వస్తువు - వస్తువుకూ (వేరువేరుగా) అనుసరించితే తీవ్రమయిన ఆర్థిక యుద్ధం నివారింప బడుతుందని వీలర్ అభిప్రాయపడ్డాడు. ప్రపంచ గోధుమల ఒప్పందం వంటి ఒప్పందాలు రోజు రోజుకూ నిరుపయోగమగుతున్నయ్. ఇండియా వంటి దేశాలు అదనపు నిలువలు కలిగి వున్నయ్. గతంలో ఇవి దిగుమతులపై ఆధారపడి చేయబడిన ఒప్పందాలు. 'ఇటువంటి ఒప్పందాలు' ధరలు ఎక్కువగా వున్నప్పుడు ఉత్పత్తి దేశాలు వినియోగదేశాలకు సహాయం చేయటం, ధరలు తక్కువగా వున్నప్పుడు వినియోగ దేశాలు - ఉత్పత్తి దేశాలనాదుకోవటానికి ఉపయోగపడతవి'. దురదృష్టవశాత్తు ఈ రెంటినీ సమన్వయ

పరచటం సాధ్యం కాదు. అందువలన ప్రాయోజిత ప్రపంచ వ్యవస్థలు - ప్రజాస్వామ్య దేశాలలో కొన్ని లేక అన్ని దేశాలతో ఒప్పందాలకు, సమాచారం ఇచ్చి పుచ్చుకోవటం, పంటల ప్లానింగు సరిచూసుకోవటం, బఫర్ స్టాక్సు (Buffer Stocks) నిర్మించుకోవటం లో అగ్రిమెంట్లు కుదుర్చుకోవాలని ఆశిస్తున్నవి. అంతర్జాతీయ అగ్రిమెంట్ల ద్వారా అధిక ప్రపంచోత్పత్తి - ధరలలో నిలకడ సాధ్యమని వీలర్ భావిస్తున్నాడు. ప్రభుత్వాలు ఒక అంతర్జాతీయ సంస్థకు ఈ బాధ్యతను అప్పగించటానికి సిద్ధంగా లేవు అని కూడా Mr. వీలర్ వ్యాఖ్యానించాడు.

ఈ శతాబ్దపు ఉత్తరార్ధంలో ప్రపంచ విపణుల పునరావాసం అసాధ్యమని, ఉదార స్వేచ్ఛా వర్తకాలకు నూకలు చెల్లినవని, జాతీయ ధరల విధానం అమలులో వుందని మనం గుర్తించాం. పారిటీ ధరలు, వ్యవసాయ ఉత్పత్తులకు ధరల మద్దతు, రైతుల జీవన ప్రమాణాలకు రక్షణలు - మన ఆర్థిక వాదానికి పునాది అని గ్రహించాలి. వైవిధ్య ఆర్థిక విధానం (Diversified) అంతర్జాతీయ కాపిటలిజంపై ఆధారపడిన ' ప్రత్యేక ఆర్థిక విధానం (Specialised Economy) కన్నా మేలయినదని, రైతుకూలీలకు మేలయిన పని - జీవన స్థితి కల్పించాలని, రైతుస్వామ్యం ఉద్యోగ కల్పనకు, ఆర్థిక స్వాతంత్ర్యానికి, స్ఫూర్తికి మూలమని దీనివలన వికేంద్రీకరణ సహకార పటుత్వం పెరుగు తుందని తెలుసుకోవాలి. అభివృద్ధి చెందని దేశాలకు అంతర్జాతీయ పోటీ నుండి రక్షణ కల్పించాలి. వర్తక విలువలు పల్లెలలో, పట్టణాలలో సమానంగా వుండాలి. సోవియట్ ఆవిర్భావం, దాని పారిశ్రామిక సిద్ధాంత ధోరణులతో - అమెరికా స్వేచ్ఛా ప్రపంచపు బహిరంగ వ్యవస్థను ఛాలెంజి చేస్తున్నది.

## కాపిటలిజం - కమ్యూనిజం, రైతులను స్వాహాచేయలేవు

(Capitalism & Communism fail to swallow peasantry)

పారిశ్రామికీకరణతో రైతాంగ వ్యవస్థకనుమరుగౌతుందని కాపిటలిస్టులు, కమ్యూనిష్టులూ ధృఢంగా విశ్వసించారు. సర్వశక్తివంతమయిన డబ్బును వ్యవసాయ పునాదులు తిరస్కరిస్తున్నయ్. ప్రతి ఘటనాశక్తి, తెలివి తేటలతో, పరిస్థితులను బట్టి నడచుకోవటంతో, రైతులు కాపిటలిజపు చొరబాటును అరికట్టగలిగారు. పెట్టుబడులతో వ్యవసాయ సంస్థలను స్వంతంగా నడపటం కంటే, కీలక సేవలతో రైతులనుదోపిడీ చేయటం సులభమని కాపిటలిస్టులు తెలుసుకున్నారు. రైతులను రూపుమాపటమే ధ్యేయంగా గల కమ్యూనిష్టులు - రైతుల సహాయ నిరాకరణ - మందకొడి వ్యవసాయంతో- వారిప్రయత్నాలను నీరుగార్చటంతో రైతులతో రాజీపడక తప్పలేదు. గ్రామీణ పరిసరాలలో జీవించాలనే జీవితేచ్ఛతో రైతులు " వరదలో తుంగ మొక్క'' లాగా తమ వేరులకు అంటిపెట్టుకొన్నారు.

రైతాంగ మొక స్వతంత్ర పురోగామి వర్గం. కార్మికులవలెనే వీరూ కాపిటలిజాన్ని అంతం చేయటమే ధ్యేయంగా కలవారు. చిన్న భూకమతాల పై వారికి గల ప్రేమ, ఆధునిక యుగపు స్ఫూర్తి అయిన అధికార, ఆర్థిక వికేంద్రీకరణకు వ్యతిరేకమయింది కాదు. వారి జీవన పోరాటానికి అభివృద్ధికి, ప్రజాస్వామ్యం ఒక బలమయిన ఆలంబన - సహకార వ్యవస్థలు శక్తివంత మయిన ఆయుధాలు.

మనం, ముందుగా కాపిటలిజపు వైఫల్యాలను, ఆ తరువాత వైఫల్య దశలోవున్న కమ్యూనిజాన్ని పరిశీలిద్దాం. చరిత్రలో ఎన్నో అజేయమయిన శక్తులపై విజయం సాధించి ఆధునిక కాపిటలిజం, వ్యవసాయాన్నీ వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్నవారినీ

లొంగదీయలేక పోవటం అసామాన్యమయిన విషయంగా మనకు గోచరిస్తుంది. భారీ పారిశ్రామిక కర్మాగారాలవలెనే, ప్రాధమిక వ్యవసాయ వ్యాపకాలు - కాపిటలిజపు ప్రత్యక్ష ప్రభావానికి లోనై యాంత్రికతచేతిలోచిక్కుకుంటవని - కాపిటలిస్టులు ఆంగ్లో అమెరికన్ అర్థశాస్త్ర వేత్తలు, పాశ్చాత్య చరిత్రకారులు- కమ్యూనిష్టులు ప్రగాఢంగా విశ్వసించారు. సంపూర్ణ యాంత్రిక వ్యవసాయం గురించి కలలు కన్నారు. ఈ నమ్మకంతో వారు వ్యావసాయక యంత్రాల తయారీకి కర్మాగారాలు నిర్మించారు. రష్యా వ్యవసాయంలో ఇది దైనందిన క్రమమయ్యింది. పెట్టుబడులు కూడబెట్టటంలోని చరిత్రగతిని గురించి వ్రాస్తూ, "రైతుల వ్యవసాయం దాని నాశనానికదే కారణమవుతుంది. వ్యవసాయం 'చిన్న పరిశ్రమ" (Petty industry) అని మార్క్స్ ఎంతో విశ్వాసంతో ప్రకటించాడు. "సమాజ గర్భంలోని శక్తుల బలీయమయిన కోర్కెల కదలికలు ఈ విధమైన ఉత్పత్తిని సంకెళ్ళుగా పరిగణిస్తాయి. దీనిని తప్పని సరిగా నాశనం చేయాలి. నాశనం చేయబడింది. పొలాల్లోంచి ఈ పెద్దపెద్ద మందలను ఒయటకు తోలటానికి ఎన్నోరకాలయిన శ్రామిక శక్తులు అవసరం కాగలవు." "మార్క్స్" అతిహేయమయిన హీనమయిన, అప్రతిష్ఠాత్మక మయిన దౌర్జన్యాల ద్వారా - ఇంగ్లాండు, ఐర్లాండులలో ఇలానే జరిగిందని మార్క్స్‌కు తెలుసు (Cap.Vol.II.P844-845) కాని ఈ విధమయిన ఉత్పత్తిని "సమాజగర్భంలోని శక్తులు, బలమయిన కోర్కెల కదలికలు సంకెళ్ళుగా భావించినవికనుక" ప్రపంచ వ్యవసాయం, గత్యంతరంలేని ఈ బాధాకరమయిన మార్పును అంగీకరింపక తప్పదని మార్క్స్ భావించాడు.

కులక్ (Kulak - రష్యాలో పెద్దభూస్వామి) లనేగాకుండా, నిజమయిన రైతులను కూడా నాశనం చేయటానికి, నియంతృత్వం, కార్మిక శక్తిని ప్రయోగించిన రష్యా (U.S.S.R.), ఇతర సోవియటు దేశాలు, రైతేలేని ఆస్ట్రేలియాలు మినహా ప్రపంచంలో వ్యవసాయం - పెరుగుతున్న అతి పెద్ద "పెట్టి" (Petti) ఇండస్ట్రీగా నిలచింది. ఆధునిక కాపిటలిజాన్ని, దాని ప్రత్యక్షదాడులను ఎదుర్కొని గతమూడున్నర శతాబ్దాలుగా నిలువగలిగింది. ఆధునికి ఆర్థిక సామ్రాజ్యవాదపు "వెన్నుదన్ను" లున్న "డబ్బుపెట్టు బడిని", వ్యవసాయ "ఆత్మ" నిర్లక్ష్యంచేస్తున్నది. ఓర్పు, ఆత్మబలిదానం, నేలతల్లిపై విశ్వాసంగల రైతుల కారణంగా లాభాలు, విలాసాలు అందించే కాపిటలిజం రూపు మాసిపోయింది. వ్యవసాయవ్యాపకాలపై (Activities), కుటీరపరిశ్రమలపై, చేతి వృత్తులపై కాపిటలిజపు దురాక్రమణకు దూరంగా వెళ్ళి నేల తల్లిపైప్రేమతో రైతులు పంటపొలాలనే

నమ్ముకొన్నారు. ఆధునిక ప్రపంచావసరాల వత్తిడులకు దీటుగా రైతులు నూతన ఉత్పత్తులను, అధిక ఆహారాన్ని వాణిజ్య సరుకులనూ అందిస్తూ,జీవంలేని ఆధునిక వేతన బానిసత్వాన్ని తిరస్కరించి, వ్యవసాయంపై పూర్తి ఆధిపత్యంతో, స్వతంత్రేచ్ఛ, ప్రేరణ -ఉత్సాహాలతో జీవితాలు గడుపుతున్నారు.

రైతుల సామాజిక ఆర్థిక వ్యవస్థలలో ముఖ్యమయిన మార్పులు రావాలి. సమిష్టి కుటుంబాలు (Joint Family) కులాలు, తెగలలో ఈ మార్పు వాంఛనీయం. ఈ వ్యవస్థలన్నీ మరుగున బడినయ్. వంశపారంపర్యంగా సంక్రమించిన అతి పెద్ద భూములు, చిన్నచిన్నముక్కలుగా, కుటుంబంలోని మగవారి మధ్య విభజించబడి, వేరువేరు చిన్న భూకమతాలుగా రైతుల యాజమాన్యంలోనికి తీసుకొనిరాబడినయ్. ఈ విభజనే గొప్ప త్యాగం. గతంలో బలహీనులు, మతిహీనులు, వృద్ధులు కుటుంబ పోషణలో వుండేవారు. వారు చేయగలిగినచిన్నపనులకు సహాయకారులుగా వుండేవారు. ఈ విభజనల వలన ఎవరికి వారు స్వశక్తితో, ఇతరుల సాయంలేకుండా జీవించవలసి వస్తుంది. చురుకయిన ఉత్పత్తులతో కాపిటలిజంపై ఎదురుదాడి చేయటానికీ విభజన తప్పని సరి.

ఆర్థిక సంక్షోభాలనుండి, కరెన్సీమార్కెట్ల కాపిటలిజపు మాయాజాలం నుండీ "భీమా" గా వున్న గతకాలపు స్వయం పూర్ణ వ్యవసాయ ఆర్థికత స్థానంలో" ఒకేపంట, వాణిజ్యపంట, వ్యవసాయ ప్రత్యేకతలు చూశాం. అధికాదాయాలకోసం, ప్రపంచ మార్కెట్ల ద్వారా ప్రలోభ పెట్టి, ప్రపంచకాపిటలిజం ఈ మార్పుకు కారణమయింది. గత ఆర్థిక మాంద్యం (తెచ్చిన బాధలు) - నూతన విధానంలోని "దగ్గర చూపును" రైతుల కర్ద మయ్యేటట్లు చేసింది.

గతంలో వలెకాక, ఇప్పుడు రైతులు ఒక ప్రాంతాన్నుండి వేరొక ప్రాంతానికి, ఒక దేశం నుండి మరొక దేశానికి "వలస" వెళ్ళగలుగుతున్నారు. గత శతాబ్దంలో ఖండాంతరవలసలుఎక్కువ. ఉదా:- దాదాపు 19 మిలియన్ల యూరోపియన్ రైతులు, కూలీలు ఇతర దేశాలకు వలస వెళ్ళారు. గత ఏభయి సంవత్సరాలలో వచ్చిపడిన జాత్యహంకారం, వివక్షలతో U.S. ఆస్ట్రేలియా, కెనడా,దక్షిణ ఆఫ్రికా, కెన్యాల వంటి దేశాలు, నిబంధనలతోవలసలను నిరోధిస్తున్నాయ్. ఈ దేశాలలో సారవంతమయిన, వ్యవసాయయోగ్యమయిన, అభివృద్ధి చేయని భూములు చాలా ఎక్కువగా వున్నయ్. ఈ దేశాలుగతంలోవలసల వలన ఎంతో లాభించినయ్. అయినా వీరు ఆసియా ప్రజల

వలసను తిరస్కరిస్తున్నారు. నార్మన్లు, స్కాండినేవియన్లవంటి యూరోపియన్ల వలస లాభకరమని ఇప్పుడిప్పుడే వీరు గ్రహిస్తున్నట్లు స్టీఫెన్ -లీ-కాక్ వంటివారి వ్రాతలనుబట్టి తెలుస్తున్నది. ఈ దేశాలలో రైతులు పశుగణాభివృద్ధి చేస్తూ, తమ ముడి ధాన్యాలను పశువులదాణాగా వాడుకొంటున్నారు.

గత ఆర్థిక మాంద్యంలో రైతులు గొప్ప నిలకడ శక్తిని (Staying power - స్థోమత) ప్రదర్శించారు. మార్కెట్లు దెబ్బతిని, ధరలు పతనం కావటంతో రైతులు మనుగడ వ్యవసాయం చేసి తమ అవసరాలమేరకే పంటలు పండించారు. వారి అవసరాలు తగ్గించుకొన్నారు. ఆర్థికలావాదేవీలకు దూరంగా వున్నారు. ఆర్థికమాంద్యపునీడలు తమపై పడకుండా జాగ్రత్త పడ్డారు. " ఆహారం అమ్ముకోలేక పోతే - తిందాం. చేపలమ్మలేకపోతే వండుకొందాం. కలప ఎగుమతి చేయలేకపోతే, ఇళ్ళుకట్టుకొని వాటిలో కూర్చొందాం." అనే స్టీఫెన్-లీ-కాక్ బోధకు ఉదాహరణగా నిలిచారు. అయితే ఈ స్వయం పూర్ణ వ్యవసాయ ఆర్థికత (ముఖ్యంగా ఒకే పంటను నమ్ముకొన్న రైతులకు)లో కొన్ని పరిమితులున్నాయ్. పై విధానం లో కొంత రైతుల విజయ రహస్యం ఇమిడివున్నదన్నసత్యం - అధిక సంఖ్యలో పట్టణ నిరుద్యోగులు మనుగడ వ్యవసాయంతో పొట్టపోసు కోవటానికి గ్రామాలకు తరలివెళ్ళటం వలన మనం అర్థం చేసుకోవచ్చు. "ప్రజలు - జాతులు తమ కాలిక్రిందవున్న నేలనూ, నేలలోవున్న వాటిపైనా ఆధారపడి బ్రతుకుతారు" అని స్టీఫెన్ - లీ - కాక్ చక్కగా చెప్పాడు.

కాపిటలిస్టులది వారి ఆదాయాలకు గండిపడుతుంటే చూసి ఓర్చుకునే జాతికాదు. అందుకే వారు స్వంతంగా దక్షిణఅమెరికారాష్ట్రాలలో, మలయాలో, ఇండోచైనాలో సిలోన్‌లో - రబ్బరు - టీ - కాఫీ, కోకో - చెరకు, అరటి ప్లాంటేషన్లునాటి ఫోర్స్‌డ్ లేబరు (Forced labour - బలాత్కారపు శ్రమ) తో ఉత్పత్తులు చేశారు. స్థానిక సామ్రాజ్యవాద దళారీలు కంట్రాక్టుకూలీలను సష్టి చేశారు. ఈ ప్లాంటేషన్లు కన్నావారికి, వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగు, వాణిజ్యంలో పెట్టిన పెట్టుబడులే అధిక లాభదాయకంగా వున్నాయ్. బానిసలు, అర్ధబానిసలు, కంట్రాక్టుకూలీలు, ఫోర్స్‌డ్ లేబరు - వీరెవరూ రైతులు చేసే పనిలో సగం కూడా చేయటం లేదనిగ్రహించారు. అందువలన అసలయిన ముడిసరుకుల ఉత్పత్తి రైతులకు వదలివేయటం మేలని భావించారు. కాపిటలిజం, సామ్రాజ్యవాదం 20వ శతాబ్దంలో ప్లాంటేషను వ్యవసాయాన్ని ప్రోత్సహించినా - అందులో అభివృద్ధి కానరాలేదు.

వ్యవసాయంలో భారీగా పెట్టుబడులు పెట్టవలసివచ్చింది. పరిశ్రమలు, వాణిజ్యంతో పోలిస్తే, వ్యవసాయం లాభసాటిగా లేదు. వ్యవసాయ పెట్టుబడులు, ఎక్కువ కాలం నిలవవుంటాయి, పరిశ్రమలు, వాణిజ్యంలో పెట్టిన పెట్టుబడులు ఎప్పుడవసర మయితే అప్పుడు మార్కెట్లలో తిరిగి పొందవచ్చు. వ్యవసాయ పెట్టుబడి అనుకొన్నప్పుడు చేతికి రాదు. పరిశ్రమలలో వాణిజ్యంలో టర్నోవర్ (Trunover) ఎక్కువసార్లు చేసి, సంవత్సరం లోనే అధికలాభాలు పొందవచ్చు. ఈ కారణాలవలన కాపిటలిస్టులు వ్యవసాయంలోతమ అదృష్టాన్ని పరీక్షించుకోవటానికి సందేహిస్తారు. పారిశ్రామిక సంక్షోభాలు ఒక క్రమంలో వస్తాయ్. ప్రకృతి వైపరీత్యాలు, వ్యవసాయానికి కలిగించే నష్టం అపారం, చెప్పిరావు. కాపిటలిస్టులు తేలికగా, నమ్మకంగా తమ పెట్టుబడులు రాబట్టుకొనే వ్యవస్థలనే వెతుక్కొంటారు.

రిస్కుతీసుకొని, అదనపు పెట్టుబడులు, శ్రమ వ్యవసాయంలో పెట్టవలసిన అవసరం కాపిటలిజంకు లేదు. కీలక సేవల ద్వారా, ఖరీదైన ఋణాల ద్వారా ( అధిక వడ్డీలకు అప్పు లివ్వటం ద్వారా) రైతులకు అల్ప జీవన ప్రమాణాలు కల్పించి, లాభాల నార్జించే అవకాశం వారికుంది. ప్రభుత్వాల పుణ్యమాని 1950 వరకు కాపిటలిజం రైతుల జీవితాలతో ఆడుకోగలిగింది. ఖరీదైన వాణిజ్య సేవలను యాంత్రిక సరుకులను రైతులు తమ నెత్తిన వేసుకొన్నారు. ప్లాంటేషన్లలో వేతన బానిసత్వాన్ని నిరసించిన రైతులు, తమ స్వంత పొలాలలో ఎక్కువ కష్టపడి పనిచేసేవారు - కాపిటలిజం, రైతులతో బలత్కారంగా పనిచేయించి - వాసి - రాశి లేని ప్రతిఫలాలకై ఎందుకు ప్రయత్నించాలి? రష్యాలో నలభయ్ సంవత్సరాలుగా అణచివేతకు గురైన రైతులు, వారి సహాయ నిరాకరణతో, వెన్నుపోటుతో (Sabotage) ఆ దేశపు జాతీయ ఆర్థికతను దెబ్బతీయడం కాపిటలిస్టులకు ఒక హెచ్చరికయ్యింది. కాపిటలిజం వ్యవసాయోత్పత్తులకు పూర్తి బాధ్యత తీసుకొని తన చేతులు కాల్చుకోలేదు.

ఏ మాత్రం సుఖంలేని, ఇతరులు అసూయపడలేని తమ దౌర్భాగ్యంతో రైతులెందుకు సర్దుకపోతున్నారు ? వీరు పట్టణాలకు, పరిశ్రమలలోనికి అధిక సంఖ్యలో వలస వెళ్ళుతున్నది వాస్తవమే. మొత్తం వ్యవసాయజనాన్ని లెఖ్ఖలోకి తీసుకొంటే - అంకెలలో పెద్దగా మార్పుండదు. కారణం - వారి అధిక జననాలరేటు, శరీర ధారుఢ్యం, బతుకుపై గల తీపి. పట్టణ, పారిశ్రామిక, వాణిజ్య ప్రజల్లాగా వీరెందుకు నిరాశపడటంలేదు? ఆ రహస్యమేమిటి?

సామాజిక శాస్త్రవేత్తలు, వైద్య శాస్త్రజ్ఞులు ఇప్పుడిప్పుడే ప్రజల ఆరోగ్యం, ఆత్మస్థైర్యాలపై - గ్రామీణ వాతావరణ ప్రభావాన్ని, నేలతో సజీవ సంబంధాన్ని గురించి అవగాహన చేసుకొంటున్నారు. రణగొణ ధ్వనులతో నిండిన పట్టణాలలో సంపాదన కన్నా, నేలతో రైతుకున్న అనుబంధం ఎక్కువ తృప్తినిస్తుంది. ఇందువలననే రైతులు, తక్కువ ఆదాయంతో, తక్కువ సుఖాలతో, తక్కువ అవసరాలతో - కేవలం తమ భూములలో తాము పనిచేసుకొనే హక్కు వుంటే చాలు అనుకొని జీవితాలు గడుపుతున్నారు. మెడిటరేనియన్ ఆఫ్రికానుండి - జపాను వరకు గల రైతులు తమ తాత తండ్రులిచ్చిన ఆస్తిని నిల్పుకోటానికి, లేక ఎంతో కొంత (అవి ఎంత చిన్నవయినా) పొలాన్ని తమ జన్మభూమిలో సంపాదించుకొని, తమ బిడ్డలు అప్పులు లేకుండా స్వంతపొలాల్లో జీవితాలు ప్రారంభించటానికై తాపత్రయ పడుతున్నారు.తరతరాలుగా భారత రైతులు, పట్టణాలకు, బ్రిటీషు సామ్రాజ్యంలోని కూలీలుగా రెక్కలు ముక్కలు చేసుకోవటానికి వెళ్తున్నది, తమ సంపాదనతో అక్కడ స్థిరపడటానికి కాదు. ఆ కొద్దిపాటి సంపాదనతో తిరిగివచ్చి, తమ గ్రామాలలో, స్వతంత్ర రైతుకుటుంబాల నేర్పరుచుకొనటానికే. ఎండిపోయి, దోపిడీ చేయబడుతున్న అసంఖ్యాక ఆఫ్రికా - ఓరియంటల్ దేశాల రైతుల మనస్సులలో జీవన జ్యోతి కొడిగట్టకుండా ప్రకాశింపజేస్తున్నది, వారికి తమ భూములపై. గ్రామాలపైగల ప్రేమే. ఈ ప్రకాశం ముందు కాపిటలిజం తలవంచి నిష్క్రమించవలసిందే.

ప్రపంచచరిత్రలో - రైతులు తామెదుర్కొనలేని అవాంతరాలకు తెలివిగా తలవంచి "వరదలోవేళ్ళనంటిపెట్టుకొన్నతుంగ" లాగా నిలదొక్కుకున్నారు. రాజుల క్రౌర్యాన్నీ, తెగలనాయకుల దౌష్ట్యాన్ని, విదేశీ దురాక్రమణలనూ, వీరత్వంతో ప్రతిఘటించారు. (Revolutionary Peasant. Prof. N.G. Ranga) పరాజితులయినపుడు - భరించరాని దైనప్పటికీ, - పరిస్థితులకు తలవొగ్గేవారు. దృష్టిలోపం (హ్రస్వదృష్టి) గల కొందరు చరిత్రకారులకు, ప్రాణాలర్పించి రైతులు భూమికీ -గ్రామీణ జీవితానికీ అంకితమవటం అభూత కల్పనగా కనుపించినా,విశాల దృక్పథంతో, మానవతా చరిత్రను అర్థం చేసుకొనేవారికి ఈ అంకితభావం,జీవితాన్నీ, జాతిని, సంస్కృతినీ నిలబెట్టుకొనే ఉదాత్తమయిన విషయంగా ప్రత్యేకించి - బలహీనులూ, పట్టుదలలేని వారూ అయిన రెడ్ ఇండియన్లూ, ఆస్ట్రేలియన్లూ, ఫిలిప్పైనులు, ఫిజీలు తమ జీవితాశను వీడిన నేపథ్యంలో - బోధపడుతుంది.

ఆటవికతెగలనాయకుల, భూతవైద్యుల దుర్మార్గాల స్థానంలో నిరంకుశ ప్రభువుల, భూస్వాముల, వారి ప్రభుత్వాల పాలనలు వచ్చినయ్. నిరంకుశ పాలకుల

తరువాత రాజులు, చక్రవర్తులు, ఆ తరువాత దోపిడీ గాళ్ళు ప్రాచీన ప్రజాస్వామ్యాల నంతరింపజేసినా, వారి పాలనలలో బానిసలుగా, అర్థబానిసలుగా, బలాత్కారపు శ్రామికులుగా అంటరానివారుగా అణగద్రొక్కబడినా రైతులుఓర్పుతో అవకాశంకోసం ఎదురు చూశారు. అతి చిన్నఅవకాశాన్నికూడా అందిపుచ్చుకొనిపాలకులను పదవీ భ్రష్టులను చేయటానికి తిరుగుబాట్లు చేశేవారు. మధ్యయుగంలో చర్చిపై ప్రొటస్టెంట్లు జరిపిన తిరుగుబాటులో తరువాత వచ్చిన ఫ్రెంచి, రష్యను విప్లవాలలో రైతులు కొన్ని విజయాలు సంపాదించారు. పాలకుల సుఖ, సంతోష విలాససౌధాల పునాదులు ఎవరి శ్రమతో నిర్మించబడినవో, ఆ రైతులలో అప్పుడప్పుడు తలెత్తే అసంతృప్తి - ఆ పునాదుల నేమాత్రం కదలించలేవని, రైతులు తమ దురదృష్టాన్ని నిశ్శబ్దంగా భరిస్తారనీ, అణగిమణగివుంటారనీ అనుకోవటం పిచ్చితనం. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో, జపాను సామ్రాజ్యవాదాన్ని, అమరమైన తమ వీరత్వంతోఆరు సుదీర్ఘవత్సరాలు చైనారైతులు నిలువరించటం నేలపై వారికి గల ప్రేమను చాటి చెప్తుంది. (Pearl.S. Buck).

ఆధునిక కాపిటలిజం, సోవియటిజంలకూ, భవిష్యత్తులో ఇదేగతి పడుతుంది. (రైతుల ప్రతిఘటన) తుఫానుల్లాగా పైనబడుతున్న కాపిటలిజం,సోవియటిజం ప్రమాదాలకు రైతులుతలవొంచక తప్పటం లేదు. రైతులనీ దురదృష్టం బారుకూ వెంటాడుతునే వుంది. రాజుల, చక్రవర్తుల, నియంతల గుప్పెట్లనుండి బయటపడి, నూతన రాజకీయ ఆర్థిక, సామాజిక జీవితంలో అడుగుబెట్టే సమయంలో-ఉద్ధృతంగా, ఆకస్మికంగా, పూర్వ నియంతలకన్నా బలమయిన, ధృఢమయిన, కబంధహస్తాలతో కాపిటలిజం, సోవియటిజం రైతులను కౌగిలించుకొంటున్నవి. కాపిటలిజం, సోవియటిజం విస్తరిస్తున్న దశలో రైతులు అజ్ఞాతంగా, తమ విధులకు తామంకితమై, స్వతంత్రతను నిల్పుకొంటున్నారు.

వడ్డీ వ్యాపారులనుండీ, వర్తకులనుండీ, విముక్తికి ముప్పై సంవత్సరాలుగా మేము సాగించిన పోరాటాల పర్యవసానంగా భారత ప్రభుత్వ పాలకులయిన కాంగ్రెసు పార్టీవారు ఎట్టకేలకు ' కేంద్ర - జాతీయ సహకారాభివృద్ధి మరియు వేర్‌హౌసింగుబోర్డు' ను ఏర్పాటుచేశారు. ఉత్పత్తి, ప్రాసెసింగు, మార్కెటింగు, స్టోరేజీ, వేర్‌హౌసింగు, వ్యవసాయోత్పత్తుల దిగుమతులు, ఎగుమతులనునిర్వహించటానికి రాష్ట్ర స్థాయిలో బోర్డుల ఏర్పాటు జరిగింది. కేంద్ర ప్రభుత్వం ఈ సంస్థకు నిధులనిస్తుంది. కేంద్ర గిడ్డంగి సంస్థ నిర్మాణం జరుగుతుంది. వ్యవసాయోత్పత్తుల రవాణా, నిలువ, గిడ్డంగుల నిర్మాణాలు, జాతీయ ప్రాధాన్యతకలచోట చేపట్టటంతో - భారతరైతాంగపు కృషి

ఫలితంగా, ఈ విప్లవాత్మకమయిన కార్యక్రమం అమలుపరచబడి, కాపిటలిజం ఉచ్చు నుండి రైతుల విముక్తికి శ్రీకారం చుట్టబడింది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో కేంద్రంచే వంద వేర్ హౌస్‌లు, రాష్ట్రాలచే రెండువందలు నిర్మించబడి - 2 నుండి 2.5 మిలియనుటన్నుల వ్యవసాయోత్పత్తుల నిల్వకు ఉపయోగించబడతాయి. వెనుకబడిన ఇతర ఆసియాదేశాలకు ఈ పరిణామం స్ఫూర్తిదాయకం కాగలదు.

అధిక వేతనాలవంటి కాపిటలిస్టు ప్రలోభాలకు, ఆఫ్రికన్ తెగలు, ప్రజలు లొంగలేదు. తెగలలోని సాంఘిక సమానత్వం,వారి స్వయం పూర్ణ ఆర్థికత నాయకత్వ లక్షణాలు, వేతనబానిసత్వంపై వారికి గలవిముఖత, వారి స్వాతంత్రేచ్ఛ, యూరోపియన్ ప్లాంటర్ల ఎత్తులను సాగనీయలేదు. ఆర్థిక, రాజకీయ అధికారంతో విధించిన అన్యాయమయిన పన్నులుగానీ, వేతన బానిసత్వంలోకి లాగే ఎత్తులు, అనైతికమూ, హేయమైన తాగుడు వంటి దురలవాట్లు నేర్పటం,వారి సామాజిక, నైతిక స్థాయిని దిగజార్చేపట్టణ విలాసాలు, విశృంఖలత్వం అలవాటు చేయటం ఇవేవీ ప్లాంటర్లకు వారి ఆర్థికతకు ఉపయోగపడలేదు. త్వరగా ధనవంతులమవుదామన్న ఆశతో అక్రమంగా సంపాదించిన భూములు నిరుపయోగమయినాయి. చాలా పకడ్బందీగా అతిక్రూరంగా, (బెల్జియం, ఫ్రాన్స్) యూరోపియన్‌ప్లాంటర్లు, అంగచ్ఛేదాలతో, హత్యలతో, పాశ్చాత్య దురలవాట్లతో నీగ్రోలను అణచినా - వారు వేతన బానిసత్వాన్ని, యూరోపియన్ ఆర్థికతనూ, ప్లాంటేషన్లనూ తిరస్కరించారు.

ఫలితంగా రైతులను దొంగదెబ్బతీయసాగారు. వారి కాపిటలిజంకు అవసర మయినదానికన్నా, స్వంతభూములలో, అధిక విస్తీర్ణాలలో, ఖర్చుకు వెనుకాడకుండా వాణిజ్యపంటలను ఉత్పత్తి చేశారు. రైతులు తమ పొలాలను బీడు పెట్టారు. పశువులను ఎండగట్టారు. అర్ధాకలితో కాలంగడిపారు. తమ సామాజిక ఆనందాలను, సాంస్కృతిక వినోదాలను, అతివిలువయిన ఆటవిడుపుదినాలను, జాతీయ పండగలను, కేవలం తమ పొలాలలో స్వేచ్ఛగా, స్వతంత్రంగా పనిచేసుకొనే అవకాశం కొరకు వదులుకున్నారు.

ఇది చాలా బాధకరమయినదృశ్యం. ఈ పరిస్థితి రష్యా రైతాంగ ప్రతిఘటనలో కొట్టవచ్చినట్టు కన్పిస్తుంది. ప్రతీఘాత విప్లవాన్ని ఓడించి, జార్ చక్రవర్తిని పదవీ భ్రష్టుడ్నిచేసి, భూస్వామ్యాన్ని (ఫ్యూడలిజం) పెకలించి నవంబరు విప్లవాన్ని సాధ్యం చేసిన రైతులపై ఏమాత్రం దయా, సానుభూతిలేకుండా నియంతృత్వంతో వారిపై విరుచుకుపడి,

పనిచేసుకొనే స్వేచ్ఛను 1920-36 మధ్య కాలంలో రష్యన్ కార్మిక వర్గం కాలరాచింది. నిరాశ చెందక రైతులు సాగించిన పోరాట ఫలితంగా, స్టాలిన్ లొంగివచ్చి అర ఎకరం నుండి రెండు ఎకరాల వరకు రైతులు స్వంతంగా వ్యవసాయం చేసుకొనటానికి అనుమతి నిచ్చి, సమిష్టి వ్యవసాయం నుండి కొంతరక్షణ కల్పించాడు. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు దేశంలో చాలా చోట్ల ఎత్తివేయవలసివచ్చింది. రష్యా అనుభవంతో చైనా, తనసమిష్టి వ్యవసాయంలో ఆచి-తూచి మందంగా అడుగువేస్తూ, రైతులను భూమి హీనులుగా చేయటానికి ప్రయత్నం చేస్తునే వుంది.

భూమికి రైతుకు గల అనుబంధాన్ని "రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ లేబరు" ఇలా వ్యక్తీకరించింది. "టీ పరిశ్రమలో వున్న ఇండియన్ శ్రామికుడు తన జీవన ప్రమాణంలో మెరుగుదల కన్నా, తనసాంఘిక హోదాను పెంచుకొనటానికే ఎక్కు తాపత్రయ పడతాడు, ఈ సాంఘిక హోదా స్వంత భూమికి యజమానిగా వున్నవానికే వుంటుంది".

"భారత రైతులపై భూమిపై వారి గల మక్కువ ఎక్కువ ప్రభావం చూపు తుంది. ఉత్తర భారత రైతులు వారి భూవారసత్వాన్ని నిలబెట్టు కొనటానికి ఎన్నోపోరాటాలు చేశారు." (స్టీఫెన్-లీ-కాక్) "అతని భూమి - అతని పూర్వీకులు ఒకేతానులో గుడ్డగా నీగ్రో భావిస్తాడు. (జెఫరీ గోరర్).

"భారతీయ జీవిత విధానం అతని భూస్వామ్యంతో ముడిబడివుంది. అతని భూమే అతని జీవితం". అని మెక్సికో అధ్యక్షుడు కార్డినెజ్ అన్నాడు. ఫాసిస్టుకు ఓటు వేయమని వత్తిడి చేసినప్పుడు "నాఆకలిలో కూడా నాకు నేనే యజమానిని" అని స్పెయిన్ విదేశాంగ మంత్రి - జె. అల్వారెజ్‌డికవ్‌యో ప్రకటించాడు.

అభిప్రాయ సేకరణలో 65 శాతం అమెరికా పట్టణవాసులు గ్రామ జీవితం పై మొగ్గు చూపారు. "నాకు నేనే యజమానిని", ప్రకృతికి అతి దగ్గరగా వుండవచ్చు, చెట్లు పెరగటం చూడవచ్చు, పశుపోషణ చేయవచ్చు." వార్ధక్యంలో భద్రత వుంటుంది." ఇవి వారు చెప్పిన కారణాలు (1955 సర్వే)

రైతులను రూపుమాపటం కష్టతరమని మార్క్సుకు తెలుసు. "చెల్లా చెదురుగా వుండి, వ్యక్తిగత శ్రమ తోకూడిన ఆస్తి (చిన్న రైతు) కాపిటలిస్టు ఆస్తిగా మారటం ఘర్షణలతో కూడినది. కాపిటలిస్టుల ఆస్తులు, సామాజిక ఆస్తులుగా మార్చటం సులభం.'

అని మార్క్సు వ్రాశాడు. (Cap.vol.II.P.846-847) రైతులనుండి ఎక్కువ లాభాలార్జించే "కిటుకు" కాపిటలిస్టులకు తెలుసు. స్వంత యాజమాన్యంలో కన్నా - రైతుల కిచ్చే ఋణాలపై - వడ్డీల ద్వారా లాభం చాలా ఎక్కువ. కీలక సేవల సర్వపరిష్వంగం ద్వారా వచ్చే ధరలు (లాభాలు) ఎక్కువ.

అందువలన ఇరువర్గాలు, కాపిటలిస్టులు - సోవియట్లు, చాలావరకు వ్యవసాయాన్ని రైతుల ప్రత్యక్షయాజమాన్యానికి తెలివిగావదలి పెట్టారు.

కాపిటలిస్టులతో రాజీపడి రైతు ఎన్నాళ్లు ఇలా గడుపుతాడు? వివిధ దేశాల రైతుల అనుభవం, రెండవ ప్రపంచ యుద్ధం, బెంగాలు, ఒరిస్సా కరువులు ఈ 'రాజీ' అంతిమగడియలకు మార్గం చూపినయ్.

గత ఆర్థిక మాంద్యం, దాని పరిణామం గురించి వోయిటిన్స్కీ అధ్యయనం చేశాడు.

'ఆర్థికమాంద్యానికి పరిశ్రమ ప్రారంభం మాత్రమే కాదు - నాశనానికంతకూ ముఖ్యకారణం, రైతులపై ఈ నిందలేదు. రైతుతన తాతతండ్రుల పొలాలలో శ్రమిస్తూ, ఉత్పత్తులు చేస్తునే వున్నాడు. తనను గురించిగొప్పలు చెప్పుకోవటం బహిష్కృతుడుగా భావించటం అతని నైజం కాదు. పట్టణ నిరుద్యోగిలాగా - గ్రామాలలో ఉపాధికి, తిండికి, యాచనకు అతను రాలేదు. విపరిణామాలకు తలవంచక విప్లవించాడు. పారిశ్రామిక కార్మికుడు విప్లవించలేక తల్లడిల్లాడు. ఆర్థికమాంద్యంలో వివిధ తరగతుల కార్మికులు వారిలో వారు కలహించుకొని శక్తి హీనులయినారు. ఆర్థికమాంద్యం రైతుల ఐక్యతను పెంచి వారిని శక్తివంతులను చేసింది. రాజకీయ శస్త్రాస్త్రాలను ప్రయోగించటం నేర్పింది.' (p-230) వారికి భూములపైగల అంకితభావంకించపరచబడి వ్యవసాయభద్రతకు ఆటంకాలు కలిగి వారి భూములపై ఇతరుల కన్ను పడినప్పుడు వారిలో నిద్రాణంగావున్న అపరిమితమయిన విప్లవశక్తిమేల్కొంది. కాపిటలిజం తమను కబళించకుండా కాపాడు కొన్నది. 1931 లో భారత రైతులు వ్యవసాయ ఋణాల మారటోరియంకు చేసిన డిమాండు, అప్పటినా అధ్యక్షోపన్యాసం - వొయిటిన్స్కీ 1936 లో నిజాయితీగా చేసిన అధ్యయనానికి అద్దంపడుతుంది.

1929-35 మధ్య వచ్చిన ఆర్థికమాంద్యం, ప్రపంచయుద్ధం - ఈ రెండు రైతులపై, వ్యవసాయంపై ప్రపంచ కాపిటలిజం చేసిన అతిపెద్ద దాడులు. ఈ రెండు

సందర్భాలలోనూ, ప్రపంచకాపిటలిజం, రైతులనూ వ్యవసాయాన్నీ కబళించలేక పోయినయ్. రైతులను అచిరకాలంలో రూపుమాపగలమనే మార్క్సిష్టుల విశ్వాసం నీరుగారి పోయింది. వారి మనుగడ వ్యవసాయంతో, తిరుగుబాట్లతో, పరాజిత - అభివృద్ధి వ్యతిరేక ధోరణులతో కాక దూకుడుగా, ఐక్యతగా, విప్లవాత్మకంగా స్పందించి -తమను తాము రక్షించుకోగలమని చాటి చెప్పారు. రైతువారీ వ్యవసాయంతో, కాపిటలిస్టుల భారీ వ్యవసాయం కనుమరుగైంది. కాపిటలిజంకు రైతులపై అధికారం చెలాయించే ఛాన్సు, విజయాలుపొందే అవకాశం ఇకముందు వుండవు. రోజురోజుకీ రైతులు బలంపుంజుకొని, విముక్తి పొందుతున్నారు.

కాపిటలిజం శక్తి హీనమయిన తరువాత వచ్చే మార్పులేమిటి? ప్రపంచ రైతాంగం ఆర్థిక మాంద్యం కాలం నుండీ, కాపిటలిజంపై, సోవియటిజం పై గొప్ప విజయాలు సాధించింది. ఆస్ట్రేలియా, నార్త్ అమెరికా, లాటిన్ అమెరికా రైతాంగం తమ ప్రభుత్వాలనుండి అనేక రక్షణలు సంపాదించుకొన్నయ్. ప్రపంచ విపణులు, 19వ శతాబ్దపు ప్రపంచ వర్తకం తొలగదోయబడినయ్.

ప్రపంచ విపణులనుండిరక్షణకు, అమెరికా ప్రవేశపెట్టిన ధరలమద్దతు, పారిటీధరల విధానం ప్రపంచంలో పెక్కుదేశాలు ఆచరణలో పెట్టినయ్. రాష్ట్ర సహకార మార్కెటింగ్ ఏజన్సీలు నెలకొల్పబడుతున్నయ్. "వ్యవసాయ స్వయం సమృద్ధి, దాని పరిణామంగా - ప్రపంచ వర్తకమాంద్యం" - కలిగింది. (FAO రివ్యూ 1944-55) తత్ఫలితంగా దాదాపు అన్ని పాశ్చాత్యదేశాలు, అమెరికా, ఆస్ట్రేలియా, ఆసియాలో కొన్ని ముఖ్యమయిన దేశాలు - ప్రపంచ విపణుల - ప్రపంచ వర్తకపు మోసాలనుండి పూర్తి రక్షణ పొందినయ్.

సోవియట్ విభాగంలోకూడా రైతులు - దాదాపు ఇవే విజయాలు సాధించారు.

ఆగ్నేయ యూరపుదేశాలు - నాజీలపై, ఫ్యూడలిజంపై రైతునాయకుల, రైతుల పార్టీల అండదండలతో, రాజకీయాధికారం సంపాదించుకుంటున్న తరుణంలో, సోవియట్ రెడ్ ఆర్మీ ప్రవేశించి, అచ్చటి రైతు ప్రభుత్వాలను పడగొట్టి, వారిపార్టీలను చీల్చి, బలహీనపరచి, మాస్కో మానసపుత్రికలయిన కమ్యూనిష్టు పార్టీలకు వత్తాసుపలికి, రైతునాయకులను జైళ్ళలో నెట్టి, హత్యలు చేసి, దేశం నుండి వెళ్ళగొట్టి, - ఆ ప్రపంచ భాగంలో రైతులు -బుద్ధి జీవులు కార్మికులు, కలిసి ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపన చేసే

అవకాశం లేకుండా చేసింది. ఈ అనైతిక పద్ధతితో కమ్యూనిష్టు ఆధిపత్యం, సామాజిక ఆర్థికతను U.S.S.R (రష్యా) లోనేకాక, ఆగ్నేయ యూరపుదేశాలలో కూడా లేకుండా చేసింది. రష్యా ఆధిపత్యంలో చైనా రైతుల స్థితి నరక ప్రాయం అవుతుందని పించింది. కానీ యుగోస్లోవ్‌రైతుల విజయాల స్ఫూర్తితో, చైనా రైతులు నమ్మశక్యంగాని విజయాలు సాధించారు. సహాయ నిరాకరణ, చాటుదెబ్బ (Sabotage) ప్రత్యక్ష విప్లవాలతో - అవసర సమయాలలో కమ్యూనిష్టులతో తాత్కాలికపొత్తు - ఆపరపతితో రైతుతో సహకార విధానానికి "మావో"[1] ప్రభుత్వాన్ని అంగీకరింప జేయగలిగారు. యుగోస్లోవియాలో, సహకార క్షేత్రాలనుండి బయటకురావటానికి "మార్షల్‌టిటో[2]" అనుమతించాడు. దీనివలన రైతులుతమ స్వంత సహకార సంఘాలు ఏర్పరుచుకొనే అవకాశం కలిగింది. అధికసంఖ్యలో రైతులు యుగోస్లోవియాలో కో-ఆపరేటివ్ ఫార్మింగుకు దూరంగా, స్వతంత్రంగా వుండటానికి ఇష్టపడ్డారు. చాలా సందర్భాలలోరైతులు స్వతంత్రంగా గానీ, సహకార సంఘ సభ్యులుగా గానీ వుండే స్వేచ్ఛ ఇవ్వబడింది. పీపుల్స్ చైనా[3] (Peoples china) యూరోపియన్ కమ్యూనిజం వైఫల్యపుగుణపాఠంతో, తనరైతులతో కొంత సున్నితంగా, తగుమాత్రం స్నేహభావం ప్రదర్శించింది. ప్రతిచోటా రైతులు అర ఎకరం నుండి రెండు ఎకరాల స్వతంత్ర రైతులుకాగలిగారు. తమ దగ్గరలోని ప్రభుత్వ లేక సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో భాగస్వాములయినా వీరికీ అవకాశం వుంది. మిలియన్ల సంఖ్యలో, స్వదేశ లేక వేతన బానిసలుగా వున్నవారుస్వతంత్ర రైతులయినారు. చైనా కమ్యూనిష్టు పార్టీ ఘర్షణ విధానాన్ని వదలి క్రమమైన మార్పును కోరుతున్నది. రష్యాలోవలె చైనాలో సహకార వ్యవసాయక్షేత్రాల స్ఫూర్తి అడుగంటలేదు. సహకార క్షేత్రాలలో పనిచేసేవారి జీతాలు (ధన-వస్తురూపంలో) పెంచబడినయ్. వ్యవసాయధరల గొంతునొక్కటం తగ్గింది. వ్యవసాయోత్పత్తుల - యాంత్రిక తయారీల మధ్యవున్న ధరల అసమానతలు తగ్గించ బడినయ్. ఎన్నో వైకల్యాలతో బాధపడుతున్నప్పటికీ, కార్మికవర్గసేవలతో సమానంగా వీరి సేవలు పరిగణించబడనప్పటికీ -భూమిని సమాజపరంచేయటానికి కమ్యూనిష్టులు దొంగదారులు వెతుకుతున్నప్పటికీ రైతుల బేరశక్తి పెరిగింది. వారు నిలదొక్కుకో గలుగుతున్నారు. సమిష్టివ్యవసాయం ప్రజామోదం పొందలేదనటానికి యుగోస్లోవియాలో పాడుబడ్డ వ్యవసాయక్షేత్రాలే నిదర్శనం. ఆగ్నేయయూరపు దేశాలలో రైతులు, సోవియట్ పాలనపై అసంతృప్తితో వున్నారనటానికి అక్కడ వ్యవసాయంలో వస్తున్న అపజయాలే నిదర్శనం. కాపిటలిజంకానీ కమ్యూనిజం కానీ రైతులను ఎక్కువ కాలం అణచి వేయ లేదని, రూపుమాపలేదని స్పష్టమవుతున్నది.

స్వరాజ్య ప్రభుత్వ (భారత) ప్రణాళికా రచయితలు - చైనాలో వలె వత్తిళ్ళతో వ్యవసాయ ఆర్థికతను దెబ్బతీసి సహకార వ్యవసాయం అమలుపరచగలమని పూర్తి విశ్వాసంతో బయలుదేరారు. ప్రజాస్వామ్యాన్ని ఉపదేశిస్తూ - వ్యవసాయాన్ని నిర్బంధ సహకార వ్యవస్థలోనికి ఈడ్చాలని అభిప్రాయపడ్డారు. యుద్ధకాలంలో పెట్టిన కంట్రోళ్ళు, ఆహారధాన్యాల ప్రొక్యూరుమెంటు,అసమంజసపు ధరలుప్రజలు భరించారు కనుక, వారు "ముచ్చటపడి" తెస్తున్న ఈ ప్రణాళికలో విజయవంతం కాగలమని ఊహించారు. మద్రాసు, ఆంధ్ర-కొచ్చిన్-తిరువాన్కూరు రాష్ట్రాలలో 1951-52 జనరల్ ఎలక్షన్లలో, కాంగ్రెసు ఓటమి, ఈ ప్రయోగాలపై రైతులకు గల నిరసనను బట్టబయలు చేసింది. వెంటనే ప్రభుత్వం (స్టాలిన్‌పంథాలో) వెనకడుగు వేసింది. నిర్బంధ సహకార వ్యవసాయపు డిమాండును వదులుకున్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో " ఒక గ్రామపు భూ విస్తీర్ణమంతా ఒకే మేనేజ్‌మెంటు యూనిటుగా పరిగణింపబడినప్పటికీ, రాగల చాలా సంవత్సరాల వరకు సాధారణ యాజమాన్యపు యూనిటు రైతుస్వామ్యంలోనే వున్నట్లు పరిగణింపబడుతుంది". సహకారగ్రామ మేనేజ్‌మెంటు అనగా - భూయాజమాన్యం రైతులదే అని అర్థం. భూమి హక్కు దారుడు మాత్రం రైతే. (P-69) రైతులకిది ఘనవిజయం. ప్రణాళికా సంఘసభ్యులు - ప్రభుత్వం - గోధుమ, బియ్యం, ఇతర ధాన్యాలకు మద్దతు ధరలు కల్పించటానికి అంగీకరించారు. రైతుల ప్రధాన శత్రువయిన కమ్యూనిష్టుపార్టీ కూడా, చిన్న భూకమతాల ఆర్థిక విధానానికి వత్తాసుపలికి - చిన్న కమతాలలోనే అధిక ఉద్యోగ కల్పనజరుగుతుందని ఒప్పుకోవటం రైతులకు మరొక విజయం. సహకారోద్యమం ద్వారా, ప్రజాస్వామ్యంలో రాజకీయ ఆర్థిక శక్తులవైపు అభివృద్ధి దాయకమయిన నడక ప్రపంచరైతాంగం నడవగలదనివిశ్వసించవచ్చు.

రష్యానాయకత్వంలో కోట్లాది రైతులు గతనలభయి సంవత్సరాలుగా, స్వతంత్ర వర్గంగా, కార్మికనియంతృత్వంలో కూడా మనగలగటం ఆశ్చర్యకరం. వ్యవసాయపు శాశ్వత మానసిక ప్రభావం - ఉత్తేజం అటువంటిది.

'రెండు వందలకు పైగా రాష్ట్ర ప్రభుత్వాలచే నిర్వహింపబడిన ప్రభుత్వ క్షేత్రాలలో తలసరి ఆదాయంగాని, ప్రతి ఎకరంలోవ్యవసాయ ఫలసాయంగాని అధికంగా లేదు" అని ప్రణాళికా సంఘం అంగీకరించింది. బరోడా జిల్లాలో నిర్వహింపబడిన మార్గదర్శక పరిశోధనలో స్వతంత్ర రైతుల యాజమాన్యంలో ఉత్పత్తి ప్రథమ స్థానం, కౌలుదారుని పొలాలు రెండవ స్థానంలో వుండగా - కో-ఆపరేటివ్ ఫార్మింగులో అధమంగా

వుంది. ఈ నేపధ్యంలో పట్టణ సలహాదారుల ఆలోచనల మేరకు కోఆపరేటివ్ ఫార్మింగ్ భారీగా చేపట్టి, రైతు ఆర్థికతలో జోక్యం చేసుకోవటానికి భారత ప్రభుత్వం సందేహిస్తున్నది. ప్రభుత్వ భూములలో, భూములులేని వ్యవసాయకూలీలను సభ్యులుగా జేర్చి, ప్రయోగాత్మ కంగా కో-ఆపరేటివ్-ఫార్మింగును అమలు చేయాలని ఇండియన్ పెజెంటు ఉద్యమం ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఈ ఉద్యమం రైతాంగ ఆర్థిక విధానం - సమిష్టి సహకార వ్యవసాయాల కన్నా చాలా మేలయినదని, తలసరి ఆదాయం, ప్రతి ఎకరంలో వచ్చే ఆదాయం ఎక్కువగా వుంటుందని నమ్ముతున్నది.

న్యూడీలుకువ్యతిరేకులు, రూజ్‌వెల్టు ప్రభుత్వం తరువాత వచ్చిన రిపబ్లికన్లు కూడా ధరల మద్దతు పారిటీధరల విధానాలను కొనసాగించారు. (అమెరికాలో)

రైతులు ఆధునిక సామ్రాజ్యవాదం నుండి, ఫ్యూడలిజం, కాపిటలిజం, సామ్రాజ్య వాదాల అనైతిక పొత్తుల దాడి నుండి తప్పుకున్నారు.ప్లాంటేషను ఆర్థికతను లొంగదీసు కున్నారు. యూరపులో ఫ్యూడలిజాన్ని రూపుమాపి, ఎస్టేట్లను చిన్నచిన్న ముక్కలుగా విభజింపజేసి, గ్రామీణ ఆర్థిక విధానాన్ని, ప్రభుత్వాలు అమలు జేసేటట్లు చూశారు. సోవియట్ టెర్రరిజంకు వ్యతిరేకంగా అలసట లేకుండా నిరంతరం పోరాడుతున్నారు. కనుక 19వశతాబ్దపు మధ్యకాలంలో అన్నట్లుగా నేడు "రైతులు క్షీణించే వర్గం" అని ఎవరైనా అనటంచాలా తప్పు.

నాజీ ప్రభుత్వాలలోకూడా రైతులు ప్రపంచవిపణుల దోపిడీ నుండి రక్షణ సంపాదించుకున్నారు. యుద్ధాలమధ్యకాలంలో - రెండవ ప్రంచ యుద్ధ సమయంలో, యుద్ధానంతరదశకంలో రైతులు పోరాడి పారిటీ ధరలు, ధరల స్థిరీకరణ, కనీసధరలు, కనీస వేతనాలు సాధించారు. 1946లో ఇండియన్ పెజెంట్ మూమెంట్ వత్తిడితో బ్రిటీషు ప్రభుత్వం "నిలకడ ధరల కల్పనకు" కమిటీని నియమించింది.స్వతంత్ర భారత దేశంలో, ప్రధాన ఆహార పంటలకు న్యాయమయిన ధరల నిచ్చే బాధ్యతను ప్రభుత్వంచే అంగీక రింపజేసింది. "జాగృతమయిన రైతాంగ విజయాలివి". దాదాపు ప్రపంచ ప్రభుత్వాలన్నీ ధరల మద్దతు విధానాలమలు చేయటం వలన - ఎగుమతిదారులమధ్య పోటీ - ప్రధాన ఆహారసరుకులకు స్వేచ్ఛా విపణులు - లేకుండా పోయినవి అని 1955లో I.F.A.P. సర్వే ప్రకటించింది.

అయినా, తగు మొత్తం అల్ప సంఖ్యలోరైతులు - ఫ్యూడలిజం నుండి ప్రపంచ విపణులనుండి, విముక్తి పొందవలసివుంది. ఉదా:- చిలీ రైతాంగంలో 1/4 వంతు మంది

మాత్రమే స్వతంత్రరైతులుగా, కవులుదార్లుగా వున్నారు. వెనిజులాలో 90 శాతం భూమి 5 శాతం ప్రజలచేతుల్లోవుంది. "పరాగువే" లో 25 మంది 1/4 వంతు భూమికి యజమానులుగా వున్నారు. (Farming Around the World P.65)

సామ్యవాద తరహా సమాజాన్ని (socialistic pattern of society ) నిర్మించాలని, స్వతంత్ర భారత ప్రభుత్వం నిర్ణయించినంత మాత్రాన, రైతుల - గ్రామీణుల భవిష్యత్తు ఈ ప్రభుత్వం చేతుల్లో భద్రంగా వుంటుందని భావించటానికి వీలులేదు. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రకారం, జనాభాలో 70 శాతంగా వున్న రైతుల నుండి అందే సేవల విలువ 4885 కోట్ల రూపాయలు, మిగతా జనాభా - 30 శాతం అందించే సేవల విలువ 7265 కోట్ల రూపాయలుగా లెక్కకట్టబడింది. భారతీయుని తలసరి ఆదాయం రూ. 330=00 లు, ఐదుగురు కుటుంబ సభ్యులు గల చిన్నరైతు కుటుంబపు (3 ఎకరాలు. 40 శాతం రైతుల భూపరిమితి ఇంతకన్నా చాలా తక్కువ). సంవత్సరాదాయం 2400 రూపాయలు. అనగా తలసరి వార్షిక ఆదాయం 240 రూ॥లు మాత్రమే. వ్యవసాయ జనంలో 30 శాతంగా వున్న వ్యవసాయకూలీలు - 80 శాతం భూములుండి, వ్యవసాయంచేసే రైతులుకూడా 1961 వరకు అణగారి వుండాలి. ఈ సామ్యవాద తరహా సమాజంలో రైతులు అభివృద్ధి చెందగలరని మనం ఎలా నమ్మగలం? రైతుల అవసరాలను - ఆశలను రక్షించగలందులకు మనం జాగరూకులమై వుండాలి.

ఆఫ్రికా విభజన జరిగిన తరువాత, మరికొన్ని మిలియన్ల ప్రజలు బానిసత్వం లోకి లాగబడ్డారు. వారితాత, తండ్రులిచ్చిన భూమి పోగొట్టుకున్నారు. యూరోపియన్ ప్లాంటేషన్లలో కూలీలుగా మార్చబడ్డారు.వారి స్వయంపూర్ణ, ఆర్థిక, సామాజిక జీవితం అడుగంటి పోయింది. అవమానాల పాలయింది.

యూరోపియన్ కాపిటలిస్టుదేశాలలో - అమెరికాలో - ఆసియాలోని స్వతంత్ర వలసదేశాలలో - లాటిన్ - ఇండో-అమెరికాలో, ఆఫ్రికా - ఆసియాలలోని ఆధారిత వలసదేశాలలో - రైతులు ప్రాథమికమయిన రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించి నప్పుడే, కార్మికులకుగలస్వేచ్ఛ, రైతులకు కూడా లభించినప్పుడే, కాపిటలిజంను రైతాంగం ఎదుర్కొనగలదని మనం తెలుసుకోవాలి. 20వ శతాబ్దపు విప్లవాత్మక ప్రతిఘటనల నేపథ్యంలో, ఆత్మ విశ్వాసం, వ్యవస్థీకృత ప్రతిఘటన, కాపిటలిస్టు, సామ్రాజ్య వాద వ్యతిరేకతలో-శక్తిలో రైతులు కార్మికవర్గంతో సమానమేనని తీర్పు ఇవ్వవలసి వస్తుంది.

కాపిటలిజంతో సంబంధాలలో - రైతులకు తగినంత ప్రతిఘటన దెబ్బతిన్నా మరల దెబ్బతీయగల శక్తి, అవసరానుగుణంగా నూతనవ్యూహరచన - రైతుల నైజంలో వుందా అని మనం ఆలోచించాలి. కాపిటలిజాన్ని ఎదుర్కోవటంలోరైతులు కార్మికులంత ఉత్సాహంగానూ, శక్తివంతంగాను, విప్లవాత్మకంగాను స్పందించగలరు. బాల్కన్, రష్యన్ రైతులు, భారతరైతుసత్యాగ్రహులు, లాటిన్ అమెరికా 1911 విప్లవాలు, మెక్సికో, చైనా రైతాంగం - వీరు జపాను దురాక్రమణనుఎదుర్కొని అధికారం కైవశం చేసుకోవటం, ఐరిష్ ప్రజల స్వాతంత్ర్యపోరాటం, వారి సహకార ఉద్యమం, అమెరికన్ రైతులువారి వ్యవసాయ క్షేత్రాలు నిలబెట్టుకోవటం - ఈ చరిత్రంతా రైతులు నిర్వీర్యులుకారు అని సూచిస్తుంది.

మార్క్స్, అనేకమంది ఇతర ఛాందసకమ్యూనిష్టులూ ఆశించినట్లుగా రైతాంగం-కాపిటలిజంచే కబళింపబడలేదు. ఆధునిక సామ్రాజ్యవాదపు మార్గదర్శకత్వంలో - కాపిటలిజం - ఫ్యూడలిజంలుకలిసి తీసిన దెబ్బలకు లొంగలేదు. ప్రపంచరైతాంగపు విస్ఫోటనాలకు ఫ్యూడలిజం -కాపిటలిజంలు వరుసగా చావుదెబ్బలు తింటున్నయ్.

కాపిటలిజం, చిన్నతరహా రైతు వ్యవసాయానికి, స్వతంత్ర చేతివృత్తులకు కారణంకాగలదని మార్క్స్ గ్రహించాడు. ఈ రెండూ కొంతవరకు ఫ్యూడల్ ఉత్పత్తికి పునాదులు. కాపిటలిస్టు ఉత్పత్తులలో భాగంగా ప్రక్కప్రక్కనే అవతరించినవి." (Marx Cap . Vol.1).

ఒక విధంగా ఆలోచిస్తే కార్మిక వర్గ ఆవిర్భవానికి కాపిటలిజం ఎలా కారణ మయిందో - స్వతంత్ర రైతాంగ ఆవిర్భవానికికూడా కాపిటలిజం అలానే కారణమయింది. యూరపులో పారిశ్రామికీకరణతో యాంత్రిక తయారీలు, భారీ పారిశ్రామిక ఉత్పత్తులుతో ముందడుగువేయటానికి, అధిక సంఖ్యలో పారిశ్రామిక కార్మికులు అవసరమయ్యారు. ఫ్యూడలిజం నుండి విముక్తి కల్పించి ఈ జనాన్ని వేతన కార్మికులుగా పరిశ్రమలలోనికి తరలించారు. అలానే ఆధునిక వాణిజ్యం, ప్రపంచవిపణులు - వివిధ వాణిజ్యపంటల "క్రమమయిన ఉత్పత్తులకు" - ఫ్యూడలిజం నుండి రైతులకు కొంత స్వాతంత్ర్యం కల్పించారు. ప్రాధమికంగా తూర్పు వలసదేశాలలో కౌలు - కౌలుకాలపరిమితి నిర్ణయించారు. ఈ నిజం తెలుసుకొనటానికి, వివిధ పార్లమెంటరీ కమీషన్లరిపోర్టులు, బ్రిటీషు హౌస్ ఆఫ్ కామన్స్ కమిటీ (1844) నుండి నిన్నటి (1926-28) రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ అగ్రికల్చర్ వరకు పరిశీలిస్తే చాలు. లాంక్షైర్ బట్టల మిల్లుల

యజమానులు, లండనువ్యాపారులు, ఇతరులు - వాణిజ్య పంటల ఉత్పత్తి, ఋణ చెల్లింపులు, బ్రిటీషు తయారీలకు అనువయిన మార్కెట్ల కల్పన ఈ కౌలు కాలపరిమితి, కౌలు ధర నిర్ణయాల ద్వారా నిరోధించరాదని ఆందోళన చేసారు. 19వ శతాబ్దంలో ఇంగ్లాండులో స్వతంత్ర కార్మికవర్గం వలెనే స్వతంత్రరైతులూ - కాపిటలిజపు లబ్ధికై సాయం చేయబడ్డారు.

ప్లాంటేషన్ల అనుకొన్నంత లాభసాటిగాలేకపోవటంతో కాపిటలిస్టులు కొంత లొంగివచ్చి - గోల్డ్‌కోస్ట్, నైజీరియానీగ్రోలకు చిన్న భూకమతాలు, రైతువారీ వ్యవసాయం - కోకో, కాటను, సిసిల్, ఇతరవాణిజ్యపంటలను, ఆఫ్రికా పశ్చిమకోస్తాలో వృద్ధి చేయటానికి చొరవతీసుకొన్నారు. ఫోర్స్‌డ్‌లేబరు, కంట్రాక్టులేబరు విధానాలు వదలి పెట్టారు. కాపిటలిజం తనస్వార్థానికి - ఫ్యూడలిజంతో ఇంపీరియలిజంతో పొత్తువదిలి స్వతంత్ర రైతాంగాన్ని చిన్న భూకమతాలను ప్రోత్సహిస్తుంది. అందువలన కాపిటలిజానికి వారసత్వంగా, కాపిటలిజం బదులు రెండు వర్గాలు - రైతు - కార్మిక వర్గాలు పుట్టుకవచ్చి, కాపిటలిజంను రూపుమాపుతయ్. నా ఈ నిర్ణయం సాంప్రదాయక కమ్యూనిష్టు నమ్మకానికి విరోధంగా వుంటుందని నాకు తెలుసు. అతను కార్మిక ఆర్థికతనే నమ్మి, కార్మిక వర్గం మాత్రమే కాపిటలిజం నుండి ఆవిర్భవించి - కాపిటలిజాన్ని నాశనం చేస్తుంది అనే విశ్వాసంతో వున్నాడు. అతనికి (కమ్యూనిష్టు) మనకు మధ్య జడ్జీగా వుండవలసినది వాస్తవాలు మాత్రమే.

కాపిటలిజం - ఫ్యూడలిజాలనుండి స్వాతంత్ర్యం సంపాదించాలనే బలమయిన, నిగ్రహించుకోలేని ధోరణి రైతులకు రోజురోజుకీ పెరుగుతున్నది. గత ఆర్థిక మాంద్యం, రెండు ప్రపంచయుద్ధాలు, రైతుల సంకుచిత మనస్తత్వాన్ని, నిర్వేదాన్ని, నిస్సహాయతను పోగొట్టినయ్. ఆధునిక ప్రపంచంలోకాపిటలిజం - ఇంపీరియలిజం కల్పిస్తున్న సమస్యలను రైతులు ధైర్యంగా ఎదుర్కొంటున్నారు. వారి కోర్కెలకు రూపమిచ్చి ఏకమవుతున్నారు.

ప్రస్తుత రైతాంగ దుర్గతికి యుద్ధ పూర్వం కాపిటలిజపు దోపిడీయని - వర్తమానంలో- పట్టణప్రజలు -రష్యాలో కార్మికులనీ రైతులు గ్రహిస్తున్నారు. పారిశ్రామిక - వ్యవసాయధరలమధ్య సారూప్యత వుండాలనే రైతుల డిమాండును, చాలా ప్రజాస్వామ్యదేశాలంగీకరించటం ఈ గ్రహింపును సూచిస్తున్నది. వర్తమానకాపిటలిస్టు వ్యవస్థ రూపుమాసి, ప్రభుత్వ యంత్రాంగం శ్రామికుల చేతులలో పడి శ్రామిక సంక్షేమానికి మార్గం సుగమం అయినట్లు - వాణిజ్య, పారిశ్రామిక, బుద్ధిజీవుల వర్గాలతో రైతులు

సమానప్రతిఫలాలు పొందాలనే డిమాండు - కాపిటలిజపు ఆధిపత్యాన్ని, సామ్రాజ్యవాదపు ఆజమాయిషీని, సోవియట్ టెర్రరిజాన్ని ఓడించినప్పుడు మాత్రమే రైతులు సంపూర్ణ రాజకీయ, ఆర్థిక అధికారాన్ని చేపట్టి - సంపూర్ణ తృప్తి పొందగలరు. కార్మికులు మాత్రమే కాపిటలిజంను నాశనం చేస్తారని, వారు మాత్రమే దోపిడీ నుండి ఈ అన్నివర్గాలకు విముక్తి కలిగిస్తారని, అందుకై విప్లవించగలరనీ భావిస్తూ కార్మికులు కాపిటలిజం, ఇంపీరి యలిజంల నుండి రైతుల విముక్తి కాంక్షను నిర్లక్ష్యంచేయటం 'బుద్ధిహీనుల స్వర్గంలో' నివసించటం వంటిది. ఈ వేదాంతం ఆధునిక సామాజిక జీవితవాస్తవాలను మభ్య పెట్టటమే.

"రైతులు తమ్మంతాము కాపిటలిజం నుండి రక్షించుకొనే ప్రయత్నాలలోనే, వున్నారు, వారికి భవిష్యత్తులేదు" అనే ఆలోచనకు కాలం చెల్లింది. ఆ రోజులు పోయాయి. కాపిటలిజం రైతులపై సాగిస్తున్న పోరాటంలో చారిత్రక నిర్ణయం, కాపిటలిజంకు వ్యతిరేకంగా వచ్చిందని మనం చూశాం. ఫ్యూడలిజం, కాపిటలిజంల రక్షణావలయాలను ఛేదించుకొని, నిజమయిన అర్థవంతమయిన సంపూర్ణ స్వేచ్ఛకు, దోపిడీ నుండి విముక్తికి రైతులు ముందుకు దూసుకొని పోతున్నారు. ప్రతి వర్గందోపిడీ నుండి తన్నుతాను రక్షించుకోవలసిందే. రైతులు న్యాయమయిన, ధృడమయిన యత్నాలతో విజయాల వెంట విజయాలు సాధిస్తున్నారు. వర్తమాన సామాజిక సౌభాగ్యానికిఅత్యావశ్యకమయిన రైతులు, తగిన ప్రతి ఫలాలు అడగటం ధర్మం. కాపిటలిజం - సోవియటిజం వారి జీవితాలలో పరచిన ముళ్ళను -పల్లేర్లను ఊడ్చివేస్తూ ముందుకు సాగవలసిందే. సామాజిక ఉత్పత్తి వనరుల పునర్వ్యవస్థీకరణ, సామాజిక సంపద - ఆదాయాల పంపిణీలను, వివిధ వర్గాలశ్రమ, యత్నాలు, త్యాగాల ఆధారంగా చేయటానికి కావలసిన రాజకీయ ఆర్థిక అధికారాలలో భాగస్వామ్యాన్ని రైతులు డిమాండుచేస్తున్నారు.

ఆంధ్రప్రజల - చైనా రైతుల సాహిత్యంలో, కవిత్వంలో, పాటలలో అతిశయ మయిన విశ్వాసం, ఆశావాదం - ప్రతిమాటలో - ప్రతి ఊర్పులో మార్మోగటం - ప్రపంచ రైతాంగం నూతనోత్తేజంతో మేల్కొన్నదనటానికినిదర్శనం, తెలుగు తమ్ముడు శెట్టిపల్లి పాటలు- రైతుల హృదయాలనురగిలించినయ్. శతాబ్దాలుగా, అద్భుతమయిన భావ వ్యక్తీకరణతో, ప్రేమ గాధల నిరాశా నిస్పృహలతో నిండిన సాహిత్యానికి నేడుచోటులేదు.

ఇది సాహసాల, ఆశల, కలల, విప్లవోద్వేగాల, చర్యల రైతు ప్రపంచం. (చైనా,

ఇండియా, మెక్సికో, బాల్కన్ దేశాలు). రష్యా విప్లవం సమిష్టి వ్యవసాయం, దీనితో వచ్చిన హీనత - ఈ రెండూ వెలుగు - చీకటి వంటివి. పట్టణాలపై గ్రామాలాధారపడటం, పట్టణవాసులను చూచి న్యూనతా భావంతో కుంచించుక పోవటం, మార్క్సుంతటివానిచే పట్టాభిషిక్తులయిన కార్మికులను చూచి బెంబేలు పడటం మానుకొని - 1937 సోవియట్ రాజ్యాంగం ప్రసాదించిన హక్కులకన్నా మేలయిన సంపూర్ణ ప్రజాస్వామ్యహక్కుల సాధనకు పవిత్రోద్యమం చేపట్టే ఆత్మస్థైర్యం రైతులు కలిగి వున్నారు. రష్యా ఇతర దేశాలలో అధికార పీఠాలెక్కిన కార్మికులలాగా కాక, రైతులు, బుద్ధిజీవులు, కార్మికులు, చేతివృత్తులవారు - శ్రామిక బాహుళ్యమంతా సమానభాగస్వామ్యం కలిగిన, నిజమయిన నూతన సాంఘిక జీవిత సాఫల్యానికి రైతాంగం కృషిచేస్తుంది.

## రైతులు స్వతంత్ర వర్గం

దృష్టిలోపంగల కొందరు సోషలిస్టులు రైతులు ఒకవర్గమే కాదన్నారు. లెనిన్‌స్వయంగా ఇలా చెప్పాడు. " సాధారణంగా వర్గాలంటే ఏమిటి ? సమాజంలోని ఒక భాగం భూమినంతా ఆక్రమించుకొంటే -మనకు భూస్వాములు, రైతులు అనే వర్గభేదం ఏర్పడుతుంది. అలానే సమాజంలోని ఒక భాగం పరిశ్రమ కంతకూ యజమానైతే, వేరొక భాగం అందులో శ్రామికులయితే - కాపిటలిజం - కార్మికులు అనే రెండు వర్గాలు ఏర్పడతయ్ " (Quoted by Leontove).

కాని రెండు దోపిడీ వర్గాలు ప్రక్కప్రక్కనే నిలచి వారి బాధితులను - రైతులను - కార్మికులను - దోపిడీ చేస్తుంటే అప్పుడు రెండు వర్గాలకు బదులు - రెండు దోపిడీ వర్గాలు, రెండు దోపిడీచేయబడే వర్గాలు ఏర్పడతాయి. ఆత్మవంచనతో, మాటలగారడీతో వీటన్నింటిని ఒకే బలమైన వర్గంగా ఒక వైపు - వేరొక వర్గంగా ఇంకొక వైపు, సాంప్రదాయ కమ్యూనిష్టులు చూపటం, నిజాలను విస్మరించటం, తమ వాదనలను సమర్థించు కోవటానికి చేసేప్రయత్నాలు.

కార్మికులు ఎలాగైతే జీతాల కొరకు ఫాక్టరీలలో పనిచేస్తారో, అదే విధంగా రైతులు పొద్దుపొడిచిన దగ్గరనుండి పొద్దుగూకే వరకు పొలంలో పనిజేస్తారు. కార్మికులు ఒకరితో ఒకరు - ఫాక్టరీలలో చర్చించుకొని, తమ బాధల కారణాలను కనుగొని ఏ విధంగా సంఘటిత పడుతున్నారో అదేవిధంగా, వివిధ రకాల ప్రాసెసింగు ఫాక్టరీలలో,

మార్కెట్లలో రైతులు తమ ఐక్యతావశ్యకత గుర్తిస్తున్నారు. కాపిటలిజం తన ఫాక్టరీలద్వారా కార్మికులకే కాక రైతుల రక్షణకు ఐక్యతకు సహాయపడుతున్నది. కార్మికుల్లాగా, రైతులు కూడా కాపిటలిజపు దోపిడీ బాధితులే. వీరిరువురూ దోపిడీ నైజాన్ని దోపిడీ పరిమితులను గుర్తించగలిగితే - విముక్తి మార్గం అర్థం అవుతుంది. ఏకీకృతమయిన వారి ప్రతిఘటన ఇరువురకూ చెందినదై అత్యంత ఉపయోగకరమవుతుంది. కార్మికులపైపారిశ్రామిక యాజమాన్యపు ఆజమాయిషీలాగానే, - రైతులు కూడా - భూస్వాములు, వడ్డీవ్యాపారులు పన్నువసూలుదారుల, బాంకర్ల, మాన్యుఫాక్చరర్ల, వర్తకుల, సామ్రాజ్యవాదుల -ఒక్క మాటలో చెప్పాలంటే -కాపిటలిజం బలిపీఠం ముందు సేవలందించే అన్ని పరికరాల దౌర్జన్యాలకు లోనవుతారు.

ప్రపంచకాపిటలిజం - దాని ప్రపంచ విపణులు - సామ్రాజ్యవాదం ఇవి రైతుల అధోగతికి, అణచివేతకు ప్రధానమయిన పరికరాలు. వీటి నుండి సంపూర్ణమయిన విముక్తికై రైతులుతమ ఐక్యతావశ్యకతను గుర్తిస్తున్నారు. కలసి పోరాడటంలోని అవసరాన్ని గ్రహించి దయాహీనులు తమకు సాధారణ శత్రువులయిన దోపిడీగాండ్లను ప్రతిఘటించ టానికి తమకున్న అన్ని వనరులూ సమీకరించుకుంటున్నారు. రైతులు ఐక్యతతో, క్రమశిక్షణతో జాతీయంగా అంతర్జాతీయంగా,దోపిడీ బాధితులందరితోకలసి, తమ జీవనాడులను పిండుతూ, తమ సంపదతో అదృశ్యంగా బూర్జువాలు పెట్టెలు నింపుకోవటం లోని దుర్మార్గాన్ని వెంటనే ఆపివేయాలి.

ప్రపంచ రైతులు, ముఖ్యంగా వలస రైతులు, తమ బాధలకు, భయానక అనుభవాలకు చరమ గీతంపాడి, బలవంతులయిన శత్రువులనుగెలచి, విప్లవోద్యమాన్ని నిర్మించి, సామాజిక పునర్నిర్మాణం కావించాలి. ఐక్యతనూ అందరిప్రయోజనాలను ఎవరయితే నిర్లక్ష్యం చేస్తారో, విప్లవావసరాలను మార్గాలను (ఇతర వర్గాలు - కార్మికులతో సహా) తమ శక్తి నంతా హరిస్తున్న కాపిటలిస్టు వ్యతిరేకతనూ పట్టించుకోరో వారు విప్లవ వ్యతిరేకశక్తులనూ,తిరోగమనవాదులను ప్రోత్సహిస్తున్నారనేది సత్యం.

దాని (కాపిటలిజం) పతనం - కార్మిక విజయం రెండూఅనివార్యమని కమ్యూనిస్టు మానిఫెస్టో[4] లో మార్క్సు చేసిన ప్రకటన ఎంత ఏకపక్షంగా వుందో మనం తెలుసుకో గలిగిన స్థితిలోవున్నాం. కార్మికులపైనే తమ ధ్యాసంతా నిలిపే మూఢత్వాన్ని ఆధునిక రైతు అంగీకరించడు. మార్క్సు ఇంకాఇలా ప్రకటించాడు "బూర్జువాలనెదుర్కొనే అన్ని వర్గాల కంటే కార్మిక వర్గమొక్కటేఅధిక విప్లవాత్మకమయినది." తరువాత జరిగిన

చరిత్రలో "కార్మిక వర్గమొక్కటే" యని చెప్పటానికి తగిన ఆధారాలు కన్పించవు. కార్మిక వర్గం -అంత విశ్వాసపాత్రమయిన, నిలకడ గల మార్గదర్శిగా , విప్లవంలో ముందుండేదిగా ఋజువు చేసుకోలేదు.

"దిగువ మధ్యతరగతి జనం, చేతివృత్తులవారు - రైతులు అందరూ తమ మనుగడ నిల్పుకోవటానికి మధ్యతరగతి వారిగనే బూర్జువాలతో పోరాడతారు." ఇది మార్క్సు చేసిన మరొకనిరాధారమయిన ఆరోపణ రైతులపై, చేతివృత్తులవారిపై, సాంప్రదాయకమ్యూనిష్టులకు కల ద్వేషభావానికీ ఆరోపణల పునాదులు వేసి 'వారు (రైతులు) తిరోగమనవాదులు - చరిత్రగతిని వెనకకు మరలించాలని ప్రయత్నిస్తున్నారని' వాదించాడు. రైతులు సాంఘిక విప్లవం సాధించగలరని నమ్మవద్దు అని హెచ్చరించాడు. ఈ విధంగా రైతుల పట్ల శతృత్వమూ, అపనమ్మకమూ, నిర్లక్ష్యమూ రెచ్చగొట్టబడింది. దీనిపరిణామంగా రైతులు ఈ సంశయాత్మకుడు, ప్రమాదకారి అయిన మిత్రునిపై అపనమ్మకం పెంచుకున్నారు. లాసెల్స్ - "కార్మికులు మినహా అన్ని వర్గాలవారూ తిరోగమన వాదులే" అని చేసిన ప్రకటనకు, మార్క్సు వ్యతిరేకంగా స్పందించినప్పటికీ, ఆ స్పందన యదార్థమయినప్పటికీ -మార్క్సు శిష్యులు పట్టించుకోలేదు. మార్క్సుతో మొదలై సాంప్రదాయమార్క్సిస్టులందరూ - ఫ్రెంచి కమ్యూన్ నుండి లెనిన్ - తరువాత స్టాలిన్ వరకు - రైతులు విశ్వాసపాత్రులై కార్మికుల కండగా వుండాలని, కార్మికులకు అధికారం కట్టబెట్టాలనీ, వారి నియంతృత్వాన్ని బలపరచాలని, వారి పంటలపై విధింపబడే మిలటరీ లేవీలను మౌనంగా భరించి - సమిష్టి వ్యవసాయంలోకి నెట్టబడి వారి కొత్త పాలకుల కడుపులు నింపాలని, తప్పుడు ఆలోచనలతో వున్నారు.

ఆధునికి రైతు పూర్తిగా మేలుకుంటున్నాడు. తనసోదరులపై రష్యా కార్మిక నియంతృత్వపు కాఠిన్యవైఖరినుండి గుణపాఠం నేర్చుకున్నాడు. ఆగ్నేయ ఐరోపాలో రెడ్ ఆర్మీ , U.S.S.R కమ్యూనిష్టు అనుచరులూ, ప్రజాస్వామ్యాన్ని ఎలా అణచివేసిందీ రైతులకు తెలుసు "శ్రామికుల ఐక్యత" వంటి కమ్యూనిష్టులమాటలలోని తిరకాసు "రైతులు తిరోగమనవాదులు"సోవియట్ కార్మిక నియంతృత్వాధికారం" వంటిమార్క్సు భావాలను అర్థంచేసుకొంటున్నారు. రైతుల ఇష్టాయిష్టాలు, ఆవేశం, విప్లవాత్మకత చారిత్రకనేపథ్యాన్ని ప్రపంచ సోషలిష్టులందరూ గమనించినడవాలి. "రైతులు తిరోగమన వాదులు. వీరు అభివృద్ధి గడియారపు ముళ్ళను వెనక్కు తిప్పాలని ప్రయత్నిస్తారనే" సాంప్రదాయక కమ్యూనిష్టుల ఆరోపణలో సత్యంలేదు. అభివృద్ధి మార్గాలు కాపిటలిజంలో

కనిపించవనే వాస్తవాన్ని అనేకమంది గుర్తించారు. అటువంటి కాపిటలిజాన్ని వ్యతి రేకించటం తిరోగమనం కాదు - అది విప్లవం. " అప్రతిష్ఠాకరమూ, హేయము, హీనము, ద్వేషపూరితమైన వాంఛలు, గ్రంధుల రక్తస్రావంతో నిండిన శరీరంతో - కాపిటలిజం నిండిఉంది. కాపిటలిజపు విజయమంటే మానవత్వం నరకంలోనికి నెట్టబడటమే. కాంగో, లాటిన్ అమెరికా, సెంట్రల్ అమెరికాలో భయోత్పాతాలు సృష్టించిన బానిసవిధానాల నుండి ఈ విషయం తెలుసుకోవచ్చు. కాపిటలిజం ఎక్కడైతే తాను సమర్థవంతమైన, స్వంతకార్యచరణ చేపట్టానని చెప్తుందో, అక్కడ ప్రతిచోటా దాని భారీ యాంత్రిక వ్యవ సాయం, (అస్సాం, నీలగిరి, మలయా, కెన్యా, ఇండోచైనా, వెస్టిండీస్, బ్రెజిల్, అర్జెంటీనా, అమెరికా వ్యవసాయ క్షేత్రాలు) అంగచ్ఛేదాలు - హత్యలతో రక్తపు టేరులు పారించింది. ప్రపంచం దాని ప్రయోగాలతో రోగగ్రస్తమయింది. కాపిటలిజపు మద్దతు దారులు సిగ్గుతో తలలు దించుకొంటున్నారు. రక్తపు కంపుగొడుతున్న లాభాలను దాని భాగస్వాములు అసహ్యించుకుంటున్నారు.

ఇటువంటి "దెయ్యాన్ని" వదిలించుకోవటం - చరిత్రగతిని వెనుకకు మరల్చటం కాదు. పెరుగుతున్న కాపిటలిస్టుపరిశ్రమల, వాణిజ్యాల డిమాండు తట్టుకుంటూ వ్యవ సాయం చేసి, వివిధ పంటలు పండిస్తూనే ప్రపంచ జనాభాను మరింత పతనావస్థకు దిగజారకుండా కాపాడ గలగటం - విప్లవాత్మకమయిన విజయం.

అందువలన మార్క్స్ "రైతాంగ ఆర్థిక విధానం నశిస్తుంది - నశించింది." అన్న మాటలిక ఆమోద యోగ్యం కావు. విశ్వాసంతో వారి బాధ్యతలను నెరవేర్చటమే. శతాబ్దాలుగా సమాజం సంస్కృతులతో వారిమనుగడ ప్రత్యేకమయిన విషయం.

"ఏదేశం కూడా రైతుల చే పాలించబడలేదు" నిరంతర పోరాటం చేయడం - ఓడిపోవటం వారి అలవాటు'' అని 1923లో జరిగిన రెడ్‌పేజెంట్ ఇంటర్నేషనల్‌లో మార్క్సిస్టులు ఆరోపించారు. (I.P.U Journal 1955) ఇంతకంటే బుద్ధిలేని తప్పుడు ఆరోపణ వేరొకటుండదు. స్టాంబోలిస్కీ బల్గేరియాలో ప్రభుత్వం నిర్మించాడు. ప్రాతినిధ్యం లేకుండా రష్యాలో జరిగిన సమావేశంవారికి గుర్తులేదు. హంగరీ కమ్యూనిష్టు 'వాంగా' "రైతులలోవర్గ స్పృహపెరిగింది. మధ్య, తూర్పు ఐరోపాలో రైతులు పై మధ్య తరగతి వారితో కలిసి గాని విడిగాగాని రాజకీయ పార్టీలు నిర్మించుకొంటున్నారు. అధికారం కైవశం చేసుకొనే ప్రయత్నాలు చేశారు.'' ( I.P.U. 1955), అని ఈ సమావేశంలో చెప్పాడు. 1922-38 లో అనటోనిన్ స్వేహాతా, మిలన్ హోడ్జాల నేతృత్వంలో - ది రిపబ్లికన్

పెజెంట్స్ పార్టీ - చెకోస్లొవేకియాకు ప్రధానమంత్రులనందించింది. 1950 వరకు "ది పెజెంట్స్ పార్టీ" స్వీడన్ సంకీర్ణ ప్రభుత్వంలో భాగస్వామయింది. డెన్మార్కు పెజెంటు మంత్రివర్గం పెజెంటు ప్రధానమంత్రిని ఎన్నుకొన్నది. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌ల లోని ఫార్మర్స్ పార్టీలు -లేబరు పార్టీలకు ప్రత్యామ్నాయంగా మంత్రివర్గాల నేర్పాటు చేసినవి.

"చిన్న కమతాలపై ప్రేమ ఆధునిక యుగ స్ఫూర్తికి వ్యతిరేకమని మార్క్సిస్టులు వారి అనుయాయులు అనగా కొందరు సోషలిస్టులు ఆరోపిస్తున్నారు. వారి వుద్దేశ్యంలో ఆధునిక యుగస్ఫూర్తి అంటే - భారీ వ్యవసాయ సమాజాలు, భారీ ఉత్పత్తులు, భారీ పంపిణీ విధానం -కేంద్రీకృత అధికారం. సంస్థాగత నియంతృత్వంలపై వారికిగల మోజు వారినిలా ఆలోచింపజేస్తున్నది. రైతాంగ ఆర్థికతలోని ఉత్తేజాన్ని, ఆర్థికాభివృద్ధి శక్తిని - తద్వారా సాధించే సమసమాజనిర్మాణాన్ని, సమాజం పై వికేంద్రీకృత ప్రజాస్వామ్య ప్రభావాన్ని వారు గుర్తించటంలేదు. వ్యవసాయ ఆర్థికతంటే వ్యవసాయ ఉత్పత్తులకలబోత (Pulverisation- పిండిగొట్టుట)నుకుంటున్నారు. సహకారోద్యమ ప్రాముఖ్యతను, ఉత్పత్తి రాశిని, వృధాలేని పంపిణీలోని లాభాలను తెలుసుకోలేక పోతున్నారు. రైతులను సహకారోద్యమంతో అనుసంధానం చేయవలసివచ్చినప్పుడు - మనస్ఫూర్తిగా సహక రించటం లేదు. ప్రతి సహకారసంస్థనూ ఒక నిర్బంధ సంస్థగా - సోవియట్ దేశాలలో మార్చినట్లుమార్చాలని భావిస్తున్నారు. (I.P.U june 1955)

రైతుల రాజకీయ పార్టీలపై, రైతుసంఘాలపై, రైతునాయకులపై - "ఇతర శ్రామికవర్గాల భాగస్వామ్యం లేకుండా అధికారం అంతా తామే మూటగట్టు కోవాలను కొంటున్నారు" అని - మాటిమాటికి తప్పుడు ప్రచారం చేయబడుతున్నది. ఇండియాలో మా నినాదం - కిసాన్ - కళాకార్, మజ్దూర్, బుద్ది జీవుల ప్రజారాజ్యం రావాలని, ఆర్థిక రాజకీయ అధికారంలో శ్రామికులకందరకూ వాటావుండాలని, ఇతర వర్గాలు నాయకత్వం మాకు కట్టబెట్టినా - సంపూర్ణ స్నేహ భావంతో అన్ని శ్రామిక వర్గాల సహచర్యంతోనే అధికారం చేపడతామని. మా ఆదర్శమయిన కిసాన్- మజ్దూర్- ప్రజారాజ్యాన్ని (రైతు-కూలీ-ప్రజారాజ్యం) మహాత్మాగాంధీ నవంబరు 1944 లో ఆశీర్వదించాడు. అలానే ది ఇంటర్నేషనల్ పేజెంటు యూనియన్ ( ది గ్రీన్ ఇంటర్నేషనల్) "రైతుల ప్రయోజనాల కొరకు ఉత్పత్తికారకులయిన ఇతర వర్గాలతో ముఖ్యంగా - పారిశ్రామిక కార్మికులు - వృత్తి జీవులతో సంకుచిత పరిష్కార మార్గాలను వెదుకు లాడకుండా, శాంతియుత మయిన అభివృద్ధి, మానవ సంక్షేమం పునాదులుగా వీరందరి ప్రయోజనాల రక్షణగా

బాధ్యతను స్వీకరిస్తాము." అని తన విధాన ప్రకటనలో తెలియజేసింది. కమ్యూనిష్టులు అపనమ్మకం - ద్వేషంతో రైతుల ఐక్యతను చెడగొడుతున్నారు. ఈ విషయాన్ని రెడ్ పేజెంటు ఇంటర్నేషనల్ స్పష్టపరచింది. రైతాంగ వ్యతిరేక ధోరణులు, రష్యా రైతాంగం పై వారి పాశవికతలను చూచే, ఆగ్నేయ ఐరోపా రాష్ట్రాలు - U.S.S.R చే తమపై రుద్దబడి - కాదనుకుంటున్న కమ్యూనిష్టు ప్రభుత్వాలను తీవ్రంగా ప్రతిఘటించినవి. ఈ రాష్ట్రాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలేర్పడిన్పటినుండీ, కమ్యూనిష్టులు రైతుల సహకార వ్యవస్థలను, పార్టీలను నాశనంచేస్తూ, సోవియట్ సమిష్టి పద్ధతులతో రైతుల ఆర్థికతను దెబ్బతీస్తున్నారు. దీనికి ప్రతీకారంగా రైతులు సహాయ నిరాకరణ చేపట్టారు.

రైతులు స్వాతంత్ర్య ప్రియులు "దోపిడీ - నిరంకుశత్వాలపై ఎల్లప్పుడూ లేక అప్పుడప్పుడూ పోరాటం చేస్తునేవుంటారు." డాక్టర్ డిమిత్రోవ్ - అభివృద్ధి స్వేచ్ఛలకై వారు చేసే ప్రచారాన్నభినందించాడు.

రెండవ ప్రపంచ యుద్ధం - తూర్పు - పడమర దేశాల రైతుల వర్గ స్పృహకు వారి ప్రాధాన్యతల గుర్తింపుకు ఎంతోసహాయపడింది. వారి దేశాల ఆర్థికాభివృద్ధిలో వారి కీలక పాత్ర తెలుసుకున్నారు.

రెండవ ప్రపంచయుద్ధానంతరం "ఫస్ట్ వరల్డ్ కాన్ఫరెన్స్ ఆన్ అగ్రికల్చర్ " (First World Conference on Agriculture - ప్రథమ ప్రపంచ వ్యవసాయ సభ) 1946లో నిర్వహింపబడింది. ఇండియన్ పెజెంటు కాంగ్రెసుకూడా ప్రతినిధిగా పాల్గొన్నది. ఈ సమావేశంలో అంతర్జాతీయ వ్యవసాయ ఉత్పత్తిదారుల సమాఖ్య ఏర్పాటు చేయ బడింది. (International Federation of Agricultural Producers - I.F.A.P) ఇది శ్రమ జీవులందరి మధ్య జాతీయ ఆదాయం, సంపదల పంపిణీ, అధికోత్పత్తి, సమాన ధరల సాధన ఆశయాలతో స్థాపించబడింది. తమ సాంఘిక శక్తిని ఏకీకృతం చేయాలని I.F.A.P. యత్నిస్తోంది. బహుముఖీన ఆర్థికత్వం మరొక నూతన ఆశయం. దురదృష్టవశాత్తు ఆగ్నేయ ఐరోపాలోరష్యా సైన్యసహాయంతో రైతులను అణచివేస్తున్నది. రైతులు పోరాడు తునేవున్నారు. ఈ పోరాట ఆవశ్యకతకై రైతులు ఇంటర్నేషనల్ పెజెంట్ యూనియన్ (గ్రీన్ ఇంటర్నేషనల్) స్థాపించి, ప్రజాస్వామ్య రైతాంగానికి విప్లవాత్మకమైన రాజకీయ నాయకత్వమందిస్తున్నారు.

ప్రజాస్వామ్యం అతి ప్రధానమయిన శక్తిగా -నియంతృత్వం అతి హేయమయిన శతృవుగా రైతు భావిస్తున్నాడు. సోవియటిజం -కాపిటలిజం పాత్ర పోషించటానికి

అవతరించిందని తెలుసుకున్నాడు. అందువలన కాపిటలిజం - సోవియటిజం రెంటిపై పోరాటం చేయటం ఆతని ధ్యేయం. ఆతని భవిష్యత్తు సహకారోద్యమంలోనే వుందని సంపూర్ణ విశ్వాసంతో వున్నాడు.

కాపిటలిజం సోవియటిజంల మోసాన్ని గెలవటానికి, సహకారోద్యమ నిర్మాణానికి, ఆర్థిక వ్యాపకాలలో స్థోమతసాధించి, కొత్తపాత వర్గ శత్రువులపై రాజకీయ విజయం సాధించాలి.

ప్రపంచమంతటా రైతు ఉద్యమిస్తున్నాడు. రైతుసంఘాలు అన్ని దేశాలలో రైతుల అండదండలు పొందుతున్నయ్. ప్రపంచ రైతాంగంలో ప్రతిచోటా నూతన చైతన్యం వెల్లివిరుస్తోంది. అందువలననే రైతులు ఉత్సాహభరితంగా ప్రపంచ ఆహార మరియు వ్యవసాయ సంస్థ (World Food and Agriculture Organisation ) మానవహక్కుల తీర్మానంకు (Human Rights Charter . U.N.O) మద్దతునిచ్చి కిసాన్ - మజ్దూర్ - కళాకార్ - బుద్ధిజీవప్రజాస్వామ్యరాజ్యానికి చైతన్యంతో కృషిచేస్తున్నారు.

# రైతులు - సాంఘికన్యాయం - గ్రామకామన్వెల్తులు

(Peasants contribution to social Justice -
The Village common Wealths.)

"రైతులేనాడూ అభివృద్ధి దాయకమయిన సమాజానికి - సామాజిక ఆర్థికతకు నిర్మాతలు కారు". అని మార్క్సు ముందుగా ఏర్పరుచుకొన్న అభిప్రాయంతో వ్రాసిన వ్రాతలను కమ్యూనిష్టులు -సోషలిస్టులు వంటబట్టించుకున్నారు. అందువలననే 1923 లో మాస్కోలో జరిగిన రెడ్ పెజెంట్ ఇంటర్నేషనల్ (Red peasant International) "రైతులెప్పుడూఅధికారాన్ని హస్తగతం చేసుకోలేదు. ఏ దేశాన్ని పాలించలేదు" అని చెప్పగలిగింది.

గ్రామ కామన్వెల్తుల సమభావం - పనితీరు - విజయాలపై మార్క్సు వ్యాఖ్యల కారణంగా, సోషలిస్టులు రైతులను నిర్లక్ష్యంచేశారు. గ్రామ కామన్వెల్తుల ఏర్పాటు ఫలితంగా, ఇతర శ్రామిక వర్గాలకు భిన్నంగా, రైతులూ, చేతివృత్తులవారూ తమ ప్రజాస్వామ్యాన్ని , ప్రణాళికాయుతమయిన ఆర్థిక నిర్మాణాన్ని, సాంఘిక సమానతలను, అభివృద్ధిని, యాజమాన్యాన్ని, పెంపొందించుకొన్నారు. దోపిడీ రాహిత్యం, సహకార ఆర్థిక సంబంధాలు, సామాజిక సంస్థల పునాదులపై, చక్కని నాగరికత నిర్మించారు. ఈ నాగరికతలో - పనిచేయగలవారందరికీ పని - సామాజిక రక్షణ, వృద్ధులపోషణ, విద్యావకాశాలు, వృత్తివిద్యలు కల్పించి - నాగరిక సమాజానికి అర్థమయిన సామాజిక ఆనందాలు అందించబడినవి. ప్రజల "అదనపు విలువ" -"అదనపు శ్రమ" లను సమాజానికి పంచినవి. గ్రామ కామన్వెల్తుల సరియైన అవగాహన కొరకు - రెండు వేల సంవత్సరాలకు పైగా -

ప్రపంచంలోని సువిశాల భాగాలలో - అతిపెద్ద సమాజాలలో వర్ధిల్లిన సాంఘిక ప్రజా స్వామ్యాన్ని, దాని లక్షణాలను, విజయాలను సింహావలోకనచేయాలి.

"అలతి అలతి మాటలతోసాగిన అనల్పార్థరచన" వలె వున్నదని - అర్కాన్‌సాస్ - 1956 - ఆచార్యుల సమావేశం" గ్రామ కామన్వెల్తు విజయాలను కొనియాడింది.

## గ్రామకామన్వెల్తులు - ప్రజలకు " అదనపు విలువ" పంపిణీ

బతుకు తెరువు వెతుకులాట -అందులో నే సుఖ సౌఖ్యాల అన్వేషణ సమాజంలో ప్రాచీన కాలం నుండి వున్నదే. దూరదృష్టిలేని ఆఫ్రికన్ మరగుజ్జులు వారికడుపు నింపు కోవటానికి సరిపోయినంత మాత్రం పనిచేసి, పచ్చివే తిని మిగతాకాలం సోమరులుగా వుండేవారు. భారతీయులు, గ్రీకులు దూరదృష్టితో ఉత్సాహంగా శ్రమించి, అనుకూల మయిన ఋతువులలో అధికంగా పండించి, నిలువవుండని ఆహారాన్ని పనిసమయంలో తిని, నిల్వవుండే ఆహారాన్ని నిలువజేసి - సంవత్సరంలోకొంతకాలం "ఆట విడుపు " గా గడపటం అలవర్చుకొన్నారు. ఈ నిలువలు ప్రకృతి అనుకూలంగా లేనప్పుడు, తాము అనారోగ్యంతో వున్నప్పుడు వుపయోగించుకొనేవారు. వీరు క్రమశిక్షణ, జాతిరక్షణ, సామాజిక జీవితపు మెరుగుదల, సాధారణసెలవులు - సామాజిక సుఖ సంతోషాల అవసరాన్ని గుర్తించారు. అజ్‌టి (AZTEE) ప్రజల ఇంకా (INCA) నాగరికత ఇలానే అభివృద్ధి చెందింది. వ్యవసాయంలో స్థిరపడటం, పశుపోషణ, పౌష్టికాహార తయారీలలో కొందరుంటే - కొందరుదేశ ద్రిమ్మరితనం వదలి గ్రామ జీవితానికలవాటు పడ్డారు. హరప్పా - మొహంజదారో[1] నాగరికత కాలానికి, ప్రాచీన భారతీయులు, పనిని క్రమబద్ధం చేసుకొన్నారు. సాధారణ సెలవలతో ఆనందించేవారు. ఆహారనిల్వలు, గృహవసతి, బట్టలు, గృహోపకరణాలు కలిగివుండేవారు. వారిఅదనపు సంపాదనను పట్టణ నిర్మాణానికి వాణిజ్యం సామాజిక సేవలకు వుపయోగించేవారు. వ్యవసాయంలో - చేతివృత్తులలో నైపుణ్యం సంపాదించి, తీరికకాలంలో కోటల, ఆయుధాల, నావల, నీటి పారుదల సౌకర్యాల నిర్మాణాలు చేసుకున్నారు. అభివృద్ధి చెందిన సమర్థవంతమయిన పని విభజన కలగి, స్త్రీల భాగస్వామ్యంతో - కళలను - వృత్తులను సంగీతాలను నేర్చారు.

ఎవరు ఎక్కువ అభివృద్ధి చెందినవారు.వారా? మనమా? అతి ప్రాచీన కాలంలో ప్రకృతి వైపరీత్యాలకు నివారణోపాయాలు కనిపెట్టి, జాతినికాపాడుకొని, వృద్ధి చేసుకొన్న వారే నిస్సందేహంగా అభివృద్ధి చెందినవారు. జాతినికాపాడుకోవటం, జనాభాను వృద్ధి

చేసుకోవటం, ప్రతి సమాజపు ప్రథమ కర్తవ్యం, వారు కరువు కాటకాలకై ఆహారం నిలువ చేసుకోవటం, శ్రమలో ఆనందం, పనిలో నైపుణ్యం - అన్నిటికంటే ముఖ్యంగా నైతికత - ఇవి కష్టపడి, దీర్ఘకాలం పనిచేయటం వలన సాధ్యమని తెలుసుకోగలిగారు. అధిక మయిన వృథా శ్రమ నుండి ప్రకృతి వైపరీత్యాల నుండి రక్షణకు, నీటిపారుదల సౌకర్యాలు, శాశ్వత ఉత్పత్తులతో జీవితాలు మెరుగుపరచుకోవటానికి ప్రపంచంలో ఎప్పటినుండో సమాజాలు కృషిచేస్తున్నాయి. వారి పని ప్రణాళికలు (రోజువారి, నెలవారి, సాంవత్సరిక) ద్వారా, వారి భౌతికావసరాలకు మించిచేసే, వారి ఉత్పత్తి సామర్థ్యం అర్ధమవుతుంది. సమర్ధవంతంగా, సమన్వయంతో, శ్రమతో - సరుకులు, నిత్యావసరాలు, దైనందిన అవసరాలు, నిర్మాణాలు పోను, దీర్ఘకాలికఅవసరాలుసాధించే వారి స్తోమత వెల్లడౌతుంది. పనిలో (శ్రమలో) ఈ అదనపు స్తోమత -ఒక ప్రత్యేకమయిన పనికి అంకితం చేయబడి నప్పుడు - "అదనపు విలువ" గా ప్రతిఫలిస్తుంది.

ఇటువంటి "అదనపు విలువను" ఉత్పత్తి చేయగలవారు నాగరిక జీవితాన్ని అందుకోగలరు. నాగరిక జీవితం - సమాజపు పెరుగుదలకు కొలబద్ద. అజ్ఞానులు - కానీ సుకుమారులయిన పాశ్చాత్యులు నమ్మినట్లుగా - ఇండియా - చైనా ప్రజలందరూ "తామరపూలు" తినేవారు కాదు. (Lotus Eaters - సోమరులు). ఆఫ్రికా నీగ్రోలు అమెరికారెడ్ఇండియన్లు - మయా (Maya) అజ్టీ (AZTEE) వంటి ఉన్నతమయిన నాగరికతల నిర్మాతలు, గ్రీకులు, వారి పనిసామర్ధ్యాన్నివీలైనంతగా వుపయోగించుకొనే రహస్యం తెలుసుకొని, వివిధ ప్రయోజనాలు సాధించి వారి సాంఘిక జీవితం నిర్మించు కున్నారు. జీవితాన్ని గౌరవించటం, ప్రత్యేకంగా మానవ జీవితాన్ని, వీలయినంతగా సంరక్షించుకోవటం, సౌఖ్యవంతమయిన విలువయిన జీవితానికి ఎదగటం - నాగరిక జీవితంలోఉన్నత ప్రమాణాలు సాధించటమవుతుంది. ఇది చరిత్ర నేర్పిన పాఠం. బడాయికోరు పాశ్చాత్యపారిశ్రామిక ప్రజలు, యుద్ధాలలోనికి దూకి, గతంలో వర్తమానం లో సాధించిన ప్రగతి ప్రతి ఫలాలను నాశనం చేసుకోవటం, ప్రాచీన యుగపు ఆటవిక జీవిత దశగా పరిగణించాలి.

మనిషిని మనిషి దోచుకొనే నాగరికతకు వ్యతిరేకంగా గ్రామ కామన్వెల్తులు ఆవిర్భవించటం గొప్ప విషయం. దోపిడీగాళ్ళకు ఈ వ్యవస్థలో గౌరవం యివ్వబడలేదు. సోమరితనంతో, ఇతరుల శ్రమపై ఆధారపడి జీవించేవారిని ఆదరించలేదు. సమాజం అందించిన "అదనపు శ్రమ" తో పూర్తి ఉద్యోగకల్పన, సాంస్కృతిక సౌకర్యాలు, అధిక

స్థాయిలో కల్పించబడ్డాయి. రైతులు ప్రధాన పాత్ర పోషించిన నాటి సమాజంలో (గ్రామ కామన్వెల్తు) అందరూ భాగ్యవంతులుగా, సుఖంగా వుండే అవకాశం కలగటానికి కారణం - సమాజపు "అదనపు శ్రమ" అందరకూ పంచిపెట్టబడటమే.

నేటి నాగరికులుగా చెప్పబడుతున్నవారు ఎలాగైతే, కాపిటలిజపు రాజకీయ, ఆర్థిక, మిలటరీ యుద్ధాల ఉచ్చులలో బిగించబడ్డారో అలానే గత చరిత్రంతా, రకరకాల నాగరికులు - అంటే ప్రస్తుతార్ధంలో యుద్ధోన్మాదులు ఒకరితో - ఒకరు అకారణంగా, వారసత్వం కోసం, పచ్చిక బీళ్ళ కోసం, వ్యవసాయ భూముల కోసం, పెరుగుతున్న జనాభాకు చోటు కోసం, పట్టణ, గ్రామీణ నివాసాలకు, నీటి పారుదల సౌకర్యాలున్న ప్రదేశాల కొరకు చేసిన, యుద్ధాలతో నిండివుంది. బలవంతులు క్రూరులు గుంపులు గుంపులుగా బలహీనులపై దాడులు చేసి - వారి ధాన్యం - పశువులు దోపిడీ చేసేవారు. ఈ దోపిడీ దార్లు - ఛంగిజ్‌ఖాన్[2], అత్తిల (Attila the Hune)[3] . కుంటి తైమూరు[4], కార్టెజ్‌లు తాము దోపిడీ చేసిన దేశాలలోనే స్థిర నివాసం ఏర్పాటుచేసుకొని, అచ్చటి ప్రజల పైబడి "పరాన్నభుక్కులు"గా బతక వచ్చని కాలక్రమంలో తెలుసుకొన్నారు. వివిధ ప్రదేశాల్లో విజేతలు - పరాజితులు మధ్య మాతృభూమికై జరిగిన యుద్ధాలవలన నాటి ప్రపంచం నేటి మాత్రం నాగరిక, సాంస్కృతిక, ప్రశాంతమానవజీవితం ఎరుగదు. ఇటువంటి ఆటవిక ప్రకృతిలో - బలవంతుడు - బలహీనుడ్ని వేటాడి హింసించే కాలంలో కూడా - దురాక్రమణలనుండి రక్షణకు, అంతర్గత శాంతికి - సంస్కృతీ అభివృద్ధికి, పరిపూర్ణమయిన ఆనందానుభవానికి - వ్యక్తిగతంగా - సామూహికంగా - కుటుంబ జీవితంలో పరుల అప్రమేయానికి - స్వేచ్ఛగా - సమానతతో స్త్రీ - పురుషులు సమాజంలో గడపటానికి, పూర్తి రక్షణకు, అభివృద్ధికి, విద్యావకాశాలకు - కొన్ని ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రయత్నాలు ఎక్కడ జరిగినవో అక్కడ నాగరికత విలసిల్లింది. ఇది ప్రమాణంగా తీసుకొంటే - నిషాద, మొహంజదారో, మాయా (Maya) వైదిక, మహాభారత, గ్రీసు, అశోక, గుప్త, ఆంధ్ర, కాకతీయ, చోళ కాలాలను అత్యున్నత స్థానంలో వుంచవలసి వస్తుంది.

మానవ చరిత్రంతటిలో - అశోక యుగం అత్యంత ఉత్కృష్టమయినది. యుద్ధాలు నిషేధించబడినవి - చక్రవర్తి యుద్ధాలు చేయరాదని నిర్ణయించుకొన్నాడు. అశోకుని యుద్ధ నిషేధ ప్రకటన - నేటి లీగ్ ఆఫ్ నేషన్స్ (League of Nations)[6] - కెల్లాగ్ ఒప్పందంకంటే విలువయినది. శ్రేణులకు- వర్తకులకు - వారిపై ఆధారపడిన

వారికి రక్షణలు కల్పించబడినవి. వీటి ఉపయోగాలను - హక్కులను ప్రభుత్వాలు గుర్తించినవి. గ్రామస్వామ్యంలో పూర్తి రక్షణ వుండేది. పన్నులు స్వల్పం. ప్రభుత్వవత్తిడి నామమాత్రం. పట్టణాలు స్వయంపాలితాలు. ఈ సంకీర్ణ సమాజానికి ఆర్థిక వికేంద్రీకరణ మూలం. సామాజిక ధర్మం ఆధారం. వ్యక్తుల పరస్పర హక్కులనూ, బాధ్యతలనూ గౌరవిస్తూ సామాజిక జీవితం నడిచేది. గ్రామ కామన్వెల్తులు చేతివృత్తుల శ్రేణులు ప్రజాస్వామ్యబద్ధంగా పాలించబడేవి. అందరూ ఓటుహక్కుతో (స్వయం నిర్ణయాధికారం) పంచాయితీ వ్యవస్థలో రాజకీయ, ఆర్థిక భాగస్వామ్యం కలిగివుండేవారు. రామాయణం, మహాభారతం ధర్మపథం, అశోక శాసనాలు పరిశీలిస్తే - అధిక సంఖ్యాక ప్రజల జీవితం- రాజకీయంగా - ఆర్థికంగా - సాంఘికంగా - పొందగలిగినంత ఉన్నతిని పొంది - సుఖసంతోషాలతో నిండి వున్నదని నిర్ణయించవచ్చు.

ఈ సౌఖ్యవంతమయిన జీవితానికి ప్రధానకారణం సంపూర్ణ ఉద్యోగ కల్పన, శ్రేణులకు పంచాయితీలకు పూర్తి రక్షణ, భద్రత, వారి శ్రమసాధిత ప్రతిఫలాలు, పట్టణ, గ్రామీణ, శ్రేణీ వర్గాలకు అధికవినియోగం, "అదనపు శ్రమ"ను సాంస్కృతిక సామాజిక, అభివృద్ధి, మానవతా పరిరక్షణకు, నిర్దేశించబడటం వంటివి. భారతదేశమంతా విస్తృతంగా లభ్యమయిన అశోక శిలాశాసనాలవలన - నాటి సామాజిక జీవితంలో - భిన్నత్వంలో ఏకత్వం వుందని - ఆర్థిక - రాజకీయ వికేంద్రీకరణవున్నప్పటికీ, సమైక్యతా నియంత్రణ ప్రభుత్వం చేశేదని అర్థం చేసుకోవచ్చు.

"మాయా" (Maya) నాగరికత అశోకనాగరికతకు భిన్నమయినది. 'మాయా' నాగరికత, సామాజిక, ఆర్థిక జీవితం - కమ్యూనిష్టు సమాజ జీవితపు పునాదులు కలిగినది. దళారీలు - వర్తకులూ లేనిది. అశోకుని కాలంలో దళారీల - వర్తకుల ప్రాబల్యం అధికంగావుండి వుండాలి. అశోక నాగరికతకన్నా తక్కువ స్థాయి దైనా, క్రమశిక్షణ కలిగి తమ "అదనపు విలువను" బంగారపు నిల్వలుగా మార్చుకొన్నారు. ఈ సంపద (బంగారం) తరువాతకాలంలో స్పానిష్ ఆటవికులదాడులకు గురయ్యింది. వ్యక్తిగత మయిన అభివృద్ధి, సంస్కృతి, రాజకీయ శక్తి - అశోకుని కాలంలో వలె పెంపొందలేదు. వారి "అదనపు విలువ" - అశోకుని కాలంలో వలె - ప్రజల సంస్కృతీ - సంతోషాలకు ఉపయోగపెట్టబడలేదు.

పెరిక్లీస్ - పురాతన గ్రీసుయుగం - ఇందులో - వ్యక్తిగత - సమిష్టి అదనపు

విలువలు ప్రజల మానసిక, శారీరక, ఆధ్యాత్మికాభివృద్ధికి వుపయోగింపబడినవి. దురదృష్టవశాత్తు వారీ "అదనపు విలువను" బానిసలనుండి సంపాదించారు.

ఏ విధమయిన సమాజ నిర్మాణంలో "అదనపు విలువ" - ఆనందానికి ఆట విడుపుకు, సాంస్కృతికాభివృద్ధికి, సాంఘికావసరాలకు, మానవవైయక్తిక వికాసానికి సమాజాభివృద్ధికి - సమాజం అంతటికీ సౌఖ్యావహంగావున్నదీ పరిశీలిస్తే - చరిత్రలో ఇండియా - చైనా - కొన్ని స్లోవోక్‌రాష్ట్రాలలో విలసిల్లిన గ్రామ కామన్వెల్తులలోనే అని నిస్సందేహంగా చెప్పవచ్చు. సాంఘిక న్యాయం ఆధారంగా, రైతుల - చేతివృత్తుల వారి సంఘ నిర్మాణం జరిగింది. అది సమసమాజం. అందులో ప్రజాస్వామ్య నాయకత్వం రైతుల - చేతి వృత్తుల వారిదైవుంది.

ప్రపంచంలోని భిన్న ప్రాంతాలలో వివిధ రకాలయిన సాంఘిక - ఆర్థిక నిర్మాణాలు గల గ్రామ కామన్వెల్తులుండేవి. ఒకే భాషలో లేకపోయినా వివిధ శాసనాల, ఆధారాల సమగ్రమయిన పరిశీలన - పరిశోధన జరుగవలసి వుంది.

కొన్ని ప్రధానమయిన విషయాలను సూచన ప్రాయంగా తెలుసుకొందాం. పురాతత్వశాస్త్రవేత్తలు కనుగొన్నదానినిబట్టి, తరువాత కాలంలోవచ్చిన సమాజనిర్మాణం ఎలావుందో - గ్రామ కామన్వెల్తులకు పూర్వం ఎలావుందో తెలుసుకోవచ్చు. గ్రామ కామన్వెల్తులలో వయోజనులకు (బహుశా పురుషుల కు మాత్రమే) ఓటు హక్కువుండేది. స్వేచ్ఛా యుతమయిన "ఓటింగ్" (Voting) తో పంచాయితీలకు ఎన్నికలు జరిగేవి. పంచాయితీదారుల (సభ్యులు) నుండి కార్యనిర్వాహక వర్గం "ఎంపిక" చేయబడేది. వీరు ఐదు నుండి పదిహేనుమందివరకూ " లాటరీ" విధానంతో ఎంపిక చేయబడేవారు. ఈ విధమయిన ఎంపికవలన వ్యక్తిగత ద్వేషాలు నివారింపబడేవి. (ఉత్తర మేలూరు-దేవాలయశాసనాలు) చెరువులు, నీటిపారుదల సౌకర్యాలు, రోడ్లు, ప్రజారక్షణ, గ్రామీణ పరిశ్రమలు, విశ్రాంతి కేంద్రాలు, బీదలకు గృహవసతి, సామాజిక అడవులు - గ్రామభూములు - వీటి యాజమాన్యానికి ఉపసంఘాలుండేవి. పోలీసు శాఖ పంచాయితీ అధీనంలో వుండేది. ఆక్రమణలోలేని సామాజిక భూములు పంచాయితీలవే. వ్యవసాయయోగ్యమయిన భూములు రైతుల మధ్య విభజించబడి, వంశపారంపర్యం సర్వ హక్కులతో అనుభవించబడేవి. భూముల అమ్మకం - పంచాయితీ అనుమతితో కొన్నిసార్లు అనుమతించబడేది.

బాంకింగ్ (Bank- ఖజానా) ఉపసంఘంచే పంచాయితీయే నిర్వహిస్తుంది. డిపాజిట్లు సేకరించటం - అప్పులివ్వటం జరిగేది. బాకీ దారుడుగానీ ఆతని వారసులు (కుమారులు) గానీ బాకీ చెల్లించలేనప్పుడు వారి భూమి పంచాయితీ స్వాధీనం చేసుకొని, ఇతరులకిచ్చేది. రాజుకు పన్నుచెల్లించవలసిన బాధ్యత పంచాయితీదే.

ఒక గ్రామం ఒంటరిగా వుండజాలదు. పరిసర గ్రామాలతో కలసి ఒక పెద్దగ్రామ కామన్వెల్తుగా ఏర్పాటు జరిగేది. వంద గ్రామాల కామన్వెల్తు, వేయి గ్రామాలకామన్వెల్తు (జిల్లా) నాడు (సీమ-రాష్ట్రం) గా ఏర్పడి గ్రామ కామన్వెల్తు ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ వీటిలో ప్రాతినిధ్యం కలగివుండేది. రాజు లేక రాజప్రతినిధి, ఈ సభలలో (మహా సభ - లేక మహానాడు) చర్చలలో పాల్గొనవచ్చు. వారికి ఓటు హక్కులేదు. కామన్‌వెల్తుల స్థాయిలో వివాద పరిష్కారం జరపలేకపోయినప్పుడు మాత్రమే రాజు లేక రాజప్రతినిధి తీర్పరిగా వుంటాడు.

చేతివృత్తుల, వర్తక శ్రేణుల నిర్మాణం కూడా ఇదే పద్ధతిపై జరిగేది. వారి వర్తకలావాదేవీల వివాదాలు శ్రేణులస్థాయిలో పరిష్కరింపబడేవి. శ్రేణులమధ్య వివాదాలు పరిష్కరింపబడనప్పుడు - నాడు - మహానాడులు వివాద పరిష్కార బాధ్యత స్వీకరించేవి. వృత్తి స్వేచ్ఛ వుండేది. కానీ ఆ వృత్తిలో ప్రాథమిక నైపుణ్యం, అనుభవం అవసరం. సాధారణంగా తండ్రి వృత్తినే కుమారులు - నేటి పారిశ్రామిక దేశాల కార్మికులలాగా - స్వీకరించేవారు. ఒక వృత్తివారు వేరొక వృత్తిలోనికి మారటానికి సంబంధిత శ్రేణుల అనుమతి అవసరం. కొంత ఘర్షణ ఈ సమయాల్లో జరిగే అవకాశముంది. మొత్తం మీద వృత్తుల ఎంపిక, స్వేచ్ఛగా, సరళంగా, ప్రణాళికాయుతంగా జరిగేది.

పాశ్చాత్య చరిత్రకారుల దురూహలకు భిన్నంగా - గ్రామ కామన్వెల్తులు ఉత్పత్తి - పంపిణీలు వివిధ రకాలుగా, వివిధ మార్గాలలో వుండేవి. బట్టల తయారీని తీసుకొంటే - నూలువడకటంమాత్రం, దాదాపు అన్నికుటుంబాలు చేసేవి. శుభ్రపరచటం, పోగు తీయటం, నేత, బట్టల అమ్మకంలకు ప్రత్యేకతలు సాధించిన వ్యవస్థలు పట్టణాలలో వుండేవి. సిల్కు - ఉన్నికి ప్రత్యేక నేతగాళ్లుండేవారు. అద్దకం ఒక ప్రత్యేక వృత్తి. కుట్టుపని ప్రత్యేకతగలది. ఇనుము -ఉక్కు వంటపాత్రల తయారీలు - వీటన్నిటికీ ప్రత్యేక శ్రేణీ విభాగాలుండేవి.

రైతుల ఉత్పత్తి విధానాలు గ్రామాలద్వారా అజమాయిషీ చేయబడేవి. చేతి వృత్తులు గ్రామాల ద్వారాకాక, సీమ లేక నాడు లేక భాషాపరంగా, రాష్ట్రంగా లేక దేశంకు

విస్తరించి వాటి అజమాయిషీలోవుండేవి. ప్రత్యేక కీలక సేవలయిన, లోహ వృత్తి వ్యవసాయ పనిముట్ల తయారీ, రిపేరు, సూదుల తయారీ, సుగంధ ద్రవ్యాల, విలాస వస్తువుల అమ్మకాలపై నియంత్రణ వుండేది. వీరు, వారికి కేటాయించబడిన గ్రామాలలో మాత్రమే సంచరిస్తూ, వారి అవసరాలు తీరుస్తూ, తమ సేవలకు ప్రతిఫలాలు పొందేవారు. గ్రామం - ఇతర గ్రామాలతో సమన్వయ పరచబడి గ్రామీణులు వారికవసరమయిన ప్రత్యేక సేవలనన్నింటినీ పొందేవారు.

వివిధ సేవల ప్రతిఫలాలను-సీమ - నాడు - గ్రామ కామన్వెల్తులు నిర్ణయించేవి. వీటిపై ఒప్పందాలు జరిగేవి. వివాదాలను పైస్థాయిలోవున్న కామన్వెల్తు పరిష్కరిస్తుంది.

ప్రతిఫలాలను - రైతుల ఆర్థిక స్థితిగతులను బట్టి (కాలానుగుణ్యంగా) పెంచటం, తగ్గించటం జరుగుతుంది. రైతుల ఉత్పత్తులు పంపిణీ చేయబడతవనే అవగాహన అందరికీ వుండేది. అందువలన ఎంతమొత్తం రైతువారీ ఉత్పత్తులను సమాజపరంచేయాలనే నిర్ణయాధికారం రైతులకే వుండేది. దీనివలన చేతివృత్తులవారి ఆదాయాలు దివాలా తీయవు. అలాగయితే - వివిధ శ్రేణులు రాజులతో ఒప్పందాలు ఎలా చేసుకొనేవారు? సాంచీ, అమరావతి స్తూపాలు ఎలా నిర్మింపబడేవి? నేత పనివారి పేటలను "బంగారువాడ"లుగా పిలిచేవారు. వినియోగదారులనుండి ప్రతిఫలంగా బంగారం పొందే హక్కు వుండేది ( బంగారంతో నేత నేయటం కారణం కావచ్చు - అనువాదకుడు)

రైతులు చేతివృత్తులవారికి ధాన్యం, వస్తువుల రూపంలో ప్రతిఫలాల చెల్లించే వారు. వీరికి కేటాయించే ధాన్యం వగైరాలు మొత్తం ఉత్పత్తిలో స్వల్పభాగం. అందువలన కేటాయించబడినవాటా కన్నా చాలా సార్లు రైతులు ఉదారంగా ప్రతిఫలాలు అందజేసే వారు. అంతేగాక ప్రతి గ్రామం చేతి వృత్తుల వారికి కూడా కొంత వ్యవసాయ భూముల నేర్పాటు చేసి వీరు లోటులేని జీవితం గడపటానికి సహాయపడేది. ఈ కారణంగా చేతి వృత్తులవారి జీవన ప్రమాణ స్థాయి రైతులకన్నా ఎక్కువగా వుండేది. రైతులు వీరిపై ఎప్పుడూ అసూయపడేవారు కాదు.

ప్రాచీన గ్రామ కామన్వెల్తులకు చేతివృత్తులవారిని ప్రోత్సహించి పనిలో నైపుణ్యం ఎలా పెంచుకోవాలో తెలుసు. అన్ని వర్గాలు సామరస్యం కలిగివుండి, వారివారి సేవలకు - నైపుణ్యాలకు సారూప్య ప్రతిఫలాలు పొందేవి. నేటి ఆదాయాల అంతరాలు అంతగా నాడు కన్పించవు.

సరుకుల అమ్మకాలు కొనుగోళ్ళు మార్పిడులను పరిశీలిద్దాం. ప్రతి పట్టణంలో విలాస వస్తువుల కొరకు ఒకటో, రెండో దుకాణాలుండేవి. వారానికి ఒక రోజు సంత జరిగేది. పరిసర గ్రామాలనుండి వ్యవసాయపనిముట్లు, సరుకులు, పారిశ్రామిక సరుకులు - చేతివృత్తుల తయారీలు - ఇక్కడకు తీసుకొని రాబడేవి. కనీస - అల్ప - అధిక ధరలకు లోబడి లావాదేవీలు జరిగేవి. రైతుల అవసరాలు స్వల్పం. విలాసాలుఎప్పుడో పెళ్ళిళ్ళు పండగలలో మాత్రమే. వారివి నిరాడంబర జీవితాలు.

క్రోషియా రైతునాయకుడు డాక్టర్‌మాసిక్ (Dr. Macek) యుద్ధానంతరపు తూర్పు యూరపు రైతులను గురించి "వారు తమ అవసరాలనన్నిటినీ స్వయంగా ఉత్పత్తి చేసుకొంటారు . ఆహారం మాత్రమే కాదు బట్టలు - గృహోపకరణాలతో సహా" అని చెప్పాడు. (I.P.U. Nov 1955)

ఆస్ట్రేలియాలోని " మావోరిస్ " (Maoris) లో లాగా, గ్రామ కామన్వెల్తులు, తమ స్వంత భూములనుండిగాని, రైతులనుండిగానీ వసూలు చేసిన ధాన్యం నిలువలు కలిగివుండేవి. ఈ నిలువలు కరవు - కాటకాలలో - ఉత్సవాలలోప్రజలకై ఖర్చు చేయ బడేవి. ఇదే విధంగా నాడులలో సీమలలో ముఖ్య కేంద్రాలలో రాజులు ధాన్యాగారాలు నెలకొల్పేవారు. పంటలు సమృద్ధిగా లేనప్పుడు ఈ ధాన్యాగారాలనుండి ప్రజలు ధాన్యం అరువు తెచ్చుకొనేవారు. ఈ సందర్భాలలో పన్ను మినహాయింపబడేది.

అశోకుని ఆదర్శాలాధారంగా - (అంతకుపూర్వం సప్తసంతానాలు) ప్రజా బాధ్యతగా, చెరువులు, తటాకాలు, బావులను, దేవాలయాలవద్ద, రహదారులవెంట, వ్యాపారకూడలివద్ద, నిర్మించేవారు. వీటి నిర్వహణాబాధ్యత దేవాలయాలదే. నీటిపారుదల సౌకర్యాలు - మంచినీటి వసతులు కల్పించబడేవి. రాజునుండి అతి బీద వాని వరకు వీటికి విరాళాలిచ్చేవారు. బీదవారైనప్పటికీ బాధ్యతనెరిగిన ప్రజలు "సప్తసంతాన" సాఫల్యతకై చెరువులత్రవ్వకం, తోపులు నాటటం ( చింతతోపులు వగైరా) చెట్లపెంపకం, సత్రాల నిర్మాణం చేయటం కొరకు ప్రక్కగ్రామాలలో విరాళాలు వసూలు చేయటం భారత గ్రామీణ సంస్కృతిలో ప్రత్యేకత, పెద్ద కార్యక్రమాలు అనగా - ఆనకట్టలు కట్టటం తటాకాలు నిర్మించటం, సాగునీటి సౌకర్యాలకు, పెద్ద గ్రామీణ రైతు కామన్వెల్తుల నుండి, రాజులనుండి ఆర్థిక సహాయం అందేది. ఈ విధంగా గంగా - కావేరి నదులపై నిర్మాణాలు చేయబడినవి. అంటరానివారుగా, సమాజంలోఅతిహీనంగా అణచివేయబడిన వర్గాలకుకూడా ఉద్యోగకల్పన వుండేది. గ్రామరక్షణ, చర్మకారవృత్తి, పొలాలలో సంవత్సరం

పొడుగునా కంట్రాక్టు పనులు - ఇవికాక వ్యవసాయం, కూరగాయల పెంపకం, పశు పోషణలు కలిగివుండేవారు. వారికుల పంచాయితీలకు సాంఘిక స్వాతంత్ర్యం వుండేది.

**దళితులకు అన్యాయం** :- సోవియట్‌విధానం,ఉదార ఆంగ్లో అమెరికన్ ప్రజా స్వామ్యాలు మినహా, ఏ ఇతర సాంఘిక వ్యవస్థకూడా-మానవతా వైఖరులతో- విజయ వంతంగా అందరికీ ఉద్యోగం - ఉపాధికల్పన. అనారోగ్యపోటీ నివారణ - సమానావ కాశాలు, వృత్తి నైపుణ్యానికి ప్రోత్సాహం, వ్యక్తిగత సామాజిక స్వేచ్ఛ, స్వాతంత్ర్యతలను - తమ కాలపు ప్రజాస్వామ్య నాగరికతావగాహనతో ప్రణాళికా బద్ధం చేయలేదు.

ఈ సాంఘిక వ్యవస్థలో దళితుల అణచివేత ఒక మాయని మచ్చ. అనాదిగా ప్రారంభమై నేటి వ్యవస్థపతనానికి దోహదం చేసింది. కుల విభజన వేరొక అభివృద్ధినిరోధక చర్య. తరువాత తరాలవారు బానిసత్వంలోనికి లాగబడటానికి కుల వ్యవస్థముఖ్యకారణం.

సమాజ ఆర్థికతలో - ఆదాయాల - సంపదల అంతరాలు ప్రవేశించాయి. నాటిగ్రామీణ ధనశక్తి - ఇతరుల జీవితాలు నాశనం చేసేటంత శక్తి వంతమయినదికాదు నేడున్నంత అసహ్యకరమయినదీ కాదు. గ్రామాల పన్నులు గ్రామాలలోనే ఖర్చు చేయబడేవి.

సాహసికులు - సంఘవిద్రోహులు - కరువు - కాటకాలలో - ప్రాముఖ్యత సంపాదించుకున్నారు. వ్యవస్థలోనికి " వంశపారంపర్య పంచాయితీదార్లు" ప్రవేశించారు. అగ్ర వర్ణాలవారు వీరితో రాజీపడ్డారు. అల్పసంఖ్యాకులయిన "అంటరానివారి" దారిద్ర్యం, చాకిరీ - సమాజంలోని అధికసంఖ్యాకుల సౌభాగ్యానికి సాక్షికంగా కారణమయింది.

నాటి ఆదర్శాలు - ఆచరణల మధ్యగల అగాధాలపై నాకు అవగాహన వుంది. మధ్యయుగపు ఆదర్శ గ్రామాల "పంచరంగులచిత్రీకరణ" లోని లోటుపాట్లు నాకు తెలుసు. గ్రామ కామన్వెల్తుల అభివృద్ధి, క్షీణత, అనైతికతలు, సామాజిక జీవితంలోని బలహీనతలు - జాడ్యాలు భారత చరిత్రలో అతిప్రాచీన కాలం నుండి, మహమ్మదీయుల కాలం వరకు - శాసనాలు, రికార్డులు అధ్యయనంచేసే అవకాశం నాకు కలిగింది. కానీ ప్రస్తుత అధ్యయన పరిధి, వేల సంవత్సరాలుగా గ్రామీణ జీవితంలో పొందుపరచబడిన ఆదర్శాలు - లక్ష్యాలు మాత్రమే. నాటి జీవితాదర్శాలు - కోరికలు - వేదాలలో, మహా భారతంలో, ఇతిహాసాలలో, అశోకుని శిలాశాసనాలలో, గుప్తుల, ఆంధ్రుల, చాళుక్య, పల్లవ, చోళ, శాసనాలలో వ్యక్తీకరింపబడినవి. ఈ ఆదర్శాలాధారంగా, చట్టాలను, గమ్యా లను గ్రామవ్యవస్థలు నిర్దేశించినవి.

బానిసలు, అర్ధబానిసలు, వేతన బానిసలు, సేవకులు, చెమటోడ్చే శ్రామికులు, అర్ధాకలితో బతికే అసంఖ్యాక రైతాంగపు పునాదులపైకాపిటలిజం - కమ్యూనిజం మనుగడసాగిస్తున్నవి. ప్రాచీన, ఆధునిక సామ్రాజ్యవాద, రాజకీయాధికారాల మార్గాలలో వచ్చిన కాపిటలిస్టు - సోషలిస్టు అనైతిక వినాశకర అధికారాలను ఆహ్వానించటం - చరిత్రగతిని తప్పుడు మార్గం పట్టించటంకాగలదు. గ్రామీణ జీవితం - రైతుల ప్రాథమిక అవసరాల సమన్వయంతో - నిర్మాణాత్మక సంస్కరణలు - అవసరమయితే విప్లవం కూడా చేపట్టవలసి వుంటుంది. సమన్వయం, అభివృద్ధి, మానవతాదృక్పథం కలిగిన రాజకీయ వ్యవస్థ నిర్మాణం కాపిటలిజం - సోవియటిజంలలో సాధ్యమని నమ్మకం కలగటంలేదు. వారుతమ అంతర్గత విభేదాలనే ఇంతవరకు పరిష్కరించుకోలేకపోయారు. వెలుపలదాడుల నుండే బయటపడలేదు.

అసమగ్రమయిన సమాచారం ఆధారంగా గ్రామ జీవితం, గ్రామ వ్యవస్థల పై, కారల్ మార్క్స్, ముందుగా ఏర్పరచుకొన్న వ్యతిరేక ధోరణి వలన - సోషలిస్టులు - గ్రామ జీవితాన్ని చారిత్రకాధారాలలో అధ్యయనం చేయలేకపోయారు. లభ్యమయిన సమాచారాన్ని మార్క్స్ పూర్తిగా ఉపయోగించుకున్నాడు. మార్క్స్ మరణం తరువాత సర్. హెన్రీ మెయిన్ కాలానికి చాలా విలువయిన సమాచారం వెలుగులోకి వచ్చింది. భారతీయ గ్రామ ప్రజాస్వామ్య విధానం గురించి ప్రపంచానికి తెలియవలసింది ఇంకా చాలా వుంది. సమర్ధవంతుడు, భారతప్రభుత్వోద్యోగి అయిన లార్డ్ హెయిలీ - భారత దేశ ప్రజాస్వామ్య సాంప్రదాయాన్ని గురించి "పసిఫిక్ రిలేషన్సు కాన్ఫరెన్సు"లో మాట్లాడుతూ "ఇండియాలో బ్రిటీషు ప్రభుత్వం ఏర్పడిన తరువాతనే భారతీయులు ప్రజాస్వామ్య వ్యవస్థలను గురించి తెలుసుకొన్నారు" అని మాటలలో తన అజ్ఞానాన్ని వెల్లడించుకొన్నారు. అలాంటప్పుడు "మార్క్స్" అపోహపడటంలో వింత లేదు.

"ఈ చిన్న - అతిపురాతన భారత సమాజాలు - ఈ రోజువరకూ భూములు కలిగి, వ్యవసాయం - చేతి వృత్తులతో కలసి -మెలసి, మార్పులేని శ్రమ విభజనతో - (కొత్త గ్రామకామన్వెల్తు ఏర్పడినప్పుడు) సిద్ధపరచబడిన "యోచన" ప్రణాళికలతో తయారుగా వున్నవి." (Cap. Vol. I. P. 390-391) మార్క్స్ ఈవిమర్శ చేసే కాలానికి - పాశ్చాత్య సమాజం " ఈ యోచన ప్రణాళిక" లు లేక క్రుంగిపోతున్నమాట వాస్తవం కాదా? ఆధునిక సమాజం ప్రణాళికా బద్ధమయిన ఆర్థికత కొరకు తపనపడటం లేదా? గ్రామకామన్వెల్తుల ప్రణాళికా బద్ధమయిన యోచనను మార్క్స్ అభినందించలేక పోవటం శోచనీయం.

గ్రామ కామన్వెల్తులు "మార్పులేని పని విభజన" కలిగివున్నవని మార్క్స్ చెప్పాడు. అది సరికాదు. భారతీయ సమాజం నాలుగు వర్ణాలతో మొదలై నేటికి దాదాపు వందకులాలుగా, ఉపకులాలుగా "వారివారి పనివిభజన" ననుసరించి - విభజింప బడింది. పారిశ్రామిక యంత్రాలనుండి దైనందిన అవసరాల వరకూ కుటీర పరిశ్రమలలో ఉత్పత్తి చేయబడ్డాయ్. మహమ్మదీయుల పరిపాలనలో, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలు నైతికంగా దెబ్బతీయబడి - సమాజంలో వీరు పరాన్న భుక్కులుగా, పరాధీనులుగా, ప్రభుత్వోద్యోగులుగా మారిన తరుణంలో, గ్రామ కామన్వెల్తులు తమ స్వయం ప్రతిపత్తి కోల్పోయి - కళలు - చేతివృత్తులు వంశపారంపర్యంగా మారాయి. "పారిశ్రామిక, వాణిజ్య, వృత్తి సంబంధమైన వ్యాపకాల (activites) వలన పురాణకులాల విభజన - నూతనకులాల ఆవిర్భావం జరిగింది." (History of India - Sir william Hunter) మార్క్స్ నూలువడకటం, నేయటం "ప్రతికుటుంబంలోనూ ఒక అదనపు పరిశ్రమ" గా వుంద న్నాడు. భారత గ్రామీణ జీవితం తెలిసినవారు " నేతపని" ప్రముఖంగా రైతులు చేసే వారని చెప్పరు. అస్సాంలో కొద్ది ప్రాంతంలో మినహా దేశమంతా ఈ వృత్తిలో ప్రత్యేకత సాధించిన వర్గం (చేనేత పనివారు) ఒకటుంది. నూట ఇరవై అయిదు (125) సంవత్సరాల లాంక్‌షైర్ మిల్లుల, ఆ తరువాత దేశీయ బట్టల మిల్లుల పోటీలను తట్టుకొని నేటికీ భారతదేశంలో కోటిమంది చేనేత వృత్తివారున్నారు. రెండవ పంచవర్షప్రణాళికలో - ప్రణాళికా సంఘం - జాతీయ ఆర్థికతను "నూలువడకటం - బట్టలునేయటం" ఆధారంగా పునర్నిర్మించాలని ఆశిస్తున్నారు. కనుక గ్రామ కామన్వెల్తుల " యోచన-ప్రణాళిక"లు తిరోగమన వైఖరులు కావు.

చాలా చోట్ల, మార్క్స్ గ్రామ కామన్వెల్తుల నైజాన్ని ప్రస్తావిస్తూ 'గౌరవహీనం' మురుగుతున్న, "మృతప్రాయమయిన" "స్పందనలేని" జీవితాలంటూ తీవ్రంగా విమర్శించాడు.

వేల సంవత్సరాలుగా, గ్రామకామన్వెల్తులలో ప్రజలు సాంఘిక ఆర్థిక, రాజకీయ, స్వాతంత్ర్యంలో, ప్రజాస్వామ్యయుతంగా జీవితాలు గడిపినప్పుడు - వారిది గౌరవహీన మయిన, మురుగుతున్న, మృతప్రాయమయిన, జీవితం అని చెప్పటంలో న్యాయంలేదు. వర్గరహిత సమాజం సాధించిన తరువాత, సమాజంలో చీటికీ మాటికీ తలత్తే ఘర్షణలు, అసంతృప్తులు నివారించటానికి, స్థిరమయిన, తృప్తికరమయిన సమాజ వ్యవస్థ అవసరం

లేదని మనం అర్థం చేసుకోవాలి? ఏ విధమయిన సామాజిక వ్యవస్థా అభినందనీయం కానప్పుడు - రష్యన్లు సోవియట్ విజయపు రజతోత్సవాలు ఎందుకు జరుపుకుంటున్నారు ?

అది (గ్రామ కామన్వెల్తులలోని ప్రజాస్వామ్యం) వారి వారి ప్రభుత్వాలపై రాజకీయ అధికారాన్ని (కొందరు) సంపాదించటాన్ని నిరోధించింది. వర్తమాన కాపిటలిస్టు, సామ్రాజ్య వాదశక్తులలా కాక, వర్తకాల్లో, వృత్తులలో, గ్రామాలలో న్యాయరక్షణ విభాగాలలో స్ఫూర్తి వ్యక్తిగత స్వేచ్ఛకు దోహదమయింది. ఆంగ్లో అమెరికన్, రష్యన్, చైనీస్ ప్రజలు ఏమేరకు వ్యక్తిగతమయిన, ప్రజాస్వామ్య అధికారాన్ని స్వతంత్రతను అనుభవించ గలిగారు?

"వారు ప్రజలను బాహిర పరిస్థితులకు లొంగజేశారు. పరిస్థితులపై వారికి స్వతంత్రాధికారం లేదు. స్వయం అభివృద్ధి గల సామాజిక రాష్ట్రాన్ని, మార్పులేని ప్రాకృతిక గమ్యంలోనే వుంచి, బుద్ధిలేని ప్రకృతి ఆరాధనలో మునిగిపోయారు". (మార్క్స్ - కాపిటల్ P.21) ఇదే నిజమయితే కాపిటలిజం విజయంపై అత్యంత శ్రద్ధ కలిగిన మార్క్స్ - యంత్రాల నియంతృత్వం - బానిసత్వం నుండి కార్మికుని విముక్తికై చేసిన ప్రయత్నా లేమిటి ? కాపిటలిజం - ప్రజలను ఆర్థికంగా, రాజకీయంగా, బానిసత్వానికి దిగజార్చినది భయంకరమయిన సత్యంకాదా ? మనిషి స్థితిగతులపై పట్టుసాధించగలిగాడా ? ఎప్పుడూ మార్పులేని "స్వభావసిద్ధమయిన - భవిష్యత్తు" అంటూ ఊదరగొట్టటం సోషలిస్టులు చేస్తున్న పెద్దపొరపాటు. ఫ్యూడలిజం, గ్రామ కామన్వెల్తుల ప్రజాస్వామ్య యుగాలను - ఆఫ్రికా ఆసియాలలోవిచక్షణాయుతంగా అర్థం చేసుకొలేక పోవటం- మార్క్సియన్ బలహీనత.

గ్రామ కామన్వెల్తుల ప్రజాస్వామ్యాన్ని మార్క్స్ తనకు తెలియకుండానే మెచ్చు కున్నాడు. "ప్రతి కళాకారుడు తన కర్మాగారంలో తన చేతివృత్తిని, సాంప్రదాయ కంగా ఎవరి అధికారానికీ లోబడక స్వతంత్రంగా నిర్వహించేవాడు" (Cap .P. 391). ఆధునిక సమాజంలోని పనివాడు "తనపై ఎవరి అధికారంను గుర్తించకుండా" స్వతంత్రంగా వుండేందుకు ఎంతగా అంగలారుస్తున్నాడు ?

ఈ ఉత్పత్తి వ్యవస్థలోని నిరాడంబరతపై మార్క్స్ చాలా అసహనం ప్రదర్శిం చాడు. "స్వయం సమృద్ధికలిగిన ఈ సమాజాలు ఒకే పద్ధతిలో, మరల, మరల ఉత్పత్తులు చేస్తుంటాయి. ప్రమాదవశాత్తూ నాశనమయినా మరల తిరిగిలేచి, అదే చోట అదేపేరుతో

అదే మూసలో ప్రత్యక్షమవుతాయి." ఆసియాదేశాలలోని ఎప్పుడూ అంతం కాని వంశపారంపర్యతలోని రహస్యం ఈ నిరాడంబరతే". గ్రామ కామన్వెల్తుల స్తోమతకు - శక్తికి, వ్యవస్థకు ఇంత విశ్వాసపాత్రంగా వున్న ప్రజలను అభినందించాలి. చక్రవర్తులు మారుతున్నా వారి గ్రామీణ స్వాతంత్ర్యం భంగం కలుగ నంతవరకు పట్టించుకోక పోవటానికి కారణం కూడా ఇదే. గ్రామ కామన్వెల్తుల నిర్మాణం అనుకున్నంత తేలిక కాదు. (Not so simple) సంక్లిష్ట సమాజంలో ప్రజల భాగస్వామ్యమున్నప్పుడు - అది తేలికగానే కన్పిస్తుంది. మారుతున్న రాచరికాలవెంట పరుగెత్తి , మారకుండా, తమ ప్రజాస్వామ్యయుతమయిన జీవితానికి అంటిపెట్టుకొని వుండటమే దాని వివేకత.

"ఇవి చిన్నచిన్న ముక్కలు చెక్కలుగా వుండి - సామ్రాజ్యాల పతనాన్ని, చెప్పరాని క్రూరత్వాన్ని, పట్టణ జనాభాల మూకుమ్మడి హత్యలనూ నిశ్శబ్దంగా చూస్తున్నవి. దురాక్రమణలకు నిస్సహాయంగా బలైనవి. ఇవి స్వార్ధపూరితమయినవి. మూర్ఖత్వం కలిగినవి ". అని మార్క్స్ అకారణంగా, అన్యాయంగా గ్రామ కామన్వెల్తులపై ఆరోపణలు చేశాడు. దురాక్రమణలను నిస్సహాయంగా చూస్తున్నవి అనటంలో సత్యం లేదు. సింధు, పంజాబు రిపబ్లిక్కులు - అలగ్జాండర్ దిగ్రేట్‌ను - ప్రతిఘటించి, ప్రాణత్యాగాలు చేసి నిలువరించినది చారిత్రక సత్యం. గ్రామ కామన్వెల్తుల సహకారంతోనే చంద్రగుప్త మౌర్యుడు గ్రీకు సైన్యాలను పంజాబు నుండి తరమివేశాడు. మొగల్‌చక్రవర్తిపై జీవితాంతం విముక్తిపోరాటం నడపిన రాణాప్రతాప్‌కు గ్రామ కామన్వెల్తులు పూర్తి సహకారమిచ్చాయి. వేలాది దేశభక్తులయిన రైతులను అక్బర్ హత్య చేశాడు. నూతనంగా వెలుగులోనికి వచ్చిన చారిత్రకాంశాలను సరైన దృక్పధంతో చదివి -అవగాహన చేసుకుంటే గ్రామ కామన్వెల్తులు, రైతులు చేసిన త్యాగాలు, ప్రతిఘటనలు అర్ధం కాగలవు.

సహింపరాని అణచివేత, భరింపలేని పన్నులతో బాధింపబడి, స్వాతంత్ర్యం హక్కులు కాలరాయబడినప్పుడు - గ్రామాలకు గ్రామాలు నిరసనగా తమ దేశాలువదలి వేరే రాజ్యాలకువలసవెళ్ళేవి. ఈ వలసలతో సిగ్గుపడి, బుద్ధి వచ్చిన పాలకులు - నాడు -"సీమల" పెద్దల రాయబారాల ద్వారా ఈ ప్రజలను ప్రాధేయపడి మరలా తమ స్వదేశాలకు పిలిపించుకొనేవారు. శాంతియుతజీవనానికి ఒప్పందమై, ఈ ఒప్పందాలను శాసన బద్ధం (శిలాశాసనాలు) చేసిన సంఘటనలు కోకొల్లలు. వలస వెళ్ళిన రైతులు తిరిగి వచ్చేవరకు వారి ఆస్తులను ఎవరూ ముట్టుకునేవారు కారు. ఇటువంటి ప్రజాస్వామ్య

ప్రియులను - సామాజిక బాధ్యత తెలియనివారని నిందించటం - చరిత్రకు అన్యాయం చేయటమే.

"మూసబోసిన ఈ పురాతన ప్రాచీన రూపాలను పగలగొట్టటం - పాశ్చాత్యీకరణలో ప్రధానఘట్టం". అని మార్క్సుతోసహా సోషలిస్టులందరూ నమ్ముతున్నారు. భారతీయ సంస్కృతి తెల్లవారి సంస్కృతిగా ఎందుకు మార్చబడాలి? కాపిటలిజం అంటే ఆసియన్ - ఆఫ్రికన్ ప్రజల పాశ్చాత్యీకరణ అని భావిస్తే - ఓరియంటల్ ప్రజలు ఈ తెల్ల సంస్కృతిలోఎందుకు బాధించబడాలి? కమ్యూనిష్టు మానిఫెస్టో ప్రకటించిన నూట పది సంవత్సరాలకు మైకేల్ యంగ్ (MichealYoung - British Socialist) "పాశ్చాత్య దేశాలకు ఏది మంచి అవుతుందో అది భారతదేశానికి మంచి కావాలని లేదు" అని ధైర్యంచేసి చెప్పాడు. కేన్సు[7] ఆర్థిక సిద్ధాంతాలు - ఎద్దులబండి ఆర్థికతలో ఇమడవు. (Fifty Million unemployed - Labour party - 1952).

భారతీయజీవనంలో పారిశ్రామికీకరణ, వాణిజ్యధోరణులు అవసరమని భావిస్తే, సహస్రాబ్దాల గ్రామీణ ప్రజాస్వామ్యస్పృహలను, గ్రామకామన్వెల్తులు కొన్ని శతాబ్దాల క్రితం వరకు అందించిన నాగరికత వారసత్వాన్ని, పునాదులను పరిశీలించటం, సమన్వయ పరచటం మన బాధ్యత కాదా? నేటికీ మిలియన్ల సంఖ్యలో చేనేత పనివారు, ఇతర చేతివృత్తులవారు, తమ వృత్తులకు అంకితమై గ్రామ కామన్వెల్తుల సాంప్రదాయాలలో యాంత్రికపోటీలను తట్టుకొని, సామ్రాజ్యవాద శక్తులనెదుర్కొని, పట్టణ వ్యామోహాలకు దూరంగా - వారి ఆర్థిక సామాజిక వ్యవహారాలు నిర్వహించుకుంటున్నారని నేటి సోషలిస్టులు -ప్రజాస్వామ్యవాదులు, సామాజిక శాస్త్రవేత్తలు గుర్తుంచుకోవాలి. కాపిటలిస్టు వ్యవస్థ దాని పరికరాలు- యంత్రాలు - యజమాని, వర్తకుడు, స్పెక్యులేటర్, ప్రపంచ విపణులు - వలెకాక, ఆఫ్రికన్లు, భారతీయులు, చైనావారు గ్రామ కామన్వెల్తుల సంస్కృతిని తమ మనసులలో నింపుకొన్న కారణంగానే నిస్సహాయులుగా లేరు. మారిన పరిస్థితుల నుండి బంధ విముక్తులయితే వీరు కాపిటలిజం - కమ్యూనిజం దోపిడీలను అధిగమించగలరు. డెబ్బయి సంవత్సరాల వయోవృద్ధుడైన క్రోషియా రైతునాయకుడు డా. వ్లాడికోమాసిక్ రైతుల ప్రతిఘటన U.S.S.R. తో సహా ఎచ్చటా అణచివేయబడలేదు' అని చెప్పారు (I.P.U. Journal).

చైనాలో కమ్యూనిష్టు పాలకులు, శతాబ్దాల చరిత్ర కలిగిన గ్రామీణ సమాజాల ద్వారా తమ ఆదర్శాలనుప్రచారం చేస్తున్నారు. కుటుంబం ప్రాతిపదికగా తీసుకొని,

కుటుంబ సలహా సంఘాలతో, వ్యవసాయ ప్రణాళికలను తయారుచేయాలని ప్రచారం చేస్తున్నారు. స్త్రీలకు - యువకులకూ అత్యధిక ప్రాధాన్యత నిస్తున్నారు. రైతులకు నూతన సాంఘిక హోదాను - అవకాశాలను కల్పించి వారిని తమ వ్యవస్థ (సమిష్టి) లోనికి లాగాలనే ప్రయత్నాలుచేస్తున్నారు. లెనినిష్టు ఎత్తుగడ అయిన రైతుల వర్గీకరణతో (పెద్ద - మధ్యతరగతి, చిన్నతరగతి రైతులు) విభజించి ముందుగా పెద్ద తరగతి రైతులను ఏరిపారెయ్యాలనుకుంటున్నారు.

కామన్వెల్తు ప్రజాస్వామ్యాలను, రంగుజాతుల - తెగల బాధ్యతలను హక్కులను అర్థంచేసుకున్న నిజాయితీ పరుడయిన ఏసోషలిస్టూ - రైతుల స్వాతంత్ర్యాన్ని హరించే -కాపిటలిజం - సోవియటిజంల ప్రభావాన్ని హర్షించడు. యూరోపియన్లు - అమెరికన్లు 150 సంవత్సరాలముందువచ్చిన పారిశ్రామికీకరణతో చాలా నష్టపోయారు. రంగు జాతులవారు క్రుంగిపోతూ జీవితాశను వదులు కుంటున్నారు.

గ్రామ ప్రజాస్వామ్యాన్ని, ఆధునిక ఆవిష్కరణలను సమన్వయ పరచి శారీరక -మానసిక అవసరాలను తీర్చగలిగిన ఆశావహమయిన జీవితపువెలుగును మరింత ప్రకాశవంతం చేసే నాగరికతను వారు కోరుకుంటున్నారు.

భారత రాజనీతి వేత్తలు గ్రామ పంచాయితీల ఏర్పాట్లలో నిమగ్నులై యున్నారు. వీటికి నిధులందించి స్థానిక ప్రజల అవసరాలను తీర్చటం తమ ధ్యేయంగా పెట్టుకున్నారు. వయోజనులందరకూ ఓటు హక్కు వుంటుంది. " ఈ స్థానిక స్వపరిపాలన జాతీయ ప్రజాస్వామ్యానికి నాంది. "ఈ వ్యవస్థల ద్వారానే గ్రామీణ నీటిపారుదల సౌకర్యాలు, మంచినీటి సరఫరా, మార్కెట్లు, సహకార వ్యవస్థలు నిర్వహింపబడతయ్. గ్రామీణుల, రైతుల నాయకత్వంలో పంచాయితీల ద్వారా, ప్రజాస్వామ్యం వర్ధిల్ల గలదు.

# ఆధునిక రైతు ఆవిర్భావం

(The Emergence of Modern Peasant)

ప్రపంచరైతుల, కార్మికుల ముఖ్యంగా ఆధునిక ఆర్థిక సమాజంలో అట్టడుగు స్థానంలో వున్న రైతుల ఉపశమనంలేని దౌర్భాగ్యానికి, దారిద్ర్యానికీ, నిస్సహాయతకు - వత్తిడి ఉత్పత్తి సూత్రాలు, కీలక సేవలు, వడ్డీలు అసమానార్థికాభివృద్ధి, కాపిటలిజపు సామ్రాజ్యవాదపు దోపిడీ వ్యవస్థలు, అధిక భాగం రైతులపై బలవంతంగా రుద్దబడిన అర్ధబానిసత్వం, ప్రపంచ విపణులు, సంపద అదృశ్యబదిలీ. కాపిటలిస్టు అనుకూల, రైతువ్యతిరేక - కార్మికవ్యతిరేక ప్రభుత్వాల మూకుమ్మడి ప్రభావం కారణం.

ప్రపంచంలో వివిధ దేశాలరైతుల జీవన ప్రమాణాలలో తేడాలుండవచ్చు కానీ, స్థానికంగా మాన్యుఫాక్చరింగ్, వాణిజ్య, వృత్తి జీవుల వర్గాలు, పట్టణాలలో అనుభవిస్తున్న సదుపాయాలు, సౌఖ్యాలతో బేరీజు వేస్తే రైతులు పరిస్థితి అణగారి హీనస్థితిలోవుంది. "ఇతర వృత్తులవారి ఆదాయాల కన్నా వ్యవసాయాదాయాలు, ప్రపంచంలో చాలా భాగంలోచాలా తక్కువగా వున్నవి." (Report of 8th conference of I.F.A.P. Rome - 1955). అమెరికన్ రైతుల ఎక్కువ పనిసామర్థ్యం, తక్కువ పనిగంటలు, అధికాదాయాలు తగిన జీవన ప్రమాణాల కలిగివుండటం - లెక్కలోనికి తీసుకొని, వ్యవసాయం క్రమబద్ధంగా జరిగితే చాలా లాభసాటిగా వుంటుందను కోవటం సరికాదు. అమెరికన్ రైతుల ఆదాయాలు, సామాజిక జీవితం - అమెరికాలోని ఇతర వర్గాలవారికి కల్పించబడుతున్న రక్షణలు హక్కులు ప్రాతిపదికగా, ఈ సమస్యను అర్థం చేసుకోవాలి. ఈ వర్గాలమధ్య సమానత్వ సాధన సాధ్యమా అని ప్రొఫెసర్ బ్లాక్ ఆశ్చర్యం వెలిబుచ్చాడు. సమానమయిన పనికి - సమాన ప్రతిఫలాలు ( సారూప్య సామాజిక - ఆర్థిక అవకాశాలను

బట్టి) వుండాలని మార్షెలియన్ శాస్త్రవేత్తలు ఒప్పుకొంటారు. అన్యాయకరమైన సామాజిక వ్యవస్థలు పైచేయి కాగలిగితే అది సమాజపు తప్పు. ఇవ్వబడిన పరిస్థితులలో, సమాన సామర్థ్యం కలిగి చిత్తశుద్ధితో వివిధ వర్గాలు పని చేస్తున్నప్పుడు వారి ప్రతిఫలాల్లో అసమానత లుండటానికి - సమాజంలోని అసమానత కారణం. ఈవిధంగా చూచినా జాతీయ సంపదలోగాని ప్రపంచ సంపదలోగాని రైతుల కందుతున్నది వారి శ్రమతో పోలిస్తే అత్యంత స్వల్పం.

U.S.A లోని పరిస్థితులు పరిశీలిద్దాం. ఆగ్నేయ అమెరికా రాష్ట్రాలు పూర్తిగా వ్యవసాయ రాష్ట్రాలు. 50 శాతం ప్రజల అవసరాలనుఅవి తీరుస్తున్నవి. కానీ వారి తలసరి ఆదాయం, వారి ఆహారాన్ని దిగుమతి చేసుకుంటున్న పరిశ్రమలపై ఆధారపడిన ఉత్తర రాష్ట్రాలలో పోలిస్తే సగం కన్నా తక్కువ, వివిధ సేవలలోని ఉద్యోగులు రవాణా, వర్తకం, వాణిజ్యం, సమాచార శాఖలు - ఇతరులు అంటే ఇళ్ళలో పనిపాట్లు చేసేవారు - ఎక్కువ ఆదాయాలు పొందుతున్నారు. వారి తర్వాత యాంత్రిక ఉత్పత్తి దారులు అధికంగా ఆదాయాలు కలిగి వున్నారు. రైతుల ఆదాయం అందరికన్నా తక్కువ. ఉద్యోగుల ఆదాయంలో రైతుల ఆదాయం 25శాతం. అలానే యాంత్రిక ఉత్పత్తిదారుల ఆదాయంలో మూడవ వంతుకన్నా కొంచెం అధికం. విలాసకేంద్రాలరాబడిలో కాలిఫోర్నియా రాష్ట్రం, పారిశ్రామికంగా ఈశాన్య రాష్ట్రాల ఆదాయం అత్యధికంగా వుంటే, ఆగ్నేయ నైరుతి వ్యవసాయరాష్ట్రాల జాతీయఆదాయాలు చాలా తక్కువగా వున్నాయి. జనాభాలో నాలుగోవంతు - యాంత్రిక వుత్పత్తులు గనుల త్రవ్వకం కట్టడాల నిర్మాణం చేసేవారి ఆదాయాలు - వ్యవసాయంలో, చేపలు పట్టడం, అడవులలో పనిచేయటం చేసే నాలుగవ వంతు జనాభా వారికంటే రెండున్నర రెట్లు అధికంగా వుందని Mr. హిచ్ (Mr. Hitch) తన పరిశీలనలో తేల్చాడు. (America's Economic strength P. 21-22) ఆతని గ్రాఫ్ ( నెంబరు 12) ను బట్టి అమెరికారైతు యుద్ధకాలంలోమాత్రమే తన ఉత్పత్తులకు - కొనుగోళ్ళకు సమాన ధరలు కలిగివున్నాడు. "నిజానికి అమెరికా రైతు ఆదాయం ఇతర వర్గాల వారి ఆదాయంలో సగం మాత్రమే " (F.A.O. survey)

"1944లో వ్యవసాయ ప్రజల తలసరి ఆదాయం శిఖరాగ్రాన వున్నది. అప్పుడు కూడా వారి ఆదాయం వ్యవసాయేతరవర్గాల తలసరి ఆదాయం కన్నా తక్కువ" (Conference on Economic Progress P-36).

"మొత్తం జాతీయ సంపదలో రైతులు పొందేది, వారు అందించే సేవల కన్నా చాలా తక్కువ."

1938 లో యుగోస్లేవియా ప్రభుత్వ సర్వే వివరాలు ఇలా వున్నాయి "వ్యవసాయం నుండి వచ్చి జాతీయ సంపద విలువ 380 మిలియన్‌డాలర్లు కాగా ప్రైవేటు పరిశ్రమల నుండి అందిన సంపద విలువ 120 మిలియన్ డాలర్లు. ఈ జాతీయ సంపదమొత్తం తిరిగి దేశంలో పంపిణీ చేయబడినప్పుడు, 80 శాతం గావున్న వ్యవసాయ ప్రజలకు 50 శాతం, 11 శాతం - పరిశ్రమలకు, 32 శాతం కామర్సుకూ, బాంకింగ్‌లో వున్న 3 శాతం వారికి 11 శాతంగా వుంది.

భారతదేశంలో మొత్తం జనాభాలో 69.8 శాతం వున్న రైతుల ఉత్పత్తి విలువ 1953-54లో 50,9 శాతంగాను, ప్రతి వ్యవసాయదారుని తలసరి నికర ఉత్పత్తి విలువ కేవలం 500 రూపాయలుగా - ఫాక్టరీ కార్మికుని నికర ఉత్పత్తి విలువ 1700 రూపాయలుగా, చేతివృత్తులవారిది 800 రూపాయలుగా - వాణిజ్యంలోని వ్యక్తి నికర ఉత్పత్తి విలువ 1500 రూపాయలుగా జాతీయ సంపదకు చేరుతున్నట్లు లెక్క కట్టబడింది. (Indian Agriculture in Brief - 1955). రెండవ పంచవర్షప్రణాళిక డ్రాఫ్టు ప్లానులో జనాభాలో 70 శాతంగా వున్న రైతుల ఉత్పత్తి విలువ 6170 కోట్లుగాను, మిగిలిన 30 శాతం వారి ఉత్పత్తి విలువ 7310 కోట్లుగాను అంచనా వేయబడింది.

ఇటువంటి లెక్కలు ఇతర దేశాల నుండి అందకపోయినప్పటికీ -ఆయా దేశాలలోకూడా వారి జాతీయ సంపదనుండి రైతులకు - ఇతర వర్గాలకు అందే వాటాలలో ఎంతో వ్యత్యాసం వుండే వుంటుంది. అందులో రైతులకంటే ఇతర వర్గాలవారే ఎక్కువ లాభం పొందుతున్నారు. వలస కాపిటలిస్టు దేశం కంటే స్వతంత్ర కాపిటలిస్టు దేశం - లేక సామ్రాజ్యవాద దేశంలోని ఆతని సోదరుడు (రైతు) భాగ్యహీనుడుగా వున్నాడు. కాకపోతే వలస దేశంలోని రైతుకన్నా ఇతనిస్థితి చాలా మెరుగ్గావుంది. ఈ వలసలలో కూడా ఇతర దేశాలపై ఆధారపడిన వలసల పరిస్థితి చాలా ఛండాలంగావుంది. ఉద్యోగ నిబంధనలు, బ్రిటీషు వ్యవసాయకూలీల వినియోగం సహింపరానిదిగా వుంటే, -భారత గ్రామీణ శ్రామికుల పరిస్థితి భయంకరంగా - కనీస వ్యక్తిగత సౌకర్యాలుకూడా లేకుండా వుంది. అమెరికారైతు - తన దేశపు కాపిటలిస్టు వర్గపు జీవితాన్ని వారి పెరుగుదలను చూసి బాధపడే స్థితిలో వుంటే - భారత దేశపు రైతులు తమ దేశపుకాపిటలిస్టు వర్గాలపై మండిపడటంలోఆశ్చర్యంలేదు. తాను మట్టిగుడిసెల్లో, తన కూలీలు ఆకులపాకల్లో,

ఇరుకు గొందులు సందులలో -బురదలో- అనారోగ్య వాతావరణంలో -కడుపుకట్టుకొని, చాలీచాలని బట్టతో, తనూ, తన భార్య,పిల్లలు, ముసలివారైన తలితండ్రులూ అందరూ ఎముకలు కొరికే చలిలో, మండుటెండలో. రోగాల రొష్టుల వర్షాకాలం నుండి నడుము విరిగే చాకిరిచేసే ఉగాదుల వరకూ ప్రకృతి వైపరీత్యాల నుండి ఏవిధమైన శారీరక రక్షణలు లేకుండా, శ్రమించే రైతు బాధతో కుములుతున్నాడు. ఎంత ఎక్కువగా పండిస్తే - అంత ఎక్కువ దారిద్ర్యం అనుభవిస్తున్నాడు. పట్టణ ప్రజలు తెల్లవారే సరికి భాగ్య వంతులుగా - ఒక మ్యాజిక్‌లో లాగా తయారవుతుంటే తన స్థితి గతులలో, గుర్తించదగిన మార్పు కనపడక విలవిలలాడుతున్నాడు. ఈ అన్యాయం చూసి అతను నిశ్చేష్టుడౌ తున్నాడు. దట్టంగా ముసురుకుంటున్న విషాదం, మాయామర్మాల నల్లటి మబ్బులు చీల్చుకుంటూ, సూర్యకిరణాలురెండు ప్రచండంగా దూసుకువచ్చాయ్. ఈ ఆశాకిరణాలు ఆతనివిముక్తికై చెప్పరానిఅధోగతి నుండిరక్షించటానికై వచ్చిన సుందర స్వప్నాల్లా ఆతనికి కనువిందుచేసినయ్. అవి ప్రపంచ ఆర్థిక మాంద్యం - ప్రపంచ యుద్ధాలు.

ఈ యుద్ధాలలో-ప్రపంచ మాంద్యం ప్రభావాన్ని బలహీనమయిన రైతుల భుజాల పై మోపటానికి కాపిటలిజం అతిగా చేసిన ప్రయత్నాలు బెడిసి కొట్టాయ్. ఇక్కడొకరు -అక్కడొకరు, నిన్నొకరు, నేడొకరు -ఈ విషాదాలను వారి దురదృష్టానికి, యాజమాన్యలోపానికి ఆపాదించేవారు. కాని ప్రపంచ ఖండాలన్నింటిలో, మిలియన్ల కొలదీ రైతులు ఒకేసారి, తమ తప్పేమీ లేకుండా విపత్తులో చిక్కుకున్నప్పుడు వారి కళ్లు తెరచుకున్నయ్. వారి ఆవేశాలు పెచ్చరిల్లినయ్. వారి ఆస్తులన్నీ అన్యాక్రాంతం కాగలవన్న భయం వారిని ఉత్తేజపరచింది. వారుమేల్కొన్నారు. వారి ప్రతిఘటనలు, ఐక్యత, ఈ భయంకరమైన ఆర్థికత్వాన్ని తమ చెప్పుచేతులలోకి లాక్కోవాలనే దృఢనిశ్చయం, వీటిలో తమ వంతు ప్రతిఫలాలు తాము పొందాలనే ఆకాంక్ష బలమైంది. అధికారం, సంపన్నత రాజకీయ ఆర్థిక పెత్తందారీ తనపు రష్యన్ విప్లవానికి వీరి మేల్కొల్పుతో సంబంధం లేదు. వారి తెగల జ్ఞాపకాలు, వారి గ్రామీణ వీరోచిత గాధలు రాజుకొని ఆశలమంటలై ఆశావహమయిన భవిష్యత్తుకు వెలుగు జాడలయినయ్. సంపూర్ణ న్యాయం కోసం, నిజమైన స్వాతంత్ర్యం కోసం, యదార్ధమయిన జీవితపు విలువల కోసం, జీవిత గమనాల ఆధిపత్యం కోసం - వివేకవంతులు, ఐక్యతగలవారు, చక్కని మార్గదర్శకత్వం కలవారు అయిన రైతులు కార్మికులు, అహింసావాదులయిన బుద్ధిజీవులు నిజమయిన శ్రామికుల కొరకు మనసా - కర్మణా పోరాటం జేస్తున్నారు.

తన కనీస అవసరాలకు పోను మిగిలిన ఉత్పత్తి అంతా ఇతరుల పాలవుతుందని నేటి రైతుకు తెలుసు. ఈ సంపదంతా తన అదనపు శ్రమద్వారా ఉత్పత్తి కాబడిన అదనపు విలువనీ ఇది ప్రత్యక్షంగా పరోక్షంగా రకరకాల మార్గాలలో, ప్రభుత్వ బలవంతం గానీ, ప్రైవేటు వత్తిడులుగానీ వున్నట్లు కనుపించకుండా మార్కెటు మారకాలలో సంపాదింపబడిందనీ ఏ పద్ధతి చట్టం న్యాయం ప్రకారం ఆలోచించినా 'సంపద'కు నిజమైన యజమాని తానేనని రైతు అవగాహన చేసుకొన్నాడు. 'అదనపు ఉత్పత్తి' ని ఎలా వినియోగించాలో నిర్ణయించే హక్కు తన ఒక్కడికే వుందని నేటి రైతు ప్రకటిస్తున్నాడు. మార్క్సు కార్మికులకై ప్రతిపాదించిన 'అదనపు శ్రమ' తన అదనపు శ్రమవంటిదే నని దీనితో తాను ఉత్పత్తి చేసిన 'అదనపు విలువను' కాపిటలిజం ఏజంట్లు స్వంతం చేసుకుంటున్నారని అతను గుర్తించాడు. చారిత్రక కారణాల వలన తన బాగు తాను చూసుకోలేకపోయానని, తన సంపదను - బలాత్కారంగా - వత్తిళ్ళతో తన ఆమోదంతోనే ఇతర వర్గాలు దోపిడీ చేస్తున్నవనే నిజాన్ని రైతు తెలుసుకున్నాడు. ఈ సమాజంపై అతను తిరగ బడ్డాడు.

యుద్ధకాలపు గిట్టుబాటుకాని ధరలతో, బలాత్కారపు ధాన్యసేకరణతో తనను చాలీచాలని తిండితో మాడ్చి తన అదనపు ఉత్పత్తినంతా పట్టణ వాసులపాలుచేస్తున్న ప్రభుత్వవర్గాల మోసం ప్రపంచ రైతులకు ఋజువయ్యింది. తనదైన ఎంతో అదనపు విలువ అసమాన వర్తక లావాదేవీలతో శాంతి సమయంలోనూ బలాత్కారంగా యుద్ధ కాలంలోను కాజేయి బడుతుందనే చేదునిజం రైతులు తెలుసుకొన్నారు. అమెరికన్ అగ్రికల్చరల్ అడ్జస్టుమెంటు చట్టంలో రైతుల నినాదాన్ని ఒకదానిని పొందుపరచారు.

అమెరికన్ కాంగ్రెస్ (విధాన సభ) వ్యవసాయ సరుకుల ఉత్పత్తి - వినియోగాల మధ్య సమతూకం కలిగి వుండేటట్లు మార్కెటింగ్ విధానాలను పునర్నిర్మించాలని ప్రాధమిక దశలో వ్యవసాయ సరుకుల కొనుగోలు శక్తి రైతులు కొనుగోలు చేసే వ్యవసాయ సరుకుల కొనుగోలు శక్తుల మధ్య సమానత్వం కలిగి వుండాలని విధాన ప్రకటన చేసింది. ఇది రైతుల డిమాండ్లకు దరిదాపులలో లేదు. కానీ ఇది ఆర్థిక మాంద్యపు చీకటి రోజులలో రైతులు కోరిన చిన్న కోర్కె మాత్రమే. దీనిని బట్టి రైతు రాజకీయ ఆర్థిక సంకెళ్ళను తెంచుకొనే ప్రయత్నాలు స్వతంత్రంగా వుండాలని కోరుతున్నాడని నిరూపించుకొన్నాడు.

ఫ్యూడలిజంపై కాపిటలిజం విజయం సాధించిన తరువాత రైతులలో గొప్ప మార్పు వస్తూవుంది. మార్క్సు, లెనిన్ ఫ్యూడలిజం అంతమయిన తరువాత రైతులందరూ

ఆధునిక బూర్జువాలుగానో లేక కార్మికులుగానో మారగలరని నిరాధారమయిన ఆలోచనలు చేశారు. రైతాంగంలో ఏమి జరుగుతున్నదీ వారు గమనించలేకపోయారు.

ఇంగ్లాండు, జర్మనీ U.S.A., వ్యవసాయ పరిస్థితుల అధ్యయనం మాత్రమే ఆధారంగా తొందరపడి తప్పు నిర్ణయానికొచ్చారు. పరిశ్రమలలో లాగనే వ్యవసాయంలో కూడా కాపిటలిజం స్వతంత్ర రైతులను భూములు లేని కూలీలతోను, చిన్న కమతాలు - పెద్ద క్షేత్రాలతోను, చిన్న వ్యవసాయపు ఆర్థికతను భారీ వ్యవసాయ ఆర్థికతలతో కబళించింది. ఫ్రాన్సులో, ఆఫ్రికా తెగలలో, ఇండియా చైనాలలో అభివృద్ధి చెందిన వ్యవసాయ ఆర్థికత వుందని వారికి తెలుసు. బూర్జువా వర్గం, అభివృద్ధి చెందిన యాంత్రిక పరికరాలు, ఆధునిక సమాచార వ్యవస్థల ద్వారా ఆటవిక దేశాలు కూడా నాగరికతకు అలవర్చబడతవని అలానే రైతులు ఇతరులు కార్మిక వర్గంలో లీనమవుతారని, వారి స్వల్ప పెట్టుబడులు పరిశ్రమలకు చాలవని వారి ప్రత్యేక నైపుణ్యాలు నూతన ఉత్పత్తి విధానాలకు పనికిరావు అని వారి ఉద్దేశ్యం అయివుంటుంది. కాపిటలిజపు విప్లవాత్మక విజయాలపై ఆశలను రైతులపై గల భయాలను తరువాత చరిత్ర నిరాధారమని ఋజువు చేసింది.' మధ్య యుగంలో మొదటగా పట్టణాలేర్పడినప్పుడు అర్థబానిసలు స్వతంత్ర ప్రజలు మార్పుచెందారని, రోమ్‌లో ఒకటికంటే ఎక్కువ వర్గ ప్రజలుండేవారని 'కమ్యూనిస్టు మానిఫెస్టో ప్రకటించింది. కానీ 'ఫ్యూడలిజం బదాబదలయినప్పుడు భూస్వామ్య రైతాంగం ఏమైందీ ఈ మానిఫెస్టో చెప్పలేదు.

కమ్యూనిస్టు మానిఫెస్టో ప్రచురణ తరువాత 70 సంవత్సరాల సంఘటనలను, పరిణామాలను మధ్యయుగాల్లో - కాపిటలిజంతో జరిగిన పరిశోధనలను అధ్యయనం చేసే అవకాశమున్నది. కానీ రైతులు బూర్జువా సమాజంలో విలీనమవుతున్న దశను లెనిన్ అధ్యయనం చేయలేదు. 'ఈ చిన్న చిన్న గ్రామీణ యజమానులు, తరువాత కాలంలో భూస్వాముల పనిలో కుదరుకుంటారని, అర్థవ్యవసాయ బానిసల (Serfs) విముక్తితో, ప్రజాబాహుళ్యపు జీవితం పూర్తిగా మారగలదని' చెప్పి సంతృప్తి పడ్డాడు. ఇదేమిటి? గ్రామాలలోని 'ఈ యజమాను' లందరిగతేమిటి? లెనిన్ చెప్పింది గ్రామాల లోని 'చిన్న చేతవృత్తుల దుకాణాలను గురించి - ఈ దుకాణాలు భారీ కర్మాగారాలుగా మారుతాయని, ఈదుకాణాల యజమానులు కార్మికులై - వేలాది కార్మికులతో కలసి పనిచేయటంలోనికి నెట్టబడతారని', లెనిన్ వేరొక చోట కాపిటలిజపు ఉత్పత్తి నిరంత రాయంగా దయాహీనంగా వీరిని (యజమానులు - Husbandmen) ఆక్రమిస్తుందని, వారి స్థిరమయిన గ్రామజీవితాలను వికలం చేస్తుందని, వీరిని గ్రామాలలో సాధారణ

కూలీలుగా మిగులుస్తుందనీ ప్రస్తావించాడు. (కాపిటలిస్టు ఉత్పత్తి అంటే వ్యవసాయ ఉత్పత్తి ఇందులో కలసి వుందీ లేందీ వివరంగా లేదు - ఎడిటర్). 'ఎక్కువ మొత్తాలలో జనాభా గ్రామాలను, వ్యవసాయాన్ని వదలి, నగరాలకు, ఫాక్టరీలకు, పారిశ్రామిక పట్టణాలకు వచ్చి స్థిరపడినా, లెనిన్ కాలంలో 'అధిక సంఖ్యలో 'యజమానులు' (Husbandmen) కూలీలుగా మార్పుజెందటం జరుగలేదు కనుక - లెనిన్ వుద్దేశ్యం అదైవుండదు. చాలామంది గ్రామాలలోనే వారి పొలాలలకు అంటిపెట్టుకొని గ్రామాలకు విశ్వాసపాత్రంగా ఆధునిక ఆర్థికతపై పట్టు సంపాదించుకున్నారు. ఆధునిక కాపిటలిజంకు విరుద్ధంగా వీరి (Husbandmen) ఆర్థిక స్థోమత, అవసరాలు, పాత్ర రూపుదిద్దుకున్నది లెనిన్ మాట మాత్రంగానైనా చెప్పలేదు. రైతుల సమస్యను ఒక ప్రత్యేక చారిత్రకాంశంగా, స్వతంత్రంగా అధ్యయనం చేయని వారికి, సాంప్రదాయ మార్క్సిస్టుల వ్రాతలు ఫ్యూడలిజం తన ఆధిపత్యాన్ని కాపిటలిజంకు ధారాదత్తం చేసిన తరువాత - గతంలో చేతి వృత్తులలో వున్నవారు, రైతులు, ఏదో ఒక విధంగా కార్మికులవుతారని - (ఫ్రాన్సు, ఇండియా, చైనా, జపాను వంటి దేశాలలో మిగిలిన కొద్దిమంది క్షీణించి నశించిపోతారనీ - అందువలన వీరిని గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన అవసరం లేదని - అభిప్రాయం కలుగుతుంది.

చరిత్రను, గతకాలపు వర్గ ఘర్షణలను, సరైన పద్ధతిలో అధ్యయనం చేసినట్లయితే, కమ్యూనిష్టు మానిఫెస్టో ప్రకటింపబడేనాటికి ఫ్యూడలిజం నుండి విడిబడి స్వతంత్ర రైతాంగం ఆవిర్భవించలేదని, కాపిటలిజం సహాయంతోనే స్వతంత్ర రైతాంగం త్వరగా నిలదొక్కుకోవటం మొదలైందని అర్థం అవుతుంది. ఐరోపాలో మధ్యయుగంలో తలెత్తిన తిరుగుబాట్లు రోములో బానిసలు చేసిన తిరుగుబాట్లు ముఖ్యంగా క్రూరత్వాల ఫ్యూడలిజం నుండి స్వతంత్రం కొరకు చేసినవి. ఈ తిరుగుబాట్లు విఫలం కావటంతో అప్పటి వరకు ఎంతో కొంత స్వతంత్రంగా వున్న రైతులు, అర్ధ బానిసలుగా (Serfs) దిగజారారు. వివిధ ఘర్షణల పర్యవసానంగా యూరోపియన్ రైతులు, వివిధ దశల స్వాతంత్ర్యానికెదిగారు. బానిసత్వం నుండి అర్ధబానిసత్వానికి, జమీందారీ రైతులు స్వతంత్ర రైతులుగా 'పాలికాపు'లుగా మారారు. ఇన్ని తరగతుల రైతులను సృష్టించటం ఫ్యూడలిజానికి చాలా లాభదాయకంగా వుంది.

ఇంగ్లాండులో ప్లేగు, (1348) మత యుద్ధాలు, యూరపులో వంద సంవత్సరాల యుద్ధంతో, ఐరోపా ఖండంలో పని చేసే వారి సంఖ్య తగ్గింది. శ్రామికుల బేరశక్తి పెరిగింది. భూస్వాముల పిడికిళ్ళ నుండి విడిబడి పట్టణాలకు వలస వెళ్ళే రైతుల సంఖ్య పెరిగింది.

పట్టణాలు వీరిని ఆహ్వానించాయి. సెటిల్‌మెంటు చట్టాలు బలహీన పడ్డాయి. ఈ పరిస్థితులలో ప్రభుత్వం ఫ్యూడలిజంకు రక్షణగా నిల్చింది. నేటి ఆఫ్రికా వలసల్లో తిరుగుబోతు చట్టాలు (Vagrancy Acts) పెట్టి, స్త్రీ పురుషులు గ్రామాలలో వుండేటట్లు నిర్బంధాలు చేశారు. అక్కడ దొరికిన ఉపాధితోనే వీరు సరిపెట్టుకోవాలి. ప్రభుత్వం నిర్ణయించిన వేతనాలు మాత్రమే తీసుకోవాలి. అధిక వేతనాలు అడగటం శిక్షార్హం. రైతులు ఏవిధమయిన నిల్వాలు కలిగి వుండరాదు. ఆ విధంగా నేటి వలసల వలెనే నాటి మధ్యయుగంలో విముక్తి చెందే అవకాశాలు చరిత్ర కల్పించినా రైతులను బలవంతంగా అణచివేశారు. యూరపు రైతాంగం, వీరోచితంగా విముక్తికై ఎన్ని పోరాటాలు - ఫలితం లేనివి జరిపిందీ నా 'రివల్యూషనరీ పెజెంటు' (విప్లవ రైతాంగం) లో చదువ వచ్చు. ఫ్యూడలిజం, ప్రభుత్వాలు వీటిని క్రూరంగా అణచివేశించాయి. ఎలాగైతేం కాపిటలిజం ఫ్యూడలిజంపై విజయం సాధించింది. చౌకగా, అధిక సంఖ్యలో తమ పరిశ్రమల కవసరమయ్యే శ్రామికులపై గల నిబంధనలను సడలించింది. ఫ్యూడలిజం చేతుల్లో పడివున్న రైతులను పట్టించుకోలేదు.

కుళ్ళి, కంపుకొడుతున్న యూరోపియన్ సమాజంలో 'ఫ్రెంచి విప్లవం' బద్దలవ గానే ఎదుగుతున్న కాపిటలిజం - హీన దశలో వున్న ఫ్యూడలిజం చేతులు కలిపి ఈ విప్లవాన్ని అణచివేసే ప్రయత్నాలు చేశాయి.

19వ శతాబ్దమంతా, యూరోపియన్ రైతులు భూస్వామ్య వ్యవస్థ అవగుణాల నుండి బయటపడే ప్రయత్నాలు చేశారు. ఫోర్స్‌డ్ లేబర్, మతాధిపతులకు చెల్లింపులు, పెళ్ళికి - విడాకులకు స్వేచ్ఛ, గ్రామాలనుండి వేరొక గ్రామంకు కదలే స్వేచ్ఛలు సంపాదించారు. స్వంత భూములను కానీ, శాశ్వత కౌలుహక్కుగానీ, నిర్ణయింపబడిన కౌలు ధరలు కానీ పొందలేకపోయారు. యూరోపియన్ రష్యాలో 1870 వరకు చాలా దుర్భరమైన బానిసత్వం వుండేది. బాల్కన్ రాష్ట్రాల రైతుల పరిస్థితీ అలానే వుండేది. 1955లో వచ్చిన రష్యా విప్లవం, రైతులలో ఇంకా విప్లవ శక్తి మిగిలివుందని తెలియజెప్పింది. 1914-18 మధ్య వచ్చిన మొదటి ప్రపంచయుద్ధం మొదట రష్యన్ రైతులు, తరువాత 'స్లోవ్' జాతికి చెందిన బాల్కన్ రైతులు, భూస్వాములను వెళ్ళగొట్టి, వారి భవనాలు స్వాధీనం చేసుకొని, వారి భూములను పంచుకుని అనుభవించే అవకాశాలు కల్పించింది.

19వ శతాబ్దపు చివర 30 సంవత్సరాలలో అమలులో వున్న 'ఐరిష్ లాండ్ లెజిస్లేషన్' (ఐరిష్ భూచట్టం) ఐరిష్ రైతులకు శాశ్వత కౌలు నిర్ణయం, క్రమబద్ధీక రింపబడిన, తగ్గించబడిన 'కవుళ్ళ'ను కల్పించింది. భూస్వాముల విపరీత పోకడలకు కళ్ళెం వేసింది.

మార్క్సు, ప్రధాన్, లాసెల్, బకూనిన్ బోధలు, సమ్మెలు, సహకార ఉద్యమాలు, జర్మనీలో సోషలిష్టు డెమోక్రాటిక్ పార్టీ నిర్మాణం, ఫ్రాన్సు, ఇటలీలలో సోషలిష్టు పార్టీ, ఇంగ్లాండులో లేబర్ పార్టీ, స్పెయిన్‌లో, ఫ్రాన్సులో సిండికేట్ పార్టీ, ప్రతిచోట కమ్యూనిష్టు పార్టీ గుంపుల ఆవిర్భావం, ఇవే కాక వారి వేతనాలలో అతి వేగంగా వచ్చిన పెరుగుదల, జీవన ప్రమాణాలు మెరుగుపడటం, కర్మాగారల్లో అదుపు, ఇవన్నీ వారికి తిరుగులేని రాజకీయ అవకాశాలు ఆర్థికాధికారం కలుగజేశాయి. నిద్రాణమై, అనైక్యతతో, గౌరవహీనతలో వున్న రైతులీ అవకాశాలు పొందలేకపోయారు. అందువలన వారి నాయకులు (కార్మికనాయకులు) వారి ప్రవక్తలు, రైతులు రాజకీయంగా నిర్వీర్యులని, ఆధునిక ఆర్థిక జీవితంలో వీరికి భవిష్యత్ లేదని భావించటంలో ఆశ్చర్యం లేదు.

కాపిటలిజాన్ని సమాధి చేయటానికి, సామ్యవాద సమాజానికి బీజాలు వేయటానికి చరిత్ర దేవత ఎన్నుకొన్న ముద్దుబిడ్డలు కార్మికులని మార్క్సు నమ్మబలికాడు. వాస్తవ పరిస్థితులలో రాజకీయాధికారం, ఆర్థిక అవకాశాల అలల అంచులపై తేలియాడుతున్నవీరు - తాము మాత్రమే విప్లవకారులమని నమ్మి, కాపిటలిజం నియంతృత్వ స్థానంలో - కార్మిక నియంతృత్వాన్ని ప్రతిష్ఠించగలమని - తమ ధృఢమైన బాహువుల నీడలో బలహీనులయిన బధిర పంగ్వంధ భిక్షుక గణాలయిన తమ రైతు సోదరులకు రక్షణ కల్గించగలమనుకోవటం స్వాభావికం. కమ్యూనిష్టు మానిఫెస్టో, ఈ విధమైన నమ్మకం కలిగించింది. మార్క్సు పారిస్ కమ్యూను[1] - కార్మిక నాయకత్వమే మీకు శరణ్యమని ఫ్రెంచి రైతులకు నూరి పోసింది. రష్యన్, బాల్కన్ రైతులు అగ్ని పర్వతంలాగా బ్రద్దలు కాగలరని రైతాంగ విప్లవం తేగలరని వీరు ఆనాడు ఊహామాత్రంగా కూడా తెలుసుకోలేక పోయారు.

రైతులు మెల్లమెల్లగా కొద్దిపాటి హక్కులను సాధించుకోగలిగారు. వారిని వారి పొలాలనుండి ఖాళీ చేయిస్తారనే భయం లేకుండా ప్రాధమిక ఆర్థిక స్వాతంత్ర్యాన్ని రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో మాత్రమే సంపాదించుకోగలిగారు. 1880లో ఇంగ్లాండులో వ్యవసాయ కూలీలకు ఓటు హక్కు, ఫ్రాన్సులో రైతులందరకూ ఓటు హక్కు ఇవ్వబడటం, ఇటలీ, జర్మనీలు అందించిన సహకారంతో రైతులు తమ ఆర్థిక స్తోమతను కొంత వరకు పెంచుకోగలిగారు.

ఫ్యూడలిజపు పరాజయం - కాపిటలిజపు అభివృద్ధితో లాభపడిన ఏకైక వర్గం - కార్మిక వర్గం. వీరు రాజకీయ - ఆర్థిక - పని - స్వాతంత్ర్యాలు సంపాదించుకొన్నారు. ఈ కొద్దిపాటి భద్రతల కోసం వారెంత అమూల్యమైన వెల చెల్లించవలసి వచ్చిందో ఏంగెల్సు Mr. & mrs. హామండ్స్, మార్క్సు గ్రంధాలు చదివి తెలుసుకోవచ్చు.

'వారనుభవిస్తున్న బాధలు, సామూహిక పనిలో వారి నూతన అనుభవాలు, మురికివాడలలో బతుకు ప్రతిరోజు కాపిటలిజపు దుర్మార్గాలతో సంపర్కం'- ఈ ప్రాధమిక రాజకీయ స్వాతంత్ర్యం వలన తెలుసుకోగలిగారు. ఈ కారణాల వలన ఐక్యత సంఘ నిర్మాణా వశ్యకత, వారి నూతనయజమాని అయిన కాపిటలిజంపై తిరుగుబాటు యాజమాన్యం చేపట్టవలసిన అవసరం వారు గ్రహించారు. పనిగంటలకు ఫాక్టరీ చట్టాలకు అధిక వేతనాలకు, మెరుగైన పని సౌకర్యాలకు వారి యూరోపియన్ 1848 విప్లవాలు, 1870 ఫ్రెంచి కమ్యూను, ఓవనైట్ ఛార్టిస్టు[2] ఉద్యమాలు ఇంగ్లాండులో ఓటు హక్కు, యూరోపియన్ ట్రేడ్ యూనియన్లు - తోడ్పడినవి.

U.S.A. లో, లాటిన్ అమెరికాలో 'బానిసత్వం నిషేధించబడినా' వారి రంగు కారణంగా రెడ్ ఇండియన్ల - నీగ్రో రైతుల స్థితిగతులు బాగుపడలేదు. వారు విముక్తి కాలేదు. తెల్లజాతి రైతులు, వారి కూలీలు రాజకీయ, ఆర్థిక హోదాలు అందుకోగలిగారు. ఫ్యూడలిజం వారిపై పెత్తనం చేయలేకపోయింది. మార్క్సు సూత్రీకరించినట్లుగా అమెరికాలో భారీ వ్యవసాయం గ్రామాలలో అధికంగా పెరిగింది. అలానే మాన్యు ఫాక్చరర్స్‌తో సమానంగా కాపిటలిస్టు వ్యవసాయం వచ్చినా మార్క్సు ఉత్సాహ పడినట్లు ఇది పెద్దగా అభివృద్ధి చెందలేదు. విముక్తులైన, వర్గ స్పృహ కలిగిన తెల్లరైతులతో 20వ శతాబ్దం అమెరికాలో ప్రారంభమయింది.

ఆసియాలో పరిస్థితి భిన్నంగా వుంది. సహస్రాబ్దాలుగా గ్రామకామన్వెల్తులు, నీడ, రక్షణ ఐక్యతాశక్తిని ఓరియంటల్ (తూర్పుదేశాల) రైతులకు, ముఖ్యంగా చైనా, ఇండియాలకు కలుగజేసినయ్. అధిక సంఖ్యలో వీరు ఇళ్ళలో ఊడిగం చేసేవాళ్ళుగా, సమాజంలో నిస్సహాయులుగా బానిసలకు వీరికి తేడాలేకుండా బాధలు పడుతున్నవారు. ఫ్యూడలిజం క్రమేపీ వీరిపై ఆధిపత్యం పొందసాగింది. అయితే ఓరియంటల్ ఫ్యూడలిజం, (ప్రాగ్దేశాల భూస్వామ్య వ్యవస్థ) అప్పటికే క్షీణదశలో వుంది. శతాబ్దాలుగా గ్రామాధికారాలలో జోక్యం చేసుకొనే శక్తి కోల్పోయింది. గ్రామకామన్వెల్తుల నుండి ప్రభుత్వానికందే సంపదలో వాటా మాత్రమే ఫ్యూడలిజానికి దక్కుతున్నది. గ్రామభూములు, లేక వాటిపై గ్రామ కామన్వెల్తుల పెత్తనం, భూవిభజన, భూములు ఎవరి అధీనంలో వున్నవి వీటితో ఫ్యూడలిజం సంబంధాలు ఎప్పుడో కోల్పోయింది.

పాలకులు (రాజులు) ఒకరి వెంట ఒకరు మారటం, పరిస్థితులు అస్తవ్యస్తంగా వుండడంతో గ్రామాధికారాలలో గందర గోళం ఏర్పడింది. గ్రామ కామన్వెల్తుల హక్కులు

లాక్కోబడ్డాయి. ఆక్రమణలు లేని భూములు గ్రామభూములు అడవులపై భూస్వామ్య పెత్తనం వచ్చింది. బలాత్కారపు శ్రమ విధించబడింది. భూమిపై రైతుకు గల హక్కులు బలహీనపడ్డాయి. చైనా ఇండియాలలో గ్రామాలకు గల సాంప్రదాయక హక్కులకు ఈ సహస్రాబ్దంలో భంగం కలిగింది. కానీ ఫ్యూడలిజం నాగరిక ప్రాగ్దేశాలలో ఎక్కువ విస్తీర్ణంలో శాశ్వతమైన అధికారం కలగిలేదు. ఫ్యూడలిజం గ్రామకామన్వెల్తులు ప్రక్క ప్రక్కనే మనుగడ సాగించినయ్.

ఇండియాలోని కొన్ని భాగాలు మహమ్మదీయుల పాలన క్రిందకు వచ్చిన తరువాత, చైనాలో 'మంచూ' విజయంతరువాత, ఈ రెండు దేశాలలోనే కాక, మధ్య ఆసియా, ఆగ్నేయఆసియాలలో గ్రామీణ ఆర్థికతలో పూర్తి అనారోగ్య ధోరణులు ప్రబలాయి. ఫ్యూడలిజం తన వికృత రూపంలో సాక్షాత్కరించింది. విదేశీపాలకుల ద్వారా ఫ్యూడలిజం అసాధారణ అధికారాలు పొందింది. పూర్వపు విజేతల్లాగా వీరు భారతనాగరికతను అనుసరించలేక, తమ అధికారాన్ని పదిలం జేసుకోవటానికి ఫ్యూడలిజానికి విస్తృతమైన అధికారాలు కట్ట బెట్టారు. కానీ కాలక్రమేణా, ఈ పాలకులు ప్రజల సాంప్రదాయక న్యాయ వ్యవస్థలు, సామాజిక వ్యవస్థలను గౌరవించి పాలించటం లోని విజ్ఞతనర్థం చేసుకొన్నారు. భారతజాతీయవాదంలో భాగం కాలేకపోయిన మహమ్మదీయ సామ్రాజ్యవాదం - ఫ్యూడల్ వ్యవస్థపైనే ఎక్కువ నమ్మకముంచింది.

ఇది ఆసరాగా తీసుకొని దేశీయ ప్రభువులుకూడా, గ్రామ కామన్వెల్తుల అధికారాలలో జోక్యం చేసుకొని, ప్రజల సాంఘిక ఆర్థిక నిర్మాణాలపై గ్రామ కామన్వెల్తుల అధికారాన్ని బలహీన పరచ సాగారు.

బ్రిటీషు వారి అధికారం స్థిరపడే కాలానికి, గ్రామస్వాతంత్ర్యంపై ఆధిపత్యం సంపాదించటానికి, ఫ్యూడలిజం తీవ్రంగా ముందడుగు వేస్తున్నది. ఎనిమిది శతాబ్దాలపాటు జరిగిన యుద్ధాలు, వచ్చిన రాచరికాలు సామ్రాజ్యాలు సైన్యాల కదలికలు - గ్రామ స్వతంత్రాన్ని ప్రజల రాజకీయ స్వాతంత్ర్యాన్ని విచ్ఛిన్నం చేసి, ప్రజలను దారిద్రంలోకినెట్టి, దివాళా తీయించినయ్. రైతులకు రాష్ట్రాలకు మధ్య ప్రత్యక్ష సంబంధాలు వుండేటట్లు చేయటానికి అక్బర్ ప్రయత్నాలు చేయటం గ్రామాలలో రైతులపై పెరుగుతున్న ఫ్యూడల్ అణచివేత కారణం కావచ్చు. బ్రిటీషు రాజ్యం స్థాపించబడినప్పుడు ఫ్యూడలిజం స్థానంలో కాపిటలిజం రాలేదు. భారతఫ్యూడల్ వ్యవస్థ బలపడి మిగిలిన కొద్దిపాటి గ్రామ స్వాతంత్ర్యాన్ని సంపూర్ణంగా నాశనం చేసింది. రైతులు రెవిన్యూ ఫార్మర్స్ (Revenue

Farmers - శిస్తు చెల్లించే వ్యవసాయ దారులు) దయాభిక్షకు వదలి వేయబడ్డారు. వీరు మొగలు కాలపు జాగీర్దారులనుండి వచ్చినవారు. రైతుల వంశపారంపర్య హక్కులు, శాశ్వతకౌలు రద్దు చేయబడి ఈ క్రొత్త 'రెవిన్యూ ఫార్మర్స్' వర్గానికి దాఖలు చేయబడినవి. వీరే నేటి జమిందార్లు. మార్క్సు గమనించినట్లు వేయి సంవత్సరాల స్వయంపూర్ణ ఆర్థికత (ప్రజల కనీస అవసరాలవరకైనా) చెడగొట్టబడకుండా వున్నట్లయితే - ఇంత త్వరగా రైతుల ఆర్థికత నాశనమయ్యేదికాదు. గ్రామీణ కుటీర పరిశ్రమల బలవంతపు మూసివేత, యాంత్రిక ఉత్పత్తులు ముఖ్యంగా మిల్లు బట్టల దిగుమతి, మిలియన్ల కొలది భారత రైతులను బానిసలుగా మార్చి గ్రామీణ స్వయం పరిపూర్ణతను నామరూపాలు లేకుండా చేసినవి. బ్రిటీషు కాపిటలిజం భారత భూస్వామ్య వ్యవస్థకు బలం చేకూర్చు తుందని సాంప్రదాయక వ్యవసాయం నాశనం చేయబడుతుందని భయపడినా ఇండియా - చైనాల రైతాంగం భారీ కాపిటలిస్టు వ్యవసాయంలోకి దిగక తప్పదని మార్క్సు తొందర పాటు నిర్ణయం చేసుకొన్నాడు.

బ్రిటీషు సామ్రాజ్యవాదం, భారతదేశంలోని భూస్వామ్య వ్యవస్థకు వెన్నుదన్నుగా నిలబడిన మాట వాస్తవం. రాజుల నుండి జమిందార్లవరకు అధికారాలు కట్టబెట్టింది. శిస్తులు, పన్నులు 'డబ్బు' రూపేణా వసూళ్ళు చేసింది. డబ్బు పంటలను (వాణిజ్య పంటలు) అంతర్జాతీయ విపణులకై, వ్యవసాయోత్పత్తులను ప్రత్యేకించి - కాటన్, నూనె గింజలు, పొగాకు, జూటు - వీటిని తన సామ్రాజ్యవాద మాన్యుఫాక్చరర్ల సేవలకై అభివృద్ధి పరచింది. భారత వ్యవసాయాన్ని అంతర్జాతీయ కాపిటలిజంలోకి లాగింది. రైతులు క్రుంగిపోయారు. బీదరికం అనుభవించారు. ఆర్థిక స్థోమత దోపిడీ చేయబడింది. కానీ రైతులను మాత్రం నాశనం చేయలేకపోయింది.

మార్క్సు ఆలోచనలకు భిన్నంగా జరిగింది. బ్రిటీషు ప్రభుత్వం తన ఎత్తుగడలను మార్చుకోవలసి వచ్చింది. ఫ్యూడలిజంతో తన బంధాన్ని వదులుకొని రైతులను ప్రసన్నంచేసుకోవలసిన స్థితి కల్గింది. 1857-58లో వచ్చిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం సంతాల్‌రైతుల తిరుగుబాట్లు - బెంగాల్ రైతుల జమిందార్ల వ్యతిరేక పోరాటాలు, వడ్డీ వ్యాపారులపై మహారాష్ట్రరైతుల - సిక్కు, పంజాబు రైతుల తిరుగుబాట్లు - బ్రిటీషు వారి కళ్ళు తెరిపించినయ్. భారత రైతాంగం విప్లవిస్తున్నారన్న స్పృహ వారికి కలిగింది. వెంటనే కౌలుదారీ చట్టం, వడ్డీ నియంత్రణ చట్టం, పరోక్షభూస్వామ్యంపై చట్టాలు తెచ్చి భూస్వాములను బలహీన పరచటానికి త్వరపడింది. 1905లో రష్యా కార్మికులు ఫ్యూడలిజంపై తన సుత్తి దెబ్బలు వేస్తున్న తరుణంలో భారతదేశంలో లార్డ్

కర్జన్ (Lord Curzon)- 'భూస్వాముల దౌర్జన్యాలనుండి రైతులకు రక్షణ కల్పించాలి' అనే శాసనాలు వ్రాస్తున్నాడు. మొదట ప్రపంచ యుద్ధకాలంలో చాంపరాన్ సత్యాగ్రహం రాజేంద్రప్రసాద్ గారు, కైరా-బార్డోలి సత్యాగ్రహాలు మహాత్మాగాంధీ గారి నేతృత్వంలో సర్దార్ పటేలు విజయవంతంగా నిర్వహించారు.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం మాత్రమే అధికశాతం ప్రపంచ రైతాంగం తన సంకెళ్లను విదలించుకొనే ప్రయత్నాలు చేసిందని అర్ధమవుతుంది. రెడ్ ఇండియన్లు, అమెరికానీగ్రోలు, భారతదేశంలో దళితులు, చైనాలో గృహబానిసలు, నామ మాత్రపు స్వతంత్ర రైతులు గత 30 సంవత్సరాలలో మాత్రమే 'వెట్టి' నుండి విముక్తికై కృషి చేస్తున్నారని అర్ధం చేసుకోవచ్చు. ఓరియంటల్ రైతులు తమ గ్రామకామన్వెల్తుల స్థాయినుండి దిగజార్చబడ్డారు. అలానే యూరోపియన్ రైతులు, తమ ప్రాచీన గ్రీకు నాగరికతకు దూరం చేయబడ్డారు. తూర్పు - పశ్చిమ దేశాల రైతులందరూ క్రూరుల వాత బడి అణచబడ్డారు. అమెరికన్ రైతులు వలస రైతులు వీరందరూ తమ సంఘనిర్మాణ శక్తిని రాజకీయ స్పృహను కోల్పోయారు.

1910 మెక్సికో విప్లవ నినాదం - 'భూమి - స్వేచ్ఛ' జపాటా - కార్డెనెజ్ వంటి రైతునాయకులు 'అమెరికన్ ఫ్రూట్ కంపెనీ' పై విప్లవం, బ్రెజిల్ అర్జెంటినా ప్రభుత్వాలు చిత్త శుద్ధితో తమ కాఫీ, బీట్‌రూట్ రైతులను కాపిటలిజం నుండి రక్షించే యత్నాలు చేసినయ్. రూజ్‌వెల్టు ప్రభుత్వం ' నేషనల్ రికవరీ చట్టం' తెచ్చింది.

స్వాతంత్ర్యానికి ముందు 1936-46 మధ్య కాలంలో భారత రైతాంగం - వ్యవసాయ ఋణాల మారటోరియం, అధిక ఋణాల మాఫీ, గరిష్ఠ వడ్డీ రేటు నిర్ణయం - వడ్డీ వ్యాపారంపై నియంత్రణలకు సహకారోద్యమ విస్తరణకు దేశంలోని పలు రాష్ట్రాలు వత్తిడిచేయగలిగినయ్.

కార్మికులు - కాపిటలిజంపై విజయాలు సాధిస్తున్న సమయంలో రైతులు మరింత విజయపథంలో నడిచారు.

స్వాతంత్ర్య ఉషోదయంతో భారతదేశంలో భూస్వాములు అస్తమించారు. శాశ్వత కౌలు - కౌలు ధర నిర్ణయం జరిగినయ్. చైనాలో - జపాను దురాక్రమణతో మొదలై నేటి ప్రభుత్వంలో - భూస్వామ్య వ్యవస్థ రూపుమాసింది. పాపాల ఫ్యూడలిజంకు ఈజిప్టులో కాలం చెల్లింది. రైతుల విప్లవాల నుండి స్వదేశ రక్షణకై కాపిటలిజం వలస వాదానికి మద్దతు ఉపసంహరించుకుంటున్నది.

# విప్లవ పథంలో రైతులు

మార్క్సు తన సమకాలీన పరిస్థితుల ఆధారంగా, రైతులు తిరోగమన వాదులని, ముంచుకు వస్తున్న ముప్పును తప్పించుకోవడానికి తాత్కాలికంగా తిరుగుబాట్లు చేస్తారని భావించాడు. ఈ భావనతో మార్క్సు కమ్యూనిష్టులను తప్పుడు మార్గంలో పెట్టాడు. కార్మిక విజయం కొరకు రైతులను ఆకట్టుకోవాలనే నిజాన్ని గుర్తించి ఫ్రెంచి రైతులను కార్మిక నాయకత్వం అంగీకరించమని ప్రబోధించాడు. జర్మను కార్మికులను, తమ అపోహలు వీడి, బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ విజయం కొరకు, రైతుల సాయం కోరమని ప్రచారం చేశాడు.

లెనిన్ తన ముందు వారి అపోహలను నిర్లక్ష్యం చేశాడు. రైతులను మేల్కొల్పటం లోని ఆవశ్యకత గ్రహించాడు. రైతులతో స్నేహం, కార్మిక విజయం కొరకు - కార్మిక నాయకత్వంలో అవసరమని నొక్కి చెప్పాడు. రష్యన్ రైతుల ప్రాధమిక అవసరాలయిన, భూమి, భూస్వామ్య పీడన నుండి విముక్తి, శాంతుల అవసరాన్ని గుర్తించాడు. కానీ, కార్మికులవలె, రైతులు నిరంతర వర్గ స్పృహ - విప్లవాభిరుచి కలిగిన వారుకాదు - అనే అపోహను లెనిన్ వదల లేదు. వ్యక్తిగత ఆస్తిపై వ్యామోహం కలవారవటంతో, వారికి 'భూమి హక్కు' వచ్చిన వెంటనే విప్లవానికి దూరంకాగలరేమోనని, హృదయ పూర్వకంగా సహకరించ రేమోనని లెనిన్ అపనమ్మకం. రైతు వారీ వ్యవసాయం, కాపిటలిస్టు వ్యవసాయం వలె లాభసాటి కాదని, రైతులు సహకార వ్యవసాయ విప్లవ విజయానికి ఆటంకమని, విప్లవ కార్మిక వర్గానికి తగిన జీవన ప్రమాణాలు ముందుగా కాపిటలిస్టు వ్యవసాయంలో, ఆ తరువాత సమాజ పరమయిన వ్యవసాయంలో (సోవియట్ - సమిష్టి

వ్యవసాయం) మాత్రమే సాధ్యమని లెనిన్ భావించాడు. సార్జెంట్ ప్రిష్‌బేయర్ వేధింపులు, కాపిటలిస్టుల బలాత్కారపు శ్రమ (Forced Labour) కంట్రాక్టు కూలీ విధానం (Indentured Labour) కన్నా రైతుల సహకార వ్యవసాయం మేలయినదనే విషయం లెనిన్ సరిగా అవగాహన చేసుకోలేకపోయాడు. ప్రపంచ రైతాంగం, వ్యవసాయపునరావాసం కోసం, వ్యవసాయంలో వేసిన ముందడుగు, ఆధునిక కాపిటలిస్టు సమాజపు పెరుగుతున్న నాణ్యమయిన, వైవిధ్యపు భారీ ఉత్పత్తులకు తగిన విధంగా స్పందించిన తీరు ఆయన పరిగణనలోకి తీసుకోలేదు. ఆర్థిక సంబంధాలలో, యుద్ధాలలో రైతులు మూకుమ్మడిగా నెట్టబడటం చూచే అవకాశం లెనిన్‌కు లేకపోయింది. 1905 నుండి 1917 వరకు లెనిన్‌కు రష్యను రైతులతో కలిగిన చేదు అనుభవాలు, రష్యన్ గానీ, మరే ఇతర రైతులపైగానీ నమ్మకం కలిగించటానికి ఆస్కారం కలిగించలేదు. నిర్మాణాత్మకంగా, ఐక్యంగా, ఆత్మవిశ్వాసంతో, రైతులు తమ విజయాలతో, విప్లవ ధ్యేయంతో జాతీయ వర్గంగా తరువాత కాలంలో ఎదిగినట్లుగా లెనిన్ కాలంలో లేరు.

స్టాలిన్- మార్క్సిస్టు-లెనినిజానికి వారసుడు. ట్రాట్స్కీ పద్ధతులయిన, ధాన్యం పై మిలటరీ లెవీలు, ధాన్యాన్ని బలవంతంగా పట్టణ ప్రజలకు తరలించడం, సార్జెంటు ప్రిష్‌బేయర్, ట్రాట్స్కీల పై వచ్చిన వ్యతిరేకత - వీటి కారణంగా లెనిన్ తాత్కాలికంగా వెనకడుగువేయటం, నూతన ఆర్థిక విధానం ప్రారంభించటం, స్టాలిన్ గమనించాడు. అందువలన స్టాలిన్ రైతులను సమిష్టి వ్యవసాయంలోనికి, ప్రభుత్వ క్షేత్రాలలోనికి బలవంతంగా నెట్టకుండా, పెద్ద వ్యవసాయ క్షేత్రాలలోని లాభాలను గురించి రైతులకు - నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు. లెనిన్ చేసిన 'నిజమయిన చిన్న రైతులు[1] కులక్కులు[2], (అతి పెద్ద రైతులు) విభజనను స్టాలిన్ ఇంకా ముందుకు తీసుకు పోయాడు. బీద, మధ్యతరగతి రైతులు సామ్యవాద నిర్మాణానికి అనుకూలురని ప్రకటించాడు.

అయినప్పటికీ స్టాలిన్ రైతులస్వతంత్ర విప్లవ పాత్రను, రైతులు స్వంత ఆర్గనైజేషన్లు కలిగి వుండటంలోని ఆవశ్యకతను, వారి వర్గ స్పృహను, వారి విప్లవశక్తినీ గుర్తించ నిరాకరించాడు. కార్మికుడే రైతుకు బోధకుడు, మార్గదర్శి, నాయకుడు అని నమ్మాడు. దీనికి స్లోవ్ (Slove) రష్యన్ రైతులతో అతనికి కలిగిన చేదు అనుభవం కారణం కావచ్చు. డేనిష్, ఉరుగ్వే రైతుల విజయాల ప్రభావం ఎంతో కొంత స్టాలినిజం పై వుండి వుంటుంది.

మనమిప్పుడు మార్క్సిస్టు, లెనినిస్టు, స్టాలినిజంలతో తృప్తి పడగలమా? సాంప్రదాయ కమ్యూనిష్టులు అవుసంటారు. భారత రైతు ఉద్యమ నిర్మాతలు (1923-54),

భాగస్వాములము కాదంటాము. మెక్సికో రైతాంగం కూడా తమ అసమ్మతి (మార్క్సిస్టు, లెనినిష్టు, స్టాలినిష్టు విధానాలకు) తెల్పుతున్నది. Mr. చెస్టర్ బౌల్సు తన యుద్ధానంతర ప్రపంచ సర్వేలో కూడా 'కాదు' (No) అనే అన్నాడు.

రైతు వ్యతిరేక ఛాందసవాదంపై "నిజం" స్టాలినిజం మాయమయిన తరువాత గెలుస్తుంది. 1956లో U.S.S.R. ప్రథమ ఉపప్రధాని, Mr. మికోయన్ తన భారత పర్యటనలో ఈ నిజం అంగీకరించాడు.

కార్మిక నియంతృత్వం ఇచ్చే జీవితం కన్నా మరింత సమగ్రమయిన, ఫల ప్రదమయిన, తృప్తికరమయిన జీవితానికి ఏవిధమయిన పోరాటం చేయాలో, ఆధునిక రైతుల సమాధానాన్ని, రైతుల స్వతంత్ర నిర్ణయాధికారాన్ని, స్వతంత్ర నాయకత్వాన్ని సూచిస్తూ ముందు పుటలలో ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్ని మీ ముందుంచుతాను.

రైతులకు సామ్యవాదం కావాలి. కార్మికులకంటే ముందేవారికి అది రావాలి. ఈ ఆలోచనలో సాంప్రదాయ వ్యతిరేకత కన్పించవచ్చు. కాపిటలిజం, రైతుల 'అదనపు విలువ' దోపిడీకై, సామ్రాజ్య వాద దేశాల్లో మిగతా వలసలలో, కార్మిక వర్గాలను తమ లంచగొండి విధానాలతో ఆకట్టుకోవడం, ఎప్పుడూ చేస్తూనే వుంటుంది. కార్మిక వర్గాలలో ఘర్షణలను సృష్టిస్తునే వుంటుంది. రైతులనీవిధంగా ప్రలోభ పెట్టలేదు. రైతులు తమ సంపద, రాజకీయాధికారాల అదృశ్య బదిలీలను చూస్తూ ఊరుకోరు. రైతులను నాశనం చేయలేరు. కారణం - వారిని వారు దోపిడీ చేసుకొనే అవకాశాలు లేవు. వివిధ దేశాలలోని కాపిటలిస్టుల మధ్య నెలకొన్న వైరత్వం వలన, వేతన స్థాయిలను పోటీపడి పెంచుతుండటం వలన, కాపిటలిజం బలహీనపడుతున్నప్పటికీ, కార్మిక వర్గం సంతృప్తి చెందటానికి చాలా వ్యవధి వుంది.

**రైతులు - కార్మికులు :** - రైతులు విప్లవించే అవకాశాలు మెండుగా వున్నాయ్. కాపిటలిజం తన దయారహిత ఆయుధమయిన 'ప్రపంచ విపణుల' ను రైతులపై (కొద్ది చోట్ల మినహా) ప్రయోగిస్తుంది. ప్రపంచ విపణులు పని చేస్తున్నంత కాలం, వ్యవసాయ ధరలు, పారిశ్రామిక ధరలలోని వ్యత్యాసాలలో మార్పుండదు. రైతులు, కార్మికుల కన్నా, కాపిటలిస్టు వర్గాల కన్నా, ఆర్థిక స్థాయిలో, అవకాశాలలో, సాధారణ జీవితంలో వెనుకబడే వుంటారు. కొన్ని సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికులు తాము సాధించుకొన్న సామాజిక భద్రతలు, ఆర్థిక ప్రయోజనాలు పోగొట్టుకుంటామని, ప్రస్తుతం వారికున్న సామాజిక

గౌరవం తగ్గుతుందని భయపడుతున్నారు. అందువలన రైతులు తమతో సమానత సాధించటానికి చేసే ప్రయత్నాలను కార్మికులు ఆటంకపెట్టవచ్చు. ఇతర వర్గాలతో సమానంగా ప్రపంచ సంపదను అనుభవించటానికి, ప్రపంచ ప్రజలందరితో కలిసి సామ్యవాద నిర్మాణానికి చేసే పోరాటాలకు సహకరించక పోవచ్చు. రైతులటువంటి వారు కారు. వారు పట్టణ ప్రజలతో, ఇతర అదృష్ట వర్గాలతో సమానత సాధించవలసి వుంది. కాపిటలిజం రూపుమాపితే గాని వారికి సాంఘికన్యాయం దక్కదు. వ్యవసాయంలో వారు ముందున్నా, కాపిటలిజంలో వారి బానిసత్వం - కార్మికుల కన్నా చాలా ఎక్కువ. వారికి వారి న్యాయ బద్ధమయిన ప్రతిఫలాలు కూడా అవసరం లేదు. ఎందుకంటే వారి కూలీల, వారి కుటుంబాల అదనపు విలువను దోచుకోవటం కోసం, కాపిటలిస్టులు రైతులను తమ పరికరాలుగా వాడుకుంటున్నారు గనుక. ఫాక్టరీ కూలీల్లాగా, వ్యవసాయ కూలీల్లాగా రైతులకు కూడా ఉద్యోగ కల్పన బతుకు దెరువుకు అవసరం. రైతులు ఉద్యోగాల కొరకు పరుల దగ్గరకు వెళ్ళే అవసరం లేదు. తమ పొలాలలోనే తమ ఉద్యోగాలు వెతుక్కుంటారు.

వారి కర్మను వారు నిందించుకొనేస్థితి వస్తే - పొలాలు వదులుకొని, వాటిని సహకారక్షేత్రాలలో కలపమనో, లేకపోతే, ఇతరులతో ఆర్థిక ఐక్యత పాటించమనో, వారి పొలాల్లోనే వ్యవసాయ కూలీలుగా మారమనో, ఇతరుల పొలాలలో చాకిరీ చేయమనో, లేక కార్మికులగా మారమనో, లేక ఇతర వృత్తులను ఆశ్రయించమనో వారు చెప్పబడతారు. వేరే ఉద్యోగావకాశాలు లేవని ఫిర్యాదు చేస్తే, వున్న కొద్దిపాటి పొలాలతోనే తృప్తి పడమంటారు.

రైతులు భూమికి యజమానులు, అందువలన వారు కాపిటలిస్టు వ్యవస్థలోని వారు అని కొందరంటారు. వారి బతుకు తెరువు మార్గాలకు వారు యజమానాలుగా, వారి ఆస్తి, వారి ఉద్యోగ కల్పనకు మార్గంగా వుండటం, ఏవిధమయిన సంఘజీవితంలో కూడా తిరోగమన, లేక దోపిడీ విధానానికి సంబంధించింది కాదు. వారు (కమ్యూనిస్టులు) కాపిటలిజం ఎందుకు నాశనం కావాలని కోరుకుంటున్నారు? శ్రామిక లేక కార్మిక వర్గానికి వారి బతుకు తెరువు మార్గంపై అధికారం, యాజమాన్యం లేదనే కదా! రైతులకు చేతివృత్తుల వారికి వారి జీవనోపాధిలో మిగిలిన ఈ కొద్ది పాటి ఆర్థిక స్వాతంత్ర్యం పై వారికి (కమ్యూనిష్టులకు) వ్యతిరేకత ఎందుకు? ఎందరో భూమిలేనివారుండగా ఏ

కొద్దిమందో భూమికలిగి వున్నారనటం - ఎందరో నిరుద్యోగులుండగా కొందరు పరిశ్రమ లలో, ఫాక్టరీలలో ఉద్యోగాలు కలిగి వున్నారనటం వంటిది.

'కాపిటలిస్టు వర్గంలో రైతులు ఆఖరివారు' అని లెనిన్ చెప్పటం చాలా విచారకరం. అదే నిజమనుకొంటే, వృద్ధాప్యానికి, నిరుద్యోగానికి, భీమా సౌకర్యం కలిగిన వారు, (రక్షణలున్నవారు) బోనసులు తీసుకొనేవారు, ఇన్సూరెన్సు పాలసీలు కల పారిశ్రామిక కార్మికులు కూడా కాపిటలిస్టులేనని లెనిన్ ఒప్పుకోవలసి వుంటుంది. లెనిన్ అభిప్రాయం తప్పు.

వాస్తవానికి ఈ శతాబ్దపు పారిశ్రామిక కార్మికుడు, రైతుకన్నా మెరుగయిన సాంఘిక హోదా కలిగి వున్నాడు. వారి హక్కు లేవో వారు తెలుసుకున్నారు. రైతులాస్థితిలో లేరు. కార్మికులు సాంఘిక భద్రతలు - పూర్తి ఉద్యోగకల్పన, వృద్ధాప్యం, నిరుద్యోగం నుండి రక్షణకు డిమాండు చేస్తున్నారు. వారిని అకారణంగా పనిలో నుండి తీసి వేయడం గానీ, పనిలో హీనంగా చూడటం గానీ జరగదు. రైతులు అటువంటి హక్కులు కలిగి వున్నారా? వారికి కరువుకు, పశువుల, పంటల నష్టాలకు భీమా సౌకర్యం వుందా? వారి సంపూర్ణ ఉద్యోగకల్పన హక్కు ఇంతవరకు గుర్తించబడిందా? లేదు.

మాసింగ్ హామ్, ఇంగ్లాండును గురించి మాట్లాడుతూ 'మన దేశంలోని రైతులు అతిగా అసహ్యింపబడేవారు, వెలివేయబడ్డవారుగా వున్నారు. ప్రజల విద్యావంతుల దృష్టిలో వీరు సీసాలు కడిగేవారిలో అట్టడుగున వున్నవారికన్నా గౌరవ ప్రదంగా లేరు.'

ఎవరిని చూచి మనం అసూయపడాలి - రైతులనా - కార్మికులనా!

రైతులు తమ పొలాలు వదలి విప్లవంలోకి దూకరనేవారు, కార్మికులు తమ ప్రావిడెంటు ఫండ్లు, సామాజిక సేవల నిధులు, సౌకర్యాలు, పనిలో సీనియారిటీ, దీర్ఘకాలిక నిరుద్యోగ భయం, యజమానులు ఇళ్ళు ఖాళీ చేయిస్తారనే భయం వంటి వాటితో కొట్టుమిట్టాడుతారనే నిజాన్ని మరచిపోతున్నారు. కార్మికుల విప్లవ శక్తిపై నమ్మకంతో, వారీ భయాలను వదలి విప్లవిస్తారనుకొన్నప్పుడు, రైతులు కూడా తమ స్వార్థాలు వదలి కాపిటలిజంను పడద్రోయటానికి సంసిద్ధులేనని నమ్మాలి.

రైతులకు తమ సమస్యలేవో తెలియవని, వాటిని పట్టించుకోరని కొందరు పొరబడుతున్నారు. పంజాబు, స్కాండినేవియన్ దేశాలు, ముస్సోలినీకి ముందు ఇటలీ, డెన్మార్కు U.S.A. లలో వారు సహకార వ్యవసాయం, సహకార మార్కెటింగులను

విశ్వాసంతో ఆచరణలో పెట్టారు. సోవియట్ సమిష్టి వ్యవసాయం, రెండవ యుద్ధకాలంలో ఇంగ్లాండు, U.S.A. చైనాలలో వచ్చిన సహకార వ్యవసాయం, రైతులు ఆలోచించటానికి అవకాశం కల్పించింది. గ్రామాలపై, పొలాలపై వారి కున్న ప్రేమ - విశ్వాసాలు, సామాజిక విప్లవానికి ఆయుధాలుగా మారతాయి.

నేటికీ ఎక్కువ భాగం భూమి ఆఫ్రికానీగ్రోల, లాటిన్ అమెరికా రెడ్ ఇండియన్లలో తెగల అధీనంలో వుంది. వ్యక్తిగత హక్కు తెలియదు. దానిపై వారికి శ్రద్ధ లేదు. భారతదేశపు, చైనా దేశపు ఉమ్మడి కుటుంబ వ్యవస్థ, వ్యక్తిగత భూస్వామ్యాన్ని బలహీనపరుస్తుంది. రైతులకు నూతన సహకార నిర్మాణం కొత్తగాదు. వారాహ్వానించ గలిగినదే. సోషలిస్టు వ్యవస్థంటే వారికి భయం లేదు.

ప్రస్తుత కాపిటలిస్టు వ్యవసాయ వ్యవస్థ, కమ్యూనిష్టు వ్యవసాయ వ్యవస్థలు, రైతుల సంబంధాలలో స్ఫూర్తినీ, ఉత్సాహాన్నీ కలిగించగలవా? సామ్యవాదులందరూ, కార్మికులలో సామ్యవాద నిర్మాణశక్తి వుందని విశ్వసిస్తారు. రైతులకు కూడా విప్లవ అవసరాలున్నవనీ, అప్పుడప్పుడు కార్మిక నాయకత్వంలో మాత్రమే తమ అంతిమ విజయం కోసం ముందుకు వస్తారని చెప్తారు. రైతుల విప్లవ అవసరాలు, శక్తి, సామర్ధ్యాలపై, సాంప్రదాయాలపై వీరికి నమ్మకం లేదు. రైతులను నమ్మక, కాపిటలిజం నిర్మూలన తరువాత వచ్చే సాంఘిక నిర్మాణంలో, కార్మికులతో కలసి నడచి, ఉద్యమించటానికి తగిన నిర్మాణాత్మక పాత్రనివ్వటానికి సందేహిస్తున్నారు. అటువంటి భయాలకు - సందేహాలకు చోటులేదు. రైతులు త్రోవతప్పకుండా, మడమతిప్పకుండా తమ విప్లవ ప్రయోజనాల కొరకు ఉద్యమించగలరు.

అలా ఉద్యమించనట్లయితే, ప్రాధమిక అవసరాలయిన కూడు - గూడు - బట్ట, తమ స్వంత భూములలో పని కల్పన, పనిస్వాతంత్ర్యం, పనిహక్కు, స్వతంత్రానుభూతులను, స్వంత వ్యవసాయాన్నీ కోల్పోతామని వారికి తెలుసు. నాగళ్ళకు, మగ్గాలకు, రైతులు, చేతి వృత్తులవారు అంటిపెట్టుకొని వున్నారని, అది తిరోగమనమనీ - చాలా కాలంగా తప్పుడు అభిప్రాయం వుంది. వారిది పురోగమన చర్యే - పురోగమన విధానమే. కాపిటలిజం ఆవిష్కరింపబడుతున్న దశలో, ప్రతి పెద్ద ఆర్థిక సంక్షోభం ఒక సామాజిక విప్లవానికి ప్రస్థానంగా భావించబడి 'పనిహక్కు' తిరస్కరింపబడటం క్షమార్హమే. ఆర్థిక సంక్షోభాలు క్రమం తప్పకుండా వెంటవెంటనే వస్తున్న తరుణంలో, నిరుద్యోగం శ్రామిక వర్గానికి ఒక దీర్ఘవ్యాధిగా పరిణమించి నప్పుడు, పని హక్కులకై కార్మికులు డిమాండు

చేయటం కార్మిక వర్గపు విధి అయింది. ఈ పరిస్థితులలో మగ్గాలపైనా, పొలాలలోనూ పనిచేసేవారు తమ జీవనాన్ని సుఖప్రదం చేసుకోవటాన్ని నిరసించటం, వారి ప్రాధాన్యతను గుర్తించక పోవటం విప్లవ వ్యతిరేక, సామ్యవాద వ్యతిరేక ధోరణి మాత్రమే కాగలదు.

మొదటినుండీ వారికి ఉత్పత్తి సాధనాలున్నాయి. అందువలన అనైతిక కాపిటలిస్టు ప్రభావం వారిపై లేదు. కాపిటలిజం రూపుమాపటానికి, దోపిడీ నుండి విముక్తికి, రాష్ట్రాన్ని, ఆర్థిక వ్యవస్థను అదుపు చేయటానికి, నిర్మించటానికి, ఉపయోగించుకోవడానికి - స్వాతంత్ర్యం ఇబ్బడి ముబ్బడిగా అనుభవించటానికి వారు అధికమయిన శక్తిని సంపాదించాలి. పట్టుదలతో, నిలకడగా, కాపిటలిజం దుర్మార్గాలపై విజయం సాధించ గలరని, ఉద్యోగాలు నిల్పుకొని, నిరుద్యోగ పాతాళంలోనికి లాగబడక నిలువగలరని రైతులు - చేతివృత్తులవారు ఋజువుచేశారు. ఉద్యోగపు విలువ వారికి తెలుసు. అది వారిచే సృష్టించబడి పోషించబడుతున్నది. ఉద్యోగకల్పనకు, దానిని నిలబెట్టుకోవటానికి, వారికున్న విప్లవశక్తి, కార్మికుల విప్లవతకు ఏ మాత్రం తీసిపోదు.

కార్మికుడంతగా రైతు, సమాజానికి - ప్రభుత్వానికీ భారంకాదు. తన పొలంలో, తన చొరవతో కల్పించుకొన్న పనికి అదనపు అవకాశాలు మాత్రమే కోరుకుంటున్నాడు. కార్మిక వర్గం పనికై సంపూర్ణంగా సమాజం మీద రాష్ట్రం మీద ఆధారపడుతుంది. వివేకం గల ప్రభుత్వాలు, ఎక్కువ మంది ప్రజలను వ్యవసాయం చేతివృత్తులకు మళ్ళించాలి. ఆ విధంగా ప్రభుత్వ భారం తగ్గుతుంది. రైతుల చిన్నకమతాలను, చేతి వృత్తులవారి కుటీర పరిశ్రమలను ఈసడించుకోరాదు.

వ్యవసాయ కూలీలను దోపిడీ చేయకుండా, రైతులు తగినంతగా, సంపా దించగలరా అనేది ప్రశ్న. 'అవును' అనే నా సమాధానం. వారు అలా సంపాదించు కొనేందుకు ప్రతి సమాజం వారికి చేయూత నివ్వాలి. ఇప్పటి వరకు మన సమాజంలో రైతులు తమ కూలీలనేగాక, తమ పశువులను, భార్యా బిడ్డలను, భూములను, తాము తమ పొలాల్లో స్వతంత్రంగా పని చేసుకోవడానికి, వేరే యజమాని క్రింద పనిచేయ కుండటానికి, దోపిడీకి పాల్పడుతున్నారు. వ్యక్తిగత స్వాతంత్ర్యంకోసం, కాపిటిలిజం మాయలను ఎదుర్కోవటం కోసం, ప్రపంచ విపణుల ఏకపక్షధరల విధానం నుండి బయటపడటం కోసం, భారీమూల్యం చెల్లిస్తున్నారు. ఇది చాలక - పుండుపైకారం చల్లినట్లు - రైతులను కాపిటలిస్టు దోపిడీ వర్గం అంటున్నారు.

వ్యవసాయ కూలీల 'అదనపు విలువను' దోపిడీ చేసి రైతులు, కాపిటలిస్టు - సోషలిస్టు వర్గాలకు అందించకుండా వుండటానికి రాజమార్గం ఒకటుంది. సమాజపు స్తోమత ఆధారంగా, తగిన జీవనప్రమాణాలు కల్పించే విధంగా 'వేతన నిర్ణయం' చేయటం, వివిధ పంటలకు, ప్రతి సంవత్సరం, ధరలు నిర్ణయించటం, తద్వారా రైతులకు గౌరవ ప్రదమయిన జీవన ప్రమాణాలు కల్పించటం.

పారిశ్రామిక కార్మికులకు ఈ వాస్తవాలు అర్థం అయేటట్లు చెప్పగలిగితే వారీ కనీస కోర్కెలనంగీకరిస్తారు. వ్యవసాయ దోపిడీ నుండి వారికందుతున్న వాటా వదులుకోవటానికి ఒప్పుకుంటారు. వినోభాభావే, వారి శిష్యులు కూడా తమ రైతు వ్యతిరేక ధోరణి వదులుకుంటారు. పారిశ్రామిక కార్మికులకు ఇవ్వబడిన సాంఘిక న్యాయం, రైతులకు, చేతి వృత్తుల వారికి కల్పించబడటానికి, మన సోషలిస్టులు, కమ్యూనిష్టులు తమ మార్క్సిస్టు, లెనినిస్టు, స్టాలినిస్టు ధోరణులను ఈ వెలుగులో చూచి పునరాలోచించవలసి వుంది. రైతులు దోపిడీ వర్గం కాదని, వారు దోపిడీ చేయకుండా బ్రతుకగలరని, మనుగడ సాగించగలరని, అభివృద్ధి చెందగలరని మనం విశ్వసిస్తున్నాం.

రైతులు భూములు లేని వారవుతున్నారని, పరోక్ష వ్యవసాయం పెరుగుతున్నదని, కౌలు ధరలు ఎక్కువగా వున్నాయని, పొలాలు లేని రైతులు పట్టణాలకు, పారిశ్రామిక కేంద్రాలకు వలస రావడం వలన, కార్మికుల వేతనాలు తగ్గుతున్నవని, సాంప్రదాయక కమ్యూనిస్టులు చెప్తున్నారు. ఈ వాస్తవాలు, ఇతర నిజాలు, రైతులకు కాపిటలిజంపై గల అసంతృప్తిని, నిస్పృహను పెంచుతున్నయ్. వారి నిరాశా, నిస్పృహలు ఎంత బరువయినవో, యుద్ధాల మధ్య కాలంలో బ్రద్దలయిన వారి ఆవేశం, కోపతాపాల ప్రభావం, వేలాది రష్యన్, పోలిష్, బాల్కన్ స్లోవోక్ ప్రజలు, భూస్వాములు, జమీందార్లపై తిరగబడి వారి భవనాలను తగలబెట్టి, వారి ఆస్తులను స్వాధీనం చేసుకొని, భూములను ఆక్రమించిన చరిత్రను గుర్తుకు తెచ్చుకుంటే అర్థం అవుతుంది. ప్రతిచర్య మొదలయి 'బాల్కన్' లోరైతుల పాలన అంతం చేయబడినా వామపక్ష వ్యతిరేక ప్రభుత్వాలు, రైతులు మూజువాణీగా పంచుకొని, అనుభవిస్తున్న భూములను కన్నెత్తి కూడా చూడలేకపోయాయి. స్వంత పొలాలపై వారికి గల మక్కువ, రాజకీయ, ఆర్థిక స్వయం పాలన అధికారానికై రగులుతూ బ్రద్దలవటానికి సిద్ధంగా వున్న స్వాతంత్రేచ్ఛ, వారిని సామ్యవాద ప్రపంచ నిర్మాణం వైపు పరిగెత్తేటట్లు చేస్తున్నది.

పోరాటంతో 25 మిలియన్ల రైతులు స్వరాజ్యం వచ్చిన తరువాత భారతదేశంలో భూమి హక్కు పొందారు. 600 సంస్థానాలలోని 60 మిలియన్ల ప్రజలు స్వేచ్ఛను

శాంతియుతంగా సాధించుకున్నారు. దోపిడీ వ్యవస్థలు, అభివృద్ధి కారకాలయిన ఉద్యమాల వలన ఎలా కూలిపోయేది పై రెండు సంఘటనల ద్వారా తెలుసుకోవచ్చు.

సంఘానికి బరువుగాకుండా, తాము తిని ఇతరులకింత పెట్టకలిగిన 'ప్రజ' వున్నంతకాలం, ఏ సంఘమయినా సంతోషించాలి. భిన్నాభిప్రాయం కలవారు, ఉన్మాదులు లేక అభివృద్ధి, విప్లవాలకు వ్యతిరేకులు.

**నిజాలేమిటి?**

ఎవరు అభివృద్ధి కాముకులు? సమాజ అభివృద్ధికి, చట్టబద్ధమైన పాత్ర పోషిస్తూ ఒక వర్గానికో, కొన్ని వర్గాలకో పనిచేసేవారు అభివృద్ధికాముకులు, ఎవరు విప్లవ కారులు? అణగారుతూ, అణచివేయబడుతూ, నిర్లక్ష్యం చేయబడుతున్న వర్గాల ప్రజల సాంఘిక న్యాయం, అభివృద్ధులకు ఆటంకంగా వున్న శక్తులను ఏరివేసేవారు. ఈప్రమాణాలను బట్టి మనం (రైతులం) అభివృద్ధికాముకులం, విప్లవకారులం.

రైతులకు, కళాకారులకు భవిష్యత్ సమాజంలో అభివృద్ధి దాయకమయిన పాత్ర లేదని, వారు వారినైజం వలనగానీ, ఇతరుల బలాత్కారం వలనగానీ, రూపులేకుండా పోతారని, వారిని ఉద్ధరించే ప్రయత్నం తిరోగమన చర్యా, కన్సర్వేటిజమనీ కమ్యూనిష్టులు చెప్తున్నారు. వారి ఆలోచన తప్పు. మార్క్సిజం వారిని విప్లవ వ్యతిరేక మార్గంలో నడుపుతున్నది. తప్పుడు నిర్ణయాలు తీసుకొనేటట్లు చేస్తున్నది.

రైతులు భూమి హక్కుతోను, దాని దోపిడీతోనూ సంతృప్తి పడతారనే సామ్య వాదుల ఉదాసీన వైఖరి సరి అయినది కాదు. రైతులు కోరవలసిన సాధించవలసిన ముఖ్యమయిన హక్కు వేరొకటుంది. అదికాపిటలిస్టు, కమ్యూనిష్టు ధరల 'తీరు' కు సంబంధించినది. కమ్యూనిష్టులు ధరల గొంతుపిసికి, పెరగకుండా చేసి, రైతుల శ్రమ ఫలాలను దోచుకొని, అణచి వేస్తున్నారు. ఈ అన్యాయంకు వ్యతిరేకంగా రైతులు ఉద్యమిస్తున్నారు. యాంత్రిక ఉత్పత్తుల కొరకు, న్యాయమయిన ధరల కొరకు ప్రపంచ విపణులపై కాపిటలిజంలో, ఆధునిక ద్రవ్యమారకం, కరన్సీలపై కమ్యూనిజంలో, తమ వ్యవసాయ కార్యక్రమాలు కొనసాగించటానికి కాపిటలిజం, కమ్యూనిజంలపై ఆధార పడటం వలన వారు సర్వం కోల్పోతారు. ఈనిజం తెలిసిన రైతులు ఒకరికొకరు దగ్గరవు తారు. ఆధునిక సమాజంలో పల్లె - పట్టణాల మధ్య నెలకొన్న సంపద అసమాన పంపిణీ

భరించరానిదిగా వుందని రైతులు గ్రహించారు. ఈ అన్యాయానిక వారీ రెండు మార్గాలలో ఏదో ఒక మార్గం ద్వారా ప్రతిస్పందించాలి. ఒక మార్గం - విప్లవాల పుట్ట. రెండవది మొదటి దానంత సామర్థ్యం, కమ్యూనిస్టు, కాపిటలిస్టు వ్యతిరేకత కలిగిన రైతు సహకార వ్యవస్థ నిర్మాణం. దళారీలు లేని విధానం. వినియోగదారులతో ప్రత్యక్ష సంబంధాలు కలిగి వుండటం. రైతులింతవరకు స్వయం రక్షణా విధానాలనే (Self Defence) అవలంబించారు. ఇకముందు ఆ అవకాశం లేదు. వారు రైతులుగా మరణించటమో, లేక కమ్యూనిస్టు, కాపిటలిస్టు ఉచ్చులను ఛేదించటమో నిర్ణయించు కోవాలి. వారి నిర్ణయంలో అసందిగ్ధత లేదు. వారిన్నాళ్ళు కాపిటలిజపు దోపిడీ పై విప్లవాత్మక ధోరణిలోనే వున్నారు. ప్రజాస్వామ్యమైనా సహకార రైతాంగం కూడా విప్లవించి, స్వయం ఉపాధికల్పన స్వతంత్రంగా చేసుకోగలదు. ఇది యదార్థం. రైతులు ఉద్యమించి నప్పుడల్లా విజయాలే పొందారు. ఆధునిక రైతాంగ చరిత్రంతా వారి సాంఘిక విప్లవాలతో నిండి వుంది. కానీ వాస్తవంగా యిలా జరుగుతుందా?

కార్మికులలో మాత్రమే నిజమయిన విప్లవస్ఫూర్తి వుందని, శక్తి వుందని, నిరంతర విప్లవ స్తోమత కలిగి వుంటారని కమ్యూనిస్టులు విశ్వసిస్తారు. కానీ వారి పోరాట చరిత్ర ఈ విశ్వాసాలకు భిన్నంగా వుంది. రైతులు స్థానికంగా, సమన్వయం లేని పోరాటాలు అప్పుడప్పుడు మాత్రమే చేపట్టారనే వూహను పట్టుకొని వేళ్ళాడుతూ, కార్మికులకు గల అదే విధమయిన వైకల్యాన్ని విస్మరిస్తున్నారు. బూర్జువా ప్రచారాలకు, బూర్జువా అపోహలకు రైతులు లొంగిపోతారని ఆరోపిస్తున్నారు. కార్మికులు కూడా ఈ బలహీనత లతో బాధపడుతున్నారు. కార్మికులకులేని వైకల్యాలు, బలహీనతలు రైతులకు లేవు. అసమగ్ర సమాచారం ఆధారంగా, సరైన అవగాహనలేక 19వ శతాబ్దపు సోషలిస్టులు, రైతులపై తప్పుడు కేసు బనాయించారు. రైతుల పోరాటాలు చిన్నవిగా చూపి, కార్మిక విజయాలను భూతద్దంలో చూపిస్తున్నారు.

పేరుకు మాత్రమే పాశ్చాత్య దేశమయిన రష్యాలో 'పారిశ్రామికత అతి స్వల్పంగా' వున్నప్పుడు జరిగిన కార్మిక విప్లవానికి చాలా ప్రాధాన్యత వుంది. అలానే రైతు విప్లవాలు వరుసలుగా చైనా, ఇండియా, మెక్సికో, చిలీ దేశాలలో వచ్చినయ్. సాంప్రదాయక పాశ్చాత్య సోషలిస్టుల ఊహలకు భిన్నమయినా - ఈ విప్లవానుభవం రాజకీయ, ఆర్థిక సంబంధాలకు అతి సన్నిహితమయినది. పాశ్చాత్య దేశాలు, అమెరికా సోషలిస్టులు సామ్యవాద ఆలోచనలపై వ్రాయడంలో మాట్లాడటంలో విభేదించుకోవడంలో

దిట్టలుగా వుంటే వారి ప్రజలు తూర్పు దేశాల 'అదనపు విలువ' ఫలాన్ని (Fruit) వారి సామాజిక సంపదను, వారు కడుపుకట్టుకొని మిగుల్చుకున్న దానిని చప్పరిస్తుంటే, తూర్పుదేశాల వారు, రంగు జాతులవారు, పీడిత రష్యను ప్రజలు రాజకీయ, ఆర్థిక, సామాజిక విప్లవాలలో ముందున్నారు.

'సోషలిజం విజయం ముందుగా చాలా దేశాలలో లేక ఒక దేశంలో గానీ సాధ్యం' అని లెనిన్ వ్రాశాడు. మొదటి ప్రపంచ యుద్ధం ముందునుండీ తన అసమ ఆర్థికాభివృద్ధి సూత్రం ఆధారంగా 'సోషలిస్టు విజయం ఒక దేశంలో సాధ్యం, ఆ ఒక్క దేశం కూడా కాపిటలిస్టు భావనలో అభివృద్ధి చెందినదైనప్పటికీ' అని లెనిన్ వాదించాడంటూ స్టాలిన్ వ్రాశాడు.

కనుక ఈ 20వ శతాబ్దంలో (1960) మెక్సికన్ రైతాంగం తన విప్లవోద్యమాన్ని, నిర్మాణాన్ని తన వర్గలక్ష్యాన్ని ధ్యేయాన్ని, తన వర్గ నాయకుల నాయకత్వంలో సాధించుకోవటానికి తన స్వంత గొంతు విన్పించటానికి, సామ్యవాద నిర్మాణానికి, కార్మికుల, బూర్జువాల - అన్ని రకాల నియంతృత్వం నుండి విముక్తికీ, సంపూర్ణకర్షక - కార్మిక విజయానికై చేస్తున్న కృషిని అభినందించవలసి వుంది.

రైతుకు వ్యవసాయంలో - వ్యాపారంలో (అమ్మకాలు - కొనుగోళ్ళు) యాజమాన్యపు అనుభవం వుంది. పరిశ్రమల యాజమాన్యంలో కార్మికులు అనుభవం, పరిజ్ఞానం లేనివారు. వారికా అవకాశాలు రాలేదు. అందువలననే ఫ్రెంచి, రష్యన్, బాల్కన్ విప్లవాలలో రైతులు ముందుగా భూస్వాములను రూపుమాపారు. వెంటనే మూజువాణీగా భూవిభజన చేసి, పంచి, ఎక్కువ ఉత్పత్తులను సాధించి, గ్రామీణ ఆర్థికతను, అర్థవంతంగా, ఉత్పత్తిదాయకంగా అభివృద్ధిపరంగా మలచగలిగారు. ఇటలీలో రష్యాలో కార్మి కులు విజయాలు సాధించి, లంబార్డీ (Lambardy) ఫ్యాక్టరీలను, రష్యను మిల్లులను స్వాధీనం చేసుకొన్నారు. తమ చేతులలో పడ్డ ఈ పెద్ద వ్యవస్థల వ్యాపార యాంత్రిక చిక్కులు వారు సరిచేయలేకపోయారు. భూములలో విప్లవాత్మకమయిన ఉత్పత్తులు సాధించటమేగాక ప్రభుత్వ యంత్రాంగాన్ని కూడా రైతులు తమ చెప్పుచేతల్లో వుంచుకొన్నారు.

ఎక్కువ మంది రైతులకు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో పాలనానుభవం వుంది. తెగలుగా వున్నప్పుడు, సమిష్టి కుటుంబాల యాజమాన్యంలో, వ్యవసాయ యాజమాన్యంలో గ్రామ పాలనలో రైతులకు క్రమశిక్షణ, వ్యవస్థాగత నిర్మాణాలు ఉత్పత్తి

నియంత్రణ, పరస్పర మార్గదర్శకత్వం, సామూహిక స్పృహ, విధేయతలు, నిర్ణయావ సరాలతో పరిచయం వుంది. స్థానిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థా నిర్మాణాలను చూచి బిత్తరపోరు, కార్మికులకు, ఏకొద్దిగానో గ్రామీణ వారసత్వం వలన సంక్రమించిన పాలనా సామర్థ్యాన్ని కాపిటలిజం వారికి లేకుండా చేసింది. కార్మికుల వలెనే రైతులకు కూడా జాతీయ సమస్యలపై, రాజకీయ సమస్యలపై భవిష్యద్దర్శనం లేదనే మాట యదార్థం. వారి పాలనా, నిర్వహణానుభవాలు గ్రామాలకు, జిల్లాలకు మాత్రమే గతంలో పరిమితం. ఈ పరిమిత శక్తే రష్యాలో అధికారం హస్తగతం చేసుకోటానికి ఉపయోగపడింది. భవిష్యత్తులో సామ్యవాద నిర్మాణానికి వ్యవస్థాగత సమస్యల పరిష్కారానికి మార్గం సుగమం చేస్తుంది.

ఆధునిక రైతులకు, ఒక చక్కటి అవకాశం, వాణిజ్య పంటల రూపంలో కాపిట లిజం కలిగించింది. ప్రపంచ విపణులతో పరిచయం కలుగ జేసింది. ఆధునిక ప్రపంచ యుద్ధాలు కూ॥ా రైతుల పరిధిని, విస్తృత పరచినయ్. రష్యా విప్లవం వారికి బయట ప్రపంచ సంఘటనలపై ఆసక్తి పెంచింది. ఇంటా, బయటా శ్రామికులు చేస్తున్న ఆందోళనలు, ఘర్షణలు వారికి ఐక్యతాశక్తిని బోధపరచినయ్. రైతుమేలుకుంటున్నాడు. ఆతనిలో జాతీయ స్పృహ, ప్రపంచ అవగాహన పెరిగింది.

మేలుకుంటున్న రైతు, కార్మిక నాయకత్వాన్ని తిరస్కరిస్తున్నాడు. యూరపు, అమెరికాలలోని పారిశ్రామిక కార్మికుడు శారీరకంగా, మానసికంగా, నిర్మాణాత్మకంగా లేక సామూహిక స్పృహలో గాని తన కన్నా ఉన్నత స్థితిలో లేడని గ్రహించాడు. రైతుకు గల సంఘటిత చర్యల, సాంప్రదాయేతర వారసత్వం కార్మికునకు లేదు.

గ్రామీణ సంబంధాలు తెగిపోయినా, పట్టణ ప్రజల ప్రయోజనాలు తాను పొందకపోయినా, చుక్కాని లేని నావలాగా తిరుగుడు బడుతున్నా, రైతు తన ఆధిక్యతా భావాన్ని వదల లేదు. బీదరికం, అణచివేతలలో కూడా తనకు తానే యజమాని. కార్మి కుడు పరిశ్రమలకు బానిస. రైతుల నైజాన్ని అర్థం చేసుకోకుండా, కార్మిక నాయకత్వం అంగీకరించాలని కోరడం - రైతులలో కార్మిక వ్యతిరేక భావాన్ని, అపనమ్మకాన్ని కలిగించ టానికి, వారి విప్లవ సాహసాల బిడ్డ పురిటిలోనే కన్ను మూయటానికి దోహదం చేస్తుంది.

రైతులకు వారి సంఖ్యాబలపు శక్తి తెలుసు. వారిలో చాలా మంది, భారత దళితులతో సహా ఓటు హక్కు కలిగి యున్నారు. వారి ఓటు బలం, దానితో కూడ

బెట్టిన అధికారశక్తి విలువ వారికి తెలుసు. 1917లో రష్యన్ రైతుల కన్నా వీరి స్థితి నేడు చాలా మెరుగ్గా వుంది. అటువంటి వారిని, జనాభాలో 5శాతం కూడా లేని, పట్టణాలకు పూర్తిగా అలవాటు పడని, గ్రామ సంబంధాలు వదలని, గుర్తించబడిన సాధారణ సామాజిక క్రమశిక్షణలేని కార్మికుల నాయకత్వం అంగీకరించమని కోరటం వలన, వారితో కలసి ముందడుగు వేసే అవకాశం, కార్మికులు పోగొట్టుకుంటున్నారు. కేవల సంఖ్యా బలానికి వ్యతిరేకంగా లెనిన్ చేసిన వాదనతో నేనూ ఏకీభవిస్తాను. కానీ సంఖ్యాబలం, సామాజిక అధికారబలం, పెరుగుతున్న వర్గ స్పృహ, రైతు సహకార వ్యవస్థల ప్రభావం, వీటితో కలిగిన సామాజిక అనుభూతులతో బలోపేతం చేయబడినప్పుడు, సంఖ్యాబలపు ప్రాముఖ్యతను విస్మరించటం మూర్ఖత్వం.

గత ఇరువది అయిదు సంవత్సరాలలో వచ్చిన జాతీయ సంఘ నిర్మాణపు మెలుకువలు, రైతులను చైతన్య వంతునిగా జేస్తున్నవి. అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, బ్రిటన్ రైతులు (Farmers - ఫార్మర్లు) జాతీయ స్థాయిలో సంఘనిర్మాణావశ్యకతను గుర్తించటమేగాక పార్లమెంటు ఎన్నికలలో కూడా కొన్ని విజయాలు సాధించారు. డెన్మార్కు, బాల్కన్ రాష్ట్రాలు, పోలెండు, స్కాండినేవియన్ దేశాల ప్రభావంతో ఐరిష్ రైతులు (Farmers) పార్లమెంటరీ పార్టీ నిర్మాణం చేసుకున్నారు. చైనా, ఇండియాలలో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక ఘర్షణలు, నిద్రాణంగా వున్న ఈ దేశాల రైతులను వారి వర్గాల పార్టీ నిర్మాణాలతో జాగృతం చేసినవి. 1923-36 మధ్యకాలంలో భారత రైతుల ప్రయోజనాలకై మేము వేసిన 'తప్పటడుగులు' తో ఇండియన్ పెజెంట్సు కాంగ్రెస్ రూపుదిద్దుకొంది. అది సామ్రాజ్యవాద, కమ్యూనిష్టు వ్యతిరేక శక్తిగా ఎదిగింది. నేటి భారతరైతులు, జాతీయ స్థాయిలో వర్గ సంఘనిర్మాణావశ్యకతను, లాభాలను గుర్తించారు.

వర్గ స్పృహ కలగిన కార్మిక నియంతృత్వంతో ఆకస్మికంగా ఘర్షణలు పడినప్పుడు, రష్యాలో ఈ జాతీయ సంఘనిర్మాణం లేదు. 'అనైక్యతతో వున్నాం. విస్తృతమయిన జాతీయ సంఘ నిర్మాణం లేదు'. అని లెనిన్ చెప్పాడు. కానట్లయితే 'మేము విజయంతో మత్తెక్కి వున్నా'మని స్టాలిన్ చెప్పిన మాట, అంతకు పూర్వమే చెప్పగలిగేవారు. అనవసరమయిన బాధలను రష్యా రైతులు అనుభవించేవారు కాదు.

ఇది ఐక్యతా రైతాంగయుగం. సంఖ్యాబలం వారి శక్తి. ఇది రైతు సహకార వ్యవస్థల యుగం కూడా. వర్గ స్పృహ, ఏకీభావం వారి బలానికి మూలం. వారి ఆర్థిక సూత్రాల మూలాలను వారు కనుగొన్నారు. ఏఏ మార్గాల ద్వారా వారి సంపదను,

కాపిటలిస్టులు, ఫ్యూడలిస్టులు, సామ్రాజ్య వాదులు రష్యా, చైనా, ఆగ్నేయాసియా, నియంతృత్వ దేశాలు, దొంగ దోవల్లో మరలిస్తున్నదీ తెలుసుకున్నారు. తమ దరిద్రానికి కారణం వెతుక్కోగలిగారు. వారు తమ శతృవుల చేతుల్లో నుండి బయటపడేమార్గాలే లేక, గతంలో తమ పూర్వీకులు అనుభవించిన శాంతి, సౌభాగ్యాలకాలాన్ని మించిన మంచి కాలంలో అడుగుబెట్టటానికి అనువయిన విప్లవ మార్గాలు తెలుసుకున్నారు. ప్రపంచ విపణులను జయించి, జాతీయ వ్యవసాయ ధరల స్థిరీకరణ విధానాలను అభివృద్ధి చేశారు. ధాన్యం ప్రొక్యూర్‌మెంటు, ప్రైస్ స్క్వీజ్, నిర్బంధ సహకార వ్యవస్థలను చూచి భయపడటం లేదు. రష్యా అనుభవాలతో వారీ ఉచ్చులు ఎలా ఛేదించాలో తెలుసు కున్నారు. గత నలభయ్ సంవత్సరాల (1919-56) వారి బాధలు, యత్నాలు, సామాజిక ప్రజాస్వామ్య సూత్రాలను తెలుసుకోగలగటం - ప్రపంచ సాంఘిక చరిత్రలో, ముఖ్యంగా రైతు చరిత్రలో ప్రధాన ఘట్టాలు.

రాజుల ముందు చట్ట సభలముందు కొసరు లాభాలకోసం మోకరిల్లే రోజులు పోయాయ్. కార్మిక నియంతృత్వం, సామ్రాజ్య వాదనియంతృత్వం, వారిపై కొత్త బరువులు మోపి, వారి ఆర్థికతను అస్తవ్యస్తం చేసిన రోజులకు నూకలు చెల్లాయ్. ఆధునిక రైతు రాజకీయ వ్యక్తిత్వం సంతరించుకొంటున్నాడు. ఆర్థిక శక్తుల తీరు తెన్నులు అవగాహన చేసుకున్నాడు. తన స్వంత ప్రజాస్వామ్య నిర్ణయాలతో, తన వాటాకై తాను విప్లవాత్మకంగా ఉద్యమిస్తున్నాడు.

రైతులకు చేయూత నీయటానికి సిద్ధంగా లేని వారు, వారి పోరాట చరిత్ర తెలియని వారు, రైతులకు నిలకడయిన విప్లవశక్తి లేదంటారు. అదివారు కావాలని ఏర్పరుచుకొనిన దురభిప్రాయం. సామ్రాజ్యవాదం, కాపిటలిజంల తాకిడి (తూర్పు దేశాలలో) ప్రభావ రహితంగా వుండటం వలన చాలా కాలం రైతులు కూడా కార్మికుల వలెనే, వారి చారిత్రక గమ్యం గురించి స్పృహలేకుండా వున్నారు. మార్క్సిజం ఆవిర్భావం, రష్యా విప్లవ ఫలితాలు, మార్క్సిస్టు-లెనినిస్టు-స్టాలినిజం-ప్రపంచ శ్రామికులలో అధిక భాగాన్ని మేల్కొల్పింది. వారి చారిత్రక, విప్లవ పాత్రను, కాపిటలిజం, ఇంపీరియలిజం, ఫాసిజంలకు వ్యతిరేకంగా నిర్ణయించింది.

1920 వరకు రైతులకు ప్రపంచవ్యాప్త వర్గస్పృహ, విప్లవ పాత్ర, గమ్యం లేకపోయింది. అందువలన వారు రెండు ప్రపంచ యుద్ధాలు, ఆర్థిక మాంద్యాలనుండి లబ్ధికై ప్రయత్నం చేయకపోవటం, సామ్యవాద సాధనకు విప్లవాత్మక పాత్రను పోషించక

పోవటం ఆశ్చర్యకరం కాదు. రెండు ప్రపంచ యుద్ధాలు, ఆర్థిక మాంద్యం, సామ్రాజ్యవాదం చేతులలో అవమానించబడిన, అపవిత్రం చేయబడిన, ఆఫ్రికా తెగల సాంఘిక జీవితం, ఇండియన్ పెజెంట్ మూమెంట్, లాటిన్ అమెరికాలో రెడ్ ఇండియన్ల పునరుజ్జీవం, ఇండియా, బర్మా, ఫిలిప్పైన్సు, వెస్టిండీస్, ఇండోచైనా, మలయా, ఈజిప్టు, సూడాను, టునీసియా, మొరాకో, ఆల్జీరియా, ఇండోనేసియా, లాటిన్ అమెరికా రాష్ట్రాలు, చైనా, ఆఫ్ఘనిస్తాన్, పర్షా, టర్కీలలో వచ్చిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు, ఆధునిక కాపిటలిస్టు సమాజంలో వారి విప్లవ పాత్రను విప్పిచెప్పినయ్. రష్యా విప్లవం, మహాత్మా గాంధీ, సన్-యట్-సేన్ల కార్యకలాపాలు, ఆగ్నేయ ఐరోపాలో, గ్రీన్ ఇంటర్నేషనల్, హయాస్, కార్డినెజ్ ఇంకా ఇతరాలు కాపిటలిజం వ్యతిరేకపోరాటానికి, విజయానికి అవసరమయిన మార్గాలను అందించినయ్.

ఫ్యూడలిజం పతనం, కాపిటలిజం ఆవిష్కరణతో - భూస్వామ్య వర్గాల నుండి, వారి సేవకుల నుండి, శ్రామికుల నుండి, అస్పృశ్యులనుండి, నీగ్రోల నుండి, రెడ్ ఇండియన్, ఇండియా, చైనా ప్రాచీన తెగలనుండి, చైనాలోని గృహసేవకుల నుండి, స్వతంత్ర రైతులు ఆవిర్భవిస్తున్నారు. వ్యవసాయ ప్రజలో వర్గస్పృహ, సామ్రాజ్యవాద వ్యతిరేకత, జాతీయ, సాంఘిక చైతన్యం కలుగుతున్నది. కనుక గత శతాబ్దంలో, ఫ్యూడల్ వైకల్యాలనుండి, అవిటితనం నుండి బయటపడి, రైతులుగా రూపుదిద్దుకొనని వారిని గురించి, మార్క్సిస్టులు వల్లించిన చిలుకపలుకులు ఇప్పుడు కూడా వల్లించడం అన్యాయం. సామాజిక విలువలు సృష్టిస్తూ తామనుభవానికి మిగుల్చుకొన్న దానికన్నా, అదనంగా సమాజానికి అర్పణ చేస్తున్న రైతులను, అభినందించని సమాజం, వారికి సేవచేయని 'పార్టీ' వారి పోరాటాన్ని పట్టించుకోని విప్లవ సిద్ధాంతాలలో ఏదో అవలక్షణ ముందనుకోవాలి. అభివృద్ధి కాముకులు వారి పక్షాన నిలవాలి. సృజనాత్మకులు, అభివృద్ధికాముకులు సంఘానికి ఉపయోగపడేవారయిన రైతులను బలహీన పరచే ప్రయత్నాలు చేసేవారు ఎవరయినా, అభివృద్ధికి, సాంఘిక న్యాయానికి శతృవులు. సంఘంలో చీడపురుగులు.

వ్యవసాయ దేశాలు ఎక్కువ సంఖ్యలో స్వయంపోషకత్వాన్ని, ప్రపంచ విపణులపై విజయాలను పొందటం వలన పారిశ్రామిక వాణిజ్యవ్యాపకాలను సామాజిక ఆధీనంలో వుంచుకోవటం వలన, అంతర్జాతీయతకు దూరంగా, ఒంటరిగా వుండగలవని భయపడ నవసరం లేదు. ఈ సామ్రాజ్యవాద, ప్రపంచ విపణుల కాలంలో, ఏదేశమూ, ఎక్కువ కాలం, కాపిటలిజపు జిత్తులకు దూరంగా వుండలేదు. ప్రపంచంలో ఏదో ఒకచోట ఎప్పుడూ తమ సాధారణ శత్రువు (కాపిటలిజం)పై పోరాటాలు జరుపుతునే వుంటుంది.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత సూడాను, ఇండియా, బర్మా, సిలోన్, ఇండోనేసియా, ఈజిప్టు, ఇండోచైనా, టునీసియా, మొరాకో స్వతంత్ర దేశాలయినాయి. స్వయం పోషకత్వంపై వాటి దృష్టి కేంద్రీకరించబడి వుంది. వారు తమ అవసరాలకోసం, పరిశ్రమలను నిర్మించుకుంటున్నారు. ఈ స్థితిలో వీరు తమ వ్యావసాయక ముడి సరుకులను, కొద్ది పరిమాణంలో మాత్రమే ఎగుమతి చేయాలి. అప్పుడు మాత్రమే వారు తమ ఎగుమతుల ధరలను హెచ్చు స్థాయిలో వుంచి, తమ దిగుమతుల ధరలతో పొందిక కుదుర్చుకోగలరు. వారి కాటన్, జూటు, ధాన్యం, నూనెగింజలు, పంచదార, దిగుమతి చేసుకొనే పారిశ్రామిక దేశాలు, వీటికి గిట్టుబాటు ధర చెల్లిస్తాయి. వారి ప్రజల నిజమయిన వేతన విలువలలో తగ్గింపు కలుగుతుంది. వేతన జీవులు అసంతృప్తితో కాపిటలిస్టు దేశాలలో తిరగబడతారు. ఈ వాదన మార్క్సిజంకు అనుకూలమయినదే. పూర్వవలసదేశాల ఆర్థిక స్వాతంత్ర్యం, నిద్రాణంగా వున్న సామ్రాజ్యవాద ప్రజలను మేల్కొల్పి, కాపిటలిజం వినాశనానికి బాటలు వేస్తుంది. వలస దేశాలవ్యవసాయ ఉత్పత్తులు చౌక దిగుమతి లేకుంటే, పారిశ్రామిక దేశాల రైతుల బేరశక్తి పెరుగుతుంది. వారికీ విధంగా అందుతున్న సరి అయిన ధరలు - ప్రయోజనాలతో స్థానిక కాపిటలిస్టు ప్రభుత్వాలపై విప్లవించే ధైర్యం కలుగుతుంది.

సాంప్రదాయ మార్క్సిస్టుల ఉద్దేశ్యాలకు భిన్నంగా కాపిటలిజం, దాని ఆయుధాలయిన సామ్రాజ్యవాదం - కమ్యూనిజం నుండి ప్రపంచ వ్యాప్తంగా విముక్తి పొందినప్పుడే రైతులకు రక్షణా తృప్తి వుంటుంది.

పారిశ్రామిక కార్మికులు, వ్యవసాయ కూలీలు తమ శ్రమతోనే జీవిస్తారనీ, వారికిటువంటి దోపిడీలో వాటా లేదని సామాన్య విశ్వాసం, వ్యవసాయ కూలీల వరకు ఇది నిజం. పారిశ్రామిక కార్మికులు, వ్యవసాయ వర్గాల 'అదనపు విలువ'లో పాక్షిక వాటాదారులు. ప్రస్తుత ఆర్థిక విధానంలో వ్యవసాయోత్పత్తులకు గల గిట్టుబాటు గాని స్వల్పధరల వలన వచ్చిన లాభాల నుండి గాని లబ్ధిపొందుతారు. కానీ వారి జీవితం ఈ అల్ప సంపాదనపై ఆధారపడి మాత్రం లేదు.

పొలంలో పని చేసే రైతులు, కవులుదార్లు, కార్మికుల వలెనే సమాజంలోని ఏ వర్గపు దోపిడీతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలు లేనివారు. ప్రస్తుత విధానంలో వారు 'వ్యవసాయకూలీల అదనపు విలువ'లో వాటా పొందే అవకాశముంది. వాటా పొందు తున్నారు. వ్యవసాయకూలీల నుండి అదనపు విలువలో వాటా పొందటం వారి తప్పుకాదు.

వారి (వ్యవసాయ కూలీల) అదనపు విలువలో చాలా భాగం, లేక మొత్తం, వ్యవసాయ దారుల అదనపు విలువలో పెద్దవాటాను, వ్యసాయేతర కాపిటలిస్టు వర్గాలు, దిగమింగు తున్నాయనేది వాస్తవం.

ఆధునిక రైతు, కార్మికునితో సోదరభావంతో మెలగాలని కోరుకుంటున్నాడు. అయితే అతను కార్మికుల వాణి, వారి సంఖ్యకు తగిన స్థాయిలో వుండి, తన గొంతుకన్నా ఎక్కువ స్థాయిలో విన్పించబడటానికి, తద్వారా తాను నష్టపడటానికి సిద్ధంగా లేడు. ఛెస్టర్ బౌల్సు రూఢిచేసినట్లు, నాపర్యటనలో నేను కనుగొన్నట్లు, సోవియట్ రష్యాలోవలె 'విస్మృతుడు' గా మిగలటానికి ఇష్టపడటం లేదు. తన వర్గాన్ని విచ్ఛిన్నం చేయటానికి, ఒక వర్గాన్ని ఇంకొక వర్గంపై పురికొల్పటానికి ఆత్మస్థైర్యం కోల్పోయేటట్లు చేసి, తన వర్గపు అన్ని విభాగాలను కలగా పులగం చేసి, తన గొంతు మూగబోయేటట్లు చేసి కార్మికులను మాత్రమే ప్రభావితం చేసే, లెనినిస్టు, స్టాలినిస్టు తంత్రాలను అతను (రైతు) సాగనివ్వదలచటం లేదు. (See also "An essay on the impact of Marxism - Joseph Macek - 1955, Chapters VI and VII) నేటి పరిస్థితులలో ఓరియంటల్ దేశాలలో, లాటిన్ అమెరికాలో రైతులు, కార్మికుల సంపూర్ణ సహకారం లేకుండానే, సంపూర్ణ విప్లవం సాధించగలమనుకొంటున్నారు. రైతుల అండదండలు లేనిదే కార్మికులు ఈ పని సాధించలేరు. రైతు, కార్మికులు ఇతర శ్రమజీవుల సహకారంతో, విప్లవ మార్గంలో ముందడుగు వేయటానికి కృతనిశ్చయుడైయున్నాడు.

రష్యన్ విప్లవం వలన రైతులు నలుబది సంవత్సరాలు అణచివేయబడ్డారు. స్పానిష్ విప్లవంలో - ఫాసిస్టు ప్రతి విప్లవం (Counter Revolution) వలన సామ్యవాద ప్రభుత్వం పడగొట్టబడింది. చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం రైతుల సాంప్రదాయక, ఆర్థిక విధానాన్ని తప్పుడు మలుపులు తిప్పుతున్నది. రైతులు ఆధునిక రాజకీయాలలో చాలా విలువయిన పాఠాలు నేర్చారు. వారు ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదపు పై మెరుగుల లోపలగల ఫాసిస్టు నియంతృత్వాన్ని చూడగలిగారు. అందువలన వారు ప్రతి దేశంలో రాజకీయాధికారాన్ని, ఇతర శ్రామిక జన బాహుళ్యంతో కలసి సంపాదించటానికి, బూర్జువా, కార్మిక, ఇతర నియంతృత్వాలను నిరోధించటానికి పట్టుదలతో వున్నారు.

1926-29లో రూజ్వెల్టు ప్రవేశ పెట్టిన, వ్యవసాయ - పారిశ్రామిక పొందిక ధరల విధానం (Parity), ఇప్పుడు రైతులు కోరడం లేదు. అవి ప్రాధమింగా అసమానత్వం కలిగినవి. నిజమైన పొందిక ధరలను ఇప్పుడు నిర్ణయించాలి.

వర్తకపు షరతులలో సమానత్వం, నిజమయిన సాంఘికన్యాయం, రాజకీయ అధికారంలో తగిన భాగస్వామ్యం కల్పించే ప్రభుత్వం ఆధునిక వ్యవసాయదారుని రాజకీయ లక్ష్యం. కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యంలోనే ఈ లక్ష్యం సాధించబడుతుంది. పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధి, ప్రాథమిక పరిశ్రమల అవసరాలు, ప్రయోజనాలతో (వ్యవ సాయ, అటవీ, ఖనిజ సంపదలు) సంబంధం, సమన్వయం కలిగి వుండాలి. త్వరితగతి పారిశ్రామికాభివృద్ధి, పారిశ్రామికవాణిజ్య వర్గాలకు బుద్ధిజీవులకు ప్రతి ఫలాలలో పక్షపాత వైఖరులు సహించబడవు. ఈ పక్షపాత ధోరణులను అదుపు చేయటానికి పారిశ్రామి కాభివృద్ధి, సాంఘిక పునర్నిర్మాణం, పునర్విమర్శలతో ముందుకు సాగటానికి రైతులు పెత్తనం కావాలంటున్నారు. గ్రామాభివృద్ధి, గ్రామ సౌభాగ్యం, ఆధునికత రైతుకు ప్రాణ ప్రదం. పాశ్చాత్య సామ్యవాదులు అసమంజసమయిన అభ్యంతరాలు పెట్టక, రైతులతో సహకరించినప్పుడు మాత్రమే సాంఘిక విప్లవం వస్తుంది.

రైతులు కూడా అణచివేయబడిన వర్గమా? అని వ్యవసాయ కూలీలు ప్రశ్నిస్తు న్నారు. రైతులు అణచివేయబడిన వర్గమే. వ్యవసాయకూలీల స్థితి వీరికన్నా దయనీయంగా వున్నమాట నిజమే. సమాజంలో చాలా వర్గాలు అణచివేతకు గురియగు తున్నంత మాత్రాన వ్యవసాయదారులు నిర్లక్ష్యం చేయబడుతున్నారన్న సత్యం మారదు. నైపుణ్యం గల శ్రామికుడు, నైపుణ్యంలేని శ్రామికుని కన్నా తక్కువ దోపిడీ చేయబడు తున్నాడు. అదే విధంగా వ్యవసాయకూలీకన్నా రైతు తక్కువ దోపిడీకి గురి అగుతున్నాడు. ఏ విధంగాపై రెండు వర్గాల కార్మికులు మొత్తం శ్రామికులలో దోపిడీ చేయబడినవారుగా వున్నారో, అలానే రైతులు, వ్యవసాయ కూలీలు మొత్తం వ్యవసాయ వర్గంలో దోపిడీ చేయబడుతున్నవారే. ఈ విషయం మరచి, కేవలం వ్యవసాయకూలీలపైనే ఆలోచన కేంద్రీకరించడం, అభివృద్ధిని, విప్లవాన్ని, సాంఘిక న్యాయాన్ని నష్టపరచటమే. అటువంటి వారు తిరోగమనాన్ని, ప్రతి విప్లవాన్ని (Counter Revolution) సమర్ధించిన వారు అవుతారు.

రైతులను, కాపిటలిస్టులు, బుద్ధిజీవులేకాక - విప్లవ చరిత్రకలిగిన వారమని చెప్పుకొనే సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా నిర్లక్ష్యం చేశారు. రైతులు అణచి వేయబడిన వారంటే కాపిటలిస్టులు అంగీకరించరు. ఇతర వర్గాల ఉత్పత్తులు, సేవలతోగల నష్టదాయక మయిన మారకాల ద్వారా, ప్రపంచ విపణుల ద్వారా వారు అణచి వేయబడుతున్నారు. సాధారణ ధరల స్థాయితో సంబంధం లేకుండా, రైతులు ఉత్పత్తులు పెంచుకుంటూ పోతున్నారు. వారి ఉద్యోగకల్పన అందులోనే వుంది. నిరుద్యోగ కారణంగా చేసే వత్తిడి

వ్యవసాయం వలన వత్తిడితో కూడిన వారి జీవితాలను కీలక సేవల యాజమాన్యం సొమ్ము చేసుకుంటున్నది. అతిస్వల్పమైన ప్రతిఫలాలు వారికందుతున్నాయి. అణచి వేతంటే ఇదే.

కమ్యూనిష్టులు, సోషలిస్టులు ఈ అణచివేత చారిత్రకంగా అనివార్యమని, అన్ని దోపిడీ విధానాలు ఒక వర్గపు జగన్నాథరథచక్రాల క్రిందనలగిపోవటానికి సాధనాలనీ, నిర్లక్ష్యంగా ఆలోచిస్తున్నారు. ఈ ఆలోచనతో వారు చరిత్రకు, మానవతకు, నిజమయిన విప్లవానికి అన్యాయం చేస్తున్నారు. నీరోరాజు వైఖరి నవలంబిస్తున్నారు.

రైతులు, కళాకారులు నశించరు. వారు తిరోగమనపు పల్లకీబోయాలు కాదు. వారు వికేంద్రీకృత ఆర్ధికయుగానికి ఆహ్వానం పలుకుతారు. అణుబాంబును, క్రిమి బాంబును, ఆధునిక యుద్ధాన్ని తిప్పికొట్టగలిగినవారు, వారి తరహా ఆర్ధిక విధానంలోనే సమాజం మరొక మారు స్వతంత్రంగా, సంతోషంగా, జీవించగలదు. కమ్యూనిస్టులు - ఆగ్నేయాసియాలో, చైనాలో కోట్లాది వర్గస్పృహగల రైతులు సమిష్టి వ్యవసాయంలో వున్నారని సమర్ధించుకో చూస్తారు. అలా జరగటానికి ఎంతో రక్తపాత మవసరమయింది. రైతులు వ్యక్తిత్వాన్ని, సౌభాగ్యాన్ని, సృజనను, జీవితేచ్ఛను పోగొట్టుకొని రష్యా, చైనాలలో కమ్యూనిస్టు నాయకత్వం అంగీకరించారు. సామాజిక, విప్లవ స్పృహ కలిగిన ప్రతి ఒక్కరూ ఈ అణచివేతను, నియంతృత్వాన్ని అరికట్టే బాధ్యత స్వీకరించాలి. భారతదేశం ఈ అణచివేతకు ప్రత్యామ్నాయం చూపుతుంది. రైతుస్వామ్యం, సహకార రైతురంగాల ద్వారా వారికి ఆర్ధికపుష్టి చేకూరుస్తున్నది. 1956 లో చైనాలోని రష్యాతరహా సహకార వ్యవసాయాన్ని పరిశీలించి వచ్చిన నిపుణులు, ఆ విధానానికి వ్యతిరేకంగా తమ అభిప్రాయాలు వెల్ల డించారు. ఇండియా సహకార వ్యవసాయాన్ని ప్రయోగాత్మకంగా, భారీగా వ్యవసాయ ఆర్ధికతకు 'సహచరి'గా స్వీకరిస్తున్నది. ప్రత్యామ్నాయంగా కాదు. రైతు ఆర్ధికత చావులేనిది. అది గ్రామీణ సమాజానికి, ఆధునిక సాంఘిక జీవితానికి ఉత్తమ మార్గం కనుకనే, ప్రజాస్వామ్య దేశాలలో వలస దేశాలలో రైతుల సంఖ్య పెరుగు తున్నది. సహకార వ్యవస్థలే - కమ్యూనిస్టేతర దేశాలలో రైతుల అణచివేతకు సమాధానం.

ఉత్పత్తి - పంపిణీ వ్యవస్థల ప్రతినిధులలో రైతు మాత్రమే ఇతరులను దోపిడీ చేయనివాడు. తన కొద్దిపాటి విత్తనాలు, పనిముట్లు, ఎరువులు, సామాజిక సామగ్రికి ఎన్నోరెట్లు సామాజిక సంపదను, అతను ఉత్పత్తి చేస్తున్నాడు. తను, తనకుటుంబం యావత్తూ సామాజిక సేవలో పాల్గొంటున్నది. దానికి గాను అతనడిగే ప్రతిఫలం - నన్ను నిర్లక్ష్యం చేయవద్దు. అణచివేయవద్దు అని మాత్రమే.

అందువలన రైతు, కార్మిక లేక మరే ఇతర వర్గపు నాయకత్వానికి విముఖుడుగా వున్నాడు. ఇతర వర్గాలు ఏదో ఒక విధంగా కాపిటలిజానికి సాధనంగా మారి తనను దోపిడీ చేయగలవని సందేహిస్తున్నాడు. వ్యవసాయధరలు పెంచమని కోరినప్పుడల్లా, కార్మికనాయకులు వ్యతిరేకిస్తున్నారు. యుద్ధకాలంలో ప్రొక్యూరుమెంటు ధరలకు వ్యతిరేకంగా రైతులు ఉద్యమిస్తే, కార్మికులు, ప్రభుత్వానికి మద్దతునిచ్చిన సంగతి రైతులు గుర్తుంచుకొన్నారు. పారిశ్రామిక కార్మికునితో సమానంగా తనను చూడటం లేదని రైతు నమ్ముతున్నాడు. యుద్ధకాలంలోనూ, ఆ తరువాత ట్రాట్స్కీ మిలటరీ లెవీలతో రష్యన్ రైతులు క్రూరంగా పీడించబడ్డారు. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో (రష్యాలో) సమిష్టి వ్యవసాయ పరిశోధనలను, ధాన్యాన్ని పట్టణాలకు తరలించటాన్ని, యాంత్రిక తయారీలను అందించకపోవటాన్ని, అడ్డుకొన్నవారిని, నిరసించిన వారిని క్రూరంగా - దేశ బహిష్కృతులను చేశారు. జైల్లో నెట్టారు. చావగొట్టారు. చంపారు. ఆదిలో నవంబరు విప్లవం శ్రామికులు - కార్మికులతో సాధించబడిందని చెప్పినా, అదికార్మిక నియంతృత్వానికి దారితీసింది. కార్మికులతో పోల్చి చూస్తే, అయిదవ వంతు రైతులకు మాత్రమే ఓటు హక్కు ఇవ్వబడింది. ప్రభుత్వం, బోల్షివిక్ పార్టీ - కార్మిక విభాగాలతో కార్మికుల ప్రయోజనం కొరకు నడపబడిందని, ధాన్యం వగైరాలు, కార్మికులకు జారు చక్రవర్తి కాలంలోవలెనే తరలించబడ్డవని వారెన్ని త్యాగాలు చేసినా, నాయకత్వ లక్షణాలు ప్రదర్శించి, ప్రతివిప్లవాన్ని (Counter revolution) ఎదుర్కొన్నా, కార్మిక నియంతృత్వం తన శక్తినంతా రైతుల నణగదొక్కటానికి, స్వాతంత్ర్యాన్ని, ఆత్మస్థైర్యాన్ని హరించటానికి ఉపయోగపడిందని, రష్యా రైతులు తెలుసుకొన్నారు. **1937** రాజ్యాంగాన్ని తప్పెట మోతలతో హోరెత్తించి, రైతులకు సమాన ప్రాతినిధ్యం కలిగించబడిందని చాటినా, జనాభాలో అధిక శాతంగా వున్న రైతులు, పార్లమెంటులో **1/4** వంతుకు కొద్దిగా ఎక్కువ మాత్రం వున్నారు. రైతులకు, కార్మికులతో పాటు సమాన ప్రతిఫలాలు ముట్టడం లేదని స్పష్టమయింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత కూడా, రష్యా గ్రామాలనుండి, సమిష్టి క్షేత్రాలనుండి - తమను సమానంగా చూడటం లేదని ఆరోపణలు వచ్చినయ్. భారీ పరిశ్రమలు, ఆనకట్టలు, విద్యుత్ కేంద్రాలు నిర్మించ బడినయ్. ఎడారులు పట్టణాలుగా మారినయ్. రైళ్ళు - రోడ్డులు వచ్చినయ్. గనులు త్రవ్వబడినూనె వెలికి తీయబడింది. రష్యా పారిశ్రామికీకరణ చెందింది. నా **1954** రష్యాపర్యటనలో, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో పనిచేసే రైతులు, సామాజిక భద్రతలలో కూడా వివక్షతతో చూడబడ్డారని గ్రహించాను. వీరి గృహవసతిని గురించి పట్టించుకోవటం

లేదు. వారి ఉత్పత్తులు ప్రభుత్వం నిర్ణయించిన ప్రభుత్వక్షేత్రాల ధరలకే అమ్మాలి. బానిసలతో పిరమిడ్లు నిర్మించిన ఫారోరాజుల (ఈజిప్టు) నిరంకుశత్వం కంటే బోల్షివిక్ విధానాలు ఏ విధంగా భిన్నమైనవి? తేడా ఒకటే. పిరమిడ్లు ఉత్పత్తిదాయకం కాదు. రష్యన్ పారిశ్రామికీకరణ ఉత్పత్తులు చేస్తుంది. కానీ ఈరెండూ 'బానిసశ్రమ'కు తగిన సంతృప్తికర ప్రతిఫలాలు పొందటం లేదు. ఈ కారణంగా ఇంకా అనేక కారణాల వలన, రైతులు కార్మిక నియంతృత్వంలో తమ అదృష్టం పరీక్షించుకోదలచటం లేదు.

సోవియట్ దేశాలన్నింటిలో, పారిశ్రామిక కార్మికుల పెత్తనం వుండి, ధరలను బిగదీసి కత్తిరించి, బలాత్కారపు ధాన్యపు లెవీలు విధించి, రైతు ఉత్పత్తులను అతిచౌక ధరలకు అమ్మేటట్లు చేస్తున్నారు. అధికార ఉన్మత్తులయిన రష్యన్ కార్మిక వర్గం, నిరంతరాయంగా, ఆర్థిక దోపిడీ రాజకీయ అణచివేతలతో రైతులను వేధిస్తున్నది. Mr. మికోయాన్ తన 1956 భారత పర్యటనలో ఈ నిజం అంగీకరించాడు.

ఒక విషయం మనం అంగీకరించాలి. కార్మికుల రైతుల బాధలు భరించ లేనంతగా వుండి, విప్లవ ధోరణి అనుసరించటం కాదు కావలసింది. వారు విప్లవం తీసుకరావటానికి నిర్ణయించుకోవాలి. విప్లవించాలి. అది నిర్మాణాత్మకంగా, (వర్గ) స్పృహతో, ముందుచూపుతో జరగాలి. పాక్షిక లేక సంపూర్ణ విజయాలు పొందాలి. సరైన విప్లవ సామగ్రి, విప్లవ అనుకూల పరిస్థితులు లేనట్లయితే, అత్యంత దారుణమయిన సంక్షోభంలో కూడా కాపిటలిజంలో విప్లవ విజయం అసాధ్యం. ఉదా: బెంగాలు కరువు, బ్రిటీషు, స్వదేశీ ప్రభుత్వాల ప్రొక్యూరుమెంట్లు, రైతులకెంత నిస్పృహ కలిగించినా, (1944-52) అది పటిష్టమయిన విప్లవానికి త్రోవదీయిలేదు. U.S.S.R. లోనూ ఇలానే జరిగింది. వర్గస్పృహ అవసరం. వర్గ నిర్మాణం అత్యవసరం, ప్రజల విప్లవనాయకత్వం అత్యంత అవసరం. ఈ పునాది, ఈ విప్లవ సామాగ్రి ఎక్కడ, ఎప్పుడులోపించినా, సంక్షోభాలలో కూడా విప్లవం రాదు.

కాపిటలిజం, కమ్యూనిజంల దౌర్జన్యాలకు అడ్డుకట్టవేసి, వారి దోపిడీ చేతులు నరకి, ప్రపంచ విపణుల కోరలనుండి విముక్తి పొంది, కాపిటలిజం, కమ్యూనిజంల అధికార పీఠాలను కదలించి, తాము, తమ సోదర బాధితులు సంపూర్ణ రాజకీయ అధికారం చేపట్టినప్పుడే, నిజమయిన, సమర్ధవంతమయిన, అభివృద్ధికరమయిన పునరుజ్జీవనం రైతులకు మొదలవుతుంది. చేతివృత్తులవారు, రైతులు రాజకీయ అధికార భాగస్వామ్యం పొందంది, సాంఘిక న్యాయం అందించే నిజమయిన ప్రజాస్వామ్యం రాదు.

# కిసానులు - కళాకారులు

(Peasants - Artists)

ప్రతి మానవ సమాజం, భౌతికంగా, నైతికంగా పూర్తి స్థాయికి ఎదగటానికి, సంపూర్ణ వ్యక్తిత్వం సంతరించుకోవడానికి, కోర్కెలకు అనుగుణమయిన, సుఖ, సంతోషాల అనుభవానికి, ఏ మేరకు కోరుకొంటుందో - విజయయత్నాలు చేస్తుందో - అందులోనే తన సార్థకతను, సాఫల్యతను కనుగొంటుంది. చరిత్ర గతిలో రకరకాల రాజకీయ, ఆర్థిక, సామాజిక నిర్మాణాలు, అటువంటి ఎదిగిన సంఘం కోసం, సౌఖ్యవంతులయిన ప్రజలకు లభ్యమయినయ్. యుద్ధానంతరం ప్రపంచంలో ఈ లక్ష్యాలు సాధించటానికి రెండు ఆర్థిక వ్యవస్థలు - కాపిటలిజం, కమ్యూనిజంలు బహుళ ప్రచారంలో వున్నయ్. ప్రతిదేశం రాజకీయంగా ప్రజాస్వామ్యాన్ని, ఏకపక్ష నియంతృత్వాధికారాన్ని (Totalitarianism) దేనికదే ఎంపిక చేసుకుంటున్నది.

ప్రజల అభివృద్ధి - సంతోషాలకు భారతదేశం ప్రజాస్వామ్యాన్ని ఎన్నుకుంది. అందువలన మనదేశం ఆర్థికవనరుల కోసం కాపిటలిజానికి దగ్గర కానవసరం లేదు. కాపిటలిజం - ప్రజాస్వామ్యం విడదీయరానివి కావు. అలానే ప్రజాస్వామ్యం - సోషలిజం ఒక దానికొకటి వ్యతిరేకమయినవి కావు. ప్రజాస్వామ్యం సోషలిజం - ఈ రెంటి ధ్యేయం, సాంఘికన్యాయం, ప్రతిమానవుని సంపూర్ణమయిన అభివృద్ధి, సంతోషాలే. కనుక సామాన్య మానవుని సాంఘిక న్యాయం కొరకు, భారతదేశం ప్రజాస్వామ్యాన్ని - సామ్యవాదాన్ని ఆశ్రయించింది. సోవియట్ ప్రపంచం, సాంఘిక న్యాయాన్ని, ఉత్పత్తి వనరుల సోవియటీ కరణ (సమాజపరం చేయడం) ఏకపక్ష రాజకీయ నాయకత్వాల ద్వారా సాధించటానికి

దీక్షతో వుంది. వ్యక్తి స్వేచ్ఛ, వ్యాపార, వాణిజ్య స్వేచ్ఛలను కొన్ని గ్రూపులు - గ్రూపుల కలయికలు - ఏకపక్ష నియంతృత్వాన్ని తిరస్కరించి ప్రజాస్వామ్య యుతమైన అభివృద్ధిని, సామాజిక న్యాయాన్ని అందించటానికి కృషిచేస్తున్నవి. ఈ గ్రూపులకు యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా (U.S.A) నాయకత్వం వహిస్తున్నది.

మూడవ గ్రూపు బ్రిటీషు సామ్రాజ్య నాయకత్వంలో వుంది. ఈ దేశం - సాంఘిక న్యాయం కొరకు - రాజకీయంగా ప్రజాస్వామ్య విధానాలకు అంకితమై వుంది. సామాజిక న్యాయాన్ని, సంక్షేమ రాష్ట్రం ద్వారా, సామాజిక భద్రతలు, పూర్తి ఉద్యోగ కల్పనలతో అందించాలని కోరుకుంటున్నది. ఆర్థిక నిర్మాణంతో వ్యక్తిగత లేక గ్రూపుల ఉద్యమత్వాన్ని పూర్తిగా తొలగద్రోయటం లేదు. ఇవి సంక్షేమ రాష్ట్రపు మిశ్రమ ఆర్థిక విధానమని (Mixed Economy) దాని సామాజిక భద్రతలతో కలిపి పిలువబడుతున్నది.

అమెరికా - బ్రిటీషు రాజ్యాలు రెండూ ప్రజాస్వామ్య రాజకీయ నిర్మాణాన్నే కోరుకుంటున్నవి. అమెరికా స్వేచ్ఛా ఉద్యమత్వానికి (Free - Enterprise) ఎక్కువ ప్రాధాన్యతనిస్తే - బ్రిటను సామ్యవాద మార్గం అవలంబిస్తున్నది. అమెరికా సాంఘిక న్యాయాన్ని ప్రజాస్వామ్య స్వేచ్ఛా ఉద్యమత్వంతోనూ, బ్రిటను ప్రజాస్వామ్య సామ్యవాదం ద్వారాను దర్శిస్తున్నవి. పౌరునిపై అమెరికా రాజకీయ ప్రభావం - కాపిటలిస్టు గుత్తాధిపత్యావకాశం, ప్రజాస్వామ్య యుతమయిన ప్రభుత్వనియంత్రణలతో కూడినటువంటిది. బ్రిటనులో ప్రజాస్వామ్య ప్రభుత్వం ద్వారా, పార్లమెంటు ద్వారా నియంతృత్వ ప్రభుత్వ ఉద్యమాన్ని ప్రజలు నియంత్రిస్తారు.

పాశ్చాత్య ప్రజాస్వామ్య పాలనలో, సోవియట్ ప్రపంచంలో, సహకారోద్యమం గణనీయంగా అభివృద్ధి చెందుతున్నది. పాశ్చాత్యదేశాలలో సహకారోద్యమం - కాపిటలిస్టు లేక ఫ్రీ ఎంటర్ ప్రైజ్‌ను, ప్రభుత్వాల సవతి తల్లి ప్రేమను, ఎదుర్కొని నిలువ వలసి వస్తున్నది. బలమయిన సోవియట్ దేశాలు, సహకారోద్యమాన్ని తమ ఆర్థిక - సాంఘిక నిర్మాణానికి సహచరిగా, ఆవశ్యకమయినదిగా భావించి తమ సోవియట్ సహకార అనుభవాలతో - సోవియట్ విధానం వైపు తీసుక వెళ్తున్నవి. సోవియట్ రాష్ట్రం సహకార విధానాన్ని మిత్రుడుగా పూర్తి మద్దతుదారుగా స్వీకరించింది.

డెన్మార్క్, స్వీడను, నెదర్‌లాండ్సు, స్విట్జర్లాండు మరికొన్ని లాటిన్ అమెరికా లోని చిన్న దేశాలు, తమ రైతులను సాహసోపేతంగా ఉత్పత్తిదారుల సహకార వ్యవస్థలలో

ప్రవేశ పెట్టినయ్. శక్తివంతమయిన సహకారోద్యమాన్ని నిర్మించినయ్. గ్రామీణ ఆలోచనల పునాదులతో, డెన్మార్కు, స్వీడను దేశాలు, కాపిటలిజానికి - ప్రజాస్వామ్యానికి, సామ్యవాదానికి; ప్రజాస్వామ్యానికి - ఏకపక్ష నియంతృత్వానికీ మధ్యేమార్గం ఎన్నుకున్నయ్. ఐర్లండు కూడా ఈ పంధానే అనుసరించింది. ఈ ఉద్యమాల ప్రభావంతో, డెన్మార్కు, స్వీడను దేశాలలో రైతుల రాజకీయ పార్టీలావిర్భవించినయ్. స్వీడనులో ఈ పార్టీ, సోషలిస్టు పార్టీతో పొత్తు పెట్టుకొని రెండు దశాబ్దాలు ప్రభుత్వంలో వుండి ప్రజాస్వామ్య పరిధిలో, సామ్యవాదానికి, సహకారోద్యమానికి గల ప్రాముఖ్యతను నిర్వచించింది. అమెరికా, కెనడా, న్యూజిలాండు ఆస్ట్రేలియా వంటి కాపిటలిస్టు వ్యవస్థ ఉద్భృతంగా వున్న పెద్ద దేశాలలో, రైతులు విజయవంతంగా, సహకార సంఘాల ద్వారా స్వీయనాయకత్వంలో, వ్యవసాయ విధానాన్ని పునర్నిర్మించారు. ప్రపంచ విపణుల వంటి కీలక సేవల గుప్పెట్లోంచి బయట పడ్డారు. కానీ తమ కాపిటలిస్టు ప్రభుత్వాల మద్దతు పొందలేకపోయారు. డెన్మార్కు లాగా స్వతంత్ర సిద్ధాంతధోరణిని ఈ రైతుల సహకార సంఘాలు ప్రవచింపలేక పోయినయ్. వాటి ప్రయత్నాలను గ్రామీణ నేపథ్యంలో, గ్రామీణ ఆలోచనా విధానంలో సమర్థించుకోలేకపోయినయ్. కనుక ఎంత సాధన సంపత్తివున్నా, ఇతర దేశాల రైతులకు ఉత్తేజం కలిగించలేకపోయినయ్.

స్వతంత్ర భారతదేశం ప్రజాస్వామ్యం - సామ్యవాదంపై విశ్వాస ప్రకటన చేసి, ఈ రెంటిని అర్థవంతం చేయగల సహకార కామన్వెల్తు విధానాన్ని స్వీకరించింది. ఇది 19వ శతాబ్దపు ఉదారవైఖరికి, 20వ శతాబ్దపు మహాత్మాగాంధీ మానవతావాదానికి, భారతదేశ వివిధ సామాజిక, ఆర్థిక సహకార వ్యవస్థలకు, గ్రామకామన్వెల్తులకు, వృత్తిశ్రేణులకు, సాంప్రదాయాలకు ప్రతీకగా వుంది. ఒకటవ, రెండవ పంచవర్ష ప్రణాళికలు - శ్రామిక ప్రోత్సాహం, దోపిడీ రహిత వికేంద్రీకృత ఉద్యోగ కల్పన, సామాజిక భద్రతలను నొక్కి చెప్పినయ్. ఈ విధంగా భారత జాతీయ ప్రణాళికాకర్తలు, దేశంలో 75 శాతంగా వుండి, 60 శాతం జాతీయ సంపదను, సహకారోద్యమం ద్వారా సమకూరుస్తున్న రైతుల, చేతి వృత్తుల వారి సహకార పునర్నిర్మాణంపై విశ్వాసం ప్రకటించారు. తద్వారా జాతీయ నాయకత్వం ఆశించిన ఉత్తమ సామ్యవాద సమాజ దర్శనం చేశారు. ప్రైవేటు - ప్రభుత్వ రంగాల కొక పిలకలాగాకాక, శక్తివంతమైన, సమర్థవంతమైన సాంఘిక రంగంగా, స్వతంత్ర భారత ప్రభుత్వపు జాతీయనాయకత్వపు అండ దండలతో వృద్ధి చెందేటట్లు ప్రణాళికా రచన జరిగింది. తమ వ్యక్తిగత ఉద్యమత్వం, చొరవల ద్వారా జాతీయ ఆదాయం,

అభివృద్ధి, తలసరి ఆదాయం నుండి సామూహికాదాయం వరకు పెంపుదలకు తోడ్పడి, కో ఆపరేటివ్ రంగం తన కాళ్ళపై తాను నిలబడటానికి (ప్రణాళిక) దోహదకారి అయింది. జాతీయ సంపదకేకాక, పూర్తి ఉద్యోగకల్పనకు, సామాజిక భద్రతలకు పూర్తి అవకాశం కలిగిస్తే, తన పారిశ్రామిక సామర్థ్యాన్ని, సాంఘిక స్వాతంత్ర్యాన్ని ఎప్పుడు ప్రకటించుకో గలుగుతుందో, అప్పుడు దేశంలోని ఇతర వర్గాలన్నీ ఈ విధానంలోనికి ఆకర్షించబడ తాయి. రైతులకు, చేతి వృత్తులవారికి భారత నాయకత్వం సువిశాలమయిన అభివృద్ధి మార్గాలను, సామాజిక ఆర్థిక రంగాలలో సహకార ఉద్యమం ద్వారా అందిస్తున్నది.

యుద్ధానంతర రైతు సమాజం, సోవియట్ సహకార వ్యవస్థ రైతు సహకార వ్యవస్థ మరియు డేనిష్ (డెన్మార్కు) ప్రజాస్వామ్య రైతు సహకార వ్యవస్థ, సహకార వ్యవసాయం, సహకార నిర్మాణాల తేడా స్పష్టంగా తెలుసుకున్నారు. రష్యా, చైనాల సహకార వ్యవస్థలు కుతంత్రాలతో, బలాత్కారంతో నిర్వహించబడేవి. అక్కడ ప్రభుత్వ క్షేత్రాల రైతులకు - సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులకు మధ్య అన్ని రంగాలలో వివక్షత వుంది. డేనిష్ వ్యవస్థ మానవత్వం కలిగినది. రైతులను మనుష్యులుగా, సమాజ ఆర్థికాభి వృద్ధికారకులుగా గౌరవిస్తుంది. రైతులలో చిన్న, మధ్యతరగతి, పై తరగతి అనే భేదాలు లేవు. ప్రజాస్వామ్యయుత మయినది. దాని విజయం - రైతుల సహకార నిర్మాణాలపై ఆధారపడి వుంది. కో ఆపరేటివ్ వ్యవస్థల ద్వారా, ఇతర వర్గాల లబ్ధికొరకు అక్కడ రైతులు దోపిడీచేయబడటంలేదు. వారు కోఆపరేటివ్‌లలో వేతన జీవులు కాదు. ఆ వ్యవస్థల యాజమాన్యంలో, సంపూర్ణమయిన అధికారం కలవారు. ప్రభుత్వం రైతు ఉత్పత్తులకు అవసర సామాగ్రి నందిస్తుంది. సహకార నాయకత్వంలో రైతులకు పదిరెట్లు ఎక్కువ సేవలందుతున్నయ్.

సోవియట్ విధానంలో సహకారవ్యవస్థలు పట్టణాల, కార్మికుల ప్రభుత్వో ద్యోగుల, పట్టణ ప్రజల స్వార్థానికి ఉద్దేశించ బడినయ్. రైతుల శ్రేయస్సు, ప్రజాస్వామ్య హక్కులు, ప్రాథమిక వ్యవసాయ ఆర్థికత, ఆర్థిక స్తోమతపెంపుదల డేనిష్ వ్యవస్థ కలిగి వుంది. రైతుల స్వాతంత్ర్యాన్ని సోవియట్ విధానం గిరిగీచి వుంచుతుంది. డేనిష్ విధానం విస్తరింపచేస్తుంది. కనుక ప్రపంచ రైతాంగం ఈ రెండు వ్యవస్థలలో ఏ వ్యవస్థ కావాలో తేల్చుకోవాలి.

20 కోట్లకు పైగా రైతులున్న (1955) భారతదేశం స్వతంత్ర నిర్ణయశక్తి కలిగి

వున్నందుకు నేను సంతోషిస్తున్నాను. భారతరైతులు డేనిష్ సహకార వ్యవసాయ పద్ధతిపై మొగ్గుచూపారు. ఇప్పుడున్న రెండు వందల పై చిలుకు కో ఆపరేటివ్ క్షేత్రాలు విజయ వంతంగా లేవని వారికి తెలుసు. అయినా భారత రైతులు తమ స్వంత పొలాల్లో, ఇతరులతో కలసి ప్రభుత్వ క్షేత్రాలలో సహకార వ్యవసాయం కొరకు స్వచ్ఛందంగా ముందుకు వస్తున్నారు. కానీ వారెవరి నియంతృత్వంలోనూ, తమ చొరవనూ, వ్యక్తిగత ఉద్యమత్వాన్ని, స్వంతభూముల్లో వ్యవసాయాన్ని, ఉద్యోగకల్పనను, స్వతంత్రతను వదులుకోవడానికి సిద్ధంగా లేరు. తమ స్వతంత్రతతో జాతీయ సంపదను గణనీయంగా వృద్ధిచేయటానికి పట్టుదలతో వున్నారు. సహకారంపై విశ్వాసం, వర్గ స్పృహ కల రైతులు చేతి వృత్తుల వారు, జాతీయ నాయకత్వ ధ్యేయాలకు, కో - ఆపరేటివ్ కామన్ వెల్తు సాధనకు తమ అంగీకారం తెలియజేస్తున్నారు.

బడుగుదేశాలలోని సహకార ఉద్యమం సృజనాత్మకమయింది. అభివృద్ధికలది. కమ్యూనిస్టు ఉద్యమం హింసతో కూడినది. వినాశనకరమయినది. భూస్వామ్య, జమీందారీ విధానాల రద్దు తరువాత, ఆర్థిక స్వతంత్రత, స్వేచ్ఛకలిగిన రైతులకు కావలసినది సమ న్వయం, స్వచ్ఛంద నిర్మాణం, పరస్పర సహకారం-ఇవి సహకార ఉద్యమం అందించాలి. రైతులు చేతివృత్తులవారు, వారి వారి సహకార నిర్మాణం చేసుకున్న తరువాత వ్యవస్థీకృత పారిశ్రామిక లాభాలు అందుకోగలరు. కోఆపరేటివ్‌ల ద్వారా, వ్యవసాయ అవసరాల కొనుగోళ్ళు, ఉత్పత్తుల అమ్మకాలు, పంపిణీ, వ్యవసాయి పెట్టుబడులు - మొదలయిన సేవలు అందించటంతో - చిన్న రైతులు, వారి కుటుంబ సభ్యులు, జాతీయ సంపదను గణనీయంగా పెంచగలరు. స్వయం పాలకత్వంలో, స్వచ్ఛందంగా, రైతుల, చేతివృత్తుల వారి గ్రామీణ సహకార వ్యవస్థ నిర్మాణం, గ్రామీణుల నిర్మాణాత్మక అభివృద్ధికి, ఆధునిక జీవితంలో శాంతికి కారణమవుతుంది.

సాంప్రదాయక వికేంద్రీకృత ప్రజాస్వామ్య పక్షపాతులయిన రైతులకు, ప్రపంచ సహకార ఉద్యమానికి ఇది చక్కటి అవకాశం. అతి పెద్ద దేశం (భారత్) ప్రపంచ సహకారో ద్యమంలో ముందున్నది. ఏ ప్రభుత్వం, ఇటువంటి అవకాశం గతంలో ప్రపంచానికి కల్పించలేదు. ఈ ఉన్నత ఆశయంపై విశ్వాసం ప్రకటించలేదు.

ఇది ప్రపంచ సహకారోద్యమ విశ్వాసుల పరీక్షాయుగం. వారందరూ రైతుల, చేతివృత్తుల, కళాకారుల, వినియోగదారుల పరిధిలో ఈ పరిశోధనను, ఈ సాంఘిక సాహసాన్ని ప్రతిధ్వనించే విజయంగా కృషి చేయాలి.

రష్యా తన పరిశోధనపై విశ్వాసంతో అభివృద్ధికి, మానవ సుఖ సంతోషాలకు, సహకారం అందిస్తున్న విధంగా, పాశ్చాత్య ప్రజాస్వామ్యం తన T.C.A. పాయంట్ ఫోర్, మార్షల్, కొలంబో ప్లానుల ద్వారా ప్రపంచంలో ప్రజాస్వామ్య నిర్మాణానికి చేయూత నిస్తున్నది. అదే విధంగా ప్రపంచ సహకార వాదులందరూ బాధ్యతలు స్వీకరించి ఈ ఉన్నతమయిన ఆశయానికి భారత్ మరియు ఇతర దేశాలను తమ పరిశోధనా కేంద్రా లుగా చేసుకొని, తమ శక్తి మేరకు ఆర్థిక వైజ్ఞానిక సహకారం అందించాలి.

అదే విధంగా భారత సహకార వాదులు, ప్రపంచం తమకు అప్పగించిన ఈ బాధ్యతా ప్రాధాన్యతను గుర్తించాలి. ప్రజాస్వామ్య సామ్యవాదనాయకత్వాన్ని బలోపేతం చేయాలి. మన ప్రయత్నాలను ప్రపంచం గమనిస్తున్నదని మరచిపోకూడదు. మన త్యాగం, సేవలతో సహస్రాబ్దాల చరిత్రకలిగిన, వ్యవసాయ ఆర్థికతకు, రైతులకు, వృత్తి శ్రేణులకు, ఆర్థిక ప్రజాస్వామ్యానికి, స్వపరిపాలనకు పునరావాసం కల్పించాలి. ఈ తమ చేతల ద్వారా, కృషి ద్వారా, విజయాల ద్వారా ఈ ఉద్యమ నిర్మాతల ఋణం తీర్చుకోవాలి.

# వ్యవసాయ రక్షణత్వం

(Agriculture Protection)

ఒక దేశపు ఆర్థికాభివృద్ధికి, సౌభాగ్యానికి ఆదేశం చేసే విదేశీ వాణిజ్యం కొలబద్దకాదు.

వ్యవసాయదేశాలు తమ విలువయిన ముడిసరుకులను తక్కువ ధరలకు ఇచ్చి, విదేశాల నుండి మాన్యుఫాక్చర్డ్ గూడ్సును వాణిజ్య సేవలను ఎక్కువ ధరలకు వస్తుమార్పిడి (Barter system) చేసుకొంటున్నయ్. ఈ దేశాలు తాము చెల్లించవలసిన విదేశీ అప్పుల అధిక వడ్డీలకు, ఖరీదైన దిగుమతులకు బదులుగా తమ అమూల్య ఖనిజాలను, వ్యవసాయ ఉత్పత్తులను విచ్చల విడిగా ఎగుమతి చేయటం దురదృష్టవశాత్తు తప్పటం లేదు. ఈ విధానం ఆ దేశపు బలహీనతను బహిరంగ పరుస్తుంది. బ్రిటీషు సామ్రాజ్యవాది సర్ థియోడర్ మోరిసన్ చాలా మంది భారతీయ శాస్త్రవేత్తలను 'భారత దేశపు గణనీయమయిన విదేశీ వ్యాపారపు గణాంకాలతో" తప్పు మార్గం పట్టించాడు. భారతదేశపు విదేశీ వ్యాపారాభివృద్ధి వలన దేశం అభివృద్ధి దిశలో పయనిస్తున్నదని నమ్మించాడు. ఆర్. సి. దత్తు 1901 లో ఈ వాదనలోని అవివేకతను బయల్పరచాడు.

'ఇంగ్లీషువారు తమ దేశంలో సరైనదని నమ్మిన విధానాన్ని ఇండియాకు కూడా వర్తింపచేసి పొరపాటు చేశారు. విదేశీ వ్యాపారం, విదేశీ వర్తకులతో, విదేశీ ధనంతో నిర్వహింపబడుతున్నది. ఈ వాణిజ్య లాభాలు యూరపు దేశాలకు మిగులుతవికాని ఇండియాకు కాదు''. భారతదేశంపై విదేశీ వాణిజ్యం రుద్దబడింది. స్వాభావికమయినది కాదు. ప్రత్తిపై విధించిన ఎక్సైజు సుంకం, భూమి శిస్తువిధానం, హోమ్ ఛార్జీలు,

భారతీయుల కత్యంత ఆవశ్యకమయిన ఆహార ధాన్యాలను ఎగుమతి చేసేటట్లు వత్తిడి చేసినయ్. భారతీయ పరిశ్రమలపై విధించిన ఆంక్షలవలన ప్రత్తిని ఎక్కువగా వారు దిగుమతి చేసుకో గలిగారు. భరించలేని భూమిశిస్తులు ఆహార ధాన్యాలను కూడా ఎగుమతి చేయటానికి వీలు కల్పించినయ్". పారిశ్రామికదేశాల సామ్రాజ్యవాదులు, వారి శాస్త్ర వేత్తలు, ప్రపంచ విపణుల స్వేచ్ఛా వ్యాపారపు విశిష్టతను, తమ తమ దేశాల లబ్ధి కోసం చెప్పటం అస్వాభావికం కాదు. వారు కూడా ఈ విధానాన్ని అంగీకరించటానికి కొన్ని జాగ్రత్తలు వహించాల్సిందిగా వత్తిళ్ళు చేస్తున్నారు. శైశవ దశలో వున్న పరిశ్రమలకు రక్షణలు కల్పించాలని కోరుతూ వ్యవసాయ ఉత్పత్తులను ప్రపంచ విపణుల పరిధిలోనికి సంపూర్ణంగా తీసుకొని రావటానికి ప్రయత్నిస్తున్నారు. వలస దేశాల శాస్త్ర వేత్తల వాదనలూ విపరీత ధోరణి కన్పరుస్తున్నాయి. వారి జాతీయ పరిశ్రమలకు పూర్తి రక్షణ కల్పించాలని డిమాండు చేస్తూ, ఆ వాదనలోని న్యాయాన్ని విపులీకరిస్తూనే, వారి సామ్రాజ్యవాద ప్రభువుల ధోరణిలోనే వారూ, ప్రపంచ విపణుల నుండి రైతాంగానికి రక్షణ కల్పించవలసిన ఆవశ్యకతను దురదృష్టవశాత్తూ మరచి పోయారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయ్యేవరకు వలస దేశాల్లో ఈ పరిశ్రమలకు రక్షణ వుండేది. ఆహార పంటలు ప్రపంచ విపణుల దాక్షిణ్యంపై ఆధారపడి వుండేవి. కనుక సామ్రాజ్యవాద శాస్త్రవేత్తలు సిద్ధాంత పరంగా స్వేచ్ఛా వాణిజ్యం ప్రపంచ విపణుల లాభాలు ప్రచారం చేయటం వలన వీరి ఆలోచనా క్రమం తప్పుదోవ పట్టింది. దీనివలన వలస దేశాల కుటీర పరిశ్రమలు, వ్యవ సాయాధారితాలయిన వివిధ వ్యాపకాలు ధ్వంసం కావించబడినయ్. వారి దేశాల్లోని పరిశ్రమలు మాత్రం ఏదో ఒక నెపంతో రక్షణలు పొందినయ్.

ప్రపంచ విపణుల వలన లాభనష్టాలు రెండూ వున్నాయి. వ్యవసాయ దేశాలన్నీ ప్రపంచ విపణులను బహిష్కరించాలనటం, జాతీయ స్వయంసమృద్ధిపై మాత్రమే దృష్టి కేంద్రీకరించమనటం మన ఉద్దేశ్యం కాదు. బహిష్కరించటం - కౌగిలించుకోవటం రెండూ విపరీతధోరణులే. ఈ విపరీతధోరణుల దుష్ప్రభావం ఆసియా, యూరపు దేశాల్లో గుర్తించ గలిగాము. ఆసియావారు స్వేచ్ఛా వాణిజ్యాన్ని ప్రపంచ విపణులను తమ ఉత్పత్తుల ఎగుమతుల కొరకు, విదేశీ సరుకుల దిగమతుల కొరకై కౌగిలించుకొన్నారు. ఆఫ్రికన్లు తద్విరుద్ధంగా తమలో తాము ముడుచుకొనిపోయి తమ అతి సామాన్యమైన 'స్వయం సమృద్ధి' ఆర్థిక విధానానికి అంటి పెట్టుకొన్నారు. వీరిరువురి తప్పిదాల వలన పారి శ్రామికులు సామ్రాజ్యవాద శక్తులూ లాభించారు.

రైతుల ముడి సరుకులను ప్రపంచ విపణుల నిరంకుశ శక్తినుండి రక్షణ కల్పించాలని అన్ని వైపుల నుండి విన్పిస్తున్నది. 1930-35 లలో వచ్చిన ఆర్థిక మాంద్యం దీనికి ముఖ్య కారణం.

'నిరాటంకమయిన ప్రపంచ విపణుల ప్రభావాన్నుండి రైతులకు రక్షణ కల్పించటం, కార్మికులకు పరిశ్రమల దోపిడీ నుండి రక్షణ కల్పించటం వంటిదే!

ఈ విధమైన రక్షణలు లేనప్పుడు మనం గాంధీ మహాత్ముడు సూచించిన మార్గం - గ్రామీణ స్వయం పరిపూర్ణత నుండి జాతీయ స్వయం పరిపూర్ణత వరకూ ప్రయాణించే మార్గాన్ని ఎన్నుకోవాలి. మార్షెలియన్ శాస్త్రవేత్తలు, సాంప్రదాయక మార్కిస్టు వాదులు గమనించలేకపోయిన ప్రపంచ విపణుల దుష్ఫలితాలను మహాత్మాగాంధీ, ఆయన అనుచరులు గుర్తించి, ధైర్యంగా ప్రపంచ విపణులను గురించి హెచ్చరించటం జరిగింది.

'కూర రుచి తింటేగాని తెలియదు'. ప్రపంచ విపణులు నిజంగా రైతులకు లాభదాయకమయినవైతే ఆర్థిక మాంద్యం రైతులపై - పారిశ్రామిక వేత్తలందరిపై ఒకే విధంగా వుండాలి. ఈ ఆర్థిక మాంద్యం పారిశ్రామిక దేశాల కారణంగా వచ్చినదే. కాని ఆర్థిక మాంద్యం వ్యవసాయదారులపైనే ఎక్కువ ప్రభావాన్ని చూపింది. అని మిష్టర్ వ్లాడినిస్క్ వోయిటినిస్కీ చేసిన విస్తృత మయిన అధ్యయనం తెలియచెపుతున్నది. వారి నిరూపణలు ప్రపంచ వ్యాప్తంగా రైతుల అనుభవానికి అద్దంపట్టి 'ఇండియన్ పెజంటు ఇన్‌స్టిట్యూషన్' చేసిన అధ్యయనానికి అనుగుణంగా వున్నయ్.

ఆర్థిక మాంద్యం రైతులపైనే ఎక్కువ ప్రభావాన్ని చూపటానికి కీలక సేవలు, కరెన్సీ విలువల మార్పిడులు, ప్రపంచ విపణుల మోసం ముఖ్య కారణాలు.

'ధరల వైవిధ్యం పారిశ్రామికదేశానికి అంతర్జాతీయ మారకాల ద్వారా లాభ సాటిగా వుంటుంది. వ్యవసాయదేశాలు మరింత నష్టాల్లో కూరుకొని పోతాయి' (మిష్టర్ వోయిటినిస్కీ).

'మాన్యు ఫాక్చర్డ్ గూడ్సు కన్నా ఆహార ధరలు మరీ చౌకగా వుండటమే బ్రిటన్ నేడింత సంతోషంగా వుండటానికి కారణం''.

చౌకగా ఆహారం లభ్యం కానట్లయితే బ్రిటన్ పరిస్థితి (యుద్ధ సమయంలో) ఏవిధంగా వుండేదా అని మనం ఆశ్చర్యపడవలసి వస్తుంది.

జర్మనీ, ఫ్రాన్సులు కూడా వారి వాణిజ్యాలను సమానంగా వుంచుకోగలిగినయ్. పారిశ్రామిక దేశాలకు కలిగిన నష్టం వ్యవసాయ దేశాలు భరించటం వలన ఇది సాధ్యపడింది.

గత ఆర్థిక మాంద్యం వలన U.S.A. కూడా వ్యవసాయకంగా తీవ్రంగా నష్టపడింది. ఆదేశపు వ్యవసాయ ఉత్పత్తులు ఎక్కువగా ఎగుమతులకు ఉపయోగపడేవి. కనుక ఆర్థిక మాంద్యం నుండి తప్పించుకోలేకపోయింది. వారి జాతీయ ఆదాయంలో వ్యవసాయ ఆదాయం 1913లో 14 శాతం వుంటే 1926లో అది 10.4 శాతంకు పడిపోయింది. యుద్ధానికి పూర్వం, ఆ తర్వాత అమెరికాలో వచ్చిన ఆర్థికాభివృద్ధి వెల్లువలు (Booms) కూడా వారి రైతులను నష్టాల నుండి బయటపడవేయలేక పోయనయ్. ఈ బూమ్ పిరియడ్‌లో కూడా పరిశ్రమలకు కల్పించినంత రక్షణ, వ్యవసాయానికి కల్పించకపోవటమే దీనికి కారణం.

పారిశ్రామిక రంగంలో ఈ మాంద్యం ఉత్పత్తుల పెరుగుదలను అరికట్టింది. వ్యవసాయ ఉత్పత్తుల ధరల తరగుదలతో పోలిస్తే పారిశ్రామిక ఉత్పత్తుల ధరలలో తగ్గుదల నామమాత్రం.

U.S.A. ప్రపంచ ఉత్పత్తులు చేసినంత భారీగా అంతర్జాతీయ మార్పిడులు (Exchanges) చేసివుంటే వారి ఆర్థిక విధానానికి చావు దెబ్బ తగిలేది" అని వొయిటిన్స్కీ వ్యాఖ్యానించాడు. ఈ వ్యాఖ్యప్రపంచ విపణులను అవహేళన చేయటమే.

పారిశ్రామిక దేశాలయిన జర్మనీ, ఫ్రాన్సు, చెకోస్లొవేకియా దేశాల వ్యవసాయ పరిమాణం కూడా చాలా ఎక్కువ. ఈ దేశాలు వ్యవసాయానికి రక్షణ కల్పించినయ్. వ్యవసాయదారులకు ఎంతో కొంత రక్షణ (పరిశ్రమలకు, విపణులకు కల్పించినంత కాకపోయినా) కల్పించబడిన దేశాలు ఇతర దేశాలంత ఆర్థిక మాంద్యానికి లోనుకాలేదు. ఈ దేశాల్లో గోధుమలు, ఇతర ఆహార పదార్థాల ధరలు ప్రపంచ మార్కెట్లతో సంబంధం లేకుండా స్వతంత్రంగా హెచ్చు తగ్గులు చూపించాయి.

స్వంత పొలాలను, కాయకష్టాన్ని నమ్ముకొని, యాంత్రిక సహాయం లేక అమెరికా యాంత్రిక వ్యవసాయంతో పోటీపడలేక పోవటం వంటి లక్షణాలు కలిగిన భారత రైతులకు ఫ్రాన్సు రైతులకు దగ్గర పోలికలున్నయ్. వీరందరూ ప్రభుత్వ రక్షణ

లేక పోవటం వలన తీవ్రంగా నష్టపడ్డారు. కానీ ఆర్థిక మాంద్యపు ఇసుక తుఫాను పాశ్చాత్య వ్యవసాయ రంగాన్ని కప్పివేస్తే ఫ్రాన్స్ రైతులు తమ పొలాల కంచెల వెనుక సురక్షితంగా కూర్చోగలిగారు. ప్రపంచ ధరలతో నిమిత్తం లేకుండా తమ గోధుమలు అమ్ముకోగలిగారు. (ప్రభుత్వం కల్పించిన స్వల్ప రక్షణ కారణం).

వ్యవసాయ రక్షణ ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై ప్రభావం చూపటమేకాక, పారిశ్రామిక - వ్యవసాయక ఉత్పత్తుల అసమతౌల్యం వలన కలిగే దుష్పరిణామాలను సత్వరమే అరికట్టి దేశీయ వ్యవసాయానికి రక్షణ కల్పించింది. ఈ ప్రపంచ ఆర్థిక వ్యవస్థ బలహీనులను వేటాడే క్రూర జంతువు వంటిదని మనం తెలుసుకొన్నప్పుడు. ఈ జంతువుకు పక్షవాతం వస్తే మనం విచారించాల్సిన పనిలేదు వ్యవసాయ రక్షణ పొందిన దేశాలు 5శాతం. ఈ దేశాల వ్యవసాయ ధరలు ప్రపంచ విపణుల సముద్రం మధ్య ద్వీపాల్లాగా తమ ఉత్పత్తులకు కృత్రిమంగా ధరల స్థిరీకరణను సాధించినయ్. ప్రపంచ మార్కెట్లలోని వ్యవసాయ ధరలు గతంలో ఎన్నడు లేనంతగా పడిపోయినయ్.

రక్షణ లేని రైతులు నష్టపోయారనేది స్పష్టం. వారి మిగులు ఆహార నిల్వలకు వ్యవసాయ రక్షణ కలిగిన దేశాల్లోనికి ప్రవేశం లేదు. ఇతర మార్కెట్లలో పోటీపడి అమ్ముకోవలసి వచ్చింది. నష్టపోయారు. ఈకారణంగా మనం రక్షణ గల వ్యవసాయదేశాల రైతులను నిరసించగలమా? వారు కూడా ఆర్థిక మాంద్యంలో కూరుక పోవాలని కోరుకోగలమా? రక్షణ కల్పించవలసిన బాధ్యత ఆయా ప్రభుత్వాలది. ఉత్పత్తులను తగ్గించటం ద్వారా, సమిష్టి నిల్వలను పెంచటం ద్వారా, టారిఫ్‌ల ద్వారా ఆప్రభుత్వాలు సహాయం చేయాలి. U.S.A. ఈ చర్యలు చేపట్టి తమ రైతాంగానికి కొంత ప్రయోజన కారయింది. నిత్యం యుద్ధ భయంతో కొట్టుమిట్టాడుతున్న ఈ పరిస్థితులలో స్వయం సమృద్ధి ప్రాతిపదికగా వ్యవసాయ ఆర్థిక విధానాన్ని రూపొందించుకోవాలి.

గత ఆర్థిక మాంద్యం నుండి రైతులు కొన్ని గుణపాఠాలు నేర్చుకొన్నారు. తమ అవసరాలకు సరిపడినంత మాత్రమే ఉత్పత్తి చేయటం మార్కెట్లకు దూరంగా వుండటం. ఈ మనుగడ వ్యవసాయం (Subsistance Farming) చేయగలిగిన వారు తక్కిన వారికన్నా బాగుపడ్డారు. డచ్ రైతాంగం కంటే ఇండోనేషియా రైతుల స్థితి గతులు బాగున్నయ్. డచ్ రైతులు ఎగుమతుల కొరకు వాణిజ్య పంటలు పండించి ప్రపంచ విపణులలో ప్రవేశించి నష్టపోయారు. ప్రపంచ విపణులను నిరసించటానికి ఈ కారణం చాలదా?

యుద్ధం ప్రపంచ వాణిజ్యాన్ని, వ్యాపారాన్ని ముక్కలుగా చేస్తే తర్వాత వచ్చిన శాంతి కాలం (1918-1939) ఆ ముక్కలను కూడా మిగల్చకుండా పొడిపొడి చేసివదిలింది. సువిశాలమయిన, అంతర్జాతీయ వ్యాపారపు రహదారులు, బురదతోను, రాళ్ళతోను నిండిపోయినయ్ (Stephen Leacock) అంతర్జాతీయ వ్యాపారానికి పట్టిన గతికి రైతులు కన్నీరు పెట్టనవసరం లేదు. అంతర్జాతీయ వ్యాపారానికి లీకాక్ చక్కటి శ్రద్ధాంజలి ఘటించాడు.

రైతులను మార్కెట్లకు వత్తిడి చేసో, మోసం చేసో ప్రభుత్వాలు వచ్చేటట్లు చేస్తాయని యుద్ధ సమయాల్లో ఋజువయింది. ప్రభుత్వాలు రైతులను బ్రతిమాలి, వత్తిడి చేసి అధిక ఉత్పత్తులను వారి నుంచి సాధించి వారి నిల్వలను విపణులకు లాగి, పట్టణ వాసులను, వృత్తి జీవులను, వర్తక వాణిజ్య వర్గాల వారిని మేపినయ్. ఇంగ్లాండు, ఇండియా మరికొన్ని దేశాల రైతులు, మార్కెట్లకు పరుగెత్తకుండా ముఖ్యంగా ఆహార పంటలను వీలైనంతగా నిల్వచేసుకొన్నారు. దీనివలన తాత్కాలికమయిన ఆహార కొరత ఏర్పడి ధరలు పెరిగినయ్. ప్రభుత్వాలు వెంటనే ధరల పెరుగుదల నరికట్టటానికి కట్టుదిట్టంగా కఠిన చర్యలకు పాల్పడినయ్. పారిశ్రామిక ధరలను మాత్రం అదుపు చేయలేక పోయినయ్. రైతులు మార్కెట్లలో జరిగిన మార్పులు తమకు నష్టం కలిగించటానికి చేయబడిన ప్రయత్నాలని గమనించారు. వారు నిశ్శబ్దంగా ఇతరుల ప్రోత్సాహం లేకుండానే తమ ఉత్పత్తులను మార్కెట్లలోనికి విడుదల చేయటం తగ్గించారు. వీలయినంత వరకు నిలువచేయటం లేకపోతే ఇతర ప్రయోజనాలకు వుపయోగించటం చేశారు. బ్లాక్ మార్కెటుదార్లు పుట్టుకొచ్చారు. మార్కెటు ధరలకన్నా ఎక్కువ ధరలు చెల్లించి ఈ నిలువలను మార్కెట్లలోకి లాగారు. ఇందులో కూడా వ్యాపారులే ఎక్కువ లాభించారు. ఇంగ్లీషు ప్రభుత్వం ఆహార వస్తువుల పంపిణీని తన చేతుల్లోకి తీసుకొంది. కొంత కాలం పాటు ఇతర సరుకులకు రైతులతో వొప్పందమయి హెచ్చు ధరలు చెల్లించారు. ఇండియాలో గోధుమలపై కంట్రోళ్ళు ఎత్తివేశారు. మరలా 1944 నుండి 1951 వరకు కంట్రోళ్ళు విధించారు. బలత్కారంగా ఆహార ధాన్యాల ప్రొక్యూరుమెంటు (సేకరణ) గిట్టుబాటుగాని ధరలకు చేశారు. ఈ అనర్థదాయకమయిన కంట్రోళ్ళు బలాత్కారం సోవియట్ దేశాలలో ఇప్పటికీ కొనసాగుతున్నయ్. నేటి వరకు చరిత్ర గతిలో రైతాంగం పెట్టుబడిదారీ వర్గాల ప్రభుత్వాల వత్తిళ్ళ వలన ప్రపంచ విపణుల్లో ప్రవేశిస్తున్నారని, మనఃపూర్వకంగా కాదని వారి కందుతున్న ధరలు కంటితుడుపు ధరలేనని

- గిట్టుబాటు ధరలు కావని మనం ఇప్పటి వరకూ చెప్పుకోవటం జరిగింది. ఏమాత్రం అవకాశం దొరకినా రైతులు గిట్టుబాటు ధరల కొరకు పోరాడటానికి తద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థ దాని ప్రతినిధుల నుండి స్వాతంత్ర్యం పొందటానికి సిద్ధంగా వున్నారు.

అన్నార్తులు, బక్కచిక్కిన రైతులు పెట్టుబడిదారీ వర్గాలను ఈ మాత్రమైన ఎదిరించే శక్తి యుక్తులు ఎలా సంపాదించారు? తమకు రావలసినంత కాకపోయినా, కొంతయినా ఎలా రాబట్టగలిగారు? వత్తిళ్ళ వ్యవసాయం, కీలక సేవలు, వడ్డీల ప్రభావం ఏమయింది? రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఇంగ్లాండు రైతులు గోధుమలకు, ఇండియా రైతులు ధాన్యానికి సరైన ధరలు పొందారు. వారి ఉత్పత్తులకు ధరలు పెరిగినయ్. ఆ కారణంగా కొంత ఋణ విముక్తులయ్యారు. వ్యాపారులు వ్యవసాయాన్ని కూడా 'ఒక కీలక సేవగా మార్చారని గ్రహించిన రైతాంగం సత్వరమే స్పందించి తమ వాటాను డిమాండు చేశారు. కీలక సేవల పిడికిలి బలహీనపడింది. వత్తిడి వ్యవసాయ సూత్రం తారుమారయింది. ఈ కారణాల వలన వారి బేరమాడే శక్తి పెరిగింది.

అయినా వత్తిడి వ్యవసాయం నుండి కీలక సేవల కబంధ హస్తాల నుండి కేవలం ఒక యుద్ధం వలననో లేక ప్రపంచ వ్యాప్త యుద్ధాలవలననో వారు తమ దుస్థితి నుండి బయటపడలేరు. కాపిటలిజం ఒకవైపు లొంగినట్లు కన్పిస్తూనే వేరొక దిశలో విజయాలు సాధిస్తున్నది. స్థానిక ప్రభుత్వాల అండదండలతో కాపిటలిజం సంపదను విభిన్న వర్గాల వారికి అదృశ్య బదిలీ చేస్తున్నది. వ్యవసాయ ధరల నదుపుచేసి పారిశ్రామిక ఉత్పత్తుల ధరలను పెంచుతున్నది. ద్రవ్యోల్బణం పెరుగుతున్నది. పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు మాత్రం ద్రవ్యోల్బణం పెరుగుదలకంటే ఎక్కువ పెరుగుతున్నయ్. వ్యవసాయ ఉత్పత్తులు మాత్రం తగ్గిన కరెన్సీ విలువతో పోటీపడలేకపోతున్నయ్. ప్రభుత్వ పెత్తందారీ తనం వలన, అధిక జోక్యం వలన పలు రకాల అన్యాయ మార్గాల ద్వారా - మొదట కంట్రోళ్ళు, పారిశ్రామిక ఉత్పత్తులపై కంట్రోళ్ళు లేకపోవటం, తర్వాత ద్రవ్యోల్బణం ఇవన్నీ రైతుల - పరిశ్రమల యజమానుల మధ్య ఆర్థిక అగాధాలకు కారణాలయినయ్.

రెండవ ప్రపంచ యుద్ధం, తద్వారా వచ్చిన ప్రపంచ విపణుల ఆధిపత్య విచ్ఛిన్నత, వ్యవసాయమే అతి ప్రధానమయిన కీలక సేవ అని వెలికి వచ్చిన నిజం, ఎన్నో అసహాయతలకు, అన్యాయాలకు గురి అయినా రైతాంగం తమనుఅణచివేసిన శక్తులను ఎదుర్కొని ఆధునిక ఆర్థిక సౌధంలో కాలూనగలిగింది.



# వివరణలు

**PEASENT** = రంగా గారి అభిప్రాయము - చిన్నరైతు

ఫ్యూడలిజం :- చరిత్రకారులు ఈ వ్యవస్థకు ప్రాణం పోసిన మధ్యయుగాన్ని ''అంధకారయుగం'' గా వర్ణిస్తున్నారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, సృజనాత్మకమైన ఆలోచనానాశనమైనకాలం యిది. అనేకవందల, వేల ఎకరాల భూములను సొంతం చేసుకున్న భూస్వాములు - కౌలుదారులయిన రైతులను అర్థబానిసలుగా తయారుచేశారు. భూమిదున్నే రైతు - భూస్వామికి కౌలు చెల్లించడమేకాకుండా, భూస్వామికి వెట్టిచాకిరీ చెయ్యాలి. భూస్వామి పక్క జాగీరు మీదకు యుద్ధానికి పోతే - రైతు అతని సైన్యంలో నిర్బంధంగా చేరి యుద్ధంలో పాల్గొనాలి.

అయితే యూరప్ భూస్వామ్యవ్యవస్థకూ మనదేశ పరిస్థితికీ తేడాలున్నాయి. ఇక్కడ భూస్వాముల అధికారాలు కేంద్రప్రభుత్వం బలం మీదా, బలహీనతల మీదా ఆధారపడ్డాయి. మొగలుల కాలం నుంచీ ఇక్కడి భూస్వాములు - ఒకరకంగా పన్నులు వసూలు చేసే అధికారులు మాత్రమే. వాళ్లకు చట్టాలు చేసే హక్కుకానీ, వెట్టి చేయించుకునే హక్కు కానీ లేదు. తరువాతకాలంలో కేంద్రం బలహీనమయ్యాక - ఈ హక్కులన్నీ సాధించుకున్నారు. మన తెలంగాణాలో భూస్వామ్య వ్యవస్థ వికృత విశ్వరూపం మీకు తెలిసిందే!

కేపిటలిజం :- ఈ వ్యవస్థలో శ్రామికుడు కోల్పోయిన ఉత్పత్తి సాధనాలు పెట్టుబడిదార్ల పరం అవుతాయి. అయితే ఈ శ్రామికుడు బానిసకాదు. భూస్వామ్య సమాజపు రైతు కంటే స్వతంత్రుడు. ఎవ్వరికీ వెట్టి చెయ్యడు. ఏ జాగార్దారు కోసమూ యుద్ధాలు చెయ్యడు. అయితే తన దగ్గర ఉత్పత్తి సాధనాలు లేవు కాబట్టి తన శ్రమ శక్తిని నిర్బంధంగా అమ్ముకుంటాడు. ఈ ఆర్థికేతర నిర్బంధాలేవీ ఉండవు.

సోషలిజం :- ఈ దశలో ఉత్పత్తి సాధనాలు పాలకవర్గంగా సంఘటితమైన కార్మికుల చేతిలో ఉంటాయని ''కమ్యూనిస్టు మేనిఫెస్టో'' చెబుతుంది. ఉత్పత్తి లాభాల కోసం కాకుండా, ప్రజల యొక్క వర్తమాన, భవిష్యత్ అవసరాలననుసరించి ఒక ప్రణాళిక ప్రకారం జరుగుతుంది.

కమ్యూనిజం :- ఇది సోషలిజం తరువాత దశ. ఈ దశలో సమాజ నిర్మాణంలో ''వ్యక్తి'' కంటె ''సమిష్టి'' కే ప్రాధాన్యం లభిస్తుంది. రాజ్యాంగమూ, నిర్బంధాలు ఉండవు. అందరూ తమ శక్తి వంచన లేకుండా సామూహిక ప్రయోజనం కోసం శ్రమిస్తారు. తమ అవసరాల ననుసరించి, సమాజం నుంచి ప్రతిఫలం పొందుతారు.

మొదటి ఇంటర్నేషనల్ :- ఈ అంతర్జాతీయ శ్రామిక సంఘాన్ని 1864 లో లండన్‌లో కారల్‌మార్క్స్ స్థాపించాడు. ప్రపంచంలోని వివిధ దేశాల శ్రామికులందరి లోనూ కార్యాచరణతో కూడిన రాజకీయ చైతన్యం రగిలించడం ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

రెండవ ఇంటర్నేషనల్ :- ఇది 1889లో పేరిస్‌లో - ఫ్రెంచి రివల్యూషన్ శతవార్షికోత్సవాలు జరుపుకోవడానికి స్థాపించబడింది.

మూడవ ఇంటర్నేషనల్ :- ఇది 1919లో మాస్కోలో స్థాపించబడింది. వివిధ దేశాల కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు పాల్గొన్న ఈ సమావేశం - ప్రపంచ వ్యాపితంగా సోషలిజాన్ని అభివృద్ధి చేయడం తన ధ్యేయంగా ప్రకటించింది.

1914 ప్రపంచయుద్ధ ప్రారంభంతో రెండవ ఇంటర్నేషనల్ ప్రధాననాయకత్వం ప్రపంచ కార్మికకోద్యమానికి ద్రోహంచేసి తమ తమ దేశాలోని పెట్టుబడి దారీ ప్రభుత్వాలతో యుద్ధ నిర్వహణలో చేతులు కలపడంతో ఆ సంస్థ విచ్ఛిన్నమైపోయింది. సిద్ధాంత రీత్యానూ, నిర్మాణ రీత్యానూ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మూడుధోరణులు తలెత్తుయి. 1. మితవాద గ్రూపు. 2. మధ్యస్థ గ్రూపు. 3. అతి వాదగ్రూపు.

ఈ అతివాద గ్రూపు నాయకుడైన లెనిన్ మూడవ ఇంటర్నేషనల్‌కు ఆత్మగానూ, శరీరంగానూ కూడా చెప్పుకోవాలి.

# మరికొన్ని వివరణలు

## పరిచయం

1. ప్రభుత్వక్షేత్రాలు(GOVERNMENT - FORM - SOLKHOZ) (రష్యన్) : రష్యాలో ప్రభుత్వాధి పత్యంలో, ప్రభుత్వాధికారుల పర్యవేక్షణలో నడిచే వ్యవసాయ క్షేత్రం.

2. సమిష్టి వ్యవసాయక్షేత్రం (Collective Farm - Kolkhgz) (రష్యన్) : రష్యాలో రైతులు సమిష్టిగా వ్యవసాయం చేసే భూమి, సభ్యులచే ఎన్నుకోబడిన బోర్డు అధీనంలో ఈ క్షేత్రంలో వ్యవసాయోత్పత్తి జరుగుతుంది.

పై రెండు విధానాలు ఏకకాలంలో రష్యాలో ఆచరణలో పెట్టబడినవి. రైతుకు భూస్వామ్యం లేదు.

3. మార్షల్ టిటో - యుగోస్లేవియా అధ్యక్షుడు.

4. గిల్డ్ సోషలిజం (Guild Socialism) : గిల్డ్ అనగా చేతివృత్తుల వారి సంఘం లేక శ్రేణి. స్వతంత్ర చేతి వృత్తుల వారు, స్వతంత్రరైతులు ప్రాధాన్యత కలిగిన సమాజం.

## వ్యక్తిగతం

2. ఇండియన్ పెజెంట్ ఇన్‌స్టిట్యూషన్ : 1942లో రంగాజీచే గాంధీగారి ఆశీర్వాదంతో స్థాపించబడిన సంస్థ.

3. రైతులు, చేతి వృత్తులవారు, సాంఘిక న్యాయం.

1. మార్క్సు (KARL - H. MARX) –1818 – 1883 : సోషలిస్టు, ఆర్థిక శాస్త్రవేత్త, తాత్వికుడు. ఆధునిక కమ్యూనిజపు పిత. దాస్ కాపిటల్ రచయిత. ఫ్రెడరిక్ ఏంగిల్సుతో కలసి కమ్యూనిస్టు మానిఫెస్టో రచించాడు. గతి తార్కిక భౌతికవాదం, అదనపు శ్రమ – ''అదనపు విలువ''ను సిద్ధాంతీకరించిన శాస్త్రవేత్త.

2. ఏంగెల్స్ (FREDERIK ENGLES) : జర్మన్ సామ్యవాది. మార్క్సు జీవితకాల సహచరుడు. కమ్యూనిస్టు మానిఫెస్టో సహరచయిత.

**3.** లెనిన్(V.I. LENIN) - 1870 - 1924 : రష్యన్ బోల్షివిక్ పార్టీ నాయకుడు. 1903 - 1917 విప్లవంలో నిర్మించాడు. మార్క్సిజం, లెనినిజం సిద్ధాంతకర్త.

**4.** అదనపు విలువ(Surplus Value) : పెట్టుబడిదారీవర్గం ( కాపిటలిస్టులు) కార్మికులకు చెల్లించకుండా తమ జేబుల్లో వేసుకొనే శ్రమ. ఈ నిజాన్ని మార్క్స బట్ట బయలు చేశాడు. ''కార్మికుని శ్రమద్వారా సృష్టించబడిన విలువకూ, అతని శ్రమ శక్తి విలుకూ అంటే కార్మికునకూ, ఆతని కుటుంబానికి అవసరమయిన జీవితాధారసాధనాల విలువకూ గల తేడాయే అదనపు విలువ.

మార్క్స ఆర్థిక సిద్ధాంతానికి, అదనపు విలువ సిద్ధాంతం పునాదిరాయి. మానవ సమాజ అభివృద్ధిని నిర్దేశించే సూత్రాలపై భౌతికవాదబోధన తరువాత, శ్రామికవర్గ మేధా సంపన్నుడయిన సిద్ధాంతవేత్త (మార్క్స) బయల్పరచిన గొప్ప పరిశోధనా ఫలితం - అదనపు విలువ సిద్ధాంతం.

''అదనపు విలువ'' సిద్ధాంత విమర్శనాత్మక పరిశీలనను కాపిటల్ నాలుగవ సంపుటిగా ముద్రించవలసి వుంది. ఈలోగా మార్క్స మరణించాడు. ఆయన మరణానంతరం ''అదనపు విలువ సిద్ధాంతం'' శీర్షికతో వ్రాత ప్రతిని స్వేచ్ఛగా వుపయోగించుకొని కారల్ కాట్స్ 1905 - 1910 లో ప్రకటించాడు.

''కార్మికుని అదనపు శ్రమ సృష్టించిన విలువే - అదనపు విలువ. అదనపు విలువ డబ్బు పొందని కార్మికుల శ్రమ చేత సృష్టించబడుతుంది. అదనపు విలువ ఉత్పత్తి కావటమూ - పెట్టుబడిదారులు దానిని స్వంతం చేసుకోవటమూ - ఇది పెట్టుబడి దారీ విధానపు చోదక శక్తి. (లియన్‌తోవ్ - అర్థశాస్త్రం).

ఈ అదనపు విలువ సిద్ధాంతం ఈ గ్రంధానికి ప్రాణం. రంగాజీ ''అదనపు విలువను కార్మికులు మాత్రమే కాక రైతులు కూడా ఉత్పత్తి చేస్తారని, అది కార్మికుల అదనపు విలువ కన్నా చాలా అధికమనీ, రైతుల అదనపు విలువను సమాజంలో అన్ని వర్గాలు - కార్మికులతో సహా పంచుకుంటున్నారనీ, ఈ గ్రంధంలో సిద్ధాంతీకరించాడు.

**5.** పెట్టుబడి (Capital) : సాధారణంగా ఉత్పత్తి సాధనాలు పెట్టుబడిగా వ్యవహరింపబడతాయ్. ఫాక్టరీలు, గనులు వగైరాలు ఎక్కువగా ఈ ఉత్పత్తి సాధనాలు ప్రైవేటు యాజమాన్యంలో వుంటాయ్. పెట్టుబడి దారీ వ్యవస్థలో సంపదను వ్యక్తులు

(పెట్టుబడిదార్లు) స్వేచ్ఛగా ఉపయోగించుకొనే హక్కు కలిగి వుంటారు. గ్రీక్ - రోమన్ కాలంలో కూడా ఈ వ్యవస్థ వుంది. రోమన్ సామ్రాజ్య పతనానంతరం, ఫ్యూడలిజం (భూస్వామ్య వ్యవస్థ) వచ్చింది. కానీ పెట్టుబడి దారీ వ్యవస్థ అవశేషాలు మిగిలే వున్నాయ్. 15వ శతాబ్దం నుండి మరల పెట్టుబడి దారీ వ్యవస్థ మెలమెల్లగా వేళ్ళూనుకొని, నేటి ప్రపంచ అగ్రరాజ్యాలయిన అమెరికా, కెనడా, పశ్చిమ జర్మనీ, జపాను వంటి దేశాల్లో గట్టిగా నిలదొక్కుకొన్నది. యూరప్‌లో ఫ్యూడలిజం నాశనానికి కారణమయింది.

**6.** ప్రొలిటేరియట్ (Prolitariat - శ్రామికులు) : ఈ మాటకు నిఘంటవులు శ్రామికులు అని అర్థం చెప్తాయ్. రంగాజీ ఈ గ్రంథంలో శ్రామికజన బాహుళ్యమంతా ప్రోలిటేరియట్‌గా భావించాడు. కమ్యూనిష్టులు ప్రోలిటేరియట్ అంటే కేవలం కర్మాగారాల్లో పని జేసే కార్మికులని, ప్రొలిటేరియన్ డిక్టేటర్ షిప్, అంటే కార్మిక వర్గ నియంతృత్వమనీ ఘంటాఘోషగా ప్రకటిస్తూ, జనాభాలో 70 శాతంగా వున్న రైతులను శ్రామికులుగా గుర్తించక, రైతులు కార్మిక వర్గ నియంతృత్వాన్ని అంగాకరించాలనీ చేసే వాదనను రంగాజీ నిరసించారు. అందువలననే వారు తమ జీవితకాలమంతా కమ్యూనిజంతో పోరాటం చేశారు. యుగోస్లోవియాలో మొదలై, నిన్నటి రష్యన్ కమ్యూనిజం వైఫల్యాలకు ఈ ప్రోలిటేరియన్ డిక్టేటర్ షిప్ ఒక ప్రధాన కారణం. ఈ వాదన మార్క్సుతోనే మొదలయింది.

**7.** కోమన్ టెరిన్ (Third Internationals మూడవ ఇంటర్నేషనల్) : మొదటి ఇంటర్నేషనల్ ఈ అంతర్జాతీయ శ్రామిక సంఘాన్ని 1864లో లండను నగరంలో కారల్ మార్క్సు స్థాపించాడు. ప్రపంచ దేశాల శ్రామికులందరిలోను, కార్యాచరణతో కూడిన రాజకీయచైతన్యం రగిలించటం ముఖ్యోద్దేశం.

రెండవ ఇంటర్నేషనల్ 1889లో పారిస్‌లో ఫ్రెంచ్ రివల్యూషను శత వార్షి కోత్సవాలు జరుపుకోవటానికి స్థాపించబడింది.

మూడవ ఇంటర్నేషనల్ లేక కోమెన్ టెరిన్ (Cominterin) - ఇది 1919లో మాస్కోలో స్థాపించబడింది. వివిధ దేశాల కమ్యూనిష్టుపార్టీల ప్రతినిధులు పాల్గొన్న ఈ సమావేశం - ప్రపంచవ్యాప్తంగా సోషలిజాన్ని అభివృద్ధి చేయటం తన ధ్యేయంగా ప్రకటించింది.

1914 ప్రపంచయుద్ధ ప్రారంభంలో రెండవ ఇంటర్నేషనల్ నాయకత్వం, ప్రపంచ కార్మికోద్యమానికి ద్రోహం చేసి తమ దేశాల్లోని, పెట్టుబడి దారీ ప్రభుత్వాలలో, యుద్ధ నిర్వహణలో చేతులు కలపటంతో, ఆ సంస్థ విచ్ఛిన్నమయింది.

సిద్ధాంతరీత్యా, నిర్మాణం రీత్యాను అంతర్జాతీయ కమ్యూనిష్టు ఉద్యమంలో మూడు ధోరణులుతలెత్తాయి. 1. మితవాద గ్రూపు. 2. మధ్యస్థ గ్రూపు. 3. అతి వాద గ్రూపు. ఈ అతివాద గ్రూపు నాయకుడయిన లెనిన్ ఈ మూడవ ఇంటర్నేషనల్ కు ఆత్మగాను, శరీరంగానూ కూడా చెప్పుకోవాలి.

1943లో ఈ సంస్థ స్టాలిన్ చే రద్దు చేయబడింది.

**8.** ఐక్యరాజ్యసమితి (UNITED NATIONS ORGANISATION. U.N.O. ఐ.రా.స.) : ప్రపంచంలోని అన్ని స్వతంత్రదేశాల సభ్యత్వం కల అంతర్జాతీయ సంస్థ. యుద్ధనివారణకు, శాంతి ప్రయోజనాలకు ఉద్దేశించబడి జూన్ 26, 1945లో శానిఫ్రాన్సిస్కో (కాలిఫోర్నియా రాష్ట్రం - అమెరికా) లో స్థాపించబడింది.

**9.** వలసవాదం (Colonialism) : ఒకదేశం తన సరిహద్దుల వెలుపలి భూభాగాలను ప్రత్యక్షంగా, పరోక్షంగా అధీనంలోనికి తెచ్చుకొనే విధానం. పరోక్ష విధానం ఆర్థిక లాభంకొరకు అనుసరింపబడేది. ప్రత్యక్ష విధానం కేవలం హోదా కొరకు అధికారం కొరకు అనుసరింపబడేది.

10. వలసవాదం మరియు సామ్రాజ్య వాదం (ఇంపీరియలిజం) సమానార్థంగా వాడబడింది. సామ్రాజ్యవిస్తరణ కాంక్షతో బడుగు, బలహీన దేశాలను కొల్లగొట్టడం ఇంపీరియలిజం ప్రధానలక్షణం.

**11.** రూజ్వెల్టు (F.D. ROOSEVELT) - 1882-1945 : అమెరికా 32వ అధ్యక్షుడు. నాలుగు పర్యాయాలు అధ్యక్షునిగా ఎన్నికైనాడు. డెమోక్రాట్.

## కీలకసేవలు

**1.** సెర్ఫ్ (Serf) - అర్థబానిస : సెర్ఫ్‌డమ్ అర్థబానిస విధానం. ఈ వ్యవస్థలో జనాలకు సాగుచేసుకోవటానికి, ఒక్కొక్క కుటుంబానికి కొద్దిపాటి భూమి వుంటుంది. భూస్వామ్యం వుండదు. వారంలో రెండు లేక మూడు రోజులు భూస్వామి పొలంలో పని చేయటం ద్వారా లేక డబ్బు లేక ధాన్యం రూపంలో కౌలు చెల్లించాలి.

వీరికెటువంటి రాజకీయ హక్కులుండవు. నేరారోపణ, శిక్షా ప్రకటన, శిక్ష అన్నీ భూస్వాములే అమలు జేస్తారు.

**2.** టుబాకో బోర్డు : 1976 నుండి పొగాకు కొనుగోళ్ళు, అమ్మకాలు, వంటి నియంత్రణ డబ్బు సక్రమంగా చెల్లింపులకు బాధ్యత వహిస్తూ, గుంటూరు హెడ్ ఆఫీసుగా టూబాకో బోర్డు ఏర్పాటు చేయబడింది. కానీ గిట్టుబాటు ధరలను ఇప్పించటంలో బోర్డు పూర్తి వైఫల్యం చెందింది. I.L.T.D. వారి గుత్తాధిపత్యం కొనసాగుతునే వుంది.

**3.** లియన్‌తోవ్ : అర్ధశాస్త్రం గ్రంధకర్త.

**4. F.A.O. (Food and Agricultural Organisation)** ఆహార వ్యవసాయ సంస్థ : 1945లో ఐక్యరాజ్యసమితి చే ఏర్పాటు చేయబడింది. హెడ్‌క్వార్టర్స్ - రోమ్, ఆహార ఉత్పత్తుల, పంపిణీలపెంపుదల, గ్రామీణ ప్రజలకు మెరుగయిన జీవితాలు, బలవర్ధక ఆహారాలు అందిచటం, - ప్రపంచ ఆహార సరఫరాలను నిరంతరం పర్యవేక్షిస్తుంది.

**5. Dr.** సన్ యత్. సేన్ **(Dr. Sunyat Sen)** (1866 1925) : చైనా జాతిపితగా గౌరించబడినవాడు. ''మంచూ'' ప్రభువులపై విప్లవం నడిపి, వారి వేధింపులకు ఇంగ్లాండులో తలదాచుకున్నాడు. 1912లో ప్రజలు రాజరికం అంతం చేసిన తరువాత మొదటగా అధ్యక్షుడైనాడు. తరువాత మరి రెండు సార్లు అధ్యక్షునిగా వున్నాడు. జాతీయత, ప్రజాస్వామ్యం, సామ్యవాదాలతో ప్రజలను విప్లవోన్ముఖులను చేశాడు.

## వత్తిడి ఉత్పత్తి

**1.** మానవ హక్కుల తీర్మానం **(U.N. Charter on Human Rights) :** 1948లో కమిషన్ ఆన్‌హ్యూమన్ రైట్స్ ప్రకటన, ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిల్‌లో (U.N.O.) ఆమోదించబడింది. ప్రాధమిక హక్కులైన వాక్స్వాతంత్రం, పత్రికా స్వాతంత్రం మొదలయినవి ఇందులో పొందుపరచబడినవి. అంతేగాక నూతనంగా ఏర్పాటు చేయబడిన దేశాల రాజ్యాంగ రచనలో కూడా ఉపయోగించబడినవి. ఉదా : ఇజ్రాయిల్ మరియు ఇండొనేసియా.

**2.** వైవిధ్యవ్యవసాయం లేక బహుముఖీన వ్యవసాయం (**Diversified Agriculture**) **:** వ్యవసాయాన్ని వ్యవసాయ వనరులను ఇతర వ్యవసాయాధారిత రంగాలకు, చిన్న పరిశ్రమలకు విస్తరింప జేయుటం. వ్యవసాయంలో నూతన ధోరణులను అలవర్చుకోవటం. తోటలు, పండ్లు, పూల పెంపకం, పశుపోషణ, మేకలు, కోళ్ళు, చేపలు పెంపకం చేయటం, వ్యవసాయోత్పత్తుల నుండి వచ్చే ఉప ఉత్పత్తులను, ఇతర రంగాలకు విస్తరింప చేయటం.

**3.** మద్ధతు ధరలు (**SUPPORT PRICE**) **:** యూరప్ దేశాలలో, U.S.A.లో మద్ధతుధరల విధానం, గ్రామీణ ఆదాయాలు - పట్టణ ఆదాయాలు మధ్య న్యాయమయిన పంపిణీ వుండటం కొరకు ప్రవేశపెట్టబడినవి. ఈ ఆదాయాల పంపిణీ గ్రామీణ - పట్టణ వర్తకనియమాలపై ఆధారపడివుంటుంది. అంటే వ్యవసాయధరలు - పారిశ్రామికధరల నిష్పత్తిపై ఆధారపడుతుంది. ఈ విధానం వలన ఈ నిష్పత్తులు పడిపోకుండా చూడబడతవి. గ్రామాల ఆదాయాలలో తరుగుదల నివారింప బడుతుంది.

కానీ 19వ శతాబ్దంలో U.K. రష్యా మరికొన్ని ఈస్ట్‌యూరోపియన్ దేశాలు, ఈ నిష్పత్తులను తారుమారు చేసి, గ్రామాలకు ఉద్దేశ్యపూర్వకంగా వ్యతిరేకంగా వుండేటట్లు చట్టాలు చేశాయి. ఇంగ్లాండులో కారన్ చట్టాలు (CORN ACTS) కమ్యూనిష్టు బ్లాకులో ''ధరలకత్తెరలు'' (Scissors crisis) వగైరాలు. ఇవిత్వరితగతి పట్టణ పారిశ్రామికాభివృద్ధికి, పట్టణ పెట్టుబడులు పెరుగుదల కొరకు చేయబడ్డాయి.

కానీ భారతదేశంలో మద్ధతుధరల విధానం గ్రామ - పట్టణ ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించటానికి కాక వ్యవసాయెూత్పత్తులను వేగంగా పెంచటానికి అమలు చేయబడుతున్నవి. కనీస మద్దతు ధరలపై ఆధారపడి రైతులు దేశానికి అవసరమయిన పంటలను ఎక్కువగా పండించటమే లక్ష్యం. దీనివలన వినియోగదారుల ప్రయోజనాలు మాత్రమే రక్షింపబడతాయి.

ఉత్పత్తి ధరలు గిట్టుబాటు లేనట్లయితే, ధరలు మద్దతుధరలకంటే తక్కువగా వున్నట్లయితే, ప్రభుత్వ మార్కెటింగు సంస్థలు, మార్కెటులో ప్రవేశించి, కనీస మద్దతు ధరలకైనా వ్యవసాయోత్పత్తులను కొనుగోలు చేయాలి. కొన్ని ఏజన్సీలను ఇందుకు నియమించినప్పటికీ S.T.C.; మార్క్‌ఫెడ్, C.C.I. వగైరాలు - ఈ సంస్థలు వ్యాపార

దృష్టితోనే పని చేస్తున్నవి కానీ వ్యవసాయోత్పత్తుల సంక్షోభంలో మార్కెటులోనికి రావటం లేదు. ఈ సంస్థలన్నీ అవినీతిలో కూరుకుపోయివున్నాయి.

వ్యవసాయ ఆర్థిక శాస్త్రవేత్తలు, ఈ క్రింది విషయాలపై ఆధారపడి మద్దతు ధరలు నిర్ణయిస్తారు. ఇందులో ముఖ్యమైనది వ్యవసాయ వ్యయాలు, వ్యవసాయ పెట్టుబడి.

వ్యవసాయ వ్యయం ఈ క్రింది విధంగా చూపబడింది.

I. కాస్ట్ – ఎ1

1) కూలీల కొరకు అయినఖర్చు.
2) బాడుగ వ్యవసాయ ఖర్చు (పశువులతో)
3) స్వంత వ్యవసాయ ఖర్చు (పశువులతో)
4) స్వంత మిషనరీ (ట్రాక్టర్లు వగైరాలు) ఖర్చు
5) బాడుగ మిషనరీ ఖర్చు
6) విత్తనాల ఖర్చు (స్వంతవి, కొన్నవి)
7) సేంద్రియ ఎరువులు (స్వంతవి, కొన్నవి)
8) రసాయన ఎరువులు
9) పురుగు మందుల ఖర్చు
10) వ్యవసాయ పనిముట్లు , కొష్టాలు మొదలగు వానిపై తరుగుదల విలువ.
11) నీటి పారుదల వ్యయం (నీటి తీరువా)
12) లాండ్ రెవెన్యూ
13) వర్కింగ్ కాపిటల్ పై వడ్డీ
14) వ్యవసాయ పనిముట్లు వగైరాల ఖర్చు

II. కాస్ట్ – ఎ2

కాస్ట్ – ఎ1 + అద్దె భూమికి కౌలు చెల్లింపు.

III. కాస్ట్ – బి1

కాస్ట్ - ఎ1 + భూమి మినహా ఫిక్స్‌డ్ కాపిటల్ పై వడ్డీ.

IV. కాస్ట్ - బి2

కాస్ట్ - బి1 + స్వంత భూమికౌలు + అద్దె భూమికి కౌలు చెల్లింపు

V. కాస్ట్ - సి1

కాస్ట్ బి1 + కుటుంబ సభ్యుల శ్రమకు కూలి ( ఇతర కూలీలతో సమంగా)

VI. కాస్ట్ - సి2

కాస్ట్ - బి2 + కుటుంబ సభ్యుల శ్రమకు కూలి (ఇతర కూలీలతో సమంగా)

VII. కాస్ట్ - సి2$^{0}$

కాస్ట్ సి2 విధంగానే కూలీలకు అయిన చెల్లింపులు గానీ, నిర్ణయించిన కూలీగానీ మిః హాయించాలి.

VIII. కాస్ట్ - సి3

కాస్ట్ - సి2 + 10 శాతం కాస్ట్ - సి2$^{0}$

కాస్ట్ - సి1 ః- అభ్యంతరకరం. యాజమాన్య ఖర్చు ఇందులో కలుపబడలేదు. కుటుంబ సభ్యుల శ్రమ కూలీల శ్రమ కన్నా ఎక్కువగా ఉంటుంది. కూలీలతో పాటు లెక్క కట్టడం అన్యాయం.

పై విధంగా వ్యవసాయ వ్యయం లెక్కించి వచ్చిన దిగుబడి ఆధారంగా మద్దత్తు ధర నిర్ణయించడం జరుగుతుంది. అయితే వ్యవసాయ వ్యయం బీద పొలాలలో ఎక్కువగానూ, దిగుబడులు తక్కువగానూ ఉంటాయి. ఏ ఒక్క ప్రాంతాన్ని శాంపుల్‌గా తీసుకొని నిర్ణయించడం అసాధ్యం. కనుక ఒక పంటను అధికంగా పండిస్తున్న ప్రాంతపు సగటు వ్యయాలను లెక్కలోనికి తీసుకోవడం న్యాయం. ఈ మద్దత్తు ధరల విధానం వల్ల వాణిజ్య పంటలు, పంటలు వాణిజ్య పరంగా పండించడం ఎక్కువౌతుంది.

అయితే నేడు రాజకీయ వత్తిడల ప్రభావంతో మద్దత్తు ధరలను నిర్ణయించడం జరుగుతుంది.

organise the Peasant Unions from 1923 and Weavers' Unions from 1925.

From 1928 onwards we (peasants) have began to organise ourselves in the Zamindari areas to remove the encroachments on our economic freedom which the Zamindars had made under the aegis of the Mughal and the British imperialist regimes. The congress needed our political support for its national liberation movement. We in our turn also needed its political support for our economic advancement. Thus by now i.e. after 26 years of politico economic struggles against the Zamindari System, we have succeeded in liberation ourselves from the landlordlism of Zamindars and attained complete proprietorship over our holdings which are much more to us than what the workshop is to the proletariat, the chisel and hammer for the carpenter, the loom and shuttle for the weaver and kiln and hammer for the black smith.

We began to assert ourselves from 1931 against money lenders and bankers under the terrible impact of the world economic depression and demanded moratorium, liquidation of lode debts, supply of cheaper and more adequate credit and co-operative supplies of credits and all material needed for agriculture. The National Congress during the 1936 General Elections that the Congress Ministries had to take legislative and administrative steps to declare a moratorium, to scale down our debts, to prescribe a maximum rate of interest and to regulate money lending business.

During all these thirty years and more so since attainment of Swaraj more and more of us have been wondering whether it might not be better for us, the peasants, artisans and other rural masses to develop ourselves into an independent political force and organise a separate political party to serve as our political

champion. Our patriotism would not allow us to run the risk of weakening the National United Front against British. Therefore, we were anxious to maximise our efforts to free India from the British Imperialism so that we could begin to build our own politico-economic power to achieve economic Swaraj (Social Democracy) under the aegis of our political freedom. The attainment of Swaraj brought in its train the Punjab and Bengal tragedies and also the problems of liquidation of the princely order and Zamindars. Therefore we could not break away from the National Front after the attainment of Swaraj.

Mahatma Gandhi did a great service to us. He sent his message through me as long ago as November 1944 that we should achieve in India, Kisan-Mazdoor-Kalakar-Buddhijeevi Raj ( k. m. p. raj ) and thus enjoy full-fledged social democracy. He gave his message to the nation only a few days before his death that kisans of India should enjoy real power and attain pre-eminent position in Indian political life.

## SOCIAL JUSTICE - OUR AIM

Ours is a movement of higher ideals and legitimate demands to achieve social justice. We do not ask for favours. We do not seek concessions. We find that the share of social wealth that we are allowed is very much less than what is legitimately due to us. For ages we have been impoverished by continual process of under-valueing our services and over-valueing those of other sections of society through an unjust systems of exchanges. Of all the toilers of the world the peasants alone produce 50 to 100 times more than what is given to them as seeds; and our artisans too give best values in return for most

